# కాలాతీత వ్యక్తులు

## నవల

డా॥ పి. శ్రీదేవి



విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్
విజ్ఞాన భవన్, 4-1-435 బ్యాంక్ స్ట్రీట్
హైదరాబాద్-500 001.

KĀLĀTHEETHA VYAKTULU - A Novel by Dr. P. Sridevi

ప్రథమ ముద్రణ : 1958 స్వతంత్ర పబ్లికేషన్స్, హైదరాబాద్
రెండవ ముద్రణ : 1962 దాచేపల్లి ప్రచురణ, సికింద్రాబాద్
మూడవ ముద్రణ : 1981 ఎమెస్కో ప్రచురణ, మచిలీపట్నం

ప్రచురణ నెం. : 2277

ప్రతులు : 1000

వి.పి.హెచ్. ప్రథమ ముద్రణ : సెప్టెంబరు, 2001

టైటిల్ డిజైన్ : జ్యోతి

వెల: రూ.80-00

ప్రతులకు: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్,
అబిడ్స్, హైదరాబాద్ - 500 001.
విశాలాంధ్ర బుక్ హౌస్,
అబిడ్స్, సుల్తాన్‌బజార్ - హైదరాబాదు,
విజయవాడ, విశాఖపట్టణం,
కాకినాడ, గుంటూరు, అనంతపురం,
హన్మకొండ, తిరుపతి.



ముద్రణ: కళాంజలీ గ్రాఫిక్స్, హైదరాబాదు-29. ఫోన్: 3229831

"ఓం పూర్ణమదః పూర్ణమిదమ్
పూర్ణాత్పూర్ణ ముదచ్యతే
పూర్ణస్య పూర్ణమాదాయ
పూర్ణమేవాऽవశిష్యతే"

# సమర్పణ

అన్ని వేళలా 'నేనున్నానమ్మా!" అంటూ

చెంతనిలిచి చల్లదనమిచ్చే

అమ్మకు

\- భక్తితో

# కాలాతీత రచన

సమాజం మారినప్పుడల్లా సామాజిక సంబంధాల్లో మార్పు అనివార్యం. ప్రధానంగా కుటుంబవ్యవస్థ, దానికి మూలమైన వివాహసంబంధాల్లో మార్పులు కొట్టొచ్చినట్టుకనిపిస్తై, ఫ్యూడల్ దశలో సంబంధాలన్నీ మతాన్ని ఆశ్రయిస్తూ – రక్తసంబంధం, వంశం, దాని కీర్తిప్రతిష్ఠలకేంద్రంగా ఏర్పడినట్టు గమనించగలం. కుటుంబ వ్యవస్థమీద కూడా దీని పట్టుంది. ఎప్పుడైతే పెట్టుబడిదారీ సామాజిక దశ వచ్చిందో అప్పటినుండీ పాత సంబంధాల స్థానంలో; రాజకీయాల నాశ్రయిస్తూ డబ్బు కేంద్రంగా – కుటుంబవ్యవస్థా, వివాహ సంబంధాలూ ఏర్పడ్డాయి. విలువలు మార్పుకు గురయ్యాయి. ప్రతీదీ మార్కెట్ ఎకానమీ ఆధారంగా ఏర్పడటం ఆరంభమైంది. విలువలూ, ఆశయాలు అన్నీ – అమ్మకం, కొనుగోళ్ళ పళ్ళచక్రాల్లోపడి ఛిన్నాభిన్నం అయ్యాయి 1950లలో ఈ స్థితి స్పష్టంగా మనం చూడగలం

ఈదశలో సమాజంలోని స్త్రీలకెదురైన అనేకానేక ప్రశ్నల్లో – కుటుంబవ్యవస్థ ఎలా ఉండాలి?, వివాహబంధాలకు కొత్త అర్థాలు చెప్పాలా? వద్దా!, వివాహం అన్న చట్టం ఈనాడెంతవరకూ అవసరం? – అన్నవి కొన్ని. ఈ ఆలోచనలకు కారణం స్త్రీలపై జరుగుతున్న అత్యాచారాలూ, ప్రేమకున్న విలువలు మారుతూండడం, దంపతీవ్యవస్థలో అనారోగ్య లక్షణాలు కనిపిస్తూండడం వంటివి కావచ్చు అంటే "స్త్రీ స్వేచ్ఛ"కు పునర్నిర్వచనం చెయ్యాల్సిన ఆవశ్యకతను 5 వ దశకంలో స్త్రీలు గుర్తించారు. అలా గుర్తించిన రచయితలలో డా॥ పి. శ్రీదేవి ముఖ్యులు అతి పిన్నవయసులో (1929–1961) కన్నుమూసిన వీరు రాసింది నవలగా ఇదొక్కటే! కథలూ – కవితలూ కాక. హైద్రాబాద్ నుంచి గోరాశాస్త్రిగారి సంపాదకత్వంలో వెలువడిన తెలుగు స్వతంత్రలో 7–9–1957 నుండి 25–1–1958 వరకూ 21 వారాలు ధారావాహికంగా ఈ నవల వచ్చింది. ఊహాత్మక సంఘటనలతో, రొమేంటిక్ హీరోలతో యువతరాన్ని గాలిలో మేడలుకట్టించే రచనలొస్తున్న కాలంలో – ఈ "కాలాతీత వ్యక్తులు" నవల – పాఠకులను నిలవేసింది. ఆలోచనలను గిలక్కొట్టింది. మెదడూ – హృదయం రెండూ పనిచేసేలా చేసింది. అందుకే 1958 లో వచ్చిన మొదటి ముద్రణ కాపీలు మూడు నెలల్లోనే అయిపోవడం జరిగింది.

ఇందులోని పాత్రలు ఆశయాలు మాట్లాడవు "ఆడదాని మనస్సునీకు తెలీదు ప్రకాశం., బతుకులో నాకు కావలసిందొకటి – దొరుకుతున్నదింకొకటి. అంచేత కసికొద్దీ లోకాన్నిధిక్కారిస్తున్నా" ననే ఇందిర రానున్నతరంలో సమాజంపై స్త్రీ చేయగల ధిక్కారానికి ప్రతీక. ఈ నవలలో కాలాతీత వ్యక్తులెవరన్న ప్రశ్న మీరే

తేల్చుకోండంటూ పాఠకుల కొదిలేశారు రచయిత దాదాపు 50 సంవత్సరాల తర్వాత; ఈనాడు అనవసర నియమాలను నిరసిస్తూనూ, పురుషాధిక్యతను ప్రతిఘటిస్తూనూ, తమపై అనేకరూపాల్లో జరుగుతున్న సామాజిక అత్యాచారాలకు వ్యతిరేకంగా పోరాడుతున్న స్త్రీశక్తి ప్రారంభదశ; ఈ నవలలో చూపించారు రచయిత. స్వేచ్ఛకు కొత్త నిర్వచనం రాయండని స్త్రీజాతికి గుర్తుచేశారు అందుకే ఈ నవల ఎప్పటికీ కాలాతీతస్వభావం కలదే!

ఈ నవల పూర్తయిన వెంటనే శ్రీమతి పి. సరళాదేవి గారి విమర్శ "తెలుగు స్వతంత్ర"లో వచ్చింది ఇటీవల డా॥ వి. చంద్రశేఖర రావుగారి స్పందన "గ్రంథాలయ సర్వస్వం"లో వచ్చింది. ఈ నవలను గురించి రెండు తరాలకు చెందినవారి స్పందనలను తెలుసుకోటానికి పాఠకులకు ఉపయోగపడగలవన్న ఆశతో ఈ వ్యాసాలను; 1962లో ఆచార్య నాయని కృష్ణకుమారిగారు రాసిన కవితనూ, ఈ గ్రంథంలో చేర్చడం జరిగింది వీరికి కృతజ్ఞతలు. ఈ నవల ఇలా రావడానికి మిత్రులు సర్వశ్రీ శిలా వీర్రాజు, ఆర్ రాధాకృష్ణమూర్తి, పెనుగొండ లక్ష్మీనారాయణ గార్ల సాయం ఉంది. అలాగే డా॥ శ్రీదేవిగారి అపురూపమైన ఫొటోఇచ్చి సహకరించిన వారు మిత్రులు శ్రీపతిగారు. వీరందరికీ కృతజ్ఞతలు

ప్రచురణకు అనుమతిని పొందాలన్న ఉద్దేశంతో శ్రీదేవిగారి వారసుల చిరునామాల కోసం ప్రయత్నించటం జరిగింది. కానీ దొరకలేదు. తగిన ధ్రువీకరణ పత్రాలతో వారసులు ప్రచురణాలయాన్ని సంప్రదిస్తే, మా నిబంధనల మేరకు ఇవ్వాల్సిన రాయల్టీని అందచేయగలం

ఆధునిక తెలుగు సాహిత్యంలోని మేలిరచనలను ప్రజలకందించే ఉద్యమంలో మాతో – రచయితలూ, పాఠకులూ ఎప్పటిలా సహకరిస్తారన్న ఆశతో ఈ నవలను మీకందిస్తున్నాం.

– ఏటుకూరి ప్రసాద్,
సంపాదకుడు,
విశాలాంధ్ర ప్రచురణాలయం

✻ ✻ ✻

# 'కాలాతీత వ్యక్తులు': ఒక ప్రసక్తి

• పి. సరళాదేవి •

" 'కాలాతీత వ్యక్తులు' చ్చాలా బావుంది "

అన్నాడు ఒకాయన గట్టిగా కళ్ళు మూసుకొని, పళ్ళుకరుచుకొని – "చాలా"ను నొక్కి నొక్కి ఉచ్చరిస్తూ. సీరియల్ అంతా పూర్తయిపోయినతరువాత, ఒక్కసారిగాపుస్తకాలన్నీ పరుచుకు చదవొచ్చులే అనుకున్న నేను "బావుంది కాబోలు" అనుకున్నాను

తరువాత రెండుమూడు వ్యూళ్ళు తిరిగాను. ఎక్కడ చూసినా ఈ "కాలతీత వ్యక్తులు" బావుంది బావుంది అనసాగారు అప్పటికి పది, పన్నెండువారాలయివుంటుంది ఆ సీరియల్ మొదలుపెట్టి ఈ "బావుంది" శబ్దం ఎక్కువగా వినిపించేసరికి నాకూ చదివేద్దామా? అనిపించింది అప్పటికే వచ్చిన పన్నెండు పుస్తకాలూ దగ్గర పెట్టుకుని చదవడం మొదలుపెట్టాను ఆ మొదలుపెట్టడం పన్నెండు పుస్తకాలూ ఒక్కడత పూర్తిచేస్తేగాని లేవలేకపోయాను పరితనుపట్టి, లాగి ఈడ్చుకుపోయింది. నేను చదవలేదు అదే నాచేత చదివించింది ఇంతస్పీడుగా వస్తూవున్న బండి పన్నెండూ అయిపోయేసరికి నుంచుండిపోయి, రాబోయేవారాల కోసం ఆవురావురుమని ఎదురు చూడసాగింది

ఏదైనా చదువుతున్నప్పుడు, అందులోని మనుష్యుల్ని నిజంగా వున్నట్టుగా వూహించుకొని, ఆ వ్యక్తుల చర్యలను మాటలను, గమనించి, ఆ మాటలు నిజంగా మనుషులు మాటాడగలరా? అలా ప్రవర్తించగలరా? అని ప్రశ్నలు వేసుకుని "గలరు" అని జవాబొస్తే అది వాస్తవిక రచన అని అనుకోవడం కొందరి తత్వం ఈ రకంగా చూస్తే ఈ నవలలోని ప్రతీ అంశానికీ "గలరు" అనే జవాబే వస్తుంది

సీరియల్ అంతా చదివేసి – "ఇందిరకు హేట్సాఫ్" అన్నారు ఇంకొకరు

ఇందర ఒక గొప్ప సృష్టి, ఇంతవరకూ సృష్టించబడని ఒక గొప్ప వ్యక్తి తన వ్యక్తిత్వాన్నే గొడుగుగా చేసుకొని గాలివానలకూ, వురుములూ మెరుపులకూ జడవకుండా నిర్భయంగా నడచిపోయే బలమైన వ్యక్తి

"ఇందిర యిందాక నిన్ను సరిగా గమనించలేదేమోగాని, అమాంతం భుజం పట్టుకు నిలవేసి మరీ మాటాడేస్తుంది. అరనిముషం కిందట పరిచయమైన వాళ్ళతో ఆరుగంటలు బాతాఖానీ వేసుకు కూర్చోగలదు" అంటాడు ప్రకాశం కృష్ణమూర్తికీ, పాఠకుడికీ ఒక్కసారే ఇందిరను పరిచయంచేసి

"ఒక రూమే ఏమిటి? అతనే నా కేరాఫ్‌లో వున్నాడు" అని ఇందిర పదిరోజుల కిందట తెలిసిన ప్రకాశం గురించి చెప్పడంలోనే ఆ పరిచయం నిజమే అనిపిస్తుంది–కృష్ణమూర్తికీ పాఠకుడికీ కూడా

ఇందిరకు జీవితం అన్యాయం చేసింది. చిన్నప్పటినుంచీ మామూలు మనిషికి దొరుకుతున్న వేవీ ఆవిడకు దొరకలేదు. తల్లి తనని కనేసి వదిలేసింది. తనను రక్షించవలసిన తండ్రిని తనే రక్షించవలసి వచ్చింది. దాంతో ఆవిడకు జీవితంమీద కసి పెరిగిపోయింది. మొదట కల్యాణిని సహృదయంతోనే పిలిచి వసతి సౌకర్యాలు చేసింది. అలాంటి ఇందిర తరువాత కల్యాణిని వెళ్ళగొట్టింది. కారణం? కసి. తను కావాలి కావాలనుకున్నది తనకు దొరకలేదు. కల్యాణికి దొరికింది. ప్రకాశం అండ కల్యాణికి దొరికింది. తనూ కల్యాణిలాంటి స్త్రీయే. తనకీ కల్యాణిలాంటివి కాకపోయినా కష్టాలనేవి వున్నాయి. కాని "నేనున్నాను నీకేం భయంలేదు" అనగల్గే అండ తనకెందుకు దొరకలేదు? కల్యాణికే ఎందుకు దొరకాలి?

మెల్లిగా ప్రకాశాన్ని కల్యాణినుండి తిప్పి తనపక్కకు మరల్చుకుంది. అయితే ఇంత గట్టిదయిన ఇందిర ప్రకాశాన్ని ఎన్నుకుని అంత పొరపాటు ఎందుకు చేసిందా? అనిపిస్తుంది. ప్రకాశం ఎంత బలహీనుడో అతని మేనమామ వచ్చేవరకూ తెలుసుకోలేకపోయి వుండాలి.

కల్యాణి నుండి మరలిన ప్రకాశానికి స్వర్గసౌఖ్యాలు చూపిస్తుంది ఇందిర. "ఏమిటి ప్రకాశం – ఎందుకంత భయపడిపోతావు దేనికి నీకు దిగులు"– "చూడు – ఇది కాదు బతికేవిధానం, ఇంతకన్నా బాగా బతకాలి" అని ధైర్యం చెబుతుంది. ఆ మాటల్లోనే ఆమె బలమైన వ్యక్తిత్వం తెలుస్తుంది. ఇంత ఇందిరా – ప్రకాశం మామ శేషావతారాన్ని చూసి హడలిపోయింది. కాని ఉద్రేకాలకు లోనుకావడం ఆవిడ తత్వంలో లేదు. అంచేత ప్రకాశానికి ధైర్యంచెప్పి "చల్లగా అతనితోవెళ్ళి, అన్నీ, తెగతెంపులు చేసుకో" అంటుంది. మామయ్యను ఎదిరించి వచ్చే ధైర్యం లేకపోయినా, తన మీద పెంచుకున్న వ్యామోహం ఎల్లనైనా వస్తాడనుకుంది. అలాగే వచ్చాడు ఎదిరించి కాదు. దొంగలా మామయ్య కళ్ళుకప్పి వచ్చాడు. ఎటుచూసినా తనమీద ఆధారపడినవాళ్ళే కనిపించారు ఇందిరకు. నాన్న, ప్రకాశం, తన కొలీగ్ వైదేహి. ఎంతమందిని తను రక్షిస్తూండాలి? పారిపోయి వచ్చిన ప్రకాశాన్ని చూసి జాలి, తనకెలాంటివాడు దొరికాడోననే వుక్రోషం, ఒక విధమైన దుఃఖం కలిగాయి ఇందిరకు. ఆ నిస్త్రాణలో "ఆడదాని మనస్సు నీకు తెలీదు ప్రకాశం. బతుకులో నాకు కావలసిందొకటి – దొరుకుతున్నదింకొకటి. అంచేత కసికొద్దీ లోకాన్ని ధిక్కరిస్తున్నాను. నాకూ ఓ యిల్లూ, సంసారం, నాదీ అని పిలుచుకునే భర్తా, పిల్లలూ అవేవీ అక్కర్లేదనుకోకు" అంటుంది. అప్పుడుకాని నిజమైన ఇందిర స్త్రీరూపంలో మనకు కనిపించదు. కాని ప్రకాశానికి మాత్రం కనిపించలేదు.

ఎవరూ ఎప్పుడూ "నువ్వు చెడ్డదానివి" అంటే ఒప్పుకోడాని కిష్టపడరు. అందులో ఒక మగాడు ఒక ఆడదాన్ననడం అసలే సహించలేదు. అందుకనే ఇందిర కల్యాణి వెళ్ళిపోతానంటే కారణం తెలిసివుండికూడా "ఇల్లు అచ్చిరాలేదు" అన్న కారణాన్ని పైకి తెచ్చింది. కృష్ణమూర్తి నాలుగూ దులిపేద్దామనుకుంటే, చాతుర్యంగా ఏవేవో మాటలు చెప్పేసి "కృష్ణమూర్తి నాకోసం వేరేగది చూశాడు" అని కల్యాణి అన్నట్టుగా చెప్పింది. తప్పయినా సరే తప్పని ఇంకొకళ్ళ మీద తోసేసి తాను తప్పుకుంటుంది. ఆ చాకచక్యం అందరికీ తెలీదు. ఇందిరకు తెలుసు.

తరువాత కృష్ణమూర్తి ఆవిడ దగ్గరకు రావడం మానేశాడు ఒకనాడు సినిమా నుంచి వస్తోంటే ఎదురుపడిన కృష్ణమూర్తిని మామూలుగానే పలకరించేసి ఇంటికి లాక్కు వెళ్ళింది. అప్పటికి కృష్ణమూర్తి వసుంధరకు దగ్గరయాడని తెలుసుకున్న ఇందిర "జెలసీ" తో అతన్ని లొంగదీసుకోడానికి ప్రయత్నించింది

కృష్ణమూర్తి ఆవిడచేసిన పనులకు ఎత్తి పొడుస్తాడు. దానికి వుక్రోషంవచ్చి – తనెందుకలా తయారయిందో, అందులో తన తప్పేంలేదని చెబుతుంది "నా యిల్లు నేను కట్టుకుంటూంటే పక్కనించి నడిచి వెళ్లేవారి నెత్తిమీద యిటికలు పడ్డాయంటే నేనేం చెయ్యగలనూ? ఎవరిమట్టుకు వాళ్ళు చూసుకు నడవాలి అంతే" అంటుంది అలాంటి ఆవిడతో ఏం వాదించగలడు కృష్ణమూర్తి.

"కూతురికి కొంచెం జీవశక్తి ఎక్కువగా వుండడాన్న దానంతట అదే అలాంటి ఇంట్లో పెరిగి పెద్దదయింది నిరంతరం రోగంతో మూలిగే తల్లి అంటే ప్రేమాభిమానాలు పెంచుకోలేకపోయింది రాత్రి నిద్రపోయేటప్పుడు కూతుర్ని గుండెలమీద పడుకోబెట్టుకునేవాడు నాన్న అయన పెదవుల్లోంచి ఘాటైన ద్రావకాల వాసనలు వెదజిమ్మేవి. అటువంటి అనుభవాలవల్ల గట్టిపడింది ఆ పిల్ల ప్రకృతియిచ్చిన గట్టి శరీరమూ, చురుకైన మెదడూ, యీ రెండిటివల్లా ఎన్ని అడ్డంకులున్నా నెమ్మదిగా చదువులో కాలేజీదాకా ఎగబాకింది" అని తన కధచెప్పి, జీవితమనే భూతంతో దెబ్బలాడుతోన్న ఆవిడనుచూసి "సెభాస్ ఇందిరా" అనేట్లు చేసుకుంది

"శుద్ధ నూనెమిరాయిసరుకు మనుషులం కృష్ణమూర్తీ ఏమిటేమిటో అనుకుంటాం రెక్కలున్నాయనుకుని ఎగరడానికి ప్రయత్నిస్తాం రెక్కలులేవు మనకి వున్నా అవి తడిసిపోయాయి. నా రెక్కల్ని బీదరికం తడిపేసింది. నేనొక సాదా గడియారాన్ని కాని – భగవాన్ – యీ గడియారాలకి ముళ్ళు లేవయ్యా." అంటూ జీవిత సత్యాలను హాస్యంలోజోడించి, విజ్ఞానవేత్తకు మల్లే చెబుతుంది ఆ సమయంలో వ్యక్తిత్వమనే వెలుగులో ప్రకాశిస్తూ మెరిసిపోతున్న ఇందిర కనిపిస్తుంది

హృదయాల్ని కరిగించే ఇంత దుఃఖగాథా, అవలీలగా చెప్పేస్తోన్న ఇందిర ఆశ్చర్యంగా కనిపిస్తుంది "నువ్వు చాలా గొప్పదానివి ఇందిరా" అంటాడు కృష్ణమూర్తి కాని, ఇందిర అంత సులువుగా అలాంటి మాటలకు లొంగిపోదు "ఏ పని చేసినా నేను కళ్ళు తెరిచిచేస్తాను. ఏడుస్తూ ఏదీ చెయ్యను ఏం జరిగినా ఏడవను నాకూ తక్కిన వాళ్ళకూ అదే తేడా" అంటుంది ఇందిర ఇందిర గొప్పతనం తెలుసుకోడానికి ఈ మాటలు చాలవూ?..

అంతేకాదు. కృష్ణమూర్తితో తన పెళ్ళయిన రాత్రి – "నీ జీవితకాలంలో నిండుగా నిర్భయంగా బతుకు. రోజుకు పదిసార్లు చావకు మానవత్వం వుండడం సిగ్గుపడవలసిన నేరం ఏమీకాదు. మన చుట్టూరావున్న స్వార్థం, ద్వేషం, క్రౌర్యం, భయం యివి మనలోనూ వున్నాయి. కాబట్టి వీటికి భయపడకు." అంటూ వుద్వేగంతో మాటాడుతుంది "క్షమించేశాను ఫో" అంటాడు కృష్ణమూర్తి కృష్ణమూర్తే కాదు ఎవరైనా క్షమిస్తారు

ఇందిర ఈ నవలకు నాయిక. ఆదర్శాలు మాటాడకుండా, తనేదో గొప్ప వ్యక్తి అనుకోకుండా, హాయిగా బతకా లనుకునే స్త్రీ ఆవిడ జీవితానికి తప్పో, ఒప్పో లక్ష్యమనేది వుంది ఆ లక్ష్యం చేరుకోడంలో ఏది అడ్డొచ్చినా పక్కకు తొయ్యడానికి సంకోచించదు నిండు మానవత్వం వున్న మనిషి ఈ నవలకు ప్రాణం

ప్రకాశం మనిషే. మనిషికనకే అతనికీ వుద్దేశాలూ, ఇష్టాయిష్టాలూ అనేవి కలుగుతూంటాయి కాని ఆ ఇష్టాన్ని బయటపెట్టే పొందే ధైర్యం లేదు చిన్నప్పటి నుంచీ ఆ పరిస్థితులలో పెరిగాడు. తండ్రి చనిపోయి, మేనమామ పంచ చేరి – డబ్బును ప్రేమించి, మనుషులతో వ్యాపారం చేసే శేషావతారం పడగ నీడలో పెరిగిన ప్రకాశం అలా తయారయాడు చేవలేని వాడని కాలేజీలో పేరు పడ్డాడు ఇందిర ఎంత బలమైందో ప్రకాశం అంత బలహీనుడు ఎవరు ఎటు ప్రక్కతోస్తే అటు పక్క పడిపోయే మనిషి

కల్యాణికి టైఫాయిడ్ వచ్చినపుడు ఆవిడకు సన్నిహితుడై స్థితిగతులు తెలుసుకుని, ఒంటరిగా ప్రపంచాన్ని ఎదుర్కోలేక నుంచున్న ఆవిడకు భుజం తట్టి "నేనున్నానులే నీకేం ఫరవాలేదని" హామీ ఇస్తాడు – తనకే అటువంటి హామీకావాలన్న సంగతి మరిచిపోయి

కల్యాణికి సహాయం చెయ్యలేకపోయిన తన అశక్తతకు దిగులుపడుతూన్న సమయంలో ఇందిర చెయ్యందిస్తుంది ఆ చెయ్యందుకుని కల్యాణికి చెయ్యలేక పోయిన సహాయం, ఆవిడ గురించి కాలేజీ ఫ్రెండుతో దెబ్బలాట అన్నీ మరిచిపోతాడు. ఆ మైకంలో వుండగానే శేషావతారంవచ్చి "ఎవర్తిరా అది" అని హుంకరించేసరికి గజగజలాడిపోయి, పిల్లిలా అతని వెనక వెళ్ళిపోయి, అక్కడేమనలేక కుదిర్చిన సంబంధానికి తలూపి, ఇందిర వ్యామోహాన్ని వదులుకోలేక పారిపోయొచ్చేస్తాడు. ఆ స్థితిలో అతన్నిచూసి ఇందిర పొమ్మంటుంది దాంతో ఆవిడను ధూర్తురాలుగా, మోసకత్తెగా, నీతి నియమాలు లేని పిల్లగా భావించి, ఆత్మవంచన చేసుకుని మామచూపిన పిల్లను పెళ్ళాడితేనే తనకు సుఖం అనుకుంటాడు. అంతటితో అతని అవసరం ముగుస్తుంది.

"ఈ చవట హీరో ఏవిటి చెప్మా?" అని అనుకుంటూన్న పాఠకుడికి ప్రకాశం తెరవెనక్కు వెళ్ళిపోయిన తరువాత, కృష్ణమూర్తి దృష్టిలో పడతాడు. కృష్ణమూర్తికి ఆదర్శాలు లేవు. కొందరి హీరోలకున్నటువంటి "అబద్ధ మాడను" లాంటి గుణగణాలు లేవు. ఎవరిమీదా కోపం లేదు. అందర్నీ ప్రేమించగలడు. అందరితోటే కులాసగా మాటాడుతూ హాయిగా గడిపేయడమే అతని పద్ధతి.

కృష్ణమూర్తికి పెద్దపెద్ద గుణాలు లేకపోవచ్చుగాని ప్రకాశంలాంటి చవటకాదు. అదే అతని నాయకలక్షణం. ప్రకాశం తెరమీద వున్నంతసేపూ నీడలోవుండి, ప్రకాశం చవటతనం బయల్పడి మనుష్యుల్నించి పారిపోయిన తరువాత నీడలోనుంచి అతనికతనే బయటపడ్డాడు కృష్ణమూర్తి. ఇటువంటి నాయకుడిని సృష్టించడంలో రచయిత్రి మంచి చాతుర్యం చూపినా, చివరంటా కృష్ణమూర్తి పాఠకులకు అస్పష్టంగానే కన్పిస్తాడు ప్రకాశం వున్నప్పుడు అస్పష్టంగావుండాలి కాబట్టి అలావున్నా

తరువాతనైనా స్పష్టపడలేదు ఇందిర, ప్రకాశం, కల్యాణి వున్నంత స్పష్టంగా – కృష్ణమూర్తి లేడు

ఏదో చదువు వెలగబెట్టేస్తున్నాడనే నమ్మకంతో తండ్రి పంపుతూన్న సొమ్ము తింటూ ఖుషీగా కాలం గడిపేస్తోన్న కృష్ణమూర్తికి "మొదటిసారిగా కనువిప్పు కలిగించింది కల్యాణి ఆ తరువాత, వసుంధర అతనిలో కొంత చలనం కలిగించింది. అంటే అతడిలో నిద్రాణంగా వున్న కొన్ని బాధ్యతలనీ, విలువలనీ వీళ్ళు పైకి తీశారు సరిగ్గా ఆ సమయంలో ఇందిర, అతడు పశ్చాత్తాప పడేట్లు చేసింది అందువల్లే అతడో నిశ్చయానికి వచ్చాడు మనుష్యులతో అంత తేలిగ్గా ఆడుకోడం అసహ్యం అనిపించిం దతనికి" ఇవి కృష్ణమూర్తి గురించి రచయిత్రి చెప్పిన మాటలు

ఇందిర తరువాత అంతస్పష్టంగా సృష్టించబడిన మరొక పాత్ర కల్యాణి ఝాన్సీ లక్ష్మీబాయి అంతటిదాన్ని, సరోజినీనాయుడంతటి దాన్ని చేసేద్దా మనుకున్న తండ్రే ఆవిడకు ఆధారం చాలా సున్నితమైన మనస్సు – అభిమాన వంతురాలు అటువంటి కల్యాణికి కష్టాలు ఎదురొచ్చేసరికి అటువంటి కష్టాలే వున్న ఇంకోవ్యక్తి తారసిల్లి – "ఫరవాలేదు ఒకరికొకరం తోడుపడదాం కల్యాణీ!" అని తల నిమురుతాడు అతని కష్టాలనే ఎదుర్కోలేని ఆ మనిషి తన కష్టాలకెక్కడ ఆసరా ఇవ్వగలడనే అనుమానం రాలేదు కల్యాణికి

ఇందిర ఈవిడకు అన్యాయం చేసి ఇంట్లోంచి వెళ్ళగొడుతుంది అయినా కల్యాణికి ఇందిర మీద కోపం రాలేదు అంతా తన దురదృష్టం అనుకుంటుంది తరువాత వసుంధర చేత ఆదరించబడుతుంది తండ్రి చనిపోవడం, ప్రకాశం నిరాదరణ, ఇందిర అన్యాయం ఈ దెబ్బలనుండి కోలుకోకముందే తన్ను చూడడానికి వచ్చిన మునసబు రామినాయుడు హఠాత్తుగా మంచమెక్కుతాడు

కల్యాణిని కూతురిలా చూస్తూ, ఆవిడ తాలూకు ఇల్లు అమ్మి తన అప్పుకింద డబ్బు తీసుకోకుండా వెయ్యి రూపాయలూ తెచ్చి యిచ్చి, ఆవిడను చదువుకోమని చెప్పిన రామినాయుడు మృత్యువుకు దగ్గర పడుతూండడం స్పష్టంగా, వివరంగా, పఠిత కదిలిపోయేటట్లు చెప్పారు రచయిత్రి కాని కల్యాణి కదలలేదు. ఇంతకన్నా పెద్ద కష్టం తండ్రికి సమీపిస్తున్న మృత్యువునే చూసింది కల్యాణి రామినాయుడి చావే ఇలా వుంటే స్వయానా కన్న తండ్రిని తీసుకుపోడానికి వస్తున్న మృత్యువు ఇంకెంత భయంకరంగా వుంటుందో పఠిత వూహకే వదిలి వేయబడింది

అంతంత కష్టాల్ని పడి లేచిన కల్యాణి తన జీవితాన్ని తనే నమ్మలేక పోతుంది రామినాయుడి జబ్బు సమయంలో సహాయం చేసిన కృష్ణమూర్తి, వసుంధర, డాక్టరూ అంటే కృతజ్ఞత గౌరవా లేర్పడ్డాయి కృష్ణమూర్తి సహాయం నిరాకరించి తన కర్తవ్యాన్ని త్వరగా నిర్ణయించుకోకుండా వున్న కల్యాణికి, పిన్నిగారు మనోనేత్రం తెరిపించింది కర్తవ్యంలోకి వురకలెత్తించింది పిన్నిగారి మాటలు పడలేక నాలుగు ట్యూషన్లు మాటాడుకుని బంధువుల ఇంటికి మారిపోతుంది కల్యాణి తన కాళ్లమీద తను నిలబడి ప్రపంచాన్ని చూసి నవ్వుదామనుకున్న కల్యాణికి పుట్టిన రోజునాడు పిన్నిగారి మాటలు మళ్ళీ వినిపిస్తాయి ఆ వుద్రేకంలో తప్పించుకు

పారిపోయి, డాక్టరు చక్రవర్తికి తన గోడు వెళ్ళబోసుకుంటుంది రామినాయుడి జబ్బులో పరిచయమయి స్నేహితుడయాడు డాక్టరు చక్రవర్తి

ఇక్కడొక సందేహం చక్రవర్తి మామూలు కష్టాలుపడి పైకొచ్చిన ఓ డాక్టరు కల్యాణిది సున్నితమైన మనస్సు కష్టాలవల్ల ఆవిడ అన్నింటినీ శంకిస్తూ, దేన్ని తాకడానికైనా భయపడుతూ వుంటుంది అటువంటి మనిషికి రామినాయుడికి సహాయం చేశాడనే ఒక్క కారణంవల్ల చక్రవర్తిమీద అంత గౌరవం, పెళ్ళి చేసుకునే అంత నమ్మకం కుదిరిందంటే బలంగా లేదు

"స్త్రీ అసహాయంగా నిలబడి సహాయం కోరుతుందా అని చూస్తుంటారు పురుషులు. అది సృష్టిరహస్యం" అంటారు పెద్దలు దీనిని బట్టిచూస్తే చక్రవర్తి రామినాయుడి జబ్బులో సహాయం చెయ్యడంలో అసహజమేమీ లేదు కృష్ణమూర్తి ఫ్రెండుగానన్నా, అసహాయంగావున్న ఒకరికి సహాయం చేదామనే మానవత్వం వల్లనైనా చెయ్యొచ్చు పోతే మొదటి చూపులోనే "ఈవిడ నెక్కడో చూసి నట్టుందని" అతనికీ, "ఇతనిని చూసి నట్టుందని" ఆవిడకూ అనిపించిందని రాయడంలోనే వీళ్ళిద్దరికీ పెళ్ళి జరుగుతుందని, లేకపోతే ఇంతబలంగా ఒకర్నొకరికి పరిచయం చెయ్యక్కరలేదని అనుమానం కలుగుతుంది మామూలు డాక్టరుగా ఒకరోగి దగ్గరకు వచ్చిన చక్రవర్తిని గురించి అంతచెబితే అదే వూహ కలుగుతుంది ఎవరికైనా

కల్యాణిమీద అతనికి ఒక విధమైన అభిమానం పెరుగుతుంది కల్యాణికీ అతను తనను ఓదారుస్తుండడంవల్ల అతనంటే గౌరవం పెరుగుతుంది. ఆవిడ పుట్టినరోజు రాత్రి తన ఇంటికి తీసుకుపోయి "వెనకటికి ఓ కవి పాడుపడ్డ గోడలమీద పాత కథలు వికసిస్తాయి అన్నాడు..." అంటూ ఏవేవో విషయాలు మాటాడుతాడు డాక్టరు. పిన్నిగారి మాటల్నించి పారిపోయివచ్చిన కల్యాణి డాక్టరుకు తనబాధ చెప్పుకుంది. అప్పుడు వాళ్ళిద్దరిమధ్యా ఏదో మార్పు జరుగుతుంది. కాని ఏం జరిగింది: ఎలా వాళ్ళు ఒకరికొకరు కావాలనుకుంటారు అన్నది తెలియదు.

"రాత్రేం జరిగింది తనకు....తనేమిటో డాక్టరుకి అర్థంకాలేదా? కాదు అలా అనుకుందుకు తనకు హక్కులేదు. నిన్నటిదాకా వుందేమోగాని నేటితో ఆ హక్కుపోయింది" అని కల్యాణీ, "ఆ రాత్రే తనెవరో పోల్చుకుంది. అదొక దివ్యానుభవం – ఒకరికొకరు కావాలి. ఒకరులేనిదే ఇంకొకరికి జీవితమే లేదు అనేది ఇద్దరికీ అర్థమైంది" అని చక్రవర్తీ అనుకోడంచూస్తే ఆ రాత్రి వాళ్ళిద్దర్నీ మార్చేసిందని అర్థమౌతుంది. ఎలా మార్చేసింది అన్నది పాఠకుడి వూహ కతీతంగా వుంది.

నిజంగానే ఆ రాత్రి అంతమార్పు తెస్తే, ఆ మర్నాడు డాక్టర్ని కలుసుకోవాలని వచ్చిన కల్యాణి అతను లేడని తెలిసేసరికి – "ఎక్కడకు వెళ్ళిపోయినట్లు ఈ డాక్టరు? సరిగ్గా అయిదింటికి వుంటానన్నారే? ఆదిలోనే హంసపాదా? ఎంత ఉద్విగ్న హృదయంతో వచ్చింది తను! ఆయనకికూడా అలా అనిపించలేదా?" అని ఎందు కనుకుంటుంది! ఆ తరవాతకూడా కల్యాణి ఎందుకు అతన్ని శంకిస్తూ వుంటుంది?.... "తను ఎందుకు అన్నం తినలేక పోయిందో అదికూడా పోల్చుకోలేక పోతున్నాడు నరకానికా స్వర్గానికా! ఆ క్షణంలో కల్యాణికి వళ్ళు జలదరించింది.

అణువణువునా భయం ఆవేశించింది" అని రచయిత్రి చెప్పడంలోనూ ఆ రాత్రి అంత బలమైంది కాదేమోననిపిస్తుంది బలమైంది కాకపోతే రచయిత్రికీ, కల్యాణికీ, చక్రవర్తికీ కూడా ఆ రాత్రి ఎందుకు అంతప్రాముఖ్యం వహిస్తుంది?

అదే రాత్రి ఇందిరా కృష్ణమూర్తుల సాహసం చూపించి, ఆ సాహసం కృష్ణమూర్తిని ఎంతగా మార్చేసిందో బొమ్మగీసి చూపినట్టు చెప్పిన రచయిత్రి, కల్యాణీ చక్రవర్తుల గురించి అంత స్పష్టంగా చెప్పలేదు అలా చెప్పడం అనవసరమనుకుని వుండాలి

ఇటువంటి కారణాలన్నింటివల్లా కల్యాణి తన జీవితంలో ఓ సహచరు డుండాలి కాబట్టి ఇత నయోగ్యుడుగా కనిపించలేదు కాబట్టి అతన్నంగీకరించిందని – అనిపిస్తుంది జీవితంలో ఎన్నో దెబ్బలు తిని కోలుకున్న చక్రవర్తి, అటువంటి దెబ్బలే తిని అనుభవం సంపాదించిన కల్యాణి తనకు సరిపోతుందనుకోడంలో వింత లేదు ఎంత ప్రయత్నించినా అతను డాక్టరుగా కనిపిస్తాడే గాని, చక్రవర్తిగా కనిపించడు అతనే స్వయంగా ఆవిడను కావాలని కోరడం వల్ల అతని గురించి చెప్పవలసింది ఇంకేం లేదు

కల్యాణిని ఆదరించి, పిన్ని మాటలకు వులిక్కిపడి, కృష్ణమూర్తితో బీచి షికారు చేస్తూ ఇందిర కళ్ళబడింది వసుంధర ఆ జెలసీతో ఇందిర కృష్ణమూర్తిని తన పక్కతిప్పుకుంది దాంతో కథ మలుపు తిరుగుతుంది కల్యాణిని ఆదరించడం, కృష్ణమూర్తితో బీచి షికారు చేయడంలోనే వసుంధర ప్రాముఖ్యం ఎక్కువ తరువాత ఫస్టు క్లాస్ తెచ్చుకోవలసిన వసుంధర మామూలు వసుంధర అయిపోయి వాళ్ళ పెళ్ళికికూడా వెళ్ళింది

ఆనందరావు ఇందిర తండ్రి ఆ కూతురుకు తగిన తండ్రి ఇతనూ ఆ తండ్రికి తగిన కూతురు ఇందిరా మదిరా మానినీ అతని జీవితంలో ముఖ్యమయినవి. తనమీద పిడుగు పడుతోంటే చేతి కందిన వాడిని ఆ స్థానంలో నుంచోబెట్టి పరారయి పోగల ధీశాలి ఈ విషయం – శేషావతారం వచ్చి అందర్నీ కలిపి దుయ్యబడుతోంటే అతడిని శాంత పరిచి హోటలుకు తీసుకువెళ్ళి ఓ కట్టు కథ కల్పించి చెప్పడంలోనే తెలిసిపోతుంది అతని అనుభవాలే అతన్నలా తయారు చేస్తాయని ఇందిర చెప్పిన కథ వల్ల తెలుస్తుంది.

నవల మొత్తంమీద అసహజం కలిగించిన దేమిటంటే – ఇందిర వైదేహి అన్న ప్రసాదుతో మాటాడిన మాటలు పరిచయం తక్కువగావున్న మనిషితో ఎంత దురుసుగల పిల్లయినా, ఎంత చికాకులోవున్నా అలా మాటాడడం వెగటుగా వుంటుంది. మొదట కొంచెం మర్యాదగానే మాటాడి తరువాత్తరువాత మాటల్ని హెచ్చిస్తే బావుండేది. కాని మొదట్నించీ అతన్ని తూలనాడుతున్నట్టుగా నిసాకారంగా మాటాడడం బాగులేదు. ఏ మనిషైనా తను చెడ్డదని మొదట్లోనే ఇంకోమనిషి తెలుసుకోడాని కిచ్చగించదు.

నవల పొడుగునా ఆనందరావు, ఇందిర, కృష్ణమూర్తి సున్నితమైన హాస్యధోరణిలో మాటాడతారు. కల్యాణి కష్టాలతో బరువెక్కి పోయిన పాఠకుడు వీళ్ళ హాస్యంతో ఆహ్లాదం పొందుతాడు. కొండమీదకు చేరగానే "కంపొండరుగారూ కంగ్రాచ్యులేషన్స్"

అంటుంది ఇందిర. ఇది మనకు హాస్యంగా కనిపించినా, బాధ్యతతోకూడిన ప్రశంస చేస్తుంది ఇందిర ఇలాగే అంతటా హాస్యంగా మాటాడుతూ లోతులుచెప్పేస్తూ వుంటుంది

" 'కాలాతీత వ్యక్తులు' కాదు వ్యక్తే. ఇందిరే ఆ వ్యక్తి" అని కొందరి వాదం.

"ప్రకాశం ఇందిర కలిపి "కాలాతీత వ్యక్తులు" అయుండొచ్చు జాతిలోవున్న ఒక దృష్టినిబట్టి చూస్తే – ప్రకాశం స్త్రీకిమల్లే పిరికిపడి లొంగిపోయాడు ఇందిర పురుషుడికిమల్లే జీవితమనే భూతాన్ని ఎదురొడ్డి పోరాడింది. అందుకే వాళ్ళిద్దరూ 'కాలాతీత వ్యక్తులు' అయ్యారు" అని ఇంకొక వాదం.

ఏది ఏమైనా ఈ నవల కంతటికీ ఇందిర మణిపూస. దానిచుట్టూ వ్యక్తిత్వమనే ప్రకాశం వుంది. ఆ వెలుగులోంచి ఎవ్వరూ ఆవిడను లాగలేరు. ఈ నవలకు ఆధారం ఇందిర.

ఇందిరను సృష్టించి గొప్ప విజయం సాధించారు రచయిత్రి తెలుగు సాహిత్యంలో శ్రీదేవిగారి ఇందిర చిరస్థాయిగా వుండాలని ఆశిస్తున్నాను ఇంతటి గొప్ప నవలను పాఠకుల కందించిన శ్రీదేవిగారు అభినందనీయులు

*(తెలుగు స్వతంత్ర, 8-2-1958)*

❋ ❋ ❋

# ఇందులో...


కాలాతీత రచన ... vii

- ఏటుకూరి ప్రసాద్

కాలాతీత వ్యక్తులు -ఒక ప్రసక్తి ... ix

- పి. సరళాదేవి

కాలాతీత వ్యక్తులు నవల ... 1

డా॥ శ్రీదేవిగారి కాలాతీత వ్యక్తులు ... 220

- డా॥ వి. చంద్రశేఖరరావు

ఏం చెప్పను నేస్తం-(కవిత) ... 225

- ఆచార్య నాయని కృష్ణకుమారి

# కాలాతీత వ్యక్తులు

గబగబా సగం మెట్లెక్కి "ప్రకాశం!" అని గట్టిగా కేక వేశాడు కృష్ణమూర్తి డాబామీది వరండాలోనుండి మెట్లమీదకు తొంగిచూస్తూ ప్రకాశం, "వస్తున్నానోయ్–ఒక్కనిముషం! నువ్వే పైకి రారాదూ పోనీ!" అన్నాడు ఆ చివరి మాట వినిపించుకోకుండానే కృష్ణమూర్తి మళ్ళీ కిందకి దిగిపోయి వీధి వరండాలో నిలుచున్నాడు కూనిరాగం తీస్తూ. ఇంతలో తన పక్కనుండి ఎవరో దూసుకుపోయినట్లయింది. తుళ్ళిపడి ఆ వ్యక్తికేసి తేరిపార చూశాడు అతనికేదో ఐనట్లయింది. ప్రకాశం కిందకి దిగి వచ్చి కృష్ణమూర్తి బుజంమీద చెయ్యివేసి "ఇంక పద!" అన్నాడు.

ఇద్దరూ సందు మలుపు తిరిగి మెయిన్ రోడ్డు వైపు నడిచారు దారిలో ప్రకాశం "ఏం కృష్ణమూర్తీ! ఏమిటి విశేషాలు? అన్నట్టు ఆ మధ్య హైదరాబాదు వెళ్ళావట కదూ!" అన్నాడు

కృష్ణమూర్తి పరధ్యానంగా ఏదో ఆలోచిస్తూ "ఆఁ నేను చెప్పే విశేషాలకేముంది గాని–ఎవరోయ్ ఆ మెరుపు తీగ?" అంటూ తిరుగు ప్రశ్న వేశాడు అదేమిటో అర్థం కాక 'ఏమిటీ?' అన్నట్లు తెల్లబోయి చూశాడు ప్రకాశం.

"నువ్వు చూడలేదూ! ఇప్పుడే మీ యింట్లోకి వెళ్ళిందీ–"

"కళ్ళజోడూ రెండు జడలూ – ఆ అమ్మాయేనా?" అన్నాడు ప్రకాశం

"ఆ ఆ !" అన్నాడు కృష్ణమూర్తి

"కొత్తగా దిగారులే! మా యింటి కింది వాటాలో అద్దెకుంటున్నారు"

ఆ మాట వినేసరికి కృష్ణమూర్తి అదోలా మొహం పెట్టి "ఈ యింట్లోనే ఉంటున్నారా! చెప్పావుకావేం?" అంటూ మూలిగాడు

ప్రకాశం నవ్వుతూ "చెప్పడానికేముంది ఇందులో? ఈ మధ్యనేగా వాళ్ళొచ్చింది! అంతా కలిపి పదిహేనురోజులవలేదు ఇన్నాళ్ళూ నువ్వు ఊళ్ళోనే లేవాయె!" అంటూ సంజాయిషీ చెప్పుకున్నాడు. అంతలోనే మళ్ళీ "కాని నాకు భయంగా ఉంది సుమా కృష్ణమూర్తీ! గది మార్చేస్తే బాగుండునని తోస్తూంది!" అన్నాడు

కృష్ణమూర్తి "అదేం? భయం దేనికీ! ఇంతకూ ఆవిడ నర్సా, స్టూడెంటా?" అన్నాడు సిగరెట్ వెలిగించుకుంటూ.

"రెండూ కాదు వర్కింగ్ గర్ల్, అంటే ఎక్కడో ఉద్యోగం చేస్తోంది బి.ఏ జూనియర్ దాకా చదివి మానేసిందట, ఆ పైన డబ్బులేక అనుకుంటాను టైపూ షార్టుహాండూ నేర్చుకుంది. ప్రస్తుతం రైల్వేలో ఏదో ఆఫీసులో పని చేస్తూంది. వాళ్ళదసలు అనకాపల్లి దగ్గర ఏదో ఊరట" అన్నాడు ప్రకాశం, ఆమెను గురించి తనకు తెలిసినంతవరకూ చెప్పేశాననే తృప్తితో.

"పదిహేను రోజులలో ఇన్ని ఆరాలు తీసినవాడివి గదా– మళ్ళీ ఆవిడంటే భయమంటావేం? పోనీగాని ఈమాటు ఆవిడను ఇంట్రడ్యూస్ చేస్తావా నాకు?" అన్నాడు కృష్ణమూర్తి.

"తప్పకుండా, అంత ప్రాధేయపడాలా? అసలు ఇవాళ రూముకెళ్ళగానే ఆవిడే అడిగేస్తుంది– మీ ఫ్రెండుని పరిచయమైనా చేశారు కాదే అని మొన్ననేం జరిగిందో తెలుసా–ఆవిడ భలే మనిషిలే!" అంటూ ఎందుకో ఆగిపోయాడు ప్రకాశం.

"అసలేం జరిగిందో చెప్పక అలా గుటక వేసి ఊరుకుంటావేం!" అని కదలించాడు కృష్ణమూర్తి."

"ఆవిడకి ఇంటర్‌లో క్లాస్‌మేటట. కల్యాణి అని ఒక అమ్మాయి ఈ సంవత్సరమే ఆనర్సులో చేరింది. ఓ సాయంత్రం ఈవిడగారు అమ్మాయిని అమాంతం నా రూములోనికి తీసుకొచ్చింది, పరిచయం చేయాలంటూ"

"ఇంకేం! ఇద్దరు స్నేహలతల్ని సంపాదించావన్నమాట!" అన్నాడు కృష్ణమూర్తి కొంచెం ఈర్ష్యతో

వెంటనే ప్రకాశం "అంతగా కుమిలిపోకు–ఇందిర యిందాకా నిన్ను సరిగా గమనించలేదేమో గాని అమాంతం బుజం పట్టుకు నిలవేసి మరీ మాటాడేస్తుంది అరనిమిషం కిందట పరిచయమైన వాళ్ళతో ఆరుగంటలు బాతాఖానీ వేసుకు కూర్చోగలదు. చాలా చలాకీ పిల్ల!" అని స్నేహితుడిని ఊరడించడానికి ప్రయత్నించాడు

"అంత మంచి కంపెనీ దొరికితే అలా తేలమొహం వేస్తావేం? పోనీలేగాని నువ్వు రూము ఖాళీ చేస్తే మాత్రం తప్పకుండా నాతో చెప్పు" అన్నాడు కృష్ణమూర్తి

అంతవరకూ నవ్వుతూనే మాటాడుతున్న ప్రకాశం ఆ మాట విని మొహం ముడుచుకున్నాడు మళ్ళీ వెంటనే సర్దుకుని "ఓ! తప్పకుండా!" అనగలిగాడు

ఇద్దరూ అలా పూర్ణా థియేటర్ వేపు సాగిపోయారు,

ప్రకాశం ఫైనల్ ఇయర్ ఎం.బి., బి.ఎస్. చదువుతున్నాడు. కాలేజీకెదురుగా చెంగల్రావుపేట డౌన్‌లో మొదటి మేడ యింట్లో ఉంటున్నాడు నిన్న మొన్నటిదాకా ఆ మేడ స్టూడెంట్సు లాడ్జిగా ఉండేది మెడికల్ కాలేజీలో చేరిన నాటినుండి ప్రకాశం అందులోనే ఉంటున్నాడు, పైన ఉన్న ఒకేఒక మేడ గదిలో కిందనంతా కలిపి నాలుగుగదులున్నాయి. వాటిలో పూర్వం ఏ.వి.యన్. కాలేజీ విద్యార్థులుండేవారు. వేసవిలో వాళ్ళు ఖాళీ చేసి పోగానే ఆ వాటాలో ఇందిరా, ఇందిర నాన్నా ప్రవేశించారు.

ఎత్తయిన గుర్రపు అరుగులూ, చిన్న వీధి వసారా, వసారాలో నుంచి లోపలికి నడవ, దానిలోనుంచి మేడమీదకి సన్నని మెలికలు తిరిగే సిమెంటు మెట్లు వరుస–ముప్పైయేళ్ళ క్రితం అదే అందం అనుకునే పద్ధతిలో కట్టబడినదాయిల్లు

ప్రకాశం తన రూముకు వెళ్ళాలన్నా బయటకు రావాలన్నా ఆ నడవలోనుండే నడవాలి. సంసారులున్న యింటిలో అటు- యిటూ తిరగడం, తనకోసం ఎవరో వస్తూ పోతూండడం—వాళ్ళకిబ్బందిగా ఉంటుందేమో ననిపించేది ప్రకాశానికి కొత్తలో. పూర్వం ఎప్పుడూ విద్యార్థులే ఉండేవారేమో అతనికా కష్టం ఉండేది కాదు. మొదట్లో మరొక రూము చూసుకుంటే బాగుండుననుకున్నాడు. కాని ఐదు సంవత్సరాలనుండి అందులో ఉండడానికీ, అంతరాయం లేకుండా తన చదువు సాగడానికీ ఏదో కారణం ఉండే ఉంటుందనిపించిందతనికి. ఆ నమ్మకాన్ని కాదనుకో లేక అలాగే కాలం గడిపేస్తున్నాడు.

ఆ యింట్లో దిగిన రెండో రోజునే ఇందిర హడావిడిగా ప్రకాశం రూములోకి వచ్చి "చూడండీ! మా నాన్నగారికెందుకో గంటనుండి చాలా ఆయాసంగా ఉంది, ప్రయాణం బడలిక వల్లనో ఏమో! ఒక్కసారి చెయ్యిచూస్తారా?" అంది.

ప్రకాశం వెళ్ళి చూశాడు. "మీ నాన్నగార్కి బ్లడ్‌ప్రషర్ ఉందనుకుంటాను. ప్రస్తుతానికేం భయంలేదు పూర్తి విశ్రాంతి తీసుకోమనండి, రాత్రికి భోజనం మానిపించి కొంచెం పాలివ్వండి. రేపుదయం హాస్పిటలుకు తీసుకువెళ్ళి చూపిస్తాను" అన్నాడు.

మర్నాడుదయం ఇందిర ప్రకాశం రూములోకొచ్చి "మీరిప్పుడు హాస్పిలుకు వెళతారు గదూ! అభ్యంతరం లేకపోతే మా నాన్నగారిని కూడా తీసుకు వెళతారా?" అంది.

"మాటలో వచ్చారు. నేనే వచ్చి చెపుదామనుకుంటున్నాను ఇంకో అరగంటలో బయలుదేరుతాను, సిద్ధంగా ఉండమనండి" అన్నాడు ప్రకాశం. ఆ తరువాత కాస్సేపటికి అతడు కిందకి దిగి వచ్చేసరికే ఇందిర కూడా తయారై ఉంది. ముగ్గురూ కలసి హాస్పిటలుకు వెళ్ళారు.

ఆ సాయంత్రం ఇందిర మళ్ళీ ప్రకాశం రూములోకి వచ్చి "ఏమండీ! ఉదయం నాన్నగారిని పరీక్ష చేసిన డాక్టరు ఏమన్నాడు? బ్లడ్‌టెస్టు చేశారు గదా? ఏమిటి సంగతి?" అని అడిగింది.

"నేను చెప్పాను కదూ బ్లడ్ ప్రెషర్ ఉందని! అదే, చాలా ఎక్కువ ప్రెషర్ ఉంది. కొన్నాళ్ళు విశ్రాంతి తీసుకోవాలి. అదీకాక ఆయన అలవాట్లు కొంచెం తగ్గించుకోవాలి" అనేసి ప్రకాశం కొంచెం బాధ పడ్డట్టు, మళ్ళీ "క్షమించండి. డాక్టరుగారలా చెప్పారు" అన్నాడు. అలా అన్నందుకు ఆమె ఏదైనా బాధపడుతున్నదేమోనని ఆమె వైపు పరిశీలనగా చూశాడు.

ఇందిర ఏమీ బాధపడలేదు సరిగదా చాలా సాధారణంగా "నేనూ అదే చెపుతున్నాను. కాని ఆయన యింక మారేది లేదు. అసలా తాగుడు వల్లనే యింతగా ఆరోగ్యం పాడైంది" అంది.

ప్రకాశం మనస్సు చివుక్కుమంది. తండ్రి గురించి ఒక కొత్త మనిషితో ఇందిర యిలా మాట్లాడగల్గడం అతని కాశ్చర్యం కలిగించింది.

తండ్రి ఆరోగ్యం గురించిన ఏదో ప్రశ్న వేయడానికి వచ్చి క్రమక్రమంగా ఇందిర అలా ప్రకాశంతో మాటలాడుతూ కూర్చుండిపోయేది. ఒక మాట చెప్పడానికి వచ్చి పది ప్రశ్నలు వేసి వెళ్ళేది.

ఉదయం 10 గంటలకు ఆఫీసుకు వెళ్ళి సాయంత్రం ఐదుగంటలకు వస్తుంది ఇందిర. ప్రకాశం సాయంత్రం ఐదు అయేసరికి కాలేజీనుండి వస్తాడు వెంటనే బట్టలు మార్చుకొని ఏ స్నేహితుడితోనో కలసి బజారుకు పోయేవాడు. లేదా చదువుకునేందుకు లైబ్రరీకి పోయేవాడు. తిరిగి యిల్లు చేరుకునేసరికి ఎనిమిదో తొమ్మిదో అయేది రాగానే ఇందిర ఏదో ఒక సాకుతో కబుర్లు చెపుతూ కూర్చుంటుంది ఒక్కొక్కసారి ప్రకాశానికి ఆవిడ రాకపోకలు చికాకు కలిగించేవి. చదువు వెనకపడుతుందని భయపడేవాడు. కాని ఏమీ తోచనప్పుడు ఆమెతో కబుర్లు చెప్పడంలో ఏదో ఒక ఆనందం అనుభవించేవాడు.

ప్రకాశానికి క్రమంగా ఆమెతో కాలక్షేపం ఒక తప్పనిసరి అలవాటుగా పరిణమించింది. రోజులో ఏదో ఒక సమయంలో ఆమె అతని గదికి వస్తుంది. ఏదో ఒక అక్కరలేని విషయమైనా సరే ప్రస్తావించి మాటలు పెంచుతుంది. రోజులకు రోజులు అలా గడిచాయి. కాని ప్రకాశం మాత్రం అవసరం లేకుండా వాళ్ళ వాటాలోకి వెళ్ళలేదు. ఇందిరతో తనకుతానై మాటాడలేదు. ఒక్కొక్కప్పుడు ఇందిర మరీ విసుగెత్తిస్తుంది. తన చిన్నప్పటినుండీ జరిగిన గొడవలన్నీ అతడడగకుండానే ఏకరువు పెడుతుంది. ప్రకాశం లోలోపల మండిపడినా పైకి మాత్రం ఇందిర నేమీ అనలేకపోయేవాడు. ఇందిరంటే అతని కెందుకో ఒక విధమైన భయం. ఆమెలో అతన్ని ఆకర్షించినవాటికంటె భయపెట్టిన విషయాలే ఎక్కువ.

ఆ రోజు సాయంత్రం ఆరుగంటలయింది. ప్రకాశం అప్పుడే వచ్చి క్యాంపుకాట్ మీద కాళ్ళుచాపి పడుకొని పేపరు చదువుకుంటున్నాడు ఇందిర ఎప్పుడు వచ్చిందో అతను చూడనేలేదు. గాలిదుమారంలా వచ్చి–

"ఏమండోయ్! మన కింకొక తోడు తీసుకువస్తున్నాను ఆ రోజు మీకు పరిచయం చేశాను చూడండీ–కళ్యాణీ అని– ఆ అమ్మాయిని కూడా ఇక్కడికి వచ్చేయమన్నాను. కింద నాలుగు గదులున్నాయి. నేనూ నాన్నా–ఇద్దరమేగా–ఏం చేసుకోవాలి? హాస్టలులో ఉంటే బోలెడవుతూందిట ఆవిడకి. అందుకని యిక్కడికి వచ్చేయమన్నాను"–అంది గుక్క తిప్పుకోకుండా ఇందిర.

ప్రకాశం అంతా విని తనకేమీ సంబంధంలేనట్లుగా "సరే మంచిదే!" అనేసి నిర్లిప్తంగా ఊరుకున్నాడు.

ఇందిర యిట్టే కోపం తెచ్చేసుకొని "ఆ అమ్మాయిని తీసుకురావడం మీ కిష్టంలేదు కాబోలు. అలా మూతిముడుచుకుని కూర్చోకపోతే స్పష్టంగా చెప్పేయరాదూ?" అని విసురుగా అనేసి తిరిగి చూడకుండా కిందికి వెళ్ళిపోయింది.

ప్రకాశం తెల్లబోయాడు. ఇందిర మాట్లాడినదాంట్లో ఒక్కమాట కూడా అతని కర్థం కాలేదు. ముక్కూ మొహం ఎరుగని ఆ అమ్మాయెవరో వస్తానంటే మధ్యన తన కిష్టంలేకపోవడమేమిటి? ఇందిర మీద తనకేం అధికారముంది? ఇది తన యిల్లా ఏమైనానా? అనుకున్నాడు. ఆవిడ చేసిన పని తన కిష్టం లేనట్లు తనేమీ ప్రకటించలేదే? ఆ పిల్లకి అంత కోపం ఎందుకు రావాలి? అని మధనపడ్డాడు. ప్రకాశానికి వచ్చిన గట్టి చిక్కే అది. ఇందిర క్షణంలో కోపం తెచ్చుకుంటుంది. అంతలో మళ్ళీ ఆప్యాయం వలకబోస్తుంది. ఎప్పుడెందుకెలా ఉంటుందో అతనికేమీ అర్థంకాదు.

అలాంటి అకస్మాత్ కోపాలను చాలాసార్లు ప్రదర్శించింది ఆమె. ఐతే తానుమాత్రం ఆ కోపానికి చాలా విస్తుబోయి ఊరుకునేవాడుగాని అనునయించే ప్రయత్నం చేయలేకపోయేవాడు. అంతేకాదు, ఆమెకు కోపం వస్తే మరింత భయపడిపోయేవాడు ప్రకాశం. ఆ భయంతో ఆమెను సమీపించడానికే జంకేవాడు. మళ్ళీ ఇందిరే వచ్చి ఆ జంకు పోగొట్టేది.

ఆ మధ్యలో కృష్ణమూర్తి రెండుసార్లు వచ్చాడు. కోరుకున్నట్లుగా అతనికి ఇందిరను పరిచయం చేశాడు ప్రకాశం. ఇంక ఆ రోజంతా వాళ్ళిద్దరూ ప్రకాశం గదిలో కూర్చుని ఎడతెరిపి లేకుండా కబుర్లు చెప్పుకున్నారు. ఆ బాతాఖానీతో విసుగెత్తిన ప్రకాశం చదువు నేపంతో మెడిసిన్ పుస్తకం పట్టుకుని గదిముందు వరండాలో కూర్చున్నాడు.

ఇందిరతో మాటలు కలుపుకోవడంలో కృష్ణమూర్తి చాలా చురుకుదనం కనబరిచాడు. ఇందిరకూడా అతనితో సరదాగా మాట్లాడింది. చాలా సేపు ఉభయులూ ఏవేవో చర్చలు సాగించారు.

మరొకసారి కృష్ణమూర్తి వచ్చినప్పుడు మెట్లగదిలోనే ఇందిర కనబడి లోపలికి రమ్మని ఆహ్వానించింది. అతడు సందేహించకుండా లోపలికి వెళ్ళాడు. ఇందిరతో చాలాసేపు కాలక్షేపం చేశాకగాని ప్రకాశం దగ్గరకు వెళ్ళనే లేదు.

ఆ రోజు రాత్రి నాన్నకు సుస్తీగా ఉందని ప్రకాశాన్ని పిలుచుకువచ్చింది ఇందిర. అతడు వచ్చి, స్టెతస్కోపుతో పరీక్షచేసి "మొన్న మనం కొనితెచ్చిన మాత్రలు రెండు వేసుకోండి. కొంచెం ప్రెషర్ ఎక్కువయింది. అంతకన్న మరేమీ లేదు" అని ఇందిర నాన్నతో అనేసి వెళ్ళిపోబోతుంటే ఇందిర తండ్రి ఆనందరావు ప్రకాశం చెయ్యిపట్టుకుని "కూర్చోవోయ్ వెళుదువుగాని!" అన్నాడు కుర్చీ చూపిస్తూ. తండ్రి పడుకున్న ఈజీచైర్ వెనకాతల చేతులు ఆనిస్తూ ఇందిర మూతి అదోలా తిప్పి "అతనెందుకు కూర్చుంటాడు నాన్నా! నీకు వంట్లో బాగోలేదంటే తప్పదు భగవంతుడా అని వచ్చాడు. ఇంక కొన్ని నెలలుపోతే డాక్టరవుతాడుగదా! ఆ మాత్రం రాజసం ఉండొద్దూ? కృష్ణమూర్తి చూడూ, పిలవగానే వచ్చి ఎంతసేపు కూర్చొని వెళ్ళాడో!" అని ఎత్తిపొడిచింది.

ప్రకాశం మొహం చిన్నబుచ్చుకుని, "అబ్బే! గర్వం దేనికండి? ఏదో నాకు అలవాటులేదు అంతే. చిన్నప్పటినుండీ యింతే నేను!" అంటూ తప్పనిసరిగా కుర్చీలో కూలబడ్డాడు. ఆనందరావు కబుర్లలోకి దిగాడు. హాస్పిటల్ సంగతులు, చదువులు, డాక్టర్లు అంటూ పడకకుర్చీలో కూర్చునే విశ్వపర్యటనం చేసాడు అంతసేపూ ఇందిర ఎందువల్లనో మౌనంగా ఉండిపోయింది.

మర్నాడు సాయంత్రం ఆరుగంటలయేసరికి కృష్ణమూర్తి ఖరీదయిన సూటులోవచ్చి దిగబడ్డాడు. అతడెప్పుడూ వచ్చేవేళ అదే. ఇందిర ఆ సమయానికి ప్రకాశం గదిలో వుంది. ప్రకాశం మాత్రం ఇంట్లో లేడు. కృష్ణమూర్తి తన మామూలు అలవాటు ప్రకారం సగం మెట్లమీంచి 'ప్రకాశం' అని కేక పెట్టాడు. ఇందిర మెట్లమీదకి తొంగిచూసి—

"ఓ! కృష్ణమూర్తిగారా? రండి రండి!" అంది.

అతను బూట్లు టకటకలాడిస్తూ పైకి వెళ్ళాడు. అటూ యిటూ చూచి "ప్రకాశం లేడా?" అన్నాడు.

"లేడు. లైబ్రరీకి వెళ్ళాడు. రేపేదో క్లాస్ టెస్ట్ ఉందట "

"ఓహో! ఈమధ్య రూమ్ తాళం వేయకుండా మీ కేరాఫ్‌కి వదలి వెళుతున్నాడన్నమాట!" అన్నాడు అతను అర్థోక్తిలో.

"ఒక్క రూమే ఏమిటి, అతనే నా కేరాఫ్‌లో వున్నాడు!" అంది ఇందిర మరింత దర్పంగా.

అలాంటి జవాబు వస్తుందని ఊహించుకోలేకపోయాడు. అతను వెంటనే విషయం మార్చి, "మీ నాన్నగారి ఒంట్లో ఎలా ఉందండీ?" అన్నాడు.

"బాగానే ఉంటూంది. ఈ మధ్య కాస్త లేచి తిరుగుతున్నారు కూడా. అన్నట్లు కృష్ణమూర్తిగారూ! మీరు చెస్ బాగా ఆడతారట కదూ?" నవ్వుతూ అడిగింది ఇందిర.

"అదెవరు చెప్పారు?" అన్నాడు ఆశ్చర్యంగా.

"ఇంకెవరు చెపుతారు? ప్రకాశం చెప్పాడు. మా నాన్నగారు చదరంగమంటే చెవి కోసుకుంటారు. మీకు తీరికగా ఉన్నప్పుడు వచ్చి రెండు ఎత్తులు వేస్తూండండి, యిద్దరికీ కొద్ది కాలక్షేపం! ఇప్పుడూ యింట్లో ఉంటే బాగుండిపోను నాన్నగారు, కాని బీచికి వెళ్ళారు" అంది.

అతని కేదో స్ఫురించినట్లయింది. "మనంకూడా బీచికి పోదాం రాకూడదూ?" అని సూచించాడు.

వీధి కిటికీలోకి చూస్తూ నిలుచున్న ఇందిర ఏమనుకుందోగాని ఒక్క క్షణం ఆలోచించి," సరే పోదాం పదండి. కాస్త కాలక్షేపమైనా అవుతుంది. బట్టలు మార్చుకుని వస్తాను, కూర్చోండి" అని వెళ్ళిపోయింది.

అతని హృదయం ఆశ్చర్యంతో కూడిన సంతోషంతో నిండిపోయింది. తనతో బీచికి రావడానికి ఇంత త్వరగా ఇందిర ఒప్పేసుకుంటుందనుకోలేదు.

ఐదు నిమిషాలయ్యాక "కృష్ణమూర్తిగారూ, రండీ!" అన్న ఇందిర కేక కిందనుండి వినిపించింది. ఆ కేకతో గబగబా మెట్లుదిగిన అతనికి ఇందిరా, ప్రకాశం ఇద్దరూ సాక్షాత్కరించారు. ప్రకాశం వంక పలకరింపుగా ఒక చూపు చూశాడుగాని అతనికి నోట మాట రాలేదు.

ప్రకాశమే ముందు పలకరించాడు "ఎలా చదువుతున్నావోయ్?" అని.

అతను వలయాలుగా సిగరెట్టు పొగ వదులుతూ, "ఆ పెద్ద చదువుకేముంది లెద్దూ! ఒక్క సబ్జక్టే గదా!" అన్నాడు.

ముగ్గురూ మౌనంగా మినర్వా బీచి వైపు నడిచారు.

కృష్ణమూర్తి కిందటేడు ఏ. వి. యన్. కాలేజీలో బి. ఎ. పరీక్షకు వెళ్ళాడు. గ్రూపులో తప్పి యీసారి సెప్టెంబరుకు కూర్చోబోతున్నాడు. బి. ఏ. చదివిన రెండు సంవత్సరాలూ ప్రకాశం లాడ్జీ కింద భాగంలో రూం తీసుకుని ఉండేవాడు. అతనిది విశాఖ జిల్లా పాలకొండ ప్రాంతం. అతడు చదువుకోసం విశాఖపట్నం వచ్చిన తరువాత నేర్చుకున్న ముఖ్య విషయం జల్సాగా డబ్బు ఖర్చుపెట్టడంలో

ఎంత ఆనందం ఉందని. ఆ కార్యక్రమంలోని సొంపునూ యింపునూ బాగా నేర్చుకున్నాడు. అతని ధర్మమా అని అతనిచుట్టూ చేరిన స్నేహితులకు డబ్బుకు యిబ్బందిపడే అవసరం వుండేది కాదు.

కృష్ణమూర్తి సరదాగా పెట్టే జేబుఖర్చు అతని బృందాని కంతటికీ సినిమాలకీ సిగరెట్లకీ బాహాటంగా సరిపోయేది. అతను ఒక్క చదువు మినహా తక్కిన పనులన్నీ చేసేవాడు. చదువుకోమని చెప్పి బాధపెట్టడం అతని స్నేహితుల కిష్టంలేదు. ఆ లాడ్జిలో ప్రకాశం ఒక్కడే అతని నడతచూసి బాధపడేవాడు. ఆ వర్గంతో సహకరించనిది ప్రకాశం ఒక్కడే. వాళ్ళకీ ప్రకాశంమీద ఏమంత సదభిప్రాయంలేదు. సిగరెట్ల అలవాటు గాని, స్నేహితులపైగాని తనపైగాని వేడుకలకోసం ఖర్చుపెట్టడానికి డబ్బూ, ఆసక్తీ లేనివాడు ప్రకాశం. అతడు "రంగూ, రుచీ, వాసనా" వగైరాలేవీ అంతగా పోల్చుకోలేని అదొక రకం సామాన్యుడు, సామాన్యంగా సాధారణతకు అలవాటు పడ్డవాడు, దానిని అధిగమించి అంగుళం అవతలకు పోలేదు. ఆ పరిధికి యివతల ఉండడమే శ్రేయమని అతని భావన.

చాలామంది ప్రకాశాన్ని మెత్తని వాడంటారు. అసమర్థుడనికూడా కొందరనేవారు. సాటి విద్యార్థులతన్ని చూచి "వట్టి చవటవురా!" అని తెలియచెప్పేవారు "బొత్తిగా చేవలేనివాడివిరా ఎలా బతుకుతావోగాని!" అని నిట్టూర్చేది వాళ్ళమ్మ. అతని మామయ్యకూడా వీధరుగుమీద కూర్చుని ఏ మునసబుతోనో కబుర్లు చెబుతున్నప్పుడు, "మా చెల్లెలు పోరు పడలేక వీడిని డాక్టరీ చదువుకు పంపించానుగాని-చిన్నప్పటినుండీ చూస్తున్నానుగదండీ వీడిది వట్టి పిరికిగుండె, వట్టి చెవల వాజమ్మ చెవలపిల్లిని చూసి భయపడేరకం, వీడికి డాక్టర్ గిరీ ఏమిటి నా తలకాయ!" అనేవాడు

ఒక్క ఇందిరమాత్రం ప్రకాశాన్ని "మీరు తమాషా మనిషండీ" అంటుంది. ఒక్కొక్కసారి అతనివేపు గోముగా చూస్తూ "మీతో లాభం లేదు, నాకు చాలా కోపంగా వుంది మీమీద!" అంటుంది. ఆ మాటల కర్థం ఏమిటో ప్రకాశానికి బోధపడలేదు. ఐనా, ఇందిర అలా అంటుంటే ప్రకాశానికెందుకో బాగుండేది.

తన స్నేహబృందమంతా బి. ఏ. పూర్తిచేసుకుని ఎవరితోవన వాళ్ళు వెళ్ళిపోయారుగాని కృష్ణమూర్తి ఒక్కడూ భాగారంలో శేషంలాగ మిగిలిపోయి సెప్టెంబరు పరీక్షకోసం తిరిగి వచ్చేసరికి ఒంటరివాడైనాడు ఆ ఒంటరితనంలో ప్రకాశాన్ని చూసేసరికి ప్రాణం లేచివచ్చిందతనికి. అంతే; గట్టిగా పట్టేసుకుని "హమ్మయ్యా! నువ్వేనా మిగిలి ఉన్నావు, అదెంత కాదు!" అన్నట్లు ప్రకాశం లాడ్జికి వస్తూ పోతూండేవాడు.

కల్యాణి వస్తుందని ఆ రోజు చెప్పిన తరువాత ఇందిర మళ్ళీ ప్రకాశం దగ్గిర ఆ ప్రసక్తే తేలేదు. ప్రకాశం కూడా ఆ సంభాషణ మరచిపోయాడు

సెప్టెంబరు నెలలో ఒక ఆదివారపు సుప్రభాతాన. పెట్టె పరుపు క్యాంప్‌కాట్ వగయిరా సంసారంతో ఇందిర యింటికి వచ్చేసింది కల్యాణి. ఆమె గుమ్మంలో అడుగుపెట్టగానే ముందుగా ఎదురైనవాడు ప్రకాశం; స్టెతస్కోపూ, నోటుపుస్తకం చేతబట్టుకొని హాస్పిటల్‌కు వెళ్ళబోతున్న ప్రకాశం.

'నమస్తే!' అంది కల్యాణి అతన్ని చూడగానే. అతడు బిత్తరపోతూ ప్రతినమస్కారం చేశాడుగాని పోల్చుకోలేదు. లోపలికి మళ్ళీ నాలుగడుగులు వేసి బిగ్గరగా "ఇందిరగారూ, మీకోసం ఎవరో వచ్చారు" అన్నాడు. ఆ వెనుకనే ఉన్న ఇందిర వెంటనే నడవలోకివచ్చి "ఓ-హో? కళ్యాణా? వచ్చేసేవా కల్యాణీ! వెరీగుడ్! మంచిదానవమ్మా!" అంటూ ప్రకాశం వైపు తిరిగి "అవునుగాని ప్రకాశంగారూ ! ఇందిర 'గారూ ' ఏమిటండీ అసహ్యంగా! ఇందిరా అని పిలవొచ్చులెండి మరేం ఫరవాలేదు!" అంది. విస్తుబోయాడు ప్రకాశం. ఒక కొత్త అమ్మాయి ముందు ఇలా అంటుందేమిటి ఇందిర?

డాబామీద ప్రకాశం గదికి సరిగా కిందనున్న గదిలో సామానంతా సర్దుకుంది కల్యాణి. మిగతా మూడుగదుల్లో ఒకటి భోజనాల గది. ఇంకోటి ఇందిర శయ్యాగారం. మిగిలింది ఆనందరావుండే గుహ. వంట బెడదలాంటిదేదీ ఇంతవరకు లేదు. హోటల్‌నుండి క్యారియర్ తెప్పించుకొని ఉదయం పదిగంటలయేసరికి తండ్రీ కూతురూ భోజనం ముగిస్తారు. వెంటనే ఇందిర ఆఫీసుకు పోతుంది. ఆనందరావు సాధారణంగా ఇల్లు కదలడు. కదిలే అవసరం ఏముంది గనక? గతాన్ని నెమరు వేసుకుంటూ మగతగా అలా సాయంత్రందాకా కాలక్షేపం చేస్తాడు సాయంత్రం ఆఫీసునుండి ఇందిర తిరిగి వచ్చేదాకా. వంట్లో బాగుంటే సాయంత్రం మాత్రం చిన్నషికారు సాగిస్తాడు బీచికి.

రాత్రికూడా తండ్రీ కూతురూ కులాసాగా కబుర్లు చెప్పుకుంటూ భోజనం చేస్తారు. తండ్రితో ఇందిర కొంత సన్నిహితంగా మాటాడేది భోజన సమయంలోనే. మిగతా సమయంలో కొంత ప్రకాశంతో గడుపుతుంది. కృష్ణమూర్తి వచ్చినప్పుడు అదో కాలక్షేపం. పరీక్షలు దగ్గిర పడుతున్నాయి గనక ప్రస్తుతం అతని రాకపోకలు తగ్గిపోయాయి. కల్యాణి వచ్చాక ఇందిరకు కాలక్షేపానికి అసలే లోటులేదు.

సాయంత్రం చక్కగా ముస్తాబై ఆమె తన గదికి వస్తే ప్రకాశానికి భయం–సినిమాకు రమ్మంటుందని. సినిమాకు వెళ్ళడంలో–ప్రకాశానికి చాలా నష్టాలున్నాయి. చదువు సాగకుండా కాలం వృధా అవుతుంది. డబ్బు ఖర్చుకూడా. ఈ రెండూకాక ఇంకో పెద్దభయం ఉంది. ఆమెను వెంటవేసుకు తిరుగుతూ తను ఎవరైనా ప్రొఫెసర్ల కంటబడితే వాళ్ళేమనుకుంటారోనని భయం. ఆమె బీచికి రమ్మన్నా అతని కదే భయం. అందుకే సాయంత్రం ఆమె ఇంటికి రాకమునుపే లైబ్రరీకి వెళ్ళిపోతాడు, లేదా బాగా చీకటిపడేదాకా ఇంటికి రాడు. ఆమె మరీ గొడవపెడితే రెండో ఆట సినిమాకు వెళతాడు. ప్రొఫెసర్లెవరైనా చూస్తారేమోననే భయం అప్పుడుండదు. అప్పటికీ ఎందుకైనా మంచిదని ఆనందరావునుకూడా బయలుదేరదీస్తాడు.

మొట్టమొదటిరోజున కల్యాణిని ఇంట్లో చూసినప్పుడు ఆమెగురించి ప్రకాశానికి ఒక అభిప్రాయం అంటూ రాలేదుగాని వారంరోజులు తిరిగేప్పటికి ఆమె మీద అభిమానం ఏర్పడిపోయింది. కల్యాణి ఎవరితోనైనా మృదువుగా వినయంగా మాట్లాడుతుంది. ఆమె వైఖరిలోనే ఒక ఆకర్షణీయమైన ముగ్ధత్వం ఉంది. ఆమెతో మాట్లాడుతూంటే ప్రకాశానికేదో ఓదార్పు, ఏదో ఊరట, లోలోపల అతనికి తెలియకుండానే కలిగేవి. అందుకే అతడు కల్యాణితో సరదాగా మాట్లాడగలడు. కేవలం ఆ కోరికతోనే అతడు కిందకు దిగి ఆమె వాటాలోకి వచ్చినప్పుడల్లా ఎక్కువ

భాగం ఆమెతోనే సంభాషణ సాగించవలసి వచ్చేది కల్పించుకుని మాట్లాడడం కల్యాణికి చేతకాదు. కథలు చెప్పి కాలాన్ని నింపలేదు. కలలో సుందరిలా కన్పించీ కన్పడనట్టు తప్పుకుపోతుంది.

ప్రకాశానికిప్పుడు ఇంటికి ఆలస్యంగా రావాలనిలేదు సాయంత్రాలు ఎక్కడికీ వెళ్ళాలనీ లేదు. అది గమనించిన ఇందిర "అబ్బాయిగారిప్పుడు మంచి పిల్లవాడుగా మారిపోయారే?. పక్షులతోపాటు సాయంత్రం అయేసరికి గూటికి చేరుకుంటున్నారు!" అంది ఒకనాడు. ప్రకాశాని కిప్పుడు మాటచాకచక్యం కూడా అంకురిస్తోంది "అవును, మనందరం పక్షుల్లాంటి వాళ్ళమే. ఒక గూటిలోనే ఉంటున్నాంగాని ఒక గూటివాళ్ళంమట్టుకు కాదు!" అన్నాడు.

ఆ మర్నాడు సాయంత్రం ప్రకాశం యింట్లో అడుగు పెట్టగానే ఇందిర చక్కగా ముస్తాబై అతన్ని ముందు గదిలోనే నిలిపేసి, "ఓయ్ పక్షిగారూ! కాస్త సముద్రపు గాలి పీల్చుదాం రండి!" అంటూ బలవంతంగా బీచికి లాక్కెళ్ళింది. తోవలో హోటలికి తీసుకువెళ్ళి అతనిచేత బలవంతంగా స్వీట్సు అవీ తినిపించింది. సముద్రపు ఇసుకలో ఆడుకుంది. పాటరాని ప్రకాశాన్ని పాట పాడమని వేధించింది.

రాత్రి తొమ్మిదింటికి ఇద్దరూ కొంప చేరుకున్నారు ముందరి రూములో లైటు వెలుగుతూంది కాని, కల్యాణి రూములో చీకటిగా ఉంది. "కల్యాణీ!" అని అరుచుకుంటూ గదిలోకి వెళ్ళింది ఇందిర. జవాబు రాలేదు. లైటు వెలిగించి చూస్తే మంచంమీద అచేతనంగా పడుకున్న కల్యాణి కనబడింది "అప్పుడే నిద్రపోతున్నావా కల్యాణీ? భోంచేశావా?" అంటూ ఇందిర కల్యాణి మొహం ఇటు తిప్పబోయేసరికి వేళ్ళు చురుక్కుమన్నాయి చెయ్యి వేసి చూస్తే కల్యాణి ఒళ్ళు కాలిపోతుంది "ప్రకాశం గారూ! కల్యాణికి జ్వరం!" అంది ఆమె బొంగురు గొంతుకతో.

ఒక్క ఉరకలో మేడమీదకి వెళ్ళి థర్మామీటరు తెచ్చాడు ప్రకాశం. వణుకుతున్న చేతులతో, గుండెలో దడతో థర్మామీటరు కల్యాణి నోటికి అందించాడు. రిష్టువాచీవైపు చూస్తూ – నిమిషం గడిచాక – "ఎంతుందో చూడండి ఇందిరగారూ!" అన్నాడు.

థర్మామీటరు, బల్బు వెలుతురికి దగ్గరగా పెట్టి చూస్తూ – "నూటమూడు!" అంది ఆమె ప్రకాశం చెవులు రింగుమన్నాయి. స్టెతస్కోపు కోసం మళ్ళీ మేడమీదకి పరుగెత్తాడు.

## 2

తెలతెలవారుతూండగా తుని రైల్వేస్టేషన్‌లో అప్పుడొక బండి ఆగేది. (చాలా కాలంనాటి మాట. ఇంకొక నాలుగేళ్ళలో రెండవ ప్రపంచ యుద్ధం వచ్చేస్తుందని అప్పట్లో ఆ ప్రాంత ప్రజలు ఊహించలేదు.) ఆ బండి దిగి ఎవరైనా నందూరు వెళ్ళదలుచుకుంటే ముచ్చటైన మువ్వల జట్కా ఎక్కి పన్నెండు మైళ్ళు ప్రయాణం చెయ్యాలి, కంకర రోడ్డుమీద. గజానికో నాలుగు గోతులు మినహాయిస్తే రోడ్డు బాగానే ఉండేది, చీకటి తెరలు విడి, భూమి అంచులనుండి వెలుగు ప్రసరిస్తూంటే, కంకర రోడ్డు మీద జట్కా ప్రయాణంలో అందం లేకపోలేదు. దూరాన పొగమంచులు

చిమ్మే నీలం కొండలు. దారికిరుపక్కలా డొంకలూ, అడవీ, పాలపిట్టల అరపులూ – మధ్య మధ్య చిన్నచిన్న పొలాలు. బంగారు పంటలు పండేవి కావు కాని–ఎలాటివైతే మాత్రం ఎవరేం చేస్తారు గనుక! అలా గంటన్నర ప్రయాణం చేశాక రోడ్డు పక్కన వాగు తగులుతుంది. వాగు దాటాలి. వాగులో ఎప్పుడోకాని నీళ్ళుండవు అవతలి ఒడ్డునే గ్రామం. మొదట్లోనే ఓ వంద పూరి గుడిసెలూ, సమృద్ధిగా పందులూ. అవన్నీ దాటి మట్టిబాట మీదుగా వెళితే – అక్కడక్కడ పెంకుటిళ్ళూ, ఇంటి కప్పులనుండి పొగ, కొద్దిగా జనసంచారం; ఎడ్లూ నాగళ్ళూ, గొడ్లచావిడులూ, రచ్చబండలూ, రామ మందిరం; చిన్న శివాలయం–ఆ వూరు కూడా ఆదర్శవంతమైన భారతీయ గ్రామం అనడానికి సందేహం లేదు. ఆదర్శవంతమైన మురికీ అనారోగ్యం నిస్సహాయతా పేదరికం నిరక్షరాస్యతా ఎక్కడివలెనే అక్కడ కూడా ఉండేవి. ఇది నాటి మాట, నేటిది కాదు.

ఆ గ్రామంలో, రామ మందిరాన్ని ఆనుకుని సాగే సందులో చిట్టచివరి ఓ పెంకుటింటిలో పుట్టింది కల్యాణి. కాంగ్రెస్ ప్రముఖులు ప్రమాణంచేసి కొత్తగా మంత్రి పదవులు స్వీకరించిన రోజులవి లిన్‌లిత్‌గో 'ప్రభువు' న్యూఢిల్లీలో కూర్చుని ఖరీదైన ఎడ్లను పెంచుతూ గాంధీగారితో ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపుతూన్న రోజులవి. ఆ రోజులలోనే అచ్యుతరామయ్య అక్కడ బడిపంతులు ఉద్యోగం, బ్రాంచి పోస్టుమాస్టరు ఉద్యోగం రెండూ కలిపి చేసినా, జీవనం గడవక కష్టాలు పడేవాడు. అచ్యుతరామయ్య అసలు ఆ వూరు రావడమే ఆశ్రయం లేని కుర్రవాడుగా వచ్చాడు, మేనమామ యింటికి . ఆ మేనమామ ఆ పల్లెటూరిలోనే ఒక విలక్షణమైన వ్యక్తి అనిపించుకున్నాడు ఒక చెంప ఆయుర్వేద వైద్యం, యింకొక చెంప మేస్త్రీ వృత్తీ చేస్తూ, గ్రామంలో కాస్త కలవాళ్ళ కోర్టు వ్యవహారాలల్లో ఏజంటుగా పని చేస్తూ, యాభయ్యోపడి వచ్చేసరికి ఐదెకరాల గరువూ, చిన్న పెంకుటిల్లూ, రావణాసురుడనే కీర్తీ సంపాదించగలిగాడు. అనాకారి, మూర్ఖురాలు భార్యతో ముప్పైయేళ్ళు కాపరం చేసి ఏటేటా పిల్లల్ని కన్నప్పటికీ, కడసారి కూతురు ఒక్కర్తే చివరికి మిగిలింది. ఆ కూతురే కాలక్రమాన అచ్యుతరామయ్య అర్ధాంగి అయింది. ఆ విధంగా మేనమామ ఎస్టేటుకంతటికీ అచ్యుతరామయ్య వారసుడయాడు. మేనమామ అనంతరం బడిపంతులయాడు. కాని మేనమామలాగా రావణాసురుడు కాలేకపోయాడు. ఉప్పు సత్యాగ్రహం ముమ్మరంగా సాగే రోజులలో శ్రద్ధగా ఆంధ్రపత్రిక చదివి, తనుకూడా సముద్రపొడ్డున ఉప్పు తయారు చేస్తున్నట్లూ, లాఠీతో పోలీసువాడు కొట్టడానికి వస్తే తాను ఆ లాఠీ ఊడలాక్కుని ఇండియాలోని ఇంగ్లీషువాళ్ళ నందర్నీ ఆ లాఠీతో చావగొట్టి అరేబియా సముద్రంలోకి గెంటేసినట్లూ కలలు కనేవాడు. ఖద్దరు కట్టి గాంధీ టోపీనే పెట్టుకోవాలనే రహస్యమైన కోర్కెతో బాధపడేవాడు. మొత్తం మీద గాంధీగారు ఉద్యమం లేవదీసినప్పుడల్లా అచ్యుతరామయ్య గుండెల్లో సంక్షోభం కలిగేది.

బీహారులో పెద్ద భూకంపం వచ్చిందన్న వార్త ఆ మధ్యాహ్నం గ్రామానికి ఆంధ్రపత్రిక మోసుకొస్తుందనగా, తెల్లవారుజామున నాలుగు గంటలకు అచ్యుతరామయ్య అర్ధాంగి ఆడపిల్లను ప్రసవించి, వెంటనే గుండె జబ్బుతో కన్ను మూసింది.

ఆ శిశువే కల్యాణి.

కీకారణ్యంలో కుందేలుకి దెబ్బ తగిలితే గిలగిలలాడి బాధతో మూలుగుతుంది గాని దానికి ఇంకేమీ అవగాహన కాదు; ఆ వేటగాడెవడో, తనను ఎందుకు గుండుదెబ్బ కొట్టాడో, అందువలన ఎవరికేనా ప్రయోజనం ఉందో లేదో కుందేలుకి అసలేమీ అర్థం కాదు. భార్య మరణించినప్పుడు అచ్యుతరామయ్య ఆ కుందేలులాగే బాధ పడ్డాడు. దుఃఖానికి కూడా అతీతమైన దిగ్భ్రాంతి ఏదో అతనిలో కలిగింది. భార్య ఎందుకిలా ఆగంతుకంగా ప్రాణాలు విడిచినట్లు? ప్రాణ స్పందనతో అప్పుడే భూమి మీద పడిన శిశువును ఎవరు పెంచుతారు? ఏమిటీ అన్యాయం? ప్రతిఘటించాలనుకున్నాడు ఎలాగ? ఎవరితో ప్రతిఘటన? అతనికి ఎక్కడ లేని కోపమూ వచ్చింది. గాంధీగారికి గట్టిగా ఓ ఉత్తరం రాయాలనుకున్నాడు కాని రాయలేకపోయాడు ఐనా అతనిలో ఆ కోపం మాత్రం చాలా కాలం ఉండిపోయింది. ఆ కోపం ఏ ఒక్క మనిషిమీదా, పరిస్థితిమీదా కాదు మొత్తం జీవితం మీదనే కోపం. నమ్మకంతో వెళితే దగా చేసే వర్తకుడి వంటిదిగా అతడికి జీవితం అర్థమైంది.

పక్కింటి ధర్మాత్మురాలొకామె—ఆమెకు తొమ్మండుగురు పిల్లలు—ఆ పసిగుడ్డును తెచ్చి ఏడాదిపాటు పెంచింది. ఆ పిల్లకి నామకరణం చేసింది కూడా ఆ యిల్లాలే. ఎందుకు పెట్టిందో ఆవిడకూ సరిగా తెలియదు గాని "కల్యాణి " అంటూ ఆవిడ పెట్టిన పేరే స్థిరపడిపోయింది. పిల్లకు "ఝాన్సీ లక్ష్మీబాయ్" అని పేరు పెడితే బాగుండునని అచ్యుతరామయ్య అనుకున్నాడు గాని, పక్కింటి ధర్మాత్మురాలిమీద కృతజ్ఞతాభావంతో ఆమె పెట్టిన పేరే ఖాయం చేశాడు.

కల్యాణికి సంవత్సరం నిండిన తరువాత ఎక్కడో గాలించి వెతికి పట్టుకుని అచ్యుతరామయ్య ఓ 'పినతల్లి'ని తీసుకురాగలిగాడు ఆమె బాల వితంతువు. నా అన్నవాళ్ళెవ్వరూ లేని అనాధ. ఆ ముసలావిడ తిరగతోడిన బాంధవ్యాన్ని బట్టిచూస్తే, ఆమె తనకు పినతల్లో, లేక కల్యాణికి పినతల్లో అచ్యుతరామయ్యకి అర్థం కాలేదు అంచేత తను పిన్నీ అని పిలిచేవాడు. ఏడాది శిశువుకి కూడా ఆ పిలుపే అలవాటై "పిన్నీ!" అని పిలిచేది. కల్యాణి పెంపకభారం ఆ పిన్నిగారి చేతులలో పెట్టేసి అచ్యుతరామయ్య నిశ్చింతగా ఊపిరి పీల్చాడు సంవత్సరంనుండి నడక ప్రారంభించిన కల్యాణికి కాళ్ళకు వెండిమువ్వలు చేయించాడు. మెడలో చిన్న పులిగోరు పతకం తగిలించాడు. నట్టింట్లో ఆ పిల్ల తిరుగాడుతుంటే అలా ఆప్యాయంగా చూస్తూ—కల్యాణిని ఝాన్సీ లక్ష్మీబాయ్ అంతటిదాన్ని చేసెయ్యాలి అనుకునేవాడు ఓ మాటు. సరోజినీ నాయుడంతటిదాన్ని చేసెయ్యాలి అనుకునేవాడింకొకమాటు.

ప్రాయంలోనే భార్యను పోగొట్టుకున్న అచ్యుతరామయ్యా, బాల్యంనుండీ వైధవ్యమూ, బీదరికం తప్ప యింకేమీ ఎరగని "పిన్నిగారూ" కలసి కల్యాణిని పెంచారు. ఆ యింటి వాతావరణంలోనే ఏదో శూన్యత్వం, విధురత్వం అంతర్లీనంగా ఉండేవి. ఆటపాటలకి యిరుగు పొరుగు పిల్లలున్నా, యింట్లో సాహచర్యం ఆ యిద్దరితోనే. చిరుతిండి పెట్టడం, గోవిందనామాలు నేర్పడంతప్ప పిల్లకి యింకేం ఇవ్వాలో పిన్నిగారికి తెలియదు. కాగితం పడవలు చేయడం, చవకరకం బట్టలు కుట్టించడం, పిల్ల నిద్రపోయే వేళల్లో ఒళ్ళంతా నిమిరి, ఏవేవో జ్ఞాపకం తెచ్చుకొని లోలోపల బావురుమనడం తప్ప చిన్నపిల్లను ఎలా పెంచాలో అచ్యుతరామయ్య కసలే తెలియదు.

ఐదేళ్ళ కల్యాణి నాన్నతోపాటు బడికి వెళ్ళేది.

ఎనిమిదేళ్ళ కల్యాణి పిన్నితోపాటు గుడికి వెళ్ళేది.

పదేళ్ళ కల్యాణి రుక్మిణీకల్యాణం, గజేంద్రమోక్షం, వేమన శతకం కంఠస్థం చేసి, కరణంగారి కోడలు దగ్గర చిలకమర్తివారి నవలలు ఎరువుతెచ్చుకుని కూడపలుక్కుని చదివింది. యుద్ధం ఆపేశారుట అని ఊళ్ళో అమ్మలక్కలుకూడా అనుకుంటూంటే విని, పిన్ని చిన్నప్పుడు చెప్పిన రామరావణయుద్ధం అదేనేమో ననుకుని ఏదో తెలిసినదానిలా తృప్తి పడింది.

పదకొండేళ్ళ కల్యాణికి పెళ్ళికొడుకును వెతకమని పిన్నిగారు ఒకనాడు అచ్యుత రామయ్యతో అంది. అంతవరకూ కూతురు భవితవ్యం గురించి అపస్మారంగా ఉన్న అచ్యుతరామయ్య అమాంతంగా ఉగ్రుడై, "ఏమిటి? నా కూతురికి పెళ్ళా? ఇంకా పూర్తిగా కళ్ళు తెరవని యీ పసిపిల్లకి పెళ్ళా? వీల్లేదు. దాన్ని చదివిస్తాను. ఝాన్సీ లక్ష్మీబాయి అంతటిదాన్ని, పోనీ సరోజినీ నాయుడంతటిదాన్ని చేసేస్తాను" అంటూ ఆగడం చేసి, వారం తిరిగేలోగా వందరూపాయలు అప్పుచేసి, కూతుర్నీ పినతల్లినీ తునిలో మకాం పెట్టించాడు. కల్యాణి బడికి వెళ్ళడం ప్రారంభించింది.

పదిహేనేళ్ళ కల్యాణి స్కూల్ ఫైనల్ పాసయింది. తెలివైనపిల్ల అని టీచర్లంతా ఏకగ్రీవంగా నిశ్చయించి, అమ్మాయిని పై చదువుకి పంపించాలని అచ్యుతరామయ్యతో గట్టిగా చెప్పారు. ఇకనైనా చదువు చాలించి, అమ్మాయికి పెళ్ళి చేసేయమని పినతల్లి దుమారం లేవదీసింది.

పోనీ—పెళ్ళి చేసేసి ఆపైన చదివిస్తేనో—అనుకున్నాడు అచ్యుతరామయ్య ఆ వేసవిలో సంబంధాలకోసం ప్రయత్నించాడు. నారీమూల్యం అప్పుడతనికి పూర్తిగా తెలిసి వచ్చింది. అందరూ మన్మధులే, అందరూ బృహస్పతులే; కాని అధమపక్షం రెండువేల రూపాయలైనా కట్నం లేకపోతే వివాహం అనేది అసంభవమని వాళ్ళ ప్రగాఢవిశ్వాసం అచ్యుతరామయ్య ప్రాణం విసుగెత్తిపోయింది. ఆ రెండువేలూ పెడితే కల్యాణి ఇంటరుచదువు పూర్తవుతుందిగదా అనుకున్నాడు. తలతాకట్టుపెట్టయినా సరే, అమ్మాయిని చదివించాలని నిర్ణయించుకున్నాడు.

పదిహేడేళ్ళ కల్యాణి, విశాఖపట్నం మిసెస్. ఎ. వి. యన్. కళాశాలలో ఇంటరు ప్యాసయింది. పైచదువుకి సకాలంలో అచ్యుతరామయ్య డబ్బు సమకూర్చలేకపోయాడు. ఆ సమయంలోనే ఆయనకి టైఫాయిడ్ రావడం, పినతల్లి పక్షవాతంతో చనిపోవడం—యిన్ని కష్టాలతో ఒక ఏడాదిపాటు కల్యాణి యింట్లోనే కూర్చుండిపోయింది. మరుసటేడు కొంచెం కోలుకున్న అచ్యుతరామయ్య—మిగిలిపోయిన ఎకరం పొలమూ కష్టపడి అమ్మేసి—కల్యాణిని తీసుకెళ్ళి వాల్తేరు యూనివర్సిటీలో ఆనర్సులో చేర్పించాడు. ఆ రోజు కల్యాణి లోలోపల కుమిలి కుమిలి ఏడిచింది. ఎం. బి. బి. ఎస్. చదివి లేడీ డాక్టరవాలన్నది ఆమె స్వప్నం. కాని—అంత చదువుకి నాన్న తూగలేడు. ఆ మాట కొస్తే ఆనర్సు చదువుకి కూడా తూగలేడు. డబ్బుకోసం తనుపడే బాధలేవీ కూతురికి స్పష్టంగా తెలియనివ్వలేదు. కూతురు చూచాయగా అంటే మాత్రం "అంతంతేసి చదువులకి మనం తూగలేం తల్లీ! డాక్టరీ అంటే మాటలా?" అని నిట్టూర్చాడు.

☆ ☆ ☆

పందొమ్మిదేళ్ళ కల్యాణి ఆసుపత్రిలో చేరి నెల రోజులయింది నూటమూడు డిగ్రీలు జ్వరం వచ్చిన మర్నాడే ప్రకాశం గాభరాపడి ఆమెని ఆసుపత్రిలో చేర్పించాడు. అది టైఫాయిడ్‌గా పరిణమించి, ఇరవై రోజులపాటు ఆమె మంచంమీదనే గడిపింది.

ఆ రోజు ఉదయం పదకొండుగంటలయింది. ఆమెకి జ్వరం తగ్గిపోయి అప్పటికి వారం రోజులయింది. ఇక రెండుమూడు రోజులలో డిశ్చార్జి చేసేయవచ్చునని ప్రకాశం ఆమెతో ఆ క్రితం రోజునే అన్నాడు నీరసంగా మంచంమీద పడుకున్న కల్యాణి అలా కళ్ళుమూసుకొని పరిపరివిధాల ఆలోచించడం మొదలుపెట్టింది. తీర్థంలో ప్రజ వలే బుర్రనిండా రకరకాల ఆలోచనలు క్రిక్కిరిసిపోయాయి. ఆ తీర్థప్రజల మధ్య తానొక తప్పిపోయిన పిల్లవలె ఏదో ఒంటరితనంతో దిగులుపడింది ఆమె. ఎక్కడుంది తానిప్పుడు? ఆసుపత్రిలో రోగిగా మంచంమీద "అరబ్ద సంచిత ప్రారబ్ద కర్మచే ఆసుపత్రి పాలు కొన్నాళ్ళు!" అంటూ పినతల్లిపాడే ఏదో పిచ్చిపాట జ్ఞాపకం వచ్చింది తనకి. తన చుట్టూరా రోగులు. తనూ ఒక రోగి ఇందిర దయవల్ల ఆమె యింటిలో తనకి చోటు దొరికింది ప్రకాశం పరిచయం కూడా కలిగింది ఎంత మంచివాడు ప్రకాశం! మగవాళ్ళంతా యిలాగే ఉంటారా? తనకు తెలిసినంతవరకూ నాన్న తప్ప తక్కిన మగవాళ్ళంతా అదోరకంగా, ఏదో విచిత్రంగా కనబడేవారు. ఎందుకో తనకి మొగవాళ్ళంటే భయం. పాపం, పిన్ని చచ్చి ఏ స్వర్గాన ఉందోకాని, "దుష్టులకి దూరంగ ఉండాలమ్మా! వాళ్ళ కెప్పుడూ దూరంగా ఉండడమే మంచిది" అంటూండేది. నిజమే మరి. కరణంగారి అల్లుడు పెళ్ళాన్ని వాతలుపెట్టి చంపేశాడు ఆయుర్వేద వైద్యుడు శంభులింగం రోజూ పెళ్ళాన్ని గొడ్డును బాదేటట్లు బాదేవాడు అలాగే తను చూసిన మగవాళ్ళంతా ఒక రకం, యీ ప్రకాశం యింకో రకం తనకి టైఫాయిడ్ వచ్చిందనేసరికి ఎంత కంగారు పడిపోయాడు! ఆసుపత్రిలో అమాంబాపతు అందరి డాక్టర్లచేతా పరీక్ష చేయించాడు పాపం, నాన్నకంటే ఎక్కువ బెంబేలు పడిపోయాడు. తను ఆసుపత్రిలో చేరి యించుమించు నెల్లాళ్ళయింది. రోజూ ఇందిర వచ్చి చూస్తోంది. ప్రకాశం సరేసరి, కంటికి రెప్పవలె కాపాడుతున్నాడు తనకిద్దరు మంచి స్నేహితులున్నారు, యింకేం భయం? జన్మజన్మలకీ వాళ్ళు తన స్నేహితులుగా ఉండాలి, ఉంటారు అనుకుంది కల్యాణి.

అలా అలా ఏవేవో ఆలోచిస్తూంటే విపరీతమైన తలనొప్పి వచ్చేసింది కల్యాణికి కళ్ళు మూసుకొని పక్కకి తిరగబోతూంటే, జోళ్ళచప్పుడు వినిపించింది. ఉలిక్కిపడి మళ్ళీ యిటు తిరిగింది. ప్రకాశం వస్తున్నాడు. ఆ జోళ్ళచప్పుడు అతనిదే మైలు దూరంలో ఉన్నాసరే, ప్రకాశం వస్తున్నాడంటే తనకి తెలుస్తుంది తను పోల్చుకోగలదు. ఎలాగ పోల్చుకుంటుందంటే తనకే తెలియదు.

వస్తూనే మంచం దగ్గరగా స్టూలు లాక్కుని కూర్చుని, "హలో కల్యాణిగారూ! వంట్లో ఎలా ఉందివాళ?" అంటూ పలకరించాడు ప్రకాశం

"బాగానే ఉందండీ! టెంపరేచరు నార్మలే, నీరసం తప్పితే మరేమీలేదు. ఇందిర ఎలా ఉంది?" అంది కల్యాణి.

"ఇందిరకేం? ఆమె ఫస్టుగా ఉంది. ఇంకా నిద్రలేచి వుండదులెండి" అంటూ కల్యాణి చెయ్యి తీసుకుని నాడి చూశాడు ప్రకాశం. గోడకు తగిలించివున్న కేస్‌షీట్

తీసి చూశాడు. చిరునవ్వు నవ్వుతూ, "ప్రోగ్రెస్ బాగుంది. రెండు రోజుల్లో యింటికి తీసుకుపోతానులెండి. మీరు చాలా మంచి పేషెంట్. చెప్పినట్లు విని డాక్టరుతో కోపరేట్ చేస్తారు అందుకే త్వరగా యింప్రూవ్ అవుతున్నారు" అన్నాడు

కల్యాణి మాటాడలేదు ఆమె మొహంలోకి ఆకస్మాత్తుగా ఏదో విషాదమేఘం వచ్చేసింది.

"ఎందుకలా ఉన్నారు?" అన్నాడు ప్రకాశం.

కల్యాణి రాని చిరునవ్వు తెచ్చుకోడానికి ప్రయత్నిస్తూ– "అబ్బే ఏం లేదు; కొంచెం తలనొప్పిగా ఉంది, అంతే." అంది.

"అబద్ధం తలనొప్పి ఉండొచ్చుగాని, ఇంకేదో కూడా మిమ్మల్ని బాధిస్తోంది. ఏదో విపరీతంగా ఆలోచిస్తున్నారు, అవునా?" అన్నాడు ప్రకాశం.

కల్యాణి గతుక్కుమంది "భలేవారండీ మీరు! మీరు రోగాన్ని పోల్చగలరనుకున్నాను, మనస్సుకూడా పోల్చుకుంటారు?" అంది చిలిపిగా.

ప్రకాశం ఆమె కళ్ళల్లోకి కొంటెగా చూస్తూ "పోల్చనివ్వకుండా ఎక్కడో దాచేసుకుంటే తప్ప" అన్నాడు.

"పోల్చుకోగల్గిన ఔదార్యముంటే దాచేసుకున్న మనస్సునుకూడా వెతికి పోల్చుకుంటారు!" అంది కల్యాణి తృప్తిగా అతనివంక విప్పారిన కళ్ళతో చూస్తూ.

"అబ్బే, పిచ్చిపిచ్చి ఆలోచనలతో మనస్సు పాడుచేసుకోగూడదు. ఇంటిమీద బెంగగా ఉందా? ఇన్నాళ్ళూ వద్దన్నారు పోనీ, యిప్పుడయినా నాన్నగారికి ఉత్తరం రాయమన్నారా? జ్వరం తగ్గిపోయిందిగా! ఇంక ఆయన చూసినా కంగారు పడరు. సంతోషిస్తారు, ఏం?"

"అబ్బే, వద్దండీ! ఆయనకి అనవసరంగా శ్రమ దేనికి! ఆయన ఆరోగ్యం కూడా, ఏమంత మంచిదిగాదు, నేను ఆ సంగతి అనుకోవడం లేదు. ఒంటరిగా పడుకుని ఏదో ఆలోచిస్తూంటే ఏదో దిగులుగా ఉందంతే" అంది కల్యాణి.

"అలాంటి దిగుళ్ళు ఒంటరిగా కూర్చుంటే అందరికీ వస్తాయి" అన్నాడు ప్రకాశం.

"మీకు దిగుళ్ళేమిటండీ! హాయిగా మెడిసిన్ చదువుతున్నారు. రేపో మాపో డాక్టరయి ప్రాక్టీసు పెట్టి రెండుచేతులా ఆర్జిస్తూ–" అని కల్యాణి యింకా ఏదో అనబోతుంటే ప్రకాశం అడ్డువచ్చి–

"–దూరపుకొండలు నునుపు అంటారే–అలా ఉంది మీరు చెప్పేది. నేను యీ చదువు పూర్తి చేసినప్పటి మాటగదు! చూసుకుందాం. నా చదువు ఏ క్షణంలో ఆగిపోయినా ఆగిపోవచ్చు" అన్నాడు.

కల్యాణికేమీ అర్థం కాలేదు. "అదేమిటలా అంటారు?" అంది ఆత్రుత కంఠంలో ధ్వనిస్తూండగా.

"అదంతేలెండి, అంతా మా మేనమామ దయ. చిన్నప్పుడే మా నాన్న పోయాడు. అమ్మా నేనూ మా మేనమామ పంచన చేరాం, నాన్న మిగిల్చింది అంతా కలిపి ఓ పదెకరాల పొలం మేనేజిమెంటంతా మా మేనమామదే. అందులో యిప్పటికెంత మిగిలిందో, మేమెంత తినేశామో, మా పేరు చెప్పి ఆయనెంత

తినేశాడో, అంతా పరమ రహస్యం. మామయ్య చచ్చినా చెప్పడు. మా అమ్మ ఏడుపు భరించలేక నన్ను మెడికల్ కాలేజీలో చేర్పించాడుగాని అంతా దినదిన గండం – ఏ నెల కానెలే డబ్బు లేదంటాడు అంతా అయిపోయిందంటాడు–నిజమో తెలీదు అబద్ధమో తెలీదు. సరేలెండి. యిప్పుడా సోదంతా దేనికిగాని, మీరు మాత్రం లేనిపోని ఆలోచనలతో బుర్ర పాడుచేసుకోకండి. నేను మళ్ళీ సాయంత్రం వస్తాను. సరేనా, మీరు చెప్పినట్టు వింటారుగదూ!" అంటూ లేవబోయాడు.

ఆశ్చర్యంతో కూడిన బాధతో ఆమె గుండె క్షణంలో బరువెక్కిపోయింది. పైకి యింత హాయిగా, గంభీరంగా కనిపించే ప్రకాశానికి కూడా కష్టాలున్నాయన్నమాట! ఆమెకి ఆ ఘడియలో ప్రకాశం మేనమామ మీద చెప్పలేని కోపం వచ్చేసింది.

"వెళుతున్నారా?" అంది నీరసంగా.

"ఏం? వెళ్ళాలిగా మరి?" అన్నాడు ప్రకాశం.

"వెళుదురుగాని, ఒక్క ఐదు నిమిషాలు కూర్చోండి" అంది ప్రాధేయపడుతున్నట్లు.

మళ్ళీ స్టూలుమీద కూలబడ్డాడుప్రకాశం. "మళ్ళీ సాయంత్రం వస్తానుగా! ఇందిర కూడావస్తుంది ఆమెతో ఏమైనా చెప్పమంటారా?" అన్నాడు లాలనగా.

"అబ్బే, చెప్పడానికి ఏమీలేదు, మీరున్నకాస్సేపూ నాకు ధైర్యంగా ఉంటుంది. అంచేత కూర్చోమన్నాను. సాయంత్రం తప్పకుండా వస్తారు గదూ? అన్నట్లు లైబ్రరీకి వెళ్ళి చదువుకోవాలేమో? చూశారా; నాదెంత స్వార్థమో?"

"మరేం ఫరవాలేదు. సాయంత్రం తప్పకుండా వస్తాను మిమ్మల్ని డిశ్చార్జి చేసేవరకూ ప్రతి సాయంత్రమూ వస్తాను–ఒక్క షరతుమీద మీరు దిగులుగా బెంగగా ఉండకూడదు. హాయిగా ధైర్యంగా ఉండాలి మరి వెళ్ళిరానా?"

అతను తొందరలో ఉన్నట్లు గ్రహించింది కల్యాణి సరేనన్నట్టు తలూపింది. తరువాత అతడన్న ప్రతిమాటా నెమరువేసుకోవడం మొదలుపెట్టింది. నర్సు తరుచూ ఓదారుస్తుంది తనను; ఇందిరా ఆ పనే చేస్తుంది ప్రకాశమూ అందుకే ప్రయత్నిస్తాడు. కాని ముగ్గురి ధోరణిలో ఎంత తేడా ఉంది? ప్రకాశం ఏది చెప్పినా లాలించినట్లుంటుందేం? అంత మృదులంగా ఉంటుందేం?

☆ ☆ ☆

డాబా చుట్టూరా చీకట్లు పేరుకుంటున్నాయి. గదిలో మంచంమీద రగ్గు కప్పుకు పడుకున్నాడు ప్రకాశం. ఈలపాట పాడుకుంటూ మెట్లెక్కి వచ్చి తలుపు దభీమని తోసి "డాక్టరుగారూ!" అని కేకేసింది ఇందిర.

మొహంమీద రగ్గు తీస్తూ "ఎవరది, ఇందిరా?" అన్నాడు ప్రకాశం.

"పోల్చుకున్నావే! ఫరవాలేదయితే. పూర్తిగా స్మారకం పోలేదు కాబట్టి బతికే ఉన్నావన్నమాట! లైటు వేసుకోలేదేం?" అంటూ స్విచ్చి వేసింది ఇందిర

"అప్పుడే ఇంత చీకటి పడిందా?"

"లేదు. రాత్రి ఎనిమిది కావస్తోంది కదూ? ఎండ కరకరా పొడుచుకొస్తోంది సంతోషించాం గాని, భోజనం చేసేవనుకున్నాను. క్యారియర్ అలాగే వుంచి పడుకున్నావేం?" అని చిన్నపిల్లాడిని గద్దించినట్లు గద్దించింది.

"తలనొప్పిగా ఉంది. తరువాత తింటాను" అన్నాడు ప్రకాశం భయపడుతూ. ఇందిర గట్టిగా ఏదైనా చెపితే కాదనే ధైర్యం అతనికిలేదు. కొద్ది రోజులలోనే ఆ అధారిటీ సంపాదించేసింది ఆమె. "మీరు" అనడం నుండి "నువు" అనడం ప్రారంభించి, అలాగ పిలవడం ప్రకాశానికి కూడా నేర్పింది.

"అసలు తలనొప్పి ఎందుకు తెచ్చుకున్నావు? సంజాయిషీ చెప్పు కోర్టువారికి!"

లేచి మంచం మీద కూర్చున్నాడు ప్రకాశం. ఏమిటీ యీ అమ్మాయి అల్లరి? తనమీద యింత అధికారం ఎవరిచ్చారీమెకు?

"మనస్సు బాగులేదు ఇందిరా! సాయంత్రం ఓ స్నేహితుడితో కొంచెం ఘర్షణ పడ్డాను. అప్పటినుంచీ మనస్సు చికాగ్గా ఉంది. పోట్లాటలూ; దెబ్బలాటలూ అంటే నాకసహ్యం కాని తప్పలేదు" అంటూ యింకా ఏదో అనబోతుంటే ఆమె కూడా మంచం మీద చతికిలపడి "ఎవరా ఫ్రెండు? జగన్నాథమేనా?" అంది.

"అవును. నీకెలా తెలుసు?"

"సాయంత్రం కల్యాణిని చూసి తిరిగి వచ్చేస్తోంటే కనబడ్డాడు. కల్యాణిని చూసి వస్తున్నావా? ఎలా ఉంది ఆవిడకి?' అని నిన్ను అడిగేటప్పటికి నీకెందుకు ఆవిడ గొడవ అని కోపం తెచ్చుకొని పోట్లాట పెట్టుకున్నావట కదూ?" అంది చిరునవ్వుతో.

ప్రకాశం ఒళ్ళు భగ్గున మండింది "అలా చెప్పాడా నీకు? రాస్కెల్!" అన్నాడు.

ఇందిర విలాసంగా కాళ్ళాడిస్తూ, "తగ్గుమరీ, అంతకోపం దేనికీ? కల్యాణికి ఎలా ఉందోనని సింపతీకొద్దీ అడిగితే–"

"ఏడిశాడు. సింపతీకాదు వాడి తలకాయ స్కాండల్స్ పుట్టించడంలో మా కాలేజీ మొత్తం మీద వాడే అఖండుడు."

"అసలు జరిగిందేమిటో చెప్పక అలా గంగవెర్రులెత్తుతావేం?" అంది ఇందిర.

"ఏముంది జరగడానికి? కల్యాణిని చూసి నేను తిరిగి వచ్చేస్తోంటే లాన్‌లో తారసిల్లాడు. సిగరెట్ పీలుస్తూ అదోలా పోజు పెట్టి ఫిమేల్ వార్డుకి వెళ్ళొస్తున్నావా బ్రదర్? మనవాళ్ళంతా క్షేమమేనా? అన్నాడు అందులో వ్యంగ్యం చూసి అసహ్యం వేసింది. కనబడ్డ ప్రతిసారీ అంతే వాడు. గుచ్చుకున్నట్టు మాటాడతాడు. వీణ్ణి చెక్ చెయ్యకపోతే లాభం లేదని గట్టిగా పెట్టవలసిన నాలుగూ పెట్టేశాను" అని తీవ్రమైన కంఠంతో అన్నాడు.

"లక్షమంది లక్ష మాటలంటారు. అలాగని కనబడ్డ ప్రతిమనిషితోనూ మనం పోట్లాట పెట్టుకుంటామా? అయ్యగారికి తెలివితేటలు ఎక్కువవుతున్నాయి రోజుకి రోజుకీ ఇలా పోటాడితే యింకా అనుకుంటారు. వాటినలా వదిలేసి మనపని మనం చూసుకోవాలిగాని ఇలా ఐతే ఎక్కడికని?"అంది ఇందిర.

ప్రకాశానికి ఆ వాదన నచ్చలేదు. "నిన్నే ఎవరైనా అలా అంటే ఊరుకునే దానివా?" అని తిరుగు ప్రశ్న వేశాడు.

"అబ్బో, యిలాంటివి రోజూ లక్షమాటలు వింటూంటాను. మా ఆఫీసులోనే ఉన్నారు అలాంటి ఘనులు. మా బాస్ నన్ను కొంచెం అభిమానంగా చూస్తాడని తక్కినవాళ్ళకి కడుపుమంట. ఇంకేముంది, మా యిద్దరి మధ్యా ఏదో ఉందని కథలల్లేశారు. అంచేత నేను ఏడుస్తూ కూర్చోనా? అందరూ అలా అనుకోవడమే

బాగుంది నాకు. ఎవరూ నా జోలికి రారు. బాస్‌తో ఎవరిమీద ఏం చెప్పేస్తానోనని భయం వాళ్ళందరికీ యిదంతా ఎందుకు చెపుతున్నానంటే—లోకం ధోరణే అంత" అని అనునయిస్తున్నట్లుగా ప్రకాశం చేతిని తన చేతుల్లోకి తీసుకుంది ఇందిర.

ప్రకాశం జవాబు చెప్పలేదు ఇద్దరూ అలా మౌనంగా ఉండిపోయారు. కాస్సేపటికి ప్రకాశమే తేరుకుని "మీ నాన్నగారు ఏం చేస్తున్నారు?" అన్నాడు.

"ఎవడో పాత స్నేహితుడొచ్చాడు. ఇద్దరూ కలిసి ఊళ్ళోకి వెళ్ళారు."

"అన్నం తిన్నావా నువ్వు?"

"లేదు. పద, మనిద్దరం కలిసి తిందాం. నాన్నగారొచ్చేసరికి ఎలాగా అర్ధరాత్రి దాటుతుంది."

"క్యారేజీలో నా అన్నం సిద్ధంగా ఉంటే కిందకొచ్చి భోంచెయ్యడమేమిటి? ఇదంతా దండగ కాదూ!" అన్నాడు ప్రకాశం.

ఆమెకి నవ్వొచ్చింది "వెర్రినాయనా! మన బతుకులే పెద్ద దండగ. పోనీలే ఇదే తినుగాని, నేను వడ్డించనా?" అని గభాలున లేచి క్యారేజీ విడదీసి కంచంలో వడ్డించింది.

"మరి నువ్వో?" అన్నాడు ప్రకాశం.

"ఐడియా! వన్ మినిట్!" అంటూ చిటికె వేసి తుర్రున కిందకు వెళ్ళి క్షణంలో మళ్ళీ పైకి వచ్చింది, వడ్డించిన ప్లేటుతో. "కూర్చో ప్రకాశం! ఇద్దరం కలసి తిందాం ఇవాళ" అంది.

ఇద్దరూ భోజనానికి కూర్చున్నారు. ప్రకాశం ఆప్యాయంగా ఆమె మొహంలోకి చూశాడు. టేబిలు లైటు కిందకు దించి ఉంది. కిటికీలోంచి వెన్నెల కాంతి ఆమె ముంగురులపైన కదులుతోంది. ఆమె పెదవులపైన విచిత్రమైన నవ్వు వెలుగుతోంది. అతని మనస్సులో తియ్యని తలపేదో తళుక్కున మెరిసింది. వెంటనే తల దించేసుకుని భోజనం సాగించాడు.

అంత ఆలస్యమైనా, చల్లారిపోయినా, ఇదివరకెన్నడూ ఎరుగని హాయి ఆ రాత్రి భోజనం దగ్గర అనుభవించాడు ప్రకాశం. దగ్గిర కూర్చుని, అనునయిస్తూ అన్నం తినిపిస్తే తినడం అతనింతవరకూ ఎరుగడు. ఊహ తెలిసిన నాటినుండి మేనమామ యింట్లో పెరిగాడు. తన తల్లే ఆ యింట్లో వంట వండేది. వంట పూర్తయ్యాక ఆమె ఏ మూలో కొంగు పరచుకొని నడుం వాల్చేది. నలుగురితోపాటు తనకూ యిన్ని మెతుకులు పడేసేది మేనమామ భార్య. ఆ యిల్లు విడిచాక కొన్నాళ్ళు రాజమండ్రిలో దూరపు బంధువు లెవరింట్లోనో తనకు భోజనం ఏర్పాటు చేశాడు మేనమామ. వాళ్ళు కూడా విసుక్కుంటూ కసురుకుంటూ యింత అన్నం పడేసేవారు. ఆ తరువాతనుండీ హోటలు భోజనం. ప్రస్తుతం క్యారేజీ తెచ్చుకొని సొంత -వడ్డన. "యిల్లు" అనేది అతనెన్నడూ ఎరుగడు. బసలో ఉండడం, ఆకలేస్తే యింత తినడం.

ఆ రాత్రి అదో కొత్త అనుభూతి. సరసను కూర్చుని ఒక స్త్రీ మూర్తి వడ్డిస్తున్నది. స్వయంగా తినిపిస్తున్నది. బంగారు గాజులు గలగలలాడిస్తూ ఒక తరుణి, అనురాగంతో నెయ్యి వేస్తూ, "ఇంకో గరిటె వెయ్యనా? కూర వదిలేశావేం? సహించడంలేదా?"

అంటూ పరీక్షగా ప్రశ్నలు వేస్తూంటే–ఆ హోటలు భోజనమే అతని జిహ్వాకెంతో రుచిగా ఉంది. తినే పళ్ళెమూ, తాగే గ్లాసూ అన్నీ అందంగా కనబడ్డాయి

ఏదో తన్మయతతో అతని హృదయం నిండిపోయింది

ఇద్దరూ భోజనం ముగించారు వక్కపొడి అతని చేతికందిస్తూ "నువ్వెంత పసివాడివి ప్రకాశం ! సరిగ్గా తిండి తినడం కూడా తెలీదు నీకు ఉండు, రేపటినుంచీ నిన్నో కంట కనిపెడుతూంటాను!" అని గోముగా నవ్వింది ఇందిర

"అంతకంటేనా?" అని మాత్రం అనగల్గాడు ప్రకాశం ఆ క్షణంలో అతనికి లోకమంతా ఆనందమయంగా కనబడింది ఆఖరికి సాయంత్రం పోట్లాడిన జగన్నాధాన్ని కూడా క్షమించేశాడు.

"ఏమిటాలోచిస్తున్నావు?" అంది ఇందిర

ప్రకాశం బయట వెన్నెలవేపు చూస్తూ– "ఏమీ లేదు నువ్వు చెప్పింది నిజమే ఇందిరా! జగన్నాథంతో అనవసరంగా పోట్లాట పెట్టుకున్నాను. అలాంటి మాటలు ఇకముందు పట్టించుకోకూడదు" అన్నాడు బరువుగా.

ఇంతలో వీధి తలుపు తట్టిన చప్పుడైంది ఇందిర చప్పున లేచి ప్రకాశం చెవి పట్టుకుని పిండుతూ "ఇంకెప్పుడూ అలాంటి పనులు చెయ్యకు. నేను చెప్పినట్లు విను, బాగుపడతావు. నలుగురితోనూ పోట్లాటలు పెంచుకుని యుద్ధాలు చెయ్యవలసినంత ఏంచూశావు కల్యాణిలో?" అనేసి తుర్రున మెట్లుదిగి పారిపోయింది.

చెంప చెళ్ళుమన్నట్లయింది "ఇందిరా! మాట మాట!" అని అరిచాడు. ఇందిర వెనక్కి తిరిగి చూడలేదు. గుమ్మాన్ని ఆనుకుని అలాగే చాలాసేపు నిల్చుండిపోయాడు ప్రకాశం.

## 3

ప్రకాశం సాయంత్రం యింటికి వచ్చి మేడమీదకు వెళ్ళబోతూంటే కల్యాణి గదిలోంచి శ్రావ్యమైన పాట విన్పిస్తూంది ఫరవాలేదనుకున్నాడు ప్రకాశం. ఆసుపత్రి నుండి యింటికి వచ్చి నిండా పదిరోజులు కాలేదు. కాని కల్యాణిని మానసికంగా ఒక దారిలోకి తీసుకురాగల్గాడు తను. ఆమె ఆరోగ్యం పూర్తిగా కోలుకోవడానికి యింకా టైము పడుతుందిగాని యీ లోపుగా ఆమెకు కొంత ఊరటను, ధైర్యాన్ని యివ్వగల్గాడు.

జోడు చప్పుడు చేయకుండా పాటంతా అయేదాకా అక్కడే నిలబడి తరువాత మెల్లగా అడుగులు వేసుకుంటూ ఆమె గది గుమ్మం దాకా వెళ్ళి చూశాడు. తలుపు ఒక రెక్క తెరచి ఉంది. గోడనున్న చిన్నద్దంలో చూసుకుని జడ అల్లుకుంటూ ముందు పాడిన పాటనే తిరిగి సన్నని స్వరంలో పాడుకుంటూంది.

"మీరింత చక్కగా పాడతారని తెలియలేదే ఇన్నాళ్ళూ!" అన్నాడు ప్రకాశం. గుమ్మం ఇవతలే నిలబడి.

ఆమె తుళ్ళిపడి వెనక్కు తిరిగి చూసి తల దించేసింది. ఆ తత్తరపాటు చూసి, "మిమ్మల్ని డిస్టర్బ్ చేశానేమో కదూ?" అన్నాడు.

కల్యాణి కొంచెం సర్దుకుని – "అబ్బే అదేంలేదు. రండి కూర్చోండి" అంది.

ప్రకాశం రూములో టేబిలు ముందున్న కుర్చీలో కూర్చుంటూ "వాళ్ళంతా ఏరీ?" అన్నాడు.

"ఆనందరావుగారు స్టేషనుకు వెళ్ళారు, ఎవరో స్నేహితులను చూడడానికని ఇందిర కృష్ణమూర్తితో బీచికి వెళ్ళింది."

"వాళ్ళు మిమ్మల్ని తీసుకు వెళ్ళలేదూ?"

"ఏమిటో, నాకంతగా అలవాటు లేదండీ!"

"అలవాటు లేదా, ఇష్టం లేదా?" అన్నాడు ప్రకాశం ఆమెవంక పరీక్షగా చూసి.

"ఇందులో యిష్టం లేకపోవడానికేముంది? సాధారణంగా ఎక్కడికి వెళ్ళాలనుండదు నాకు."

"ఒకసారి వెళితే అదే అలవాటవుతుంది అందులో తప్పేముంది కనుక!"

కల్యాణికి ప్రకాశం మాటలు ఆశ్చర్యం కల్గించాయి. ఇందిర చెప్పింది, ఆమెతో కలసి బీచికి రావటానికి మొదట్లో ప్రకాశం ఎంత మొహమాట పడేవాడో. అలాంటి ప్రకాశం తనకే యిప్పుడు పాఠాలు చెపుతున్నాడు–అనుకుని నవ్వుకుంది కల్యాణి.

"అలా పైకి చెప్పకుండా మీలో మీరే నవ్వేసుకుంటే ఏందారి? నాకెలా అర్థమౌతుంది?" అన్నాడు ప్రకాశం

"నవ్వుకు అర్థం ఏమిటి? ఊరికే నవ్వొచ్చింది"

"మీరర్థంలేని నవ్వులు నవ్వరు గదూ!" అని ప్రకాశం నాలిక కొరుక్కున్నాడు.

కల్యాణి గమనించకపోలేదు. పక్కవాటుగా అతనివంక చూసి "అది గ్రహించిన వాళ్ళు అర్థం కూడా గ్రహించే వుంటారు" అన్నది.

కల్యాణి పెంకితనంగా అన్నా ప్రకాశానికి మరొకలా అర్థమైంది బీచికి వెళితే తప్పేముంది అని తానన్న మాటకు ఆమె నవ్వు అంగీకారసూచకమనుకున్నాడు. ఇందిర కృష్ణమూర్తిని తీసుకుని బీచికి వెళ్ళింది, కల్యాణిని తీసుకు వెళ్ళకుండా! ఏమి మర్యాద- అది? తను కల్యాణిని తీసుకుని ఎందుకు వెళ్ళకూడదూ అనుకున్నాడు ప్రకాశం. వెంటనే "అయితే మనం కూడా పోదాం పదండి!" అన్నాడు కల్యాణితో.

తలవని తలంపుగా ప్రకాశం అలా అనేసరికి ఆమె కేమనాలో తోచలేదు. "ఇవ్వాళ నాకు తలనొప్పిగా ఉంది. మరొకసారి వెళదాం" అనేసింది.

అతనికేం తోచిందో కాని వెంటనే లేచి "సరే, నేను రూముకు పోతున్నాను" అంటూ గబగబా మెట్లెక్కి వెళ్ళిపోయాడు.

తనతో బీచికి రావడానికి కల్యాణికి యిష్టం లేదని ప్రకాశం బాధ పడ్డాడు. అనవసరంగా నోరు జార్చేసుకున్నాననుకున్నాడు. హాస్పిటలులో ఆవిడగురించి అంత పట్టించుకోవడంతో చులకన ఐపోయానేమో అని కూడా ఆలోచించడం మొదలుపెట్టాడు.

ప్రకాశానికి ఇందిరమీద కూడా కోపం వచ్చింది, కృష్ణమూర్తితో బీచికి వెళ్ళినందుకు మళ్ళీ మరుక్షణంలోనే ఆవిడమీద తనకేమి అధికారం ఉంది అనుకున్నాడు కృష్ణమూర్తితో ఆమె చనువుగా ఉంటే తను బాధపడటం దేనికి? తనతో రమ్మంటే రాదు కనుకనా

ఆమె? వస్తుందనే ధైర్యం తనకుంది. కృష్ణమూర్తితో కంటే తనతో రావడానికే మరింత సరదా పడుతుంది ఆమె. అలా అనుకుని ప్రకాశం కొంచెం తృప్తిపడ్డాడు.

ఇలాంటి విషయాల్లో ఇందిరదే ఎప్పుడూ ముందడుగు, తనే అర్థం లేని సంకోచాలతో వెనుదీస్తాడు కాని. తనలా ఎవరూ ఉండరు అన్నిటికీ భయపడుతూ. తనవెగతాళి చేసిన జగన్నాథం మాత్రం ఏం చేస్తున్నాడు? స్టాఫ్ నర్సు సరోజినితో మొన్న సినిమాహాలు దగ్గర కనబడలేదూ? తన క్లాస్‌మేట్ వెంకట్రావు సుశీలతో గంటల తలబడి హాస్పిటలులోనే మాట్లాడుతూండడం ఎన్నిసార్లు చూడలేదు తను?

ప్రకాశానికి కల్యాణిమీద యింకా కోపం పోనేలేదు. ఇంతలో ఇందిర హుషారుగా వచ్చి, "ప్రకాశం! నీకొక మంచి వస్తువు తెచ్చాను ఏమిటో పోల్చుకో!" అన్నది.

"ఏమో! నాకెలా తెలుస్తుంది?"

"ఓస్! ఇంతేనా నీ తెలివి? ఇదుగో! మంచి కేక్ తెచ్చాను. నేనూ కృష్ణమూర్తీ అలా లైట్ హౌస్ వైపు వెళ్ళి అక్కడినుంచి హెచ్ యమ్ బేకరీకి వెళ్ళాం ఇవ్వాళ నా పుట్టిన రోజు. కృష్ణమూర్తి నాకు కేక్ కొని ఇచ్చాడు. నేను నీకిస్తున్నాను" అంది.

"అరే! నాతో చెప్పనేలేదే నీ పుట్టిన రోజని?"

"అసలు నాకే గుర్తులేదు సాయంత్రందాకా—ఏదో మాటల సందర్భంలో గుర్తొచ్చి అన్నానతనితో."

"ఏదైతే నీకు యిష్టం లేదో అదే బహుమతి యిచ్చాడన్నమాట! నేనైతేనా—నీకు చాలా యిష్టమైనది యిచ్చేవాడిని"

"ఏమిటో అది?" అంది కళ్ళు గిర్రున తిప్పుతూ ఇందిర

"ఏమిటో యిప్పుడు చెపితే అందం ఏముంది? రేపు నాతో బజారుకు వస్తావా, ఏమిటో తెలుసుకుందుకు?"

"ఓ! ఎక్కడికి రమ్మన్నా వస్తాను. నాకేమిటి?" అనేసి కిలకిలా నవ్వుతూ కిందకు దిగిపోయింది. ఆమె నవ్వు ప్రకాశాన్ని గిలిగింతలు పెట్టినట్లయింది.

ప్రకాశం తన రూములోంచి వెళ్ళిపోయాక కల్యాణి మనసు పరిపరివిధాల పోయింది. అంతవరకూ సరదాగా మాటాడినవాడు చివాలున లేచి వెళ్ళడం ఆమెకు చివుక్కుమనిపించింది. అతనికేం కోపం రాలేదు గద? అని భయపడింది. వచ్చే వుంటుంది. లేకపోతే అలాగే రేపు వెళదాం లెండి అనైనా అనకుండా ఎందుకు వెళతాడు? తనకంతకన్నా బుద్ధిలేదు. అడగ్గానే ఎందుకు బయలుదేరకూడదూ? తనకు మాత్రం వెళ్ళాలని లేదూ? కాని అదేమిటో సరిగా ఆ సమయానికే అలా అనేసింది. అతనైనా "అంత జంకెందుకు, బయలుదేరండి, వెళదాం" అని గట్టిగా చెపితే తను బయలుదేరకపోయేదా? అంతలో అంత కోపం తెచ్చేసుకుని వెళ్ళిపోవడమెందుకు?

ప్రకాశానికి కోపం వచ్చిందేమో అన్న ఆలోచన కల్యాణిని చాలా బాధపెట్టింది. అతను తనకు దూరమయిపోతాడేమో అని భయపడింది. మేడమీదకు వెళ్ళి "వెళదాం పదండి" అందామనుకుంది. మళ్ళీ అలా అంటే ఈ అమ్మాయి మురిపించుకుంటూంది అనుకుంటాడేమో? ఇప్పుడింకేమన్నా అసహ్యంగా ఉంటుంది "రేపు వెళ్ళి నేనే రమ్మని అడుగుతాను" అనుకుంది.

ముందురాత్రి ప్రకాశం బజారుకు వస్తే తనకిష్టమైనదేదో యిస్తానన్నమాట, ఏదో నవ్వులాటకు అన్నాడనుకుంది ఇందిర. కాని మర్నాడు సాయంత్రం ప్రకాశం ప్రత్యేకం లోపలకు వచ్చి "నేను పది నిముషాలలో వస్తాను నువ్వు సిద్ధంగా ఉన్నావా ఇందిరా?" అనేసరికి నిజంగా ఆశ్చర్యపోయింది.

ఆ దినం ఇంటికి వస్తూ ప్రకాశం ఆలోచించుకున్నాడు, ఇందిరను బజారుకు తీసుకు వెళతానన్నాడు తాను–నిజంగా వెళ్ళాలా అని కల్యాణి మీద కోపంతో, కృష్ణమూర్తిమీద అసూయతో ఇందిరను బజారుకు తీసుకు వెళతానన్నాడు. ఊరికే వెళదావని ఊరుకోలేదు. కృష్ణమూర్తి కంటే తెలివిగా ప్రవర్తిస్తానని గొప్పలు చెప్పాడు కూడా– కృష్ణమూర్తి కంటె ఇందిర అభిరుచులను తను బాగా గుర్తించినట్లు. అని చెప్పి ఇప్పుడూరుకుంటే ఇందిరేమనుకుంటుంది? అసలే తను వట్టి పిరికివాడనే అభిప్రాయం ఆ అమ్మాయికి ఏర్పడి ఉంటుంది ఇప్పుడూరుకుంటే చులకనగా ఉంటుంది అనుకున్నాడు.

ఇందిరను తీసుకుని బజారుకు వెళ్ళడానికే నిశ్చయించాడు ప్రకాశం. కాని వెళ్ళి ఏం కొనాలో తోచలేదు. ఇందిరవంటి యువతులు మెచ్చుకున్నదేమిటి? ఆలోచించాడు. తనకు తోచినదేదో కొనేస్తే "ఇంతేనా నువ్వు!" అనేస్తే? పోనీ ఇందిరనే అడిగేస్తే? ఛా ఛా! మరీ అసందర్భంగా ఉంటుంది ఇన్నాళ్ళు పరిచయముండి ఇందిర అభిరుచుల్ని కనిపెట్టలేని తన చాతకాని తనానికి తనని తనే తిట్టుకున్నాడు ప్రకాశం. పోనీ, కల్యాణిని అడిగితే? ఆడవాళ్ళ అభిరుచులు ఆడవాళ్ళకే తెలుస్తాయి. అదీకాక కల్యాణికి ఇందిర చాలా కాలం నుండి తెలుసు "దివ్యమైన ఆలోచన!" అనుకున్నాడు. కల్యాణి నడిగితే ఆమెకు కోపం వస్తుందేమో! అనిపించింది మళ్ళీ "వస్తే రానీ. నిన్న నాకు కోపం తెప్పించలేదూ తను!" అని తృప్తిపడ్డాడు.

ఇంతకీ ఏమి కొనవలసి వచ్చినా తన దగ్గర డబ్బులేదు. అనవసరపు చిక్కు తెచ్చుకున్నానే అని బాధపడుతూనే దారిలో కృష్ణమూర్తి లాడ్జికి వెళ్ళి ఇరవైరూపాయలు అప్పు తీసుకున్నాడు

"బజారుకు వెళదాం!" అని ప్రకాశం అనగానే ఇందిర ముస్తాబు ప్రారంభించింది అదే సమయం అనుకుని ప్రకాశం మెల్లిగా కల్యాణి రూములోకెళ్ళి "ఒక చిన్న మాటడగాలి మిమ్మల్ని. ఏమనుకోరు కదూ?" అన్నాడు.

"ఏమనుకుంటాను?" అంది నవ్వుతూ, ఏమిటది అన్నట్లు చూసి.

"మీకు తెలుసనుకుంటాను, ఇందిర పుట్టినరోజు నిన్న. నాకు ఆ సంగతి నిన్నరాత్రి గాని తెలీలేదు. ఏదైనా పుట్టినరోజు కానుక యివ్వాలనుకున్నాను ఆవిడకు నచ్చే వస్తువేమిటో, ఏమిస్తే బాగుంటుందో మీరే చెప్పాలి. ఆమె అభిరుచులు నాకంటే మీకే ఎక్కువ తెలిసుంటాయికదూ?" అన్నాడు.

కల్యాణి ఒక్కనిముషం ఆలోచించి "టాయిలెట్ సెట్ ఒకటి కొనివ్వండి. ఆc! అభ్యంతరం లేకపోతే ఆ దారిని వస్తూ బుక్ స్టాలులో ఎక్కడయినా రామిరెడ్డిగారి 'పానశాల' పుస్తకం దొరుకుతుందేమో చూడండి!" అన్నది.

"ఎందుకూ, ఆవిడకివ్వటానికేనా?" అన్నాడు ప్రకాశం.

"అవును."

"సరే అలాగే. నేనిలా మిమ్మల్ని అడిగినట్లు ఇందిరతో చెప్పకండి!" అంటూ అతను రూము దాటబోతూంటే "అన్నట్లు, డబ్బిస్తాను తీసుకెళ్ళండి" అంటూ కల్యాణి డ్రాయరు తెరవబోయింది.

"అక్కరలేదు లెండి. తరువాత చూసుకుందాం" అంటూ నాలుగంగల్లో మేడమీదకి పారిపోయాడు.

ఇందిర మామూలుకన్నా శ్రద్ధగా ముస్తాబై బయలుదేరింది ప్రకాశంతో

ప్రకాశం తన రూముకి రావడం, మాట్లాడటం కల్యాణికి కొండంత ఆనందం కలిగించిది. అతనికి కోపం వచ్చిందేమో అని తను ఎంతో బాధపడింది అప్పటివరకూ. కోపం వచ్చిన వాడయితే అలా తనంతట తాను వచ్చి మాట్లాడుతాడా? అదీగాక ఇందిరకేమివ్వాలి అని తననడగడం, తనకేదో అధిక్యాన్నిచ్చినట్లయింది ఆమెతో చెప్పవద్దుసుమండీ అనడం ప్రకాశం తనకు మరింత దగ్గరవాడని ఋజువు చేసినట్లయింది

అనవసరంగా అపోహపడ్డది తాను. ఇంత చిన్న విషయాలకు కోపగించుకొనేంత చిన్నబుద్ధి కాదు ప్రకాశానిది. తన నర్థం చేసుకోగలడు, చేసుకున్నాడు కూడా—అనుకుంది. కల్యాణి మనస్సు కలకలలాడింది. తనలో తనే మురిసిపోయింది.

ప్రకాశం బజారుకు వెళ్తున్నాడేకాని అతని మనసు మనసులో లేదు తాను మాట్లాడిన దాన్నిగురించి కల్యాణి ఏమనుకుందో అని అతని బాధ ఆమె తననిగురించి చెడుగా భావించడం తను సహించలేడు

కల్యాణి తనకు బొత్తిగా నిమిత్తం లేని వ్యక్తి కాదు. ఆమె కష్టసుఖాల్లో తనకు భాగముంది. లేకపోతే ఆమె ఏమనుకుంటుందో అని తనకింత చింత ఎందుకు? తనలా అడిగినందుకు ఆమె ఏమీ కోపం తెచ్చుకున్నట్లు లేదు నవ్వుతూనే మాట్లాడింది ఇందిరకు ఏదో కొనిస్తానన్నా అసూయ పడలేదు కూడా ఏమో! కోపం, అసూయ, అందరూ పైకి ప్రకటిస్తారా? మనసులో దాచేసుకుందా? లేక అదంతా ఆవిడ మంచితనమేనా?

కల్యాణి మంచితనం కూడా తనను బాధ పెడ్తూంది ఇందిర అలాకాదు తనను బాధ పెట్టేటంత మంచితనం ఆమెలో లేదు దుఃఖపెట్టేటంత చెడుగూ లేదు. నవ్వించి కవ్వించగల ప్రతిభమాత్రం ఉంది.

మెయిన్ రోడ్డుమీద పరధ్యానంగా ముందుకు నడుస్తున్న ప్రకాశం పక్కనే నడుస్తూ ఇందిర "మన గమ్యం ఏమిటో కాస్త చెబుతావా? కొంపదీసి మళ్ళీ హెచ్.యమ్. బేకరీకేనా ఏమిటి? నేను నడవలేను బాబూ అంతదూరం అలా అయితే రిక్షా కట్టించుకుందాం!" అన్నది, అలసి పోయానన్నట్లు విలాసంగా నిట్టూర్చి

"కృష్ణమూర్తితో నడవడాని కోపిక ఉంది కాబోలు!" అనేశాడు గబుక్కున ప్రకాశం వెంటనే స్ఫురించిందతనికి— ఇలా అనేంత ధైర్యం ఎలా వచ్చింది తనకీ అని. అలా దెప్పినందుకు ఇందిర ఎక్కడ విరుచుకు పడుతుందో అని గుండెలు పీచుపీచుమన్నాయి.

అది రోడ్డు అని కూడా మరిచిపోయినట్లుగా ఇందిర పకాలున నవ్వి "ఓస్! ఇంతేనా నీకు తోచింది? కృష్ణమూర్తి కనుక నన్ను నడిపించాడు కాని ప్రకాశం

నన్నంత అలసిపోనిస్తాడా?" అని అంటూ "ఏం ఇప్పుడేమంటావు!" అన్నట్లు అతనివైపు చూసింది.

ప్రకాశం ఆ మాటలకు ఉబ్బిపోలేదు గాని నిజంగా నివ్వెరపోయాడు ఆమె తన దెప్పును అంత చులకనగా తీసుకుంటుందనుకోలేదు

ఫ్యాన్సీ షాపులోకి దారితీశాడు ప్రకాశం. ఉన్నవాటిలో అందమైన టాయ్‌లెట్ పెట్టె కొన్నాడు

"ఇదెందుకూ!" అంది ఇందిర ఎందుకో తెలుసుకునే.

"నీ కోసమే" అంటూ బయటికి నడిచాడు ప్రకాశం

"కృష్ణమూర్తి కేక్ యిస్తే నువ్వు బన్ యిస్తావేమో అనుకున్నాను; యింత చక్కని ఖరీదైన బహుమతి యిస్తావనుకోలేదే!"

ఇద్దరూ మళ్ళీ రోడ్డుమీదపడి నడుస్తున్నారు. ఇంతలో చప్పున ఏదో స్ఫురించినట్లు "అన్నట్లు 'సెలెక్టు' లో మంచి పిక్చరు వచ్చింది ఇవేళ ఆఖరి రోజు. వెళదామా?" అంది ఇందిర

"ఇంటిదగ్గర చెప్పలేదుగా!" నసిగాడు ప్రకాశం అంత మంచి ఆలోచన వెంటనే తట్టినందుకు తనను తానే అభినందించుకుని

"ఎవరి యింటిదగ్గర? నీ యింట్లోనా? నా యింట్లోనా?" అని పగలబడి నవ్వుతూ "మన కింటిదగ్గర చెప్పాల్సిన వాళ్ళెవరున్నారోయ్? మా నాన్న సంగతా? పొద్దుట అన్నాను సినిమాకు వెళితే వెళతానని. ఇప్పటిదాకా ఆ మాటే మరచిపోయాను. ఇంటికి వెళ్ళడం ఆలస్యమైతే సినిమాకు వెళ్ళుంటుందని ఎలాగూ అనుకుంటాడు. ఇలాంటివాయన కలవాటేలే!" అంది

ప్రకాశం చిక్కుల్లో పడ్డాడు. కల్యాణి కొనమన్న పుస్తకం కొనలేదు. వెళ్ళేటప్పుడు కొనవచ్చుననుకున్నాడు. సినిమాకు రానంటే ఇందిరకు కోపం వస్తుంది. తాను రానన్నా పట్టుదలగా ఉంటే ఒక్కతే వెళ్ళిపోతుంది కూడాను. తనతో తీసుకువచ్చి మధ్యలో వదలిపెట్టడం ఏమంత మర్యాద అనుకున్నాడు త్రోవలో కల్యాణి చెప్పిన బుక్ కొనుక్కుని సినిమాకు వెళదామా అనుకుంటే ఇంతలో డబ్బుసంగతి గుర్తుకొచ్చింది బుక్ కొంటే సినీమాకు డబ్బు చాలదు. ఇందిర దగ్గర డబ్బు ఉండకపోదు కాని ఇంతవరకు వచ్చి ఆమెను అడగడానికి స్వాభిమానం అడ్డు వచ్చింది. ఏమైతేనేం బుక్ కొనడానికి వీలవదు అనుకున్నాడు

"ఏమిటంత ఆలోచిస్తున్నావు, నీ కిష్టం లేదా?" అన్నది విసురుగా ఇందిర.

"అటే వెళుతున్నాంగా," ఇష్టం లేక పోవడమేమిటి?" అని సర్దిపుచ్చాడు ప్రకాశం. ఇద్దరూ థియేటరువైపు హుషారుగ సాగిపోయారు.

మర్నాడు సాయంత్రందాకా కల్యాణి కంటబడలేదు ప్రకాశం ఉదయం అతను హాస్పిటలుకు వెళ్ళేటప్పుడు వసారాలో ఎదురైంది కాని, అతను చూడనట్లు తప్పించుకుని వెళ్ళిపోయాడు. ప్రకాశం ఏదో తప్పు చేసినవాడిలా ఆమె ఎదురుపడడానికే భయపడ్డాడు. అవిడ తెమ్మన్న బుక్ తేనేలేదు. అవిడ ఏమనుకుంటూందో? తను చెప్పిన మాటమీద శ్రద్ధలేదనుకుంటుంది. కాని జరిగిందానికేం చేస్తాడు?

ఆ రాత్రి అతను భోజనం చేస్తూంటే కల్యాణి అతని గదిలోకి వెళ్ళింది. "ప్రొద్దుట ఏమీ తోచక మీ టేబిలుమీద 'రేజర్స్ ఎడ్జ్' బుక్ కనబడితే పట్టుకెళ్ళాను. మీరు వెతుక్కోలేదు కదా?" అంది.

"ఆ సంగతే గమనించలేదు నేను. ఎంతవరకూ చదివేరు? బాగుందా?" అన్నాడు ప్రకాశం."

"చాలా బాగుందండీ! ఇంకొక ఏభయి పేజీలుంది నిద్రపోయేలోగా చదివేస్తాను. రేపు ఉదయమే యిస్తాను" అంది

"ఇవ్వక్కరలేదు లెండి. మీ దగ్గర ఉంచండి"

"చదివేస్తానుగా? నా దగ్గరెందుకూ?"

"చదివేసిన పుస్తకం పారవేయాలని ఎక్కడుంది? నేనిచ్చాను కాబట్టి ఉంచండి" అన్నాడు ప్రకాశం.

కల్యాణి కతనిభావం అంత బాగా అర్థం కాలేదు. ఆమె జవాబు చెప్పకుండా అలా ఉండిపోవడం చూసి ప్రకాశం "మీరు తెమ్మన్న బుక్ నేను తేలేకపోయాను. కాని నా కివ్వాలనున్న బుక్ నే నివ్వకూడదా?" అన్నాడు

ఆమె చకితురాలై "దాని కింత బాధపడతారెందుకూ? అందుకని యివ్వడు..."

ఆమె మాట పూర్తవకముందే "ఆ పని చేయనందుకు దీనిని పరిహారంగా యివ్వడం లేదులెండి-ఊరికనే చెప్పాను మాటవరుసకి "అన్నాడు ప్రకాశం.

"నాలాగే మీరూ అన్నిటికీ బాధపడతారు" అన్నదామె.

"నిన్నను మీ మనస్సు నొప్పించాననుకుంటాను కదూ?"

"లేదు లేదు, మీరు పొరపాటు పడుతున్నారు నే నసలేమీ బాధపడనేలేదు. అవకాశం లేకపోయింది కాబోలు అనుకున్నాను అంతే. లేకపోతే డబ్బు చాలలేదేమో అనుకున్నాను. "నేను వెళుతున్నాను" అంది.

"పుస్తకం మీదగ్గర ఉంచుతారు కదూ?" అన్నాడు ప్రకాశం మళ్ళీ మొదటికివస్తూ.

వెళ్ళిపోతున్న కల్యాణి వెనుకకు తిరిగి "అలాగే కాని, ఇందిరకు పుట్టినరోజని బహుమతి యిచ్చారు. మరి నాకెందుకీ కానుక-ఇవాళ నా పుట్టినరోజు కాదుగా?" అన్నది నిండుగా నవ్వుతూ.

కల్యాణి ఎప్పుడోకాని నవ్వదు తానిచ్చిన కానుక ఆమెని ఎంత కదిలించిందో ఆమె విప్పారిన ముఖమే చెబుతూంది. అంత చిన్న కానుక ఆమె కెంత తృప్తి నిచ్చిందో అర్థం చేసుకున్న ప్రకాశం పులకితుడయ్యాడు. ఆమె అలా నవ్వడం అదివరకెన్నడూ అతడు చూడలేదు. ఎల్లవేళలా గంభీరంగా ఉంటుంది. సోగగా, విశాలంగా ఉన్న ఆ నీలికళ్ళలో అంతవరకూ ప్రకాశం శ్రావణమేఘాల బరువునేగాని పున్నమి వెన్నెలల తళతళలు మెరియడం చూడలేదు. ఏం జరిగింది? ఆమె అంత ఆనందపారవశ్యంతో ఎందుకు నవ్వింది? తానిచ్చిన ఆ పుస్తకం-అ చిన్ని కానుక, ఆమె నెంతగా లోలోపల కదలించి వేసింది - అనుకున్నాడు ప్రకాశం. ఇన్ని కిక్కిరిసిన ఆలోచనలూ క్షణమాత్రం. కాని ఆ నవ్వులో ఏదో సంతృప్తి ఉంది; ఆమె అంతరాంతరాలలో ఎక్కడో అహల్యవలె పాషాణియైన నిర్వేదం, కాన్క రూపంలో ప్రకాశం ప్రసరించిన అనురాగ రేఖకే కరిగి నీరై, అంతలో పెల్లుబికిన క్షీరసాగరమై

ఒక నిర్భయానందహాసంగా వెలువడింది. ఆమె నవ్వింది – వెండిమువ్వల కింకిణీ స్వనం ధ్వనించినట్లు కల్యాణి నవ్వింది.

ఆ నవ్వు క్షణమాత్రమే కాని ఆ క్షణమాత్రమే ప్రకాశంలో అణువణువునా కోటి విద్యుత్ మాధురులు ప్రసరించాయి అంతవరకూ అతనికి కల్యాణి మునిమాపు చీకట్లో మసకమసకగా గోచరించిన స్త్రీమూర్తి; ఆమె నవ్వింది; ఆ నవ్వు ఫాల్గుణమల్లెలా విరిసింది. విద్యుల్లతవలె మెరిసింది ఆ విద్యుత్ కాంతిలో ప్రకాశానికొక కొత్త కల్యాణి కనబడింది; కనబడి సమ్మోహితుడిని చేసింది. ఇరువురి మధ్యా ఉన్న గోడలేవో లిప్తపాటులో కూలిపోయాయి; యవనికలు తొలగిపోయాయి. కొత్త కల్యాణి అతడిని సమ్మోహితుడిని చేసింది.

గలగలా నవ్విన కల్యాణి హఠాత్తుగా తన నవ్వుకు తానే భయపడి ఆగిపోయింది. ఆ కళ్ళలో మళ్ళీ శ్రావణమేఘాలు; ప్రకాశం కళ్ళలోకి అప్రయత్నంగా ఆమె చూసింది; కంగారు పడింది; శ్రావణ మేఘాలు దట్టమైనాయి వర్షించబోతున్నాయి. చూపు తిప్పేసుకుంది.

"కల్యాణీ!" అతని నోటినుండి అప్రయత్నంగా వెలువడింది. వెంటనే నాలుక కరుచుకుని "క్షమించండి, పొరపాటు" అన్నాడు

"ఏమిటి పొరపాటు? పుస్తకం యివ్వడమా?" అంది కల్యాణి కంగారుగా.

"ఛా ఛా! ఎంతమాట! 'కల్యాణీ' అని పిలిచాను పొరపాటున–మీకు కోపం వచ్చిందేమోనని–"

"ఏమీ రాలేదు. రాదు కూడా" అనేసి ఆమె మళ్ళీ భయంగా చూసింది.

విద్యుత్ మాధురులు ప్రకాశం గుండెల్లో మళ్ళీ విజృంభించాయి ఆ విజృంభణ యిచ్చిన ధైర్యంతో "ఐతే నేను చాలా అదృష్టవంతుణ్ణి ఇకనుండి 'కల్యాణీ' అని పిలుస్తాను. సరేనా?" అన్నాడు

ఆమె నవ్వుతూ సరేనన్నట్లుగా తలూపింది

"కాని ఒక్క షరతుమీద నువ్వుకూడా 'ప్రకాశం' అని పిలవాలి" సరేనన్నట్లుగా తలూపింది నవ్వుతూ ఆమె.

"ఐతే విను, ఇవాళ నీ పుట్టినరోజు కాదుగాని అంతకన్నా విలువైన రోజు–"

"ఏం ఏమిటి యివాళ ప్రత్యేకత?" అంది కొంటెగా.

"అలా అడిగితే చెప్పలేను. కాని యివాళ మనిద్దరకు మళ్ళీ పుట్టిన రోజు. ఎందుకో నాకలా అనిపించింది. కొన్ని కొన్నింటికి కారణాలడిగితే చెప్పలేం. కొన్ని అనుభవాలకి కారణాలుండవు, ఫలితాలు మాత్రమే ఉంటాయి" అంటూ ఆమె దగ్గరగావెళ్ళి భుజంమీద చెయ్యివేసి, "కల్యాణీ! ఇవాళ నిన్ను పోల్చుకోగల్గాను" అన్నాడు. ఆమె తల వాల్చేసుకుంది. ఆమె చేతిని తన చేతిలోకి తీసుకున్నాడు. కల్యాణి చెయ్యి వెనక్కి తీసుకోలేదు

క్షణంలో ఆమె చెయ్యి వదిలేశాడు ప్రకాశం. "ఆ పుస్తకం జాగ్రత్తగా తీసుకెళ్ళి దాచు. నేనుకూడా యీ క్షణాలను పదిలంగా మనస్సులో దాచుకుంటాను. ఇంకవెళ్ళి నిద్రపో! హాయిగా మంచి కలలు గంటూ నిద్రపో!" అన్నాడు. ఆమె గబగబా మెట్లు దిగి వెళ్ళిపోయింది.

ఆ రాత్రి ప్రకాశానికి నిద్ర పట్టలేదు. ఆమె నవ్వు అతని గుండెల్లో అదేపనిగా ప్రతిధ్వనించింది ఏం జరిగింది తనకి? ఎవరీ కల్యాణీ? ఆమె ఏం చేసింది తనను? ఆమె తన రూంలోకి వచ్చింది మొదలు కిందకి వెళ్ళేదాకా తానాడిన మాటలలో ఏ ఒక్కటీ ప్రయత్నపూర్వకంగా అన్నవి కావు అసలు మాటాడింది తను కానేకాదు ఇంకెవ్వరో ప్రకాశం. ఆ ఆలోచన వచ్చేసరికి ఉలిక్కిపడ్డాడు ఇంకెక్కడి ప్రకాశం? వెనకటి ప్రకాశం ఆమె నవ్వులో కొట్టుకునిపోయాడు ఇప్పటి తను వేరు ఈ ప్రకాశానికి కల్యాణీ ఒక్కర్తే యీ జీవితానికి అర్థం తను పుట్టింది అసలు ఆమెని వెతుక్కుని వెతుక్కుని ఆమె సన్నిధానంలో శేషజీవితం గడపడం కోసమే ..ప్రకాశానికి నిద్ర పట్టలేదు. గాలిలో తేలిపోయి, మళ్ళీ భూమ్మీద పడిపోయి – అలా స్వర్గనరకాలు రెండూ ఏకకాలంలోనే అనుభవిస్తూ జాగారం చేశాడు

'నిద్రపో' అని కల్యాణిని ప్రకాశం ఆజ్ఞాపించాడుగాని, ఆ పని ఆమె చేత కాలేదు వెళ్ళి పక్కమీద అచేతనంగా పడుకుని ఉంది. అలాగని ఆమె మేలుకునీ లేదు. ఏదో తెలిసీ తెలియని స్మృతి– విస్మృతి సరిహద్దు తీరంలో కొట్టుమిట్టులాడింది. మేలుకునే ఉండి ఏవేవో కలలుకంది; ఆ కలల్లోనే కన్నీళ్ళు కార్చేసింది. రెండుమూడుసార్లు గట్టిగా పలవరించింది కూడా పక్కగదిలోంచి ఆ పలవరింపులు విన్న ఇందిర 'ఏమిటది కల్యాణీ!' అని అరచినట్లు కల్యాణికి తెలియదు ఒకానొక పారవశ్యంలో అలాగే పక్కమీద అచేతనంగా పడి ఉంది. ఆమె లోలోపల నీలోత్పలాలు వికసించాయి; ఆమె గుండెల్లో కాశ్మీరు కుంకుమతోటలు పండాయి. ఆ తోటల అంచులమీద బాల భానుడుదయించాడు. ఆమె భయపడింది అలాగే రాత్రంతా జాగారం చేసింది

ఉదయం నిద్రలేచాక కల్యాణీ, ప్రకాశం యిరువురి ముఖాల్లోనూ ఏమీ అలసట గోచరించలేదు కళ్ళలో కొత్త కాంతి మెరిపిస్తూ నిద్రలేచారు

## 4

సముద్రపు ఒడ్డునే నడుస్తున్న ప్రకాశం చీకటి పడిందని అకస్మాత్తుగా గ్రహించేసరికి చీకటిపడి అప్పటికప్పుడే గంటన్నరయింది. రిస్టువాచీ చూసుకున్నాడు ఆగిపోయింది చిరాకువేసిందతనికి. దిక్కుమాలిన వాచీ ఈమధ్య తెగ ఆగిపోతోంది. మరమ్మతు మీద యిప్పటికే చాలా ఖర్చుపెట్టాడు. లాభంలేదు కొత్తది కొనుక్కోవాలనుకున్నాడు. కోరికలే గుర్రాలైతే!–తనలో తనే నవ్వుకున్నాడు. పంపవలసిన డబ్బు యింకా మేనమామ పంపలేదు నెలనెలా అదే తంతు. రెండు మూడు ఎక్స్‌ప్రెస్ ఉత్తరాలూ, ఒక టెలిగ్రామ్ ఇస్తే కాని అయనకి వేడి పుట్టదు. పోనీ దయాధర్మ భిక్ష అనుకుందామా అంటే అదీ కాదాయె; తన డబ్బే తనకి పంపించడానికి యింత మెహర్బానీ! కొందరు మనుష్యులు అలా ఎందుకుంటారో, ఎందుకలా ప్రవర్తిస్తారో అతనికే అర్థం కాదు. తనకి తానే అర్థం కానప్పుడు ఇతరులెలా అవుతారు? రోడ్డుమీద అపరిచితుడు కనపడి, తెలిసినట్లు పలకరిస్తే ఎంత ఆశ్చర్యం వేస్తుందో–తననుచూసి తనకు అంత ఆశ్చర్యమూ కలుగుతుంది అప్పుడప్పుడు. ఎవరు తను? అదే తెలియడం లేదు. పోల్చుకుందామంటే పూర్తి ఆకారం స్పష్టంగా తనకే కనపడడం లేదు–ఎక్కడో ఏదో

వెలితివుంది తను పూర్తి మనిషి కాదు సగం మనిషి. తలుపుల్లేని గది, చక్రాలులేని బండి, సగం కట్టిన తరువాత డబ్బులేక ఆపేసిన ఇల్లు–ఇవన్నీ జ్ఞాపకం వచ్చాయి తనకి ఆ వెలితి ఎలా పూడుతుంది? రోజురోజుకి ఆ వెలితి ఎక్కువవుతున్నదే కాని తగ్గడం లేదు. అందరూ తనలాగే ఆలోచించి తనలాగే ఆశ్చర్యపోతున్నారా? ఇందిరా – కృష్ణమూర్తి–ఆనందరావూ అందరూ ఒక్కసారి మనోవీధిలో మెరిశారు. కృష్ణమూర్తికేం? అతని జీవితం వడ్డించిన విస్తరి మరి ఇందిర మాటేమిటి? జీవితం అంటే అంతధీమా ఎలా వచ్చింది ఆ అమ్మాయికి? ఆలోచించి చూసుకుంటే జీవితంలో ఏమీలేని ఆ అమ్మాయికి? సర్కస్‌లో ట్రెపీజ్ మీద ఫీట్లుచేసే అమ్మాయిలు జ్ఞాపకం వచ్చారతనికి. సరిగ్గా అలాంటిదే ఇందిర అనుకున్నాడు ఏ ఘట్టంలోనైనా సరే, అవలీలగా, విలాసంగా, ఎగిరివచ్చే ఊతను అందుకొని హాయిగా మొగ్గవేసి అవతల గట్టుకి చేరుకుంటుంది. అందరూ చప్పట్లు కొడతారు చెయ్యిచాపడంలో, నేర్పుగా పట్టుపట్టడంలో ఒక అంగుళం కూడా వాసి రానివ్వదు జీవితంలో ప్రతిదీ అంత సులువుగా చేసెయ్యగలదు ఇందిర కృష్ణమూర్తి సరేసరి, తీర్థంలో పిల్లవాడి తంతు జీవితం అతనికొక ఎడతెగని తిరునాళవలె కనబడుతూంది జేబులో మస్తుగా డబ్బుంది. ఇంకేం కావాలి? తీర్థంలో కులాసాగా తిరుగుతూ, రంగురంగుల గాలిబుడగలు కొని ఊదుకుంటున్నాడు కావలసినంత వ్యవధి ఉంది అన్నీ తీరిగ్గా చూడొచ్చు; రంగులరాట్నం ఎక్కి తిరగొచ్చు, సీతాకోక చిలుకల్ని పలుకరించవచ్చు అసలు నేటి మానవ సమాజమే పెద్ద తీర్థంలాగ అనిపించింది ప్రకాశానికి ఈ తీర్థంలో జీవితం తనకే అర్థంకాకుండా ఉంటే– తనకొక దారితప్పిన పిల్ల తారసిల్లింది కల్యాణి నిజంగా తిరునాళలో తప్పిపోయిన పిల్లవలె కనబడుతుంది. క్రితం రాత్రి సంఘటన జ్ఞాపకం వచ్చిందతనికి. ఒక్కనవ్వుతో కల్యాణి తన హృదయంలో చోటు చేసుకుంది ఈ పరిణామం తనని ఎక్కడికి తీసుకువెళుతుంది?

ఆలోచనల బరువుతో భారంగా నడుచుకుంటూ ఊళ్ళోకి వచ్చాడు ప్రకాశం దీపతోరణాలు వెలిగిపోతున్నాయి. కిల్లీకొట్టులో గడియారం కేసి అప్రయత్నంగా చూశాడు. అప్పుడే ఎనిమిది దాటింది బాబోయ్ అనుకున్నాడు. ఇందిరకి కోపం వస్తుంది. ఇవాళనుండి అందరూ కలిసి భోజనం చెయ్యడానికి ఏర్పాటు చేశాడు ఆనందరావు. ఎవరి భోజనం వాళ్ళు హోటలు నుండి తెప్పించుకుంటున్నా ఆ తినేదేదో అందరూ కలిసి కూర్చుని తింటే బావుంటుందని ఆనందరావు సూచిస్తే బాగుంది అలాగ చేసితీరాలి యివాళ నుండీ అని ఆజ్ఞాపించింది ఇందిర. మొదటి రాత్రే ఆలస్యంగా వెళితే అపార్థాలొస్తాయి అనుకుని గబగబా అడుగులు వేశాడు ప్రకాశం. ఇల్లు చేరేటప్పటికి ఆనందరావుగారు ముందుగదిలో కూర్చుని ఒక్కడూ పేకాడుకుంటున్నాడు. ఇందిర పేపరు చదువుకుంటూంది కల్యాణి గదిలో దీపం లేదు మేడమెట్లెక్కి తన గదిలోకివెళ్ళి బట్టలు మార్చుకుని కిందికివచ్చాడు ప్రకాశం.

"సారీ ఇందిరా! కొంచెం ఆలస్యమైంది కదూ? భోజనం చేద్దామా?" అన్నాడు.

చదువుతున్న పేపరు గిరవాటుపెట్టి "అయితే పద. వడ్డనలో సాయంచేద్దువుగాని. ఇంక పేకాట చాలించి నువ్వుకూడా రా నాన్నా!" అంటూ వంటింట్లోకి దారితీసింది. నలుగురికీ వడ్డనలు చేసి పీటమీద కూర్చుంటూ "కల్యాణినీ, మీ

నాన్నగారినీ రమ్మను" అన్నాడు ప్రకాశం. ఇందిర అతనివైపు ఒక్కసారి సాలోచనగా చూసి చిరునవ్వు నవ్వి "నాన్నా!" అంటూ అరుచుకుంటూ వెళ్ళింది. ఇంతలో ఆనందరావుగారు వచ్చి విస్తరిముందు కూర్చున్నాడు."ఏమిటోయ్ ఆసుపత్రి విశేషాలు? రోగాలన్నీ క్షేమమేనా?" అన్నాడు. అతని పలకరింపు ధోరణే అంత.

ప్రకాశం కొంటెగా నవ్వి "రోగులంతా క్షేమంగానే వున్నారు" అన్నాడు ఆనందరావు విస్తరికి కొంచెం ముందుకు లాక్కుంటూ– "ఆహా! రోగుల సంగతి నీకేం తెలుసు, నన్నడుగు చెప్తాను. వెనుకటి కోసారి ఏమయిందంటే మా డిప్టీకలెక్టరు శేషావతారంగారమ్మాయికి హఠాత్తుగా ఓ రాత్రి జలుబుచేసింది నిలుచున్నపాటున డాక్టరును తీసుకురమ్మని నాకు కబురు చేశారాయన" అంటూ ఏదో కథ మొదలుపెట్టాడు. ప్రకాశం వినిపించుకోడంలేదు. కల్యాణి యింకా రాలేదేం? ఒంటరిగా గదిలో చీకటిలో ఏంచేస్తుంది? ఉదయం కాలేజీకి వెళ్ళబోయే ముందు ఎంతో సంతోషంగా ఉంది. హాయిగానే ఉంది. అలాంటిది తానింటికి చేరాక గదిలోంచి బయటికి రాలేదామా అని కొంచెం ఆందోళనపడ్డాడు. ఒక్క క్షణంలో అతని ఆలోచన పరిపరివిధాల పోయింది. ఇంతలో ఇందిర దూకుడుగా వచ్చి విస్తరిముందు కోపంగా చతికిలపడుతూ "రాణీగారెందుకో అలిగింది. భోజనానికి రమ్మంటే రానంది" అని ఎవరితోటో అన్నట్టు చిరాగ్గా అనేసి అన్నం కలుపుకోడం మొదలుపెట్టింది. ఆనందరావు ధీమాగా "ఏంచేత రానంది? కారణమేమిటట!" అన్నాడు. "తలనొప్పిగా ఉందట. తలనొప్పయితే అన్నం తినడానికేం?" గొణిగింది ఇందిర

ప్రకాశం తిన్నగా కల్యాణి గదిలోకి వెళ్ళిచూశాడు. లైటు స్విచ్ వేశాడు. క్యాంపు కాటుమీద ఒకమూల ఓరగా పడుకుంది కల్యాణి. దగ్గరగా వెళ్ళి "కల్యాణీ! ఎందుకలా పడుకున్నావు?" అన్నాడు

కల్యాణి నెమ్మదిగా లేచి కూర్చుని "ఊరికే పడుకున్నాను. తలనొప్పిగా ఉంది" అంది.

ప్రకాశం "ఉత్త తలనొప్పికే ఇలా పడుకోవు నువ్వు. ఇంకేదో కారణముంది, చెప్పవా?" అన్నాడు.

కల్యాణి మాటాడలేదు.

"చెప్పవా కల్యాణీ?" అన్నాడు మళ్ళీ లాలనగా.

"ఏంలేదు ప్రకాశం! మధ్యాహ్నం నాన్న దగ్గిరనుంచి ఉత్తరం వచ్చింది అప్పటినుంచి మనస్సు బాగులేదు. కాసేపు నన్నొదిలేయి. ఒంటరిగా పడుకోవాలనుంది. ఎవరితోటీ మాట్లాడే స్థితిలో లేనిప్పుడు" అంది కల్యాణి.

ప్రకాశం ఆమె చెయ్యి పట్టుకుని "వీల్లేదు. ముందు భోజనానికిరా! నాన్నగారేం వ్రాశారో తరువాత చెబుదువు గాని దీనికే అంత బెంగపడిపోకూడదు, పద" అంటూ బలవంతంగా ఆమెను భోజనానికి తీసుకువెళ్ళాడు.

ఆమె అనిష్టంగా అతనివెంట నడిచింది. కల్యాణి వెళ్ళి భోజనం చేసినదేమీ లేదు కాని, తాను పిలిస్తే ఆమె రాకపోవడం, ప్రకాశం పిలిస్తే రావడం ఇందిరలో దుమారం లేపింది. భోజనం చేసినంతసేపూ కల్యాణిని దెప్పిపొడిచింది.

"ప్రకాశం! నువ్వింత మంచివాడి వెప్పుడయిపోయావు? ఈ సంగతి తెలిస్తే నిన్నే ముందు పంపించేదానినే" అన్నది.

కల్యాణి చారుఅన్నం తిని చెయ్యి కడుక్కోబోతుంటే "అదేమిటి? కాస్త పెరుగు వడ్డించవోయ్, నువ్వు వడ్డిస్తే తింటుందిలే" అన్నది ఇందిర. ప్రకాశం అన్నిటికీ ఊరుకున్నాడు, కల్యాణి కన్నెత్తలేదు. ఆనందరావు పేపరు చదువుకుంటూ ఈ విషయాలు ఎరగనట్లే భోజనం ముగించాడు. ప్రకాశం లేవకమునుపే కల్యాణి వెళ్ళిపోబోతుంటే "అదేమిటి? అతనన్నం కాస్తా తినేదాకా ఆగవోయి, లేకపోతే అతనికి సహించదు" అన్నది ఇందిర వికటంగా నవ్వి,

ప్రకాశానికి సహనం తగ్గింది. "చాల్లే ఇందిరా! ఎప్పుడూ నీకు వెటకారమే సమయం సందర్భం ఉండనక్కర్లేదూ?" అని కంచంలో నీళ్ళు పోసి లేచి దూకుడుగా మెట్లెక్కి తన గదికి వెళ్ళిపోయాడు

ఆమె తెల్లబోయి అతను వెళుతూన్నవైపు చూసి అంతలోనే ఆనందరావు వైపు తిరిగి "చూశావా నాన్నా?" అన్నట్లు చూసింది.

ఆనందరావు "అంతేలే!" అన్నట్లు కూతురువైపు చూశాడు.

ప్రకాశం–ఇందిర సూటిపోటి మాటలకు లోలోపల చిటపటలాడాడు. కల్యాణి దుఃఖపడుతూౘందని తల్చుకొని, "ఏమిటో! మనస్సు విప్పి మాట్లాడదు" అని బాధ పడ్డాడు. వెళ్ళి అసలు విషయమేమిటో కనుక్కొని వస్తేనో అనుకున్నాడు. "అమ్మో! ఇంకేమైనా ఉందా? ఇందిర మా ఇద్దరినీ బతకనివ్వదింక" అనుకున్నాడు మళ్ళీ. ఇలా భయపడడంలో అర్థం లేదు. అవతల మనిషి బాధపడుతూంటే తనేం చెయ్యలేకపోయినా కొంచెం అనునయించడానికి కూడా ఎందుకు సంకోచిస్తున్నాడు తను? ఇందిరను చూసి తనెందుకు భయపడాలి? నిజానికి ఆ అమ్మాయినుండి స్వేచ్ఛగా తన తోవను తాను పోవడం ఎలాగో నేర్చుకోవాలి తన బోటివాళ్ళు. ఇంత ఆలోచించి కల్యాణి దగ్గరకు వెళదామా అనుకున్నాడు ప్రకాశం. "కాస్సేపు నన్నొదిలేయి, ఒంటరిగా పడుకోవాలనుంది" అన్న ఆమె మాటలు గుర్తుకొచ్చాయి. తను వెళ్ళినా ఆమె అంత ఇష్టపడక పోవచ్చు ననుకుని లైటార్పేసి పడుకున్నాడు. అర్ధరాత్రి గడిచాకగాని ప్రకాశానికి నిద్రపట్టలేదు.

తెల్లవార్లూ కల్యాణికి కునుకులేదు. తండ్రి తనకింతవరకూ తెలియని ఎన్నో బాధాకరమైన విషయాలు వ్రాశాడు. పైగా అతని ఆరోగ్యం క్షీణిస్తూందన్నాడు. నాన్న ఆరోగ్యం బాగులేదు. నాన్న మనస్సు బాగులేదు. నాన్న ఆర్థిక పరిస్థితులు బాగులేవు నాన్నే తనకు సర్వస్వం. ఇంక తనకేం బాగుంది కనుక "ఎందుకలా ఉన్నావు? చెప్పవా కల్యాణీ?" ప్రకాశం మాటలు వినిపించాయి. ప్రకాశానిదెంత జాలిగుండె? తన బాధను చూసి అతని కెందుకింత సానుభూతి? అందరికీ అలా ఉంటుందా? ఎందుకుంటుంది? సానుభూతి అనేది మనుష్యులకు సహజ గుణమే అయితే ఇందిర అలా ఎందుకంటున్నది? ఇందిర ఎత్తిపొడుపు మాటలు కల్యాణిని గుచ్చిగుచ్చి బాధించాయి. ఇన్నాళ్ళూ ఇందిర చాలా సరదామనిషి అనుకున్నది. యింత ఈర్ష్య పెంచుకొన్నదనుకోలేదే! ఈర్ష్య అనే తలంపు వచ్చేసరికి కల్యాణి భయంతో వణికిపోయింది. అమ్మో! అదే నిజమయితే ఇందిర ధాటికి నేనాగగలనా? అనుకుంది.

తెల్లవారుఝామున కలతగా చిన్న నిద్దురపోయి ఎండెక్కాక లేచింది కల్యాణి. తల భారంగా ఉండి, అద్దంలో చూసుకుంది. తన ముఖం తనకే భయంకరంగా తోచింది కనురెప్పలు వాచి బరువెక్కాయి. కాలేజీకి వెళ్ళాలనిపించలేదు. డిశంబరు పరీక్షలు దగ్గర కొస్తున్నాయి. అసలే జబ్బుపడి నెలపైగా కాలేజీకి వెళ్ళలేదు. చదువు వెనుకపడుతూందని భయపడింది.

కల్యాణి కాలేజీకి వెళ్ళనేలేదు. కాఫీతాగి మళ్ళీ పడుకుంది. ఇందిర 10 గంటల కాఫీసుకు వెళుతూ ఆమె పడుకుని ఉండడం చూసిందికాని పలకరించలేదు. ప్రకాశం ఉదయం ఆసుపత్రికి వెళ్ళినవాడు ఏం తోచిందో కాని పదకొండు గంటలకే యింటికి వచ్చేసి, కల్యాణి గదిలోకి తొంగిచూశాడు. మంచంమీద అడ్డంగా పడుకుని ముందురోజు పేపరు తిరగేస్తూంది ఆమె.

"కాలేజీకి వెళ్ళలేదూ?" అన్నాడు ప్రకాశం.

"లేదు" అంటూ మంచంమీద లేచి కూర్చుని "ఇంత వేగంగా వచ్చేశావేం?" అనడిగింది.

"నీకోసమే! పొద్దుట నీ వాలకం చూసి నువ్వు యింట్లోనే ఉండి ఉంటావనుకున్నాను."

"మరి వార్డులో పని?"

"చేస్తే ఉంటుంది, చెయ్యకపోతే ఉండదు. అదీకాక ఇవ్వాళ మా బాస్ రాలేదు. క్లినిక్సు లేవు."

"అన్నీ నీ కోసమే కుదిరాయి కాబోలు!" అంది కల్యాణి లేనినవ్వు తొణికించి

"మనకోసమే అను. సరేకాని, నేనొకటడుగుతాను, ఊ అంటావా?"

"ఏమిటది?" అంది ఆమె రెప్పలు పైకెత్తి ఆశ్చర్యంగా చూసి.

"తీరా అడిగితే నువ్వు కాదంటే?" అన్నాడు ప్రకాశం.

"అననులే" అన్నదామె ఆప్యాయంగా.

"మరేమీలేదు. నువ్వెలాగా కాలేజీ ఎగ్గొట్టావు. నేనూ రమారమీ అంతే ఎక్కడికయినా తిరిగొద్దాం. నీకూ మనస్సుకి కొంచెం హాయిగా ఉంటుంది."

"ఇంత ఎండలోనా! ఎక్కడికి పోగలం?"

"ఏ వ్యాలీ గార్డెన్సుకో పోదాం, ఇలాంటప్పుడే అక్కడ హాయిగా ఉంటుంది."

"అమ్మో! అంత దూరమే!" అంది కల్యాణి గుండెమీద చెయ్యి వేసుకుని

"ఏం, ఎంతమందో పిక్నిక్కని తిరగటానికి వెళుతూనే ఉంటారు. మరీ అంత దూరమేమీ కాదు ఇప్పుడు బయలుదేరితే రెండయేలోపున చేరిపోతాం. కాస్సేపు హాయిగా గడిపి ఆరింటికి తిరిగి రావొచ్చు. ఏం?" అన్నాడు. ఆమె కొంచెంసేపేదో ఆలోచించి "ఇందిరకు తెలుస్తే?" అంది భయం భయంగా.

"నిన్నటి గొడవతో హడలిపోయినట్టున్నావు - తెలిస్తే నీకేం - అవుననను" అన్నాడు ప్రకాశం ధీమాగా.

ప్రకాశం ఇంత నిబ్బరం ఎప్పుడు నేర్చుకున్నాడా అనుకుంది కల్యాణి

ఆమె సరేననటంతో ఎక్కడలేని బలం వచ్చింది ప్రకాశానికి. మేడ మీదకు ఒక్క ఉరుకున వెళ్ళి బట్టలు మార్చుకొని నీటుగా తయారయి వచ్చాడు కల్యాణి కూడా సిద్ధమైంది.

దారిలో ఫలహారాలు కొనుక్కుని ఇద్దరూ వ్యాలీ గార్డెన్సుకు బయలుదేరారు

పడవలో ప్రయాణం అదివరకెన్నడూ ఎరుగదు ఆమె. అదే మొదటిసారి. ఇవతలి గట్టునుండి అవతలి గట్టుకు చేరడానికి అంతా కలిసి పదిహేను నిముషాలు పడుతుంది. ఆ పదిహేను నిముషాలు ఆమెకెంతో హాయనిపించింది. 'ఈ పడవవాళ్ళెంత అదృష్టవంతులు?' అనుకుంది హోరుమని వీచేగాలి. దూరంనుండి కనబడే హార్బరు. రంగురంగుల స్టీమర్లు నీళ్ళమీద రంగులు పులుముతూంటే, స్టీమరుగొట్టాలనుండి పొగలు లేచి ఆకాశంలో వలయాలు తిరుగుతూంటే ఆమె దృష్టికి ప్రతిదీ మనోహరంగా కనబడింది. సముద్రంలోనికి చొచ్చుకున్న ఏరాడ కొండరాళ్ళు కెరటాల ఎడతెగని తాకిడికి నునుపెక్కి నలుపెక్కి ఎండలో తళతళా మెరుస్తున్నాయి ఆ క్షణాలలో తనను తాను మరచిపోగల్గింది కల్యాణి పడవ లోవతోట ఒడ్డుకు చేరడం గమనించనే లేదు ఆమె. "వచ్చేశాం, యింక లే!" అని ప్రకాశం హెచ్చరించేసరికి ఉలిక్కిపడి పడవలోంచి ఒడ్డుమీదకు ఒక్క ఉరుకు ఉరికింది.

ఇద్దరూ పక్కపక్కగా ఒడ్డువారనే నడక సాగించారు. కంటికి యింపుగా కనబడే గులకరాళ్ళను ఏరి చేతిరుమాలులో మూటకడుతూంది కల్యాణి. "గులకరాళ్ళు ఏరి ప్రయోజనం ఏమిటి కల్యాణీ? చూడడానికి ఎంత బాగున్నా గులకరాయి గులకరాయే, గుడ్డిగవ్వ చెయ్యదు" అంటూ వ్యాఖ్యానించాడు ప్రకాశం.

"మనం ఏరుకొనే ప్రతి వస్తువునూ ప్రయోజనం చూసి ఏరుకుంటామా?" తిరుగుప్రశ్న వేసింది కల్యాణి.

"మరి దేన్నిచూసి?"

"ప్రయోజనాలు లెక్కచూసుకుని ఆపైన మమతలు పెంచుకోము. అవి ఏర్పడతాయి, అంతే" అంది కల్యాణి, అతని కళ్ళల్లోకి చిలిపిగా చూసి

"ఓహో!" అన్నాడు ప్రకాశం గోముగా ఆమెవైపు చూస్తూ. ఇద్దరికీ ఒక్కసారే మళ్ళీ భయం వేసి, చూపులు తిప్పేసుకున్నారు. నిశ్శబ్దంగా నడక సాగించారు

తోటలో చెట్లు బాగా దట్టంగా అల్లుకున్న చోట నీడలో ఆగిపోయి ప్రకాశం, "టైము మూడున్నరయిందిప్పుడు. సాయంత్రం ఆరుగంటలదాకా పడవవాళ్ళుంటారు. కథలో చెప్పినట్లు యీ చెట్టు నీడను విశ్రాంతిగా కూర్చుని మాట్లాడుకుందాం. మోసుకొచ్చిన ఫలహారాలున్నాయి; ఒకరి కొకరం చెప్పకోవలసిన గాథలు చాలా ఉన్నాయి. ఏకాంతం దొరికింది. విశ్రాంతి కల్పించుకున్నాం. ఇంకేం కావాలి కల్యాణీ?" అంటూ ఫలహారం పొట్లం విప్పాడు ప్రకాశం.

కల్యాణి జవాబు చెప్పలేదు. ఇద్దరినీ మౌనం ఆవరించింది దూరాన పిగిలి పిట్టలు అరుపులు—ఎండుటాకుల గలగలలు.... ఇద్దరి హృదయాలూ ఏదో చెప్పలేని నిర్వేదంతో బరువెక్కిపోయాయి. పరస్పరం చెప్పకోవడానికి బోలెడంత వుంది. మాటలే దొరకడంలేదు. ఇద్దరిమధ్యా ఏదో అవ్యక్తమైన అయోమయం అడ్డు

నిలుచుంది. ప్రకాశానికి చెప్పవలసినవన్నీ ఒక్కసారిగా కల్యాణి మనసులో పెల్లుబికినట్లు స్ఫురించాయి. అన్నింటినీ ఒక్కసారిగా చెప్పేయాలనుకుంది.

"ఔను ప్రకాశం-యింకేంకావాలి? ఇలాంటి అవకాశాలు ఎప్పుడోకాని రావు మా లెక్చరర్ అన్నట్లు-బ్రతుకులో చిన్న చిన్న కటాక్షాలకే మనం నోచుకున్నాం. కనక వాటికే కృతజ్ఞత చూపించాలి. చెప్పుకోవలసిన గాథ చాలా వుంది ప్రకాశం! ఎటొచ్చీ ఎలా చెప్పాలో తెలియడంలేదు నీతో చెప్పుకోవాలనే ఎన్నోసార్లు ప్రయత్నం చేశాను. కాని అది లోలోపలే అణగిపోయింది. అదే నా బలహీనత. ఎవరితోనూ ఏదీ చెప్పుకోలేను చెప్పుకునేందుకు మాత్రం ఎవరున్నారులే! పుట్టిననాటినుండీ నేను ఒంటరిదాన్నే-" ఆగిపోయింది కల్యాణి.

"ఇదివరకంటే ఏమో, యిప్పుడూ నువ్వూ ఒంటరిదానివేనా? మొన్నటిదాకా యిద్దరం వేర్వేరుగా ఒంటరివాళ్ళం. ఇవాళనుండి అలా కాదుగా! ఇద్దరం ఒకరికొకరం తోడుపడితే యిక ఒంటరితనం ఏమిటి?" అన్నాడు ప్రకాశం.

కల్యాణి జవాబు చెప్పలేదు. ఆమె మొహంలో ఏదో భయం కమ్ముకుంది అది ప్రకాశం పోల్చుకోలేదు. "చెప్పు కల్యాణీ! మీ నాన్నగారు ఏమిటి రాశారు ఉత్తరంలో? రాత్రి ఎందుకంత బాధ పడ్డావు?" ఆప్యాయంగా అడిగాడు.

అతని కళ్ళలోకి ప్రశ్నార్థకంగా చూసింది. "ఇతడికి అభిమానించడం తెలుసు. తోడుపడాలని తహతహలాడ్డం తెలుసు. కాని మనిషిని అర్థం చేసుకోవడం తెలుసా?" అనుకుంది మనసులో.

వెంటనే ఆ జిజ్ఞాసలోంచి తేరుకుని, "చెప్పడానికేముంది ప్రకాశం! యిప్పుడు మేమున్న పరిస్థితి అంతా రాశారు. ఆయన మనసులోని దిగుళ్ళూ బెంగలూ అన్నీ రాశారు. మాది బీద కుటుంబంకిందే లెక్క. ఆ సంగతి నేను చిన్నప్పుడే అర్థం చేసుకున్నాను. కాని బొత్తిగా నిరాధార పక్షులం అని తెలుసుకోలేకపోయాను. నందూరులో మాకొక యిల్లుందని చెప్పాను కదూ! తాతలనాటి యిల్లది. అమ్మితే ఎంత చేస్తుందో నాకు తెలీదుగానీ దాని మీద మూడువేలకుపైగా అప్పు పెరిగిందట. ఇంటిమీద అప్పు చేసినట్లు నాన్న నాకెప్పుడూ చెప్పలేదు. ఇప్పుడది వేలానికొచ్చిందట. ఆ తరువాత మాకు నిలవ నీడకూడా ఉండదు. మూలిగే నక్కమీద తాటిపండన్నట్లు దానికి తోడు నాన్న ఆరోగ్యం బాగులేదట..అదీ పరిస్థితి, ఏం చెప్పమంటావ్?" అని ఆగిపోయింది కల్యాణి.

తల దించేసుకు వింటూన్నాడు ప్రకాశం. తల ఎత్తకుండానే, "పోనీ, మీ నాన్నగారిని యిక్కడికి తీసుకురారాదూ, ఆసుపత్రిలో వైద్యం చేయిద్దాం. నేనున్నానుగా?" అన్నాడు జంకుతూ జంకుతూ.

"అలా చేస్తే బాగానే వుంటుంది. కాని అంత శక్తి నాకెక్కడిదీ? ఇందిరలాగ యింకొకర్ని పోషించే స్థితిలో లేనుగదా! అక్కడుంటే నాన్నకి ఏదో విధంగా గడచిపోతుంది. స్థానికుడు కాబట్టి అప్పో సప్పో చేసి నన్నిక్కడ చదివిస్తున్నాడు. ఇక్కడికొచ్చేస్తే మమ్మల్ని చూసేవారెవరు? అదీగాక, నాన్నకి ఆ ఊరూ ఆ యిల్లూ విడిచిపెట్టి రావడం ఎంత మాత్రం యిష్టం లేదు. ఎందుకో ఆ ఇంటిమీద అంత మమత!"

"స్వంత యిల్లంటే ఎవరికి మమత ఉండదు కల్యాణీ?"

"స్వంత యిల్లు!" నిట్టూర్చింది కల్యాణి "ఆయనకేముంది గనక యింట్లో? ఇల్లాలా ఇంటికి ఓ దక్షతా? నేను పుట్టిపెరిగిన దాయింట్లోనే. కాని ఆ యిల్లు తలుచుకుంటే నేను మరింత వణికిపోతాను... ఎంత భయంకరమైన ఒంటరితనం అనుభవించానా యింట్లో! ఈ లోకంలోకి నా ప్రవేశం, మా అమ్మ నిష్క్రమణం రెండూ ఒకసారే జరిగాయి సంవత్సరం పక్కింటి ధర్మాత్ములరాలు పెంచింది ఆ తరువాత మా వేలు విడిచిన పిన్ని పెంచింది నేను ఇంటర్ ప్యాసయాకనే పోయిందిలే ఆవిడ. నా హైస్కూలు చదువూ, తునిలో పిన్నితో కాపురం-ఇవన్నీ అప్పుడప్పుడు నీకూ చెబుతూవచ్చానుగా! ఆ! యిల్లన్నావా? ఊరిలో రామమందిరం సందులో చిట్టచివరి యిల్లు మాది. నిర్మానుష్యంగా పాడుపడినట్లుండేది. చిన్నతనం నుండీ యిల్లు కదలి ఎక్కడికీ వెళ్ళేదానిని కాదు. నలుగురితో కలసి ఆడుకోవడం కూడా తెలియదు. ఇంట్లో నేనూ మా పిన్నీ, వీధిగదిలో మా నాన్నా- వీధి గదిలోనే పోస్టాఫీసుంది. కనీసం మా నాన్నైనా నలుగురితో కలిసి మెలిసి ఉండగలిగే మనిషైతే నేనిలా తయారవకపోదునేమో! ఆయన నాలాంటివాడే తెలివితక్కువవాడు కాదు కాని అమ్మపోయిన నాటినుండి జీవితంమీద అదోరకం విరక్తి పెంచేసుకున్నాడు. ఒక్క నేను తప్పితే యీ ప్రపంచంలో ఆయనకే అనుబంధమూ లేదు. కాని నాతోకూడా చనువుగా ఉండలేకపోయేవాడు. 'జలుబు చేస్తుంది నీళ్ళలో తిరక్కు' 'ఇంక పడుకో, లేకపోతే జబ్బు చేస్తుంది,' 'రేపు పండగ, పొద్దున్నే లేచి తలంటుకొని కొత్త పరికిణీ కట్టుకో' మొదలైన వాక్యాలు మించి ఆయన నాతో ఇంకేమీ మాట్లాడి ఎరుగడు. అలాగని నాన్న హృదయం లేనివాడనుకోకు. ఎవరి కష్టం విన్నా సరే యిట్టే కన్నీళ్ళు కార్చేస్తాడు. ఆ పోలిక కొంచెం నాకూ అబ్బింది అలాగే-మా నాన్న అల్పసంతోషి అందుచే చిన్నప్పటినుండీ నేనూ అలాగే తయారయాననిపించింది. నాకెప్పుడు పెద్ద ఆశలూ, ఆశయాలు లేవు నాన్న ఏం కొంటే అవే బట్టలు. యింట్లో ఏం తింటే అదే తిండి అంచేత పేదరికం గాని మరేలోపం గాని నాకు తెలిసేది కాదు కాని నా బాధ వేరు చెప్పలేని ఒంటరితనం సర్వదా నన్ను బాధించేది. పట్టపగలు కూడా కీచురాళ్ళ శబ్దాలు, గాలిరొదలు నన్ను భయపెట్టేవి. నాన్న ఎప్పుడోగాని మాటాడడు. ఆ వాతావరణంలో నేనూ అలాగే తయారయాను. వెలికిరాని మాటలెన్నో నా లోలోపల అట్టహాసం చేసేవి" అంటూ ఏదో ఉద్వేగం వచ్చి మధ్యలో ఆగిపోయింది కల్యాణి. అప్రయత్నంగా ఆమె కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

ఆమెకంట నీరు చూసి ప్రకాశం గిలగిలలాడిపోయాడు. చేతి రుమాలుతో కళ్ళు తుడుస్తూ, "ఛా! ఏమిటది కల్యాణీ? ఎందుకలా బెంబేలు పడుతున్నావు?" అన్నాడు

కల్యాణికి దుఃఖం పెల్లుబికి వచ్చేసింది. శ్రావణమేఘం ఒక్కసారిగా వర్షించేసింది ప్రకాశం అచేతనంగా అలా వుండిపోయాడు. జీవితంలో ఎప్పుడూ యిటువంటి ఘట్టాన్ని అతడెదుర్కోలేదు. ఆమెనెలా ఓదార్చడం? తన చిన్నప్పుడు అమ్మకూడా తనను చూసి కంటనీరు పెట్టేది. అది చూసి తనకు భయం వేసేది. వెంటనే అక్కడనుండి పారిపోయి ఆ రోజంతా అమ్మదగ్గరకు వెళ్ళేవాడు కాదు. ఇప్పుడు కల్యాణి ఎందుకేడుస్తోంది?

కల్యాణి తనంతట తనే దుఃఖాన్ని ఆపుచేసుకుని తిరిగి చెప్పడం ప్రారంభించింది. "ఆ వాతావరణంలోని నిస్సహాయత అలాంటిది ప్రకాశం! క్షమించు నన్ను. ఎందుకో ఒక్కసారిగా దుఃఖం వచ్చేసింది, ఆపుకోలేకపోయాను. కాని నేను యిల్లు దాటేవరకూ కంటనీరు పెట్టి ఎరుగను-నీకు ఆశ్చర్యంగా ఉండవచ్చుగాని అది నిజం నమ్ము ఎప్పుడూ బరువుగా ఉండి ఎప్పటికీ బరువు తీర్చుకోలేకపోవడం ఎంత బాధగా ఉంటుందో ఊహించుకో"

క్షణం ఆగి మళ్ళీ ప్రారంభించింది కల్యాణి "నేను స్కూల్ ఫైనల్ ప్యాసయాక నాకు పెళ్ళి చేద్దామని ప్రయత్నించాడు నాన్న. ప్రయత్నం ఫలించలేదు అప్పుచేసి తీసుకొచ్చి యింటరులో ప్రవేశపెట్టాడు జీవితం అంతా సమస్యల వలయం అని ఆ తరువాతే నాకు అర్థమయింది ప్రకాశం! ఆశించింది వేరు జరుగుతున్నది వేరు. ఆశించిన చదువుకూడా చదవలేకపోయాను. చివరకు యీ అనర్సులో చేరాను. పోనీ – యిదైనా గట్టెక్కుతుందా అంటే –ఆ ఆశా అడుగంటుతోంది...నా మనస్సు ఏవిధంగా ఉందో కొంచెమైనా అర్థమవుతుందా ప్రకాశం?" అని ప్రశ్నవేసి ప్రకాశం కళ్ళలోకి చూసింది.

"ఎందు కర్థంకాదు కల్యాణీ! ఇద్దరం సరిగ్గా ఒకలాంటి నిర్భాగ్యులమే. ఎటొచ్చీ మా మామయ్య నాకు మిగిలిన భూమి అమ్మేసి ఆ డబ్బుతో నేను కోరిన చదువు చెప్పిస్తున్నాడు. నీకు అదీ లేకపోయింది."

"పోనీలే, దానికి నేను విచారించడం లేదు" అంది ఆమె.

"ఒద్దు. విచారించకు, నువ్వు డాక్టరువు కాలేకపోయినా, నేను అవుతానుగదా! ఇద్దరిలో ఎవరో ఒకరం అయితే చాలు" అన్నాడు ప్రకాశం చిరునవ్వు నవ్వుతూ.

"ఒద్దు ప్రకాశం! అలాంటి మాటలు చెప్పి నన్ను భయపెట్టకు" అని తలదించేసుకుంది కల్యాణి.

"యింత అందమైన కళ్ళనీ యిలా భూమిలోకి దింపేస్తావేం? యిలా చూడూ? ఎందుకంత భయం? నామీద నమ్మకం లేదా?" అన్నాడు ప్రకాశం ఆమె చుబుకం పట్టుకుని తలపైకెత్తుతూ, ఆప్యాయంగా–బాధగా.

"నీమీద నమ్మకంలేక కాదు ప్రకాశం! నా అదృష్టంమీద నాకు నమ్మకం లేదు. ఇంత బరువు మోయగలవా? అని భయం కూడా."

"అదేమిటలా అధైర్యపడతావు? ఈ క్షణం నుంచీ అలాంటి భయాలన్నీ పోగొట్టుకో కల్యాణీ! ప్రకాశం ఎప్పుడూ నీ పక్కనున్నాడన్నమాట మరచిపోకు"

ఒకసారి ఏడ్చేసి కొంతబరువు దించేసుకున్న కల్యాణి ప్రకాశం మాటలతో మరింత తేలికపడింది. ఉన్నభయాలన్నీ ఒక్కసారి పోగొట్టుకోడానికి అన్నట్లు ఒక్కసారి గట్టిగా నిట్టూర్చి "యిదంతా నిజమేనా ప్రకాశం?" అన్నది అతని కళ్ళల్లోకి సూటిగా చూస్తూ బొంగురుపోయిన కంఠంతో. కళ్ళల్లో దుఃఖమో ఆనందమో తెలియని కన్నీళ్ళు యింకా మెదులుతున్నాయి–ఎక్కడో ఉరిమింది–ఇద్దరూ ఒక్కసారి తుళ్ళిపడ్డారు. ప్రకాశం పడమటి దిక్కుకు తిరిగి చూసేసరికి మబ్బులు కొండలను కప్పేస్తున్నాయి. ఆ పక్క అప్పుడే చీకటైపోయినట్లుంది.

"మాటలలో మనం గమనించనేలేదు. ఎంత మబ్బు పట్టిందో!" అన్నాడు ప్రకాశం.

"అవునుకదూ! టైమెంతయింది? చీకటికూడా పడిపోతుందే!" అన్నది ఆమె మబ్బులవంక ఆదుర్దాగా చూసి.

"అయిదునిమిషాల తక్కువ అయిదయిందంతే మబ్బు దట్టంగా ఉండటం వలన చీకటయిపోయినట్లుంది. వర్షం వచ్చేసేలా ఉంది మనం త్వరగా పడవ చేరుకోవాలి. లేలే" అంటూ లేచాడు ప్రకాశం. ఆమె కూడా లేచి ముందుకు అడుగులు వేస్తూ "అక్కడిదాకా వెళ్ళేలోపునే వాన వచ్చేసేటట్లు వుంది. తడిసిపోతామో ఏమిటో" అంది.

ఉండుండి భయంకరంగా ఉరుముతూొంది. కొండలఅంచుల్లో కత్తి దూసినట్లు మెరుస్తోంది. దట్టంగా అల్లుకున్న చెట్లన్నీ దర్పంగా ఊగుతున్నాయి. గాలి మరీ ఎక్కువ వీచినప్పుడు ఆకులు జల్లుజల్లుగా రాలుతున్నాయి. వారిద్దరూ సగం దూరం వచ్చేసరికి వర్షపుజల్లులు కూడా ప్రారంభమైనాయి. "కల్యాణీ! త్వరగా నడవాలి. లేకపోతే తడిసి ముద్దయిపోతాం. అసలే నీ వళ్ళు మంచిదికాదు" అంటూ మరింత జోరుగా అడుగులేశాడు అతను ఆమె మౌనంగా అతని ననుసరిస్తోంది. వాన అంతకంతకూ ఎక్కువవుతూొంది. ఉరుములు, మెరుపులు, గాలి, వాన, చెట్లరొదలు వీటన్నిటిమధ్య యిక్కడ చిక్కడిపోయాం – యిల్లు చేరుకోవటమెలా – దీనికితోడు పడవ నడుస్తుందో లేదో అని ప్రకాశం కలత పడుతున్నాడు చుట్టూ వాతావరణమంతా భయంకరంగా ఉంది. ఐనా ప్రకాశం నాకు తోడున్నాడు. ఫరవాలేదు – ఇలా ఉంటే ఎలాంటి పరిస్థితుల్లోనయినా ముందుకు నడిచేయవచ్చు–అని ధైర్యంగా నిబ్బరంగా అడుగులు వేస్తోంది కళ్యాణి.

పడవ ఎక్కేసరికి వర్షం జోరు కొంత తగ్గి సన్ననిజల్లు పడుతూొంది. మబ్బులు మాత్రం ఆకాశమంతా కప్పేశాయి వెలుతురు బాగా తగ్గిపోయి మసక చీకటిగా ఉంది. సముద్రపుహోరుతోపాటు గాలి రొద మరీ ఎక్కువయింది పడవ ఊగిసలాడుతూ భయపెడుతూొంది. అప్పటికే తడిసిపోయిన ఇద్దరూ చలికి వణికిపోతున్నారు. పడవ అవలి గట్టుకు చేరేసరికి అక్కడెలాగో ఒక రిక్షా వుంది అందరికంటెముందు గట్టుమీద కురికి రిక్షా మాట్లాడేడు ప్రకాశం.

"ఇప్పటికే తడిసిపోయావు, నువ్వు ముందెక్కు" అన్నాడు ప్రకాశం.

"మరి నువ్వో?" అంది కల్యాణి.

"మరొకటి దొరుకుతుందేమో చూస్తాను" అని నసిగాడు ప్రకాశం అటూ యిటూ చూస్తూ.

"చూడనక్కరలేదు, నువ్వూ ఎక్కు" అంది కళ్యాణి రిక్షా ఎక్కుతూ.

సంకోచించకుండా రిక్షా ఎక్కేసి ఆమె పక్కన కూర్చున్నాడు ప్రకాశం. భోరున పడే వర్షంలో రిక్షా సాగిపోయింది.

## 5

తోసుకొస్తున్న మనుష్యుల గుంపుదాటి ప్లాటుఫారం గేటులోంచి ఎలాగో బయటపడి రిక్షాలూ గుర్రపుబళ్ళూ వాటి కోలాహలంలోంచి తప్పించుకుని ప్రకాశం రోడ్డుమీదకు వచ్చేసరికి దీపాలు వెలిగించారు. స్టేషన్లో దీపాలన్నీ ఒక్కసారిగా

వెలిగాయి. అతని వెంటనే ఉన్న ఇందిర "రిక్షాలు మాటాడు ప్రకాశం" అంది అతను ఆమెవైపు చూడకుండానే "కొంతదూరం నడుద్దాం పద" అనేసి నడకసాగించాడు "నడవడమా! ఈ వాల్తేరు స్టేషనునుంచి చెంగల్రావుపేటదాకానా! నా తరంగాదు బాబూ?" అన్న ఇందిర మాటలు గాలిలో కలిసిపోయాయి. కాని అతని చెవులలో పడలేదు. అతడు గబగబా అడుగులు వేస్తూ నడుస్తున్నాడు ఇందిర మరికొంచెం స్వరం హెచ్చించి, "ఏమిటి ప్రకాశం, మతిగాని పోయిందా? నడవలేను అంటూంటే వినిపించుకోవేం?" అంది. అతడు ముఖం చిట్లించి "ఫరవాలేదులే, నాలుగడుగులు వేస్తే ప్రమాదంలేదు. నాకేమిటో రిక్షా ఎక్కాలని లేదు" అనేశాడు.

ఇరువురూ మౌనంగా నడుస్తున్నారు అతని మెదడులో ఆలోచనలు తిరిగిపోతున్నాయి. చల్లని మబ్బుగాలి వీస్తూంది

ఆవేళ వాలీగార్డెన్సులోనూ ఇలాంటి మబ్బుగాలే ప్రారంభించింది. నిండా వారం రోజులు తిరగలేదు. అంతలోనే యింత మార్పు! ఆలోచించుకుంటున్నాడు ప్రకాశం. అప్పుడే కల కరిగిపోయిందా? కల్యాణి ఇంక తిరిగి రాదా? రాదేమో!

"మళ్ళీ ఎన్నాళ్ళకు వస్తానో" అంది! ఎంత బరువుగా అంది! పాడు ఉత్తరం ఎటువంటి వార్త మోసుకొచ్చింది– వెనుకటి ఉత్తరం చూసి భయపడిన కల్యాణి–ఈ ఉత్తరంచూసి భోరుమని ఏడ్చింది. ఆవిడ నాన్నకు జబ్బు తీవ్రంగానే ఉండి ఉంటుంది. ఇంక బతకడేమో? ఆ తరువాత? ఆమె ఇక తిరిగిరాదు. ఆ దుఃఖంలో తనను మరచిపోతుంది. తరువాత ఇంకెవరినో పెళ్ళాడేసి అక్కడే ఉండిపోతుంది. లేదా ఎక్కడికో వెళ్ళిపోతుంది.

ఛాఛా అనుకున్నాడు ప్రకాశం. మనిషి బుద్ధి ఒక్కొక్కప్పుడు ఎంత వక్రంగా నడుస్తుంది! చావులోనే పెళ్ళి ఊహిస్తున్నాడు తను. రైలు కదలబోతూంటే కల్యాణి పెట్టెలోంచి చూసిన చూపు ఎంత జాలికరం. రైలు ఎక్కబోతూ ప్లాటుఫారం మీద నిలబడి ఆమె అన్న మాటలు అతని చెవుల్లో రింగుమంటున్నాయి. ఆ పిచ్చి పిల్లకి తనెంత ధైర్యం చెప్పినా ఎందుకో నమ్మకం కలగలేదు.

"ఉత్తరాలు వ్రాస్తావుకదూ!" అంటుంది పదేపదే జాలిగా. ఉత్తరాలే ఏం కర్మం, అవసరమయితే తనే వస్తానన్నాడు. డబ్బు కావలిస్తే తల తాకట్టు పెట్టయినా పంపిస్తానన్నాడు. అంతలో మళ్ళీ ప్రకాశానికి నవ్వు వచ్చింది. ఉత్తరాలు వ్రాయొచ్చు–అవసరమైతే ఆ ఊరు వెళ్ళవచ్చు, కాని డబ్బో! తన తల తాకట్టు పెట్టినా దమ్మిడీరాదు– కాని–కాని–అంతేనా? ఏదో చెయ్యాలి. అంత అవసరమైతే డబ్బు పుట్టించి తీరాలి. మేనమామ నడిగితే అసలివ్వడు. ఇలాంటి ఆలోచన లెన్నో అతని బుర్రలో సుడులు తిరుగుతున్నాయి. అంతలో భయం, అంతలో ధైర్యం. ఆమె దుఃఖాన్ని తను పంచుకోవాలనే మమత–అదెలాగో తెలియని నిస్సహాయత – ఇన్ని ఆలోచనలూ విషాదాలూ అతని బుర్రలో రేగి పొగలై సెగలై దట్టంగా కమ్ముకుని అతనిని ముందుకు నెట్టుకెళుతున్నాయి అపస్మారంగా నడుస్తున్నాడతడు.

వీధి దీపాల కాంతులు వలయాలుగా రోడ్డుమీద ప్రసరిస్తున్నాయి. అంతగా జనసంచారం లేదు. దూరాన ఎక్కడో రిక్షామువ్వల చప్పుడు, రైలుకూతలు గాలిలో తేలివస్తున్నాయి. అతని వెనువెంటనే నడుస్తున్న ఇందిర కూడా పరిపరివిధాల

ఆలోచిస్తోంది. "ఏమిటో వింత మనిషి" అనుకుంది ప్రకాశాన్ని చూసి – కల్యాణి తండ్రికి జబ్బుగా ఉందంటే ఆమె కంటే ఇతడే ఎక్కువ బాధపడుతున్నట్లున్నాడు అనుకుంది. పాపం! కల్యాణి తన కష్టాలు పంచుకోవడానికి ప్రకాశంమీద ఆశలు పెంచుకున్నట్లుంది. ఏమిటో ప్రపంచం! ఏమిటో మనుష్యులు! ఇలాంటివాళ్ళు తనకెన్నడూ అర్థం కాలేరు. ఇట్టే మమతలు పెంచేసుకుంటారు. ఇట్టే కన్నీళ్ళు కార్చేస్తారు. ఇలాంటి అనుభవాలు తనకెన్నడూ కొత్తే తనలో తనే నవ్వుకుంది ఇందిర. ఏదో సినిమాలో వాక్యం జ్ఞాపకం వచ్చింది, "దౌర్బల్యాన్ని చూసి బాధపడడమే ఒక దౌర్బల్యం." ఆ బాధ తనకు లేదు. ఈ విచిత్ర ప్రపంచంలో అలాంటి బాధను పెట్టుకుంటే బతకడం కష్టం ఆ మాటకొస్తే అలాంటివాళ్ళ వెనకాతల నడవడం కూడా కష్టమే. హఠాత్తుగా జ్ఞాపకం వచ్చింది – ఎంతదూరం నడిచేసింది. అరమైలుకు పైగా అయి ఉంటుంది. నడుస్తున్న ప్రకాశం భుజంమీద చెయ్యివేసి "ప్రకాశం!" అని గట్టిగా అరిచింది. అతడు ఉలిక్కిపడి ఆగి "ఏం" అన్నట్లు చూశాడు. "నువ్వయితే మగధీరుడవు నడవగలవేమోగాని ఇంక నేను నడవలేను బాబూ! ఏదైనా రిక్షా చూడు. ఈ లాంతరు స్తంభం కింద ఇక్కడే కూచుంటాను. రిక్షా దొరక్కపోతే ఇక్కడే ప్రాణాలు విడిచేస్తాను" అంది నవ్వుతూ. మైకంలోనుంచి తేరుకుని ఆమె మాటలు అర్థం చేసుకోవడానికి ప్రకాశానికి కొద్ది క్షణాలు పట్టింది. తరువాత ఆమెవైపు తేరిపార చూసి "ఇక్కడే ఉండు" అని ఒక అరఫర్లాంగు ముందుకు నడిచి రిక్షా ఒకటి తీసుకొచ్చాడు. "ఒక్కటే దొరికింది. నువ్వు కూర్చో నేను నడిచివస్తానులే" అన్నాడు. ఇందిర కొంటెగా "ఫరవాలేదులే. ఇంతలోకే నా పాతివ్రత్యానికేం భంగంరాదు. ఇద్దరం కూర్చుని పోదాం పద" అంది ప్రకాశం తెల్లబోయాడు. అంతలోకే మళ్ళీ సర్దుకుని 'పదయితే' అని తనూ కూర్చున్నాడు.

ఇంటికి చేరేసరికి ఆనందరావు నడవగదిలో తీరికగా కూర్చుని చుట్టముట్టించి పేపరు తిరగేస్తున్నాడు. కూతురినీ ప్రకాశాన్నీ చూసి "దిగబెట్టేశారా?" అన్నాడు. "ఓ బేషుగ్గా నాన్నా!" అంది ఇందిర. "ఐతే మరింత త్వరగా వచ్చేశావేం?" అన్నాడానందరావు ప్రకాశంవైపు సాలోచనగా చూస్తూ. అందులోని హాస్యం ప్రకాశానికేమీ బోధపడలేదు. "రాక ఎక్కడికి పోతామండీ?" అన్నాడు

ఆనందరావు విలాసంగా చుట్టపొగ వదుల్తూ "ఎక్కడికేమిటోయ్! వెనకటికి మా డిప్టీకలక్టరు గారమ్మాయి మద్రాసు వెళ్ళింది. నాయుడుగారి కొడుకు బొంబాయి వెళ్ళాడు" అని ఇంకా ఏదో అనబోతూంటే ఇందిర అడ్డుపడి "వాళ్ళకేం నాన్నా! రైలు టిక్కెట్టుకు డబ్బులుండి ఉంటాయి" అంది.

"వెనకటి కేమయిందంటే–" అని ఆనందరావుగారు ఏదో కథ ఎత్తుకోబోయేసరికి ప్రకాశం గబగబా మేడ యెక్కి తన గదిలోకి వెళ్ళిపోయాడు. బట్టలు మార్చుకుని నిశ్శబ్దంగా పైడాబా ఎక్కేశాడు. అప్పటికప్పుడే చీకటి దట్టంగా కమ్ముకుంది. అప్రయత్నంగా గాలిలోకి చూస్తూ అతని కళ్ళు ఆకాశంలోని శుక్రకాంతిని చూశాయి తెల్లతెల్లగా కొంచెం నీలంగా దగదగా మెరిసిపోతున్నాడు శుక్రుడు. చల్లనికాంతి–వెంటనే అతనికి కల్యాణి జ్ఞాపకం వచ్చింది ఈపాటికి కల్యాణి అనకాపల్లి దాటి ఉంటుంది తుని చేరుకునేసరికి రాత్రి తొమ్మిది. అర్ధరాత్రికి కాని ఆ పల్లెటూరు చేరదు. సాయానికి మనిషిని పంపిస్తానని మునసబు ఉత్తరంలో ఉంది. కాని ఏమో నమ్మలేం.

ఛా తను కూడా వెళ్ళవలసింది. తన అశక్తతకు తనకే బాధ కలిగింది. కల్యాణికి తనేవిధంగానూ పనికిరాలేక పోతున్నాడు ఎందుకు పనికిరావాలి అని ప్రశ్నవేసుకుంటే జవాబులేదు. ఏమౌతుంది కల్యాణి తనకు? బాధతో అతని హృదయం మూల్గింది అంతవరకూ నడిచిన జీవితం ఒకసారి స్మృతి పథంలో మెరిసింది. దూరాన పొగమంచులో పాలవలె కొన్ని స్మృతులు అతని అవగాహనలో వెలిగాయి. అందులో అన్నీ చురుక్కుమని బాధ కలిగించేవే కాని చల్లగా ఊరట నిచ్చేదొక్కటీ లేదు. పుట్టిన మూడేళ్ళకే నాన్నపోయాడు. అంచేత పితృవాత్సల్యం అంటే ఎరగడు బతుకులో ఏదో పెద్దశూన్యం ఆ శూన్యాన్ని తొలిగించే వ్యక్తి అతని కింతవరకూ తారసిల్లలేదు. కల్యాణిని చూడగానే తనకెందుకో ఆ నొప్పితగ్గి కొంత ఉపశమనం కలిగింది. తన లోలోపల బిగుసుకుపోయిన కవాటాలు తెరిచి "నేనూ నీలాంటిదాన్నే. నాకూ ఊరటకావాలి" అని కల్యాణి అన్నట్లనిపించింది ఇంతలోకే ఒక ఉప్పెన. భవిష్యత్తుమీద మబ్బులు.

పిట్టగోడ నానుకుని శూన్యంగా రోడ్డుమీదకు చూస్తూ నిల్చున్నాడు ప్రకాశం. చీకటి గర్భంలో ఇంటింటా మనుష్యులు వెలిగించుకున్న దీపాలు. నలుదిక్కులా ఒకసారి కలయచూశాడు ప్రకాశం. వాతావరణంలో గాంభీర్యం అతనిని భయపెట్టింది లక్ష నిట్టూర్పుల – లక్ష కన్నీళ్ళ నగరమిది. ఎవరి తొందర వారిది ఎవరి పనులలో వారు. ఎవరికి కావాలి తమ సమస్యలు? ఈ చీకటిలో ఎన్నో మైళ్ళదూరంలో ఆ గ్రామంలో పాడుపడ్డ యింటిలో జబ్బుపడ్డ తండ్రిప్రక్క కల్యాణి– నగరంలో, మధ్యతరగతి మూర్ఖత్వం ఘనీభవించిన పేటలోని పాడుపడ్డ యింటి డాబామీద అర్థంలేని ఆలోచనలతో తాను ఎందుకు బాధపడడం – బాధపడక ఏం చేయగలడు తాను? అంతేనా? ఏమిటో, ఆలోచనలు కూడా సాగడం లేదు పంచేంద్రియాలూ స్తంభించిపోయినట్లుగా అనిపించిందతనికి. తనకే గనక డబ్బుంటే కల్యాణి తండ్రిని యిక్కడికి రప్పించేవాడు కాదా! అంత విషాదంలోనూ అతనికి నవ్వు వచ్చింది అనుకున్నాడు–డబ్బనే ఆరో యింద్రియం లేనిదే తక్కిన పంచేంద్రియాలూ పనిచేయవని అన్నాడెవడో కాని అతడు నిజంగా మహానుభావుడు డబ్బులేనిదే అనురాగాలు వ్యర్థం. అనుబంధాలు అర్థవిహీనం.

భుజంమీద చల్లనివేళ్ళు తగిలేసరికి ఉలిక్కిపడ్డాడు. వెనుతిరిగి చూస్తే "డాబామీద ఒంటరిగా ఏం చేస్తున్నావు ప్రకాశం?" అంటూ ఇందిర నిలబడింది.

"ఏంలేదిందిరా! కాస్తగాలి పీల్చుకుంటున్నా నంతే" అన్నాడు. "గొప్పపని చేస్తున్నావు–బతికివున్న ప్రతి మనిషీ గాలి పీలుస్తాడు. సరేగాని జేబులో విటమిన్లు ఏమాత్రం ఉన్నాయి?" అంది

"ఆరు రూపాయల చిల్లర ఉంది, ఏం?" అన్నాడు ప్రకాశం. "అయితే యింకేం కొల్లలు. పద, గబగబా భోంచేసి సినిమాకు పోదాం."

ప్రకాశం కొంచెం చిరాకుగా "సినిమాకా! ఇవాళ రాత్రా! నేను రాను – రాలేను. కావలిస్తే నువ్వూ మీ నాన్నా వెళ్ళండి. గదిలో షర్టుజేబులో పర్సుంది తీసుకో!" అన్నాడు ఇందిర కొంచెం స్వరం హెచ్చించి సగం కఠినంగా, సగం లాలనగా "దానకర్ణుడివి బయలుదేరావు. డబ్బుకేంలే! నాకు కావలసింది నీ కంపెనీ.

వెర్రివేషాలేయక సినిమాకుపోదాంరా, నాకు తెలుసు నీ బాధేమిటో – ముందొచ్చిన చెవులకంటే వెనుకవచ్చిన కొమ్ములు వాడి అన్న సామెతగా ఉంది నీ వరస. కల్యాణి కోసం ఆ మాత్రం బాధ నేనూ పడుతున్నాను. కాని ఏం చేస్తాం? మూలుగుతూ ఇలా తెల్లవార్లూ కూర్చోలేంగద! సినిమాహాలులో కూర్చొని కాస్సేపు ఇవన్నీ హాయిగా మర్చిపోయి కాలక్షేపం చేదాంపద" అంటూ చెయ్యిపట్టుకుని గబగబా లాక్కెళ్ళింది ప్రకాశం కాదనలేకపోయాడు. యంత్రవత్‌గా అనుసరించి వెళ్ళి భోజనం చేశాడు అన్నం తింటున్నంతసేపూ ఆనందరావు ఏవేవో చిత్రమైన కబుర్లు చెప్పాడు. ఎన్నాళ్ళు చెప్పినా ఎన్నేళ్ళు చెప్పినా ఆయన కబుర్లు ఒకటే రకం – ఒకటే కథావస్తువు. ఆయన జీవితంలో చవిచూచినవి రెండేరెండు; మదిర, మానిని! ఆ రెండింటిని గురించే ఆయన మాట్లాడగలడు

ఆ రాత్రిపూట ఎందుకోగాని ప్రకాశం మొదట్లో చీదరించుకున్నా పోనుపోను ఆసక్తిగా విన్నాడు. ప్రశ్నలు వేశాడు. అంతసేపూ ఇందిర చాలాహుషారుగా తనుకూడా మాటలు కలిపి మధ్య నాన్నకి ఏవేవో జ్ఞాపకం చేస్తూ మరచిపోయిన కథావస్తువును అందిస్తూ "అది జరిగింది బెజవాడలో కాదునాన్నా, రాజమండ్రిలో" "ఆవిడపేరు అనసూయ కాదు నాన్నా, రుక్మిణి" అనేది.

భోజనం ముగిసేసరికి ప్రకాశంలోని వేదన కొంచెం సర్దుమణిగింది. జ్వరం తగ్గిన తరువాత వచ్చే నీరసం లాంటిది ఆవహించింది "అదీ కొంత నయమే" అనుకున్నాడు. తండ్రీకూతురూ కలసి తన బాధను కొంత తగ్గించడానికి ప్రయత్నిస్తున్నారు దీపం ముందు అద్దం పట్టుకుని నిలుచుని తిలకం సరిదిద్దుకుంటున్న ఇందిరను చూసి ప్రకాశం "అర్ధరాత్రి యింత సింగారం దేనికి ఇందిరా! ఎలాగో అలాగ వద్దూ పోదాం" అనేసరికి ఇందిర నవ్వుతూ "వెర్రినాయనా! అలావచ్చేస్తే ఎంత ప్రమాదం! దారిలో ఏ మహాప్రేమికుడో నన్ను ప్రేమించే అవకాశం తప్పిపోతే దానికి జవాబు దారీ ఎవరు? ఆడవాళ్ళ అవసరాలు నీకు తెలియవులే పద!" అంటూనే మరో పదినిమిషాలు ఆలస్యంచేసి వయ్యారంగా జోడు తొడిగి ఆఖరికి బయలుదేరింది. ఈ తతంగం అంతా చూస్తున్న ప్రకాశం కాస్సేపు కల్యాణిని మరచిపోగల్గాడు

రోడ్డుమీదకు వచ్చాక "రిక్షాలు తీసుకరానా!" అన్నాడు ప్రకాశం

"రిక్షాలా! ఇపుడెందుకు? హాయిగా నడిచిపోదాం పద" అంది ఇందిర

"మరి ఇందాకా నడవలేనన్నావు. దీపస్తంభం కింద మరం వేసి పొట్టిశ్రీరాములువై పోతానన్నావు. ఇప్పుడు నడవగలవా?" అంటే, "అప్పటికింకా కొంచెం వెలుతురుంది. సూర్యుడు కూడా సరిగ్గా అస్తమించలేదు. నీకు తెలుసో తెలీదో కాని ప్రకాశం! సూర్యకాంతిలో చేయలేని కొన్ని పనులు దీపకాంతిలో మనం నిర్భయంగా చేసేయగలం ఇదీ అంతేననుకో!" అంది ఇందిర, పెంకితనంగా అతని వైపుచూస్తూ.

"నువ్వేమంటున్నావో నా కర్థం కాలేదిందిరా!" అన్నాడు ప్రకాశం. "ముందుముందు అదే అవుతుందిలే పద" అంటూ ఇందిర చురుకుగా అడుగులు వేసింది నిస్సహాయంగా ప్రకాశం ఆమెననుసరించాడు....

☆ ☆ ☆

ఎప్పటివలె మర్నాడు తెల్లవారింది. ఉదయం ఎనిమిది గంటలు దాటింది. ఆనందరావు నడవలో బెంచీమీద కూర్చుని చుట్టకాలుస్తూ ఎదురుగుండా పేకముక్కలు పరుచుకుని 'పేషెన్సు' ఆడుతున్నాడు. ఒక్కడూ కూర్చుని ఆడుకునే ఆ ఆటలో కూడా తనను తనే దగా చేసుకుంటూ ముక్కలు వేసికుంటున్నాడు. ఆనందరావు చరమోత్కర్షలలో మదిరా మానినుల వరుసగా వచ్చేవి చుట్టలు, టీ, చీట్లపేక. అప్పటికప్పుడే తనే రెండుసార్లు టీ చేసుకుని తాగాడు. ఇంతలో వీధిలోంచే "ఇందిరా!" అని అరుచుకుంటూ సుడిగాలిలా ప్రవేశించాడు కృష్ణమూర్తి. "ఇందిరా!" అని మళ్ళీ ఒక గావుకేకపెట్టి, చుట్టపొగల మధ్యలో ధ్యానముద్రలో ఉన్న ఆనందరావు కనపడేసరికి "నమస్తే మామయ్యగారూ! ఉదయాన్నే పురాణం వేశారు, గెలుస్తున్నారా...ఓడిపోతున్నారా?" అన్నాడు

ఆనందరావు చిరునవ్వుతో "రావోయి కృష్ణమూర్తీ రా! కూర్చో, గెలుపా! మనకి గెలుపూ ఓటములు రెండూ–" అని వాక్యం ముగించక ముందే కృష్ణమూర్తి "ఇందిర ఏదీ? ఇంకా లేవలేదా!" అన్నాడు, ఆనందరావు పక్కనే చతికిలబడి సిగరెట్టు వెలిగిస్తూ.

"ఆదివారం కదూ, బద్ధకంగా పడుకుంది."

"ఎనిమిది గంటలు దాటినా యింకా పడకేమిటండీ! లేపండీ. మీరు లేపకపోతే నేనే వెళ్ళి లేపుతాను" అన్నాడు కృష్ణమూర్తి ఆత్రంగా.

"అంత చొరవుంటే వెళ్ళి లేపు, రాత్రి రెండో ఆట సినిమా చూసొచ్చి ఆలస్యంగా పడుకుంది. లేపడానికి ప్రయత్నించావో– అప్పుడు నీకు తగిలే గాయాలకు నేను బాధ్యుడిని కాను. రక్కేసి, కరిచేయగలదు వెళ్ళకావలిస్తే" అన్నాడు ఆనందరావు.

"ఇప్పటికి చాలాసార్లు కరిచింది లెండి మరేం భయం లేదు" అని సిగరెట్టొక్క దమ్ములాగి అవతలకి పారేస్తూ "ఇందిరా! బారెడు పొద్దెక్కింది లేస్తావా!" అని పొలికేక పెట్టాడు కృష్ణమూర్తి.

కాస్సేపటికి ఇందిర బయటికి వచ్చి "హల్లో కృష్ణమూర్తీ! ఎప్పుడొచ్చావు? కూర్చో అయిదునిమిషాల్లో వస్తాను" అని తుర్రున లోపలికి వెళ్ళిపోయింది.

కృష్ణమూర్తి "మరేమి టానందరావుగారూ! చెప్పండి కబుర్లు. మొత్తానికదృష్ట వంతులండీ మీరు" అన్నాడు.

ఆనందరావు నిట్టూర్చి "ఏమదృష్టంలే – మూడుగుర్రాలు కళ్ళచూసి ఎన్నాళ్ళయిందో! కాళీగ్లాసులో అగ్గిపుల్ల గీసిపడేసి చాలాకాలమయింది" అన్నాడు.

కృష్ణమూర్తి పెదవులు చప్పరించి "ఛా! అవేం మాటలండీ! వెధవ మూడు గుర్రాలూ–మూడేం కర్మం ముప్ఫయి తెద్దాం! బ్లాకులో కావలసినంత తేవచ్చుగానీ చోటులేదు. అదే వచ్చిన చిక్కు" అన్నాడు.

ఆనందరావు కొంచెం సకిలించి "చోటుకే లోటా! మన పైడాబా వుంది చూశావూ–అది ప్రొటెక్టెడ్ ఏరియా అనుకో– గవర్నరు బంగళా కంటె బందోబస్తుగా ఉంటుంది. అయినా పాపం నీకెందుకులే పన్ను వేయడం, మార్చి సెప్టెంబరులలో పడి కొట్టుకుంటున్నావు. అన్నట్లు మొన్న రిజల్ట్సు వచ్చాయి గదా! ఏమయింది నీ పరీక్ష?" అని అడిగాడు.

కృష్ణమూర్తి గర్వంగా "ఏమవుతుంది? హాయిగా సున్న చుట్టేసింది. మళ్ళీ మార్చి ఉందిగా!" అని జవాబు చెప్పాడు.

"లేకేం నాయనా! ఉంది. అయితే యింటికెప్పుడు ప్రయాణం?"

"బాబోయ్! యింటిమాట జ్ఞాపకం చేయకండి భయమేస్తుంది. వెళ్ళనసలు. ఇక్కడే ఉండిపోతాను."

"ఉండిపోతే మనియార్డర్లు వస్తాయా?"

"అయ్యో మామయ్యగారూ! మా సంగతి మీ కింకా తెలీదు. మా గ్రామం మొత్తం మీద మా కుటుంబాలన్నిటిలోకీ నేనే మొదటి అండర్ గ్రాడ్యుయేట్ ని. అక్కడ కనుచూపు మేర పొలాలన్నీ మావేగాని పలక బలపం పట్టి బడికిపోయిన పాపాన ఒక్కడూ లేడు. అసలు ఈ జిల్లా వెనుకబడిందయితే మా తాలూకా మరీ వెనుకబడినది. అంచేత నేను బతికిపోయేను. మా నాన్నకి వ్యవసాయం తప్ప మరొక గొడవలేదు. నేనిక్కడ చదివేస్తున్నానని ఆయన నమ్మకం" అన్నాడు కృష్ణమూర్తి నిర్లిప్తంగా.

ఇంతలో ఇందిర రెండు కప్పులలో టీ తీసుకొచ్చి ఒకటి కృష్ణమూర్తి కిచ్చి ఒకటి తను తీసుకుని కృష్ణమూర్తి కెదురుగా కూర్చుండి "నువ్వు వుత్త బ్రూట్ వి కృష్ణమూర్తీ! షివల్రీ బొత్తిగాలేదు, అనవసరంగా నిద్ర పాడుచేశావు!" అంది కోపం అభినయిస్తూ.

"నిజమే! వెరీసారీ! పాపం రాత్రంతా నిద్రలేనట్లుంది" అన్నాడు కొంటెగా అని, "ఆ పోనీలే! ఆ ఘట్టాన్ని కళ్ళుమూసుకుని దాటేద్దాం కాని ఇవాళ ప్రోగ్రాం ఏమిటి వేసుకున్నావు? ఆదివారం కదా!" అంటూ ప్రశ్నవేశాడు

టీ కప్పు విలాసంగా పక్కకు పెట్టేసి ఇందిర ఒక్కసారి బద్ధకంగా ఒళ్ళువిరిచి "అదీ నువ్వే చెప్పు! అన్నట్లు సాయంత్రం మా బాస్ తనతో సినిమాకి రమ్మన్నాడు," అంది

ఇంతలో ఒక అగంతుకుడు నడవలోకి ప్రవేశించి "నమస్కారం బాబుగారూ! షాహుకారుగారు పంపించారు ఇవాళకి వాయిదా వేశారటగా! ఆలస్యమైతే అయింది యిక్కడే కూర్చుని అద్దె వసూలు చేసి తెమ్మన్నారు" అన్నాడు బెంచీమీద చతికిలబడుతూ, సాయంత్రందాకా యిక్కడే తిష్టసుమా అన్నట్లు ముఖం పెట్టి ఆనందరావు ముఖం తెల్లబడింది.

"అమ్మాయి! ప్రకాశం ఏడీ? మేడమీదకు వెళ్ళి.." అంటూండగానే ఇందిర "ప్రకాశం లేడు పొద్దున్నే ఆసుపత్రి కుడాయించి నట్లుంది, అయినా ఉంటే మట్టుకు దేనికి? అతనివ్వవలసిన దెప్పుడో ఇచ్చేశాడుగా!" అంది ముఖం చిట్లిస్తూ.

ఆనందరావు "అన్నట్లు అదీ నిజమే!" అని గొణుగుతున్నాడు ఇదంతా గమనిస్తూన్న కృష్ణమూర్తి సిగరెట్ ముట్టించి—

"ఏమిటీ గొడవంతా! అసలు సంగతేమిటి?" అని ఇందిర ముఖం వైపు చూశాడు. "మరేముందోయ్! సిల్లీ ప్రోబ్లెమ్స్ ఇలాంటివంటే నాకసహ్యాం" అంది ఒక మహారాణిలా పోజుపెట్టి—ఈ గొడవకి తనకి ఏమీ నిమిత్తం లేనట్లు

కృష్ణమూర్తి "ఇంత అందమైన ఆదివారం ఉదయం ఈ వెధవ సమస్యలేమిటి?" అన్నాడు నిర్లక్ష్యంగా.

ఇందిర "నిజమే కాని ఈ వెధవ సమస్య ఖరీదు పాతికరూపాయలు" అంటూ, "ఫస్టు తారీకు సాయంత్రం రమ్మనరాదూ నాన్నా?" అంది చీదరగా ముఖం పెట్టి.

కృష్ణమూర్తి చివాలున తేలు కుట్టినట్లు లేచి "ఓస్ ఇందుకేనా ఇంతగొడవానూ! మా నాన్నా పోస్టువాళ్ళూ చల్లగా ఉండాలికాని!" అంటూ జేబులో పర్సులోంచి పాతికరూపాయలు తీసి షాహుకారు గుమాస్తా చేతిలో పెడుతూ "గుమాస్తాగారూ! ఇది పుచ్చుకొని ఇక సెలవు పుచ్చుకోండి" అన్నాడు దర్జాగా.

గుమాస్తా నోట్లు గట్టిగా రెండుసార్లు లెక్క చూసుకొని "ఇది అక్టోబరు జమ, నవంబరుదో" అన్నాడు. గుమాస్తా డబ్బు జేబులో భద్రంగా పెట్టేసుకున్న తరువాత ఇందిర "అదేమిటి కృష్ణమూర్తీ! మధ్య నువ్వెవడివి? ఇవ్వడానికి వీల్లేదు గుమాస్తాగారూ, ఆ డబ్బుతని కిచ్చేయండి" అంది

కృష్ణమూర్తి "నో నో నో నో! తీసికెళ్ళండి గుమాస్తాగారూ!" అంటూ "మరేం ఫర్వాలేదు ఇందిరా! తరువాత చూసుకోవచ్చులే. మనలో మనకి తేడాలేమిటి? అంతేకదూ ఆనందరావు గారూ!" అన్నాడు ఏదో విజయం సాధించేసినట్లు.

ఆనందరావు "అమ్మాయన్నది సబవే కాని గట్టిగా వద్దంటే నువ్వు మనసు చిన్నబుచ్చుకుంటావు—నేనంతా లెక్క వేస్తున్నానులే. వెనకటిదీ ఇదీ కలిసి అంతా ఒక్కసారే యిచ్చేస్తాను—" అంటూండగానే ఇందిర "వెనకటిదేమిటి?" అని ఉరిమింది. ఇద్దరూ జవాబు చెప్పలేదు కాని ఆనందరావు కృష్ణమూర్తి ఒకరినొకరు సాలోచనగా చూసి నవ్వుకున్నారు.

ఆమె అదోరకంగా మూతి ముడిచి "సరే మీ రహస్యాలేవో మీవి. మధ్య నాకెందుకు పోనీగాని ప్రోగ్రాం అంటావేమిటి కృష్ణమూర్తీ! చెప్పానుగా మా బాస్ సినిమాకి రమ్మన్నాడు" అని ప్రస్తావన మార్చేసింది. కృష్ణమూర్తి అభిమానం గాయపడింది.

"ఎవరా బాస్! ఎన్ని వేల గుండెలు వాడికి? మా స్నేహితుడన్నట్లు ఎడ్రసు తెమ్మిటు డొక్క చీల్చెదన్!" అన్నాడు కోపంగా.

ఆమె ఒక్కసారి విలాసంగా అవులించి "అయితే వ్రాసుకో చెపుతాను. డి. టి. యస్. వాల్తేరు. అతని పెర్సనల్ స్టెనోని నేను, తెలుసా?" అంది.

కృష్ణమూర్తి "వీల్లేదు! బాస్ లేదు గీస్ లేదు—మనం వేరే ప్రోగ్రాం వేసుకోవలసిందే" అన్నాడు.

ఆనందరావు పేకముక్కలు సర్ది డొక్కులో పెట్టేస్తూ "అలా ఊరికే ఉడికిపోకపోతే ఆ ప్రోగ్రామేమిటో చెప్పకూడదుటోయ్! వెనకటికి మా సబ్ కలెక్టరుగారబ్బాయుండే వాడులే. అచ్చు వాటం అంతా యిలాగే" అంటూంటే ఇందిర "బాస్‌ని సరే వదిలేద్దాం. వదిలేసి ఏం చేద్దాం?" అంది.

"ఏముంది చేయడానికి? ఇక్కడేం మెరినా బీచ్ ఉందా! అడయార్ బోటు షికారా! ఏదో కప్పు కాఫీ తాగి ఊరవతలికి షికారు పోతే కాస్త వేడి తగ్గుతుంది" అన్నాడు కృష్ణమూర్తి.

ఆనందరావు "ఇంతేనటోయ్ నీకు తెలిసినది? మద్రాసు దాటితే మంచి ఊరు లేదంటావు. నాల్గుమైళ్ళు దాటితే నలువైపులా భూలోక స్వర్గమేకదూ యిక్కడ.

నీ వయసులో నేనిక్కడ ఏడాది వున్నాను తెలుసా – రైల్వేలో బుకింగ్ ఆఫీసులో పనిచేశానులే – ఆదివారం వచ్చేసరికి తిరిగినచోటు తిరగకుండా తిరిగేమనుకో – సీతమ్మధార దగ్గర చిట్టడవులూ మాధవధార దగ్గర పనసచెట్లూ– నీకింకా తెలీదులే అందులోని అందం" అన్నాడు.

"ఆల్ రైట్! ఐడియాస్ అందించడానికి అసలైన పెద్దలు ఇక్కడే ఉన్నారు కదా! మరి లే ఇందిరా! జల్దీగా సింగారం పూర్తి చేస్తే అలా వెళ్ళి కోమల విలాస్‌లో కప్పు కాఫీ సేవించి సీతమ్మధారకు చిన్న షికారు సాగిద్దాం."

"కప్పుకాదు బాబూ రెండు కప్పులు తాగినా అడవులూ కొండలూ దాటలేను. నడవక్కరలేకుండా నట్టడవిలోకి తీసుకు వెళతానన్నా నాకేం అభ్యంతరం లేదు"

"ఎంతమాట! ఎంతమాట! అంత ఆయాసపెడతానా నిన్ను –పసందైన పెట్టెబండి ఎక్కి వెళదాం– నాకదంటే మహా సరదా! రిక్షాలు రాగానే వాటికి గిరాకి తగ్గిపోతూంది పాపం, కొన్నాళ్ళకవి లేకుండానే పోతాయేమో అని నాకు మహా దిగులుగా ఉంది"

"పెట్టెబండి యెక్కి నీతో సీతమ్మధార దాక ప్రయాణమా–అమ్మ బాబోయ్! ఇంకేమైనా వుందా? పెళ్ళికాని పిల్లని నలుగురూ ఏమనుకుంటారు! చూడు నాన్నా! అలాంటి మాటలంటూంటే బుద్ధి చెప్పక అలా చూస్తూ ఊరుకుంటావేమిటి?"

ఆనందరావు ఏదో జ్ఞాపకం వచ్చినట్లు ముఖం పెట్టి "పెట్టెబళ్ళ సొగసు యిప్పుడేముంది! అవెందుకు పనికి వస్తాయో కూడా ఈ కాలపు వాళ్ళకు తెలీదు" అన్నాడు.

ఇందిర లేని కోపం గట్టిగా తెచ్చుకుని "నీదంతా ఏదో సోది–నేనొకటంటే నువ్వొకటంటావు–పోనీలే కృష్ణమూర్తీ! అలాగే వెళదాం పద–బాస్‌తో సినిమాకంటె ఇదే కొంతనయం. డ్రెస్ చేసికొస్తానుండు. ఈలోపుగా టిఫిన్ ఏం కొనుక్కోవాలో ఆలోచించి వుంచు" అని తుర్రున లోపలకు పోయింది.

మరొక అరగంటలో ఇల్లు తాళం పెట్టి ముగ్గురూ రోడ్డుమీద పడ్డారు

సర్జికల్ వార్డులో పని ముగించుకొని మధ్యాహ్నం పన్నెండు గంటలకు ఆసుపత్రినుండి ప్రకాశం బయటికి వచ్చేస్తూంటే అఫీషియల్ కాలనీ గేటుదగ్గర కిష్టయ్య కనబడ్డాడు "ఏమిరోయ్ ప్రకాశం, మూడు రోజులాయి నీకోసం వెతుకుతూంటే ఇప్పటికా కనబడ్డావు? ఇంతేలేరా! పెద్దవాడివైపోతున్నావు" అని పలకరించాడు ప్రకాశం "ఇదేమి కిష్టయ్యా! ఇలా ఊడిపడ్డావేమిటి? ఎప్పుడొచ్చావు? కార్డుముక్కయినా రాయలేకపోయావా?" అన్నాడాప్యాయంగా కిష్టయ్యను చూసి. కిష్టయ్యదీ ప్రకాశం మేనమామ ఊరే. ఇద్దరూ బాల్యస్నేహితులు ఒకే వీధిబడిలో చదువుకుని ఒకే చెరువు గట్టున ఆడుకున్నారు. థర్డుఫారమ్ గట్టెక్కలేక కిష్టయ్య చదువు చాలించి హాయిగా వ్యవసాయం చేసుకుంటున్నాడు. కిష్టయ్య అదోలా ముఖం పెట్టేసి "కర్మరా కర్మ! మా అత్తయ్యకి పెద్దజబ్బు చేసింది. ఇక్కడకి తీసికెళ్ళమంటే మూడురోజుల క్రింద వచ్చేం నేనూ, మా ఆవిడ, అత్తయ్యాను." అన్నాడు. ప్రకాశానికా అత్తయ్య తెలుసు. ఆవిడ కూతురునే కిష్టయ్యకిచ్చారు.

"ఏమిటి జబ్బు? ఎక్కడుందావిడ?" అన్నాడు ప్రకాశం

కిష్టయ్య కంగారుగా "ఎక్కడుందేమిటిరా! ఈ నరకంలోనేరా బాబూ! రోజూ భోజనాలు మొయ్యలేక చస్తున్నాను. మీ మామయ్య నిన్ను తప్పకుండా కలుసుకోమన్నాడు. డాక్టరీ చదువుతున్నావుగా సాయం చేస్తావన్నాడు. అసలు నువ్వు కంటికి కనబడితేగా సూర్యప్రకాశం ఎక్కడుంటాడని కనిపించిన వాళ్ళనందరినీ అడిగాననుకో" అన్నాడు నిష్ఠూరంగా.

"ఏడిసినట్లుంది–కె. యస్. ప్రకాశం అంటే తెలుస్తుంది కొందరికైనా. అసలు నువ్వు వస్తావని నేనేం కలగన్నానా! పోనీలే ఇప్పుడు మించిపోయింది లేదు ఏమిటి జబ్బు మీ అత్తయ్య కింతకీ?"

కిష్టయ్య మరింత కంగారుగా ముఖంపెట్టి "ఏమిటంటే ఏం చెప్పనురా ప్రకాశం... అంతా ఖర్మ అనుకో... కాళ్ళూ చేతులూ వాచిపోయాయి పొట్ట ఉబ్బింది....మధ్య మధ్య జ్వరం.. ఏం జబ్బంటే నాకేం తెలుస్తుంది. డాక్టర్లు వస్తున్నారు చూస్తున్నారు ...ఏవేవో ఇంజక్షనులూ మందులూ యిస్తూనే ఉన్నారు!" అన్నాడు

కిష్టయ్య ధోరణి ప్రకాశానికి చిరాకేసింది.. కాని తమాయించుకుని "సరేలే, రేపు నేను చూసి డాక్టర్లతో మాట్లాడతాను. ఎక్కడ మకాం?" అన్నాడు.

కిష్టయ్య "ఏమిటిరా! అదిగో ఎదురుగుండా ఉన్న మేడలో ఎడంచేతి పక్క చివరిగది తీసికున్నాం–రా చూదువుగాని. నీతో మాట్లాడవలసిన సంగతులు చాలా ఉన్నాయి" అనేసరికి ప్రకాశం మొహమాటపడి "పద" అన్నాడు

ఇద్దరూ రూం చేరుకున్నారు చూడగానే కిష్టయ్య భార్య ప్రకాశాన్ని పోల్చుకోలేకపోయింది. పోల్చుకున్న తర్వాత ఒకటే కబుర్లు చెప్పేసింది ప్రకాశం వాళ్ళత్త మళ్ళీ నెలతప్పిందట. తోడల్లుని కూతురుని పురుటికి తీసికొచ్చారు పెరట్లో చూడిగేదె ఏదో జబ్బుచేసి హఠాత్తుగా చచ్చిపోయేసరికి మేనమామ గేదె కోసం ఒకటే బెంగ పెట్టుకున్నాడట.

గేదెకోసమా డబ్బుకోసమా అనుకున్నాడు ప్రకాశం మనసులో. భార్యాభర్తలిద్దరూ ఒకటే వాగుడు. ప్రకాశం తల్లికి కూడా ఒంట్లో బాగులేదట – కీళ్ళనొప్పులబాధ ఈమధ్యనే ఎక్కువయిందట. యింటిచాకిరీ అంతా ఆవిడే ఈడ్చుకురావాలిట. కొడుకును ఒకసారి చూడాలని ఆవిడ తహతహలాడుతూందట. ప్రస్తుతానికి చాలా డబ్బు యిబ్బందిగా వుందని, ఈ నెల కేమీ పంపలేననీ మేనమామ ప్రకాశంతో చెప్పమన్నాడట. ఆ కబురందిస్తూ కిష్టయ్య ఇంకేదో అనబోతూంటే కిష్టయ్య భార్య అడ్డుకుని "ఆ! ఆయనవన్నీ టక్కరి వేషాలు లెండి. ఈ మధ్యనే గరువు పక్కన ఎకరం పొలం అమ్మేశాడుగదా! ఏం చేశాడా డబ్బు? ఆయన ధోరణే అంత, అందరినెత్తినా చెయ్యిపెడితేకాని గడవదు" అని వ్యాఖ్యానించి "ప్రకాశం గారూ! ఈ పూట ఇక్కడే భోంచెయ్యండి–చెయ్యకపోతే నామీద ఒట్టే" అని బలవంతం చేసింది.

దంపతు లిద్దరి ధోరణీ చూసి ప్రకాశానికి కడుపులో తిప్పినట్లయింది. తప్పనిసరిగా భోజనానికి కూర్చున్నాడు. వాళ్ళు ఏవేవో చెప్పుకుపోతున్నారు. అతని కవేవీ వినబడటంలేదు. గుండెల్లో రాయిపడింది.

ఈ నెల డబ్బు పంపకపోతే ఇంకొక పదిరోజుల్లో పరీక్షలు–అవతల కల్యాణి...మధ్యలో తల్లి స్థితి జ్ఞాపకం వచ్చి అతను మరీ బాధపడ్డాడు. ఏమిటో ఈ బతుకులు సగం నలిపేసిన

నల్లులు – అనుకున్నాడు భోజనం అయాక అతని గుండె మరీ బరువెక్కిపోయింది ఇంటికి పోదాం అంటే వాళ్ళు కదలనీయరు. వాళ్ళిద్దరూ చెప్పే ప్రతి విషయం అతనిని శూలంలా గుచ్చి బాధ పెడుతూంది ఇల్లు తల్లి. మామయ్య ఎకరాలు. డబ్బు. ఇవే అతని బుర్రలో గిరగిరా తిరిగాయి నాలుగు గంటలదాకా అక్కడే వుండిపోయి కిష్టయ్య పెళ్ళాం ఇచ్చిన నీళ్ళ కాఫీ తాగేసి రేపు మళ్ళీ కలుసుకుంటాను అని ఎలాగో బయటపడ్డాడు అక్కడినుంచి

# 6

మధ్యాహ్నం పదకొండు గంటలకు తృప్తిగా కారియర్ భోజనం చేసి పడుకున్న ఆనందరావు సాయంత్రం ఐదు గంటలకు బద్ధకంగా లేచాడు. మత్తుమందు తిన్నవాడిలా అలా గంటలకొలదీ నిద్రపోవడం అతని కలవాటే. వయస్సూ ఆరోగ్యం బాగున్న రోజుల్లో రెవిన్యూ డిపార్టుమెంటు. గుమాస్తా గిరీ చేసేటప్పుడూ ఆ తరువాత రకరకాల ఉద్యోగాలలో ఉన్నప్పుడు కూడా ఒక్కొక్కనాడు హాయిగా నిద్రపోయి ఆఫీసుకు కూడా వెళ్ళడం మానేసేవాడు నల్లమందు భాయీ అనే వా రతనిని చాలామంది ఆ అలవాటుకూడా కించిత్ మాత్రం ఉండేది కాని ఆ తరువాత అంతకన్న ఘాటైన నీటైన అలవాట్లు అలవర్చుకుని దానిని వదిలేశాడు. ఏదైతేనేం, బ్రహ్మాండం విరిగి మీదపడినపుడు కూడా అతను భయపడలేదు. గాభరా పడలేదు. దుఃఖపడడం అనేదసలతనికి తెలియనే తెలియదు. ఉద్యోగం ఊడిననాడు, లంచగొండి అని పోలీసులు పట్టుకున్ననాడు, భార్య పోయిననాడూ అతను నిబ్బరంగానే వున్నాడు. ఆనందరావు తనకే ఆపత్తువచ్చినా దానిని తప్పించుకునే ప్రయత్నం చేయడు. దాని నెదుర్కొనే అవసరం అతనికెన్నడూ వుండదు. ఏదో బైరాగి చిట్కా ఆలోచించి క్షణంలో తనే తప్పుకుంటాడా విపత్తులోంచి. తన నెత్తిమీద పిడుగు పడబోతూంటే చేతికందినవాడి నెవడినో తన స్థానంలో నిలబెట్టేసి మరి ఫికరు లేకుండా పారిపోగగల సమర్థుడతను. నిద్ర లేవగానే ఆనందరావు సూరమ్మ చేత టీనీళ్ళు పెట్టించి కప్పున్నర టీ తాగి వరుసగా రెండు లంకపొగాకు చుట్టలు కాల్చాడు. హాయిగా వేన్నీళ్ళ స్నానంచేసి సన్నని జరీ అంచు ధోవతీ, పాలపిట్ట రంగు పెద్దాపురం సిల్కులాల్చీ, వెడల్పంచు జరీ ఉత్తరీయం వేసుకుని వీధిలోకి బయలుదేరాడు. క్రిందటేడు ఎగ్జిబిషనులో కొన్న జయపురం చేతికర్ర విలాసంగా ఆడిస్తూ హుందాగా వీధిమెట్లు దిగుతూంటే ప్రకాశం ఎదురొచ్చాడు. "ఏమోయి" అన్నట్లు పలకరింపుగా చిరునవ్వొలికించాడు ప్రకాశం వైపు చూసి.

"ఎక్కడికో బయలుదేరినట్లున్నారు! ఇందిర యింటిలో ఉందా?" అప్రయత్నంగా అడిగాడు ప్రకాశం.

"లేదు. కృష్ణమూర్తితో కలిసి ఎక్కడికో వెళ్ళింది."

"కృష్ణమూర్తితోనా! ఎప్పుడు వెళ్ళింది? ఎక్కడికి వెళ్ళింది? ఎప్పుడొస్తుంది?" అంటూ గబగబా ప్రశ్నలు వేసేశాడు ప్రకాశం.

ఆనందరావు "వస్తుందిలే! అర్ధరాత్రయేలోపున రాకపోతుందా? నేనలా కాస్త తిరిగొస్తాను" అంటూ వీధిలోకి అడుగులు వేశాడు. నడవతలుపు చేరవేసి ప్రకాశం

తన గదిలోకి పోయి ఎవరిమీదో కోపం తెచ్చుకుని కూర్చున్నాడు. అతని కసలే తల దిమ్మెక్కిపోయింది కిష్టయ్య ఇంటినుంచి బయలుదేరి వస్తూంటే దారిలో ఎవరో క్లాసుమేటు కనిపించి వాళ్ళలాడ్జికి లాక్కెళ్ళాడు. అక్కడినుంచి తిరిగివస్తూ హోటలుకు వెళ్ళి కప్పుకాఫీ తాగి అలాఅలా తిరిగి వచ్చాడు ప్రకాశం. తన గదికి వచ్చి మంచంమీద మేను వాల్చేసరికి ఎక్కడలేని నీరసం వచ్చిందతనికి ఇంతగా జీవితం బరువెక్కిపోవటం అతని కిదివరలో అనుభవంలేదు యింటికి వచ్చేసరికి కాస్త గాలికబుర్లు చెప్పటానికైనా ఇందిర వుంటుందనుకున్నాడు. ఇందిర లేకపోవటం సరికదా కృష్ణమూర్తితో షికారు బయలుదేరిందనడం ప్రకాశానికి మరింత కోపం తెప్పించింది.

ఇందిర ఎక్కడికో వెళితే మధ్య తనకెందుకింత బాధ? ఇందిర మీద తనకేం హక్కుంది? ఈ స్థితిలో తనను కల్యాణి చూస్తే ఏమనుకుంటుంది? మళ్ళీ అతనికి కల్యాణి జ్ఞాపకం వచ్చింది వెంటనే మేనమామ గుర్తుకొచ్చాడు

ఛ! ఛ! ఏమిటిలా టైము వృధాచేయడం ఆదివారం అన్నమాటే కాని ఒక్క అక్షరం ముక్క చదువలేదు. రోజంతా గడిచిపోయింది అనుకుని లైటు వెలిగించి పుస్తకం తెరిచాడు నాలుగుపేజీలు తిరిగాయి కాని అందులో విషయంమాత్రం అతని మెదడు కెక్కలేదు పుస్తకం మూసేసి కాగితం కలంతీసి కల్యాణికి ఉత్తరం వ్రాయడానికి ప్రయత్నించాడు లాభం లేకపోయింది. మూడు కాగితాలు చింపేశాడు. కాని ఒక్కవాక్యం కుదరలేదు ఎందుకో అతనికి తెలియలేదు. మనస్సులో ఏదో చీదర, ఏదో నిస్సహాయత. గాలిలో కనబడని గడుసు దయ్యాలేవో తనను పీడిస్తున్నట్లు బాధపడ్డాడు. కల్యాణి ఉండివుంటే ఎంత బాగుండును! మళ్ళీ తనలో తనే నవ్వుకున్నాడు. ఆమె వుంటే ఈ బాధే లేకపోవునుగా! నిజమేనా! ఈ బాధంతా కల్యాణి కోసమేనా! అయితే ఇందిర యింట్లో లేదంటే తనకంత కోపం దేనికి! అది కోపం కాదు, ఈర్ష్య అనుకున్నాడు. మొదట్లో ఇందిరను చూసి భయపడ్డ తను ఇప్పుడిందిర కృష్ణమూర్తితో షికారు కెళ్ళిందంటే బాధపడుతున్నాడు. లేదులేదు. ఇందిరమీద తనకే వ్యామోహం లేదు. ఇప్పుడిందిర అంటే భయంకూడా లేదు. తన అనుబంధం కల్యాణితో...నిన్నరాత్రి అనుభవంతో ఇందిర అతనిని సానుభూతితో అర్థం చేసుకుంది అనుకున్నాడు. తాను తన బాధ కొంచెం మరిచిపోవడానికి ఇందిర ప్రయత్నించిందనుకున్నాడు. అంతా ఉత్తది. ఇందిర వట్టి స్వార్థపరురాలు. ఆమెతో యిక ప్రమేయం పెట్టుకోకూడదు ఏమిటి పిచ్చి ఆలోచనలు? ఎవరీ అమ్మాయిలంతా! తను వచ్చింది చదువుకోవడానికి. ఒక్కసారిగా అతని మనస్సులో పెద్ద పశ్చాత్తాపం కలిగింది. అంతటితో మనసులో ఏదో ప్రశాంతత ఏర్పడింది పరీక్షలు దగ్గర పడుతున్నాయి– శ్రద్ధగా చదవాలి – అనుకుని మళ్ళీ అఫ్తాల్మాలజీ పుస్తకం తెరిచాడు. ఇప్పుడతని మనసులో కల్యాణి లేదు ఇందిర లేదు. అల్పమైన కోరికలూ వ్యామోహాలూ ఏమీ లేవు. తల్లి జ్ఞాపకం వచ్చింది. ఏనాటికైనా ఆమెను సుఖపెట్టాలి. వీళ్ళంతా ఎవరు? అనుకుని తేలికైన హృదయంతో చదువు సాగించాడు.

టైము దగ్గర దగ్గర తొమ్మిదయింది. అంతవరకూ అతను చదువు దీక్షలోనే వున్నాడు యింతలో మేడమెట్లమీద అడుగుల చప్పుడు విని గుమ్మంవైపు చూశాడు.

ఇందిర లోపల ప్రవేశిస్తూ "హలో ప్రకాశం! ప్రొద్దుటినుండి ఫికరులేకుండా పోయావు. యిప్పటికా ఇంటికి వూడిపడ్డావు! బలేవాడివే" అంటూ అక్కడే జోడువిప్పి నేలమీద గట్టిగా కొట్టి గిరవాటేసి ప్రకాశం మంచంమీద కూర్చుంది ప్రకాశం ఆమె వైపు చురచురా చూసి ముఖం తిప్పేసుకున్నాడు ధ్యానముద్ర పోయింది. ఇందాకటి కోపం లోపలినుంచి ఒక్కసారిగా పెల్లుబికింది ఒక్కసారి ఆమె వైపు ఎగాదిగా చూశాడు. అరచేతిని తలగడాకానించి వయ్యారంగా తల భుజంమీదవాల్చి ప్రకాశాన్ని చూసీ చూడనట్లు పక్కచూపు చూస్తూ రీవిగా కూర్చుంది ఇందిర. లేత పసుపురంగు జార్జెటు చీర కాలి బొటనవేలుదాకా జీరాడుతూంది. ఆమె విలాసంగా కాలాడించి నప్పుడల్లా సన్నని చీరపొరల్లోనించి లోపలి పరికిణీమీద కుట్టుకున్న చెమికీ పువ్వులు నక్షత్రాల్లా మెరుస్తున్నాయి ముదురు కుంకంరంగు వెల్వెట్ చోళీ కడుపుమీద మడతలను దాచలేక ఒదిగిఒదిగి మీఁకిపోయింది. మెడచుట్టూ కుట్టుకున్న గుండ్రని అద్దాల బిళ్ళలు ఎదురుగా వున్న దీపకాంతికి ధగధగా మెరిసి ప్రకాశం కళ్ళజోడు మీద వెలుగులను ప్రసరించాయి మెడకు బిగించినట్టున్న నల్లపూసల ఫాన్సీ దండ ఒక వింత సోయగాన్నిస్తూంది. ఉదయంనుంచీ తిరిగిన అలసటను వ్యక్తంచేస్తూ ముఖమంతా చెమటపట్టి నుదుటిమీద పొట్టి పొట్టి తలవెండ్రుకలు వలయాలుగా అతుక్కున్నాయి ఒక్కసారిగా ప్రకాశం ముఖం తిప్పేసుకున్నాడు. అతని నరనరాల్లోనూ తళుక్కుమని మెరుపు మెరిసింది. ఇందిర మళ్ళీ ప్రశ్నించింది– "ఎక్కడి కుడాయించావు నువ్వు ప్రొద్దుటనుంచీ! చెప్పవయ్యా...నువ్వు, విక్రమార్కా!" అని.

ప్రకాశం ముఖం మరింత చిట్లించి "బాగుందివరస. నేనేం నీలాగ కృష్ణమూర్తిని తీసికుని షికార్లకీ విహారాలకీ వెళ్ళలేదు. పగలల్లా ఆసుపత్రిలో సతమతమయి సాయంత్రం యింటికి చేరుకున్నాను" అని విసిరాడు ఇందిర దిగ్గున ముందుకు వంగి "ఓహో! అందుకా ఆయనగారి అలక! ఏం చెయ్యను! నేను నిద్ర లేచేసరికి నువ్వు వెళ్ళిపోయావు తరువాత కృష్ణమూర్తి వచ్చి ప్రాణం కొరికేశాడు. నానా అవస్థా పడ్డాననుకో! మధ్యన నాన్న ఒకడు. వెలుదూ కాస్త కాలక్షేపం అయినా అవుతుంది అంటాడు. పోనీలే దానికేంగాని పద భోజనం చేద్దాం!" అని అతని భుజంమీద చేతులు వేసి లేవనెత్తింది. ప్రకాశం నివారించలేదు "ముందు మీరిద్దరూ తినండి, నేను తర్వాత వస్తాను. చదువుకోవాలి" అన్నాడు లేచి నిల్చుంటూనే. "చదువుదువుగాని లేవోయి–అవుదువు గానిలే డాక్టరువి తొందర దేనికి? నిదానం ప్రధానం అన్నారు పెద్దలు" అంటూ చేయి పట్టుకుని లాక్కెళ్ళింది. ఇష్టం లేకుండానే ప్రకాశం ఆమె ననుసరించాడు భోజనాల దగ్గర ప్రకాశం పక్కనే కంచం వేసికొని కూర్చుని "మరికొంచెం నెయ్యి వేసుకో–కూర బాగుంది రుచి చూడు" అంటూ ఆప్యాయం ఒలకబోసింది.

భోజన మవగానే ఇట్టే వెళ్ళి పావుగంటలో డ్రెస్ మార్చుకొని మరొక వేషంలో వచ్చింది ఇందిర. "అంత చీదరగా ఉన్నావేమిటి? డ్రెస్ మార్చుకో, అలా తిరిగి వద్దాం" అంటూ గొడవ చేసింది. ఇష్టం లేకుండానే ఆమె చెప్పినట్లల్లా చేశాడు ప్రకాశం సినిమాకు తీసుకువెళితే వెళ్ళాడు. దారి పొడుగునా ఏవేవో కబుర్లు చెప్పింది ఇందిర. హాల్లో కూర్చున్నంతసేపూ కృష్ణమూర్తిని వేళాకోళం చేసింది. తిరిగి యింటికి వచ్చేస్తూంటే ప్రకాశానికి హఠాత్తుగా కల్యాణి జ్ఞాపకం వచ్చింది "పాపం,

కల్యాణి నాన్నకెలా వుందో? అన్నాడు పైకి. ఇందిర మాటడలేదు. పక్కనే నడుస్తున్న ఆమెను ఒక్కసారిగా ఓరగా చూసి ప్రకాశం నిట్టూర్చాడు. ఏమిటీ వింతమనిషి? హాస్టల్లో బాధ పడుతున్న కల్యాణిని చూసి చాతనైన చాకిరీ చేసింది. ఇప్పుడదే స్నేహితురాలికి పుట్టెడు కష్టం వస్తే చీమ కుట్టినట్లయినా లేదేం ఈ పిల్లకి - అనుకున్నాడు.

ఇందిర "ఏమిటాలోచిస్తున్నావు ప్రకాశం?" అంది

"ఏమీ లేదు, కల్యాణి గురించి."

"అయ్యో రామా! కల్యాణి జపం తప్పితే ఇంకోపని లేదా యేం నీకు!"

"అదికాదు ఇందిరా! పాపం, చూడు ఎంత కష్టంలో ఉందో!"

"ఉంది బాబూ ఉంది, లేదనా! కాని ఒక్కటి ఆలోచించు. కష్టంలో లేనివాళ్ళెవరు! ఆ మాటకొస్తే నువ్వు మటుకు సుఖంతో ఊగిపోతున్నావా! నా సంగతీ ఒక్కసారి ఆలోచించు. అందరం ఒక్కలాంటి వాళ్ళమే–అడుగులేని పడవలం. ఏదో అలా ప్రవాహంలో పడి కొట్టుకుపోతున్నాం వెనక్కు తిరిగి చూసుకుంటే భయం కాని, చిత్రమెక్కడంటే ఈ లోకంలో కల్యాణిలాంటి వాళ్ళకే ఎక్కడ లేని జాలి దొరుకుతుంది."

"అదేమిటి ఇందిరా! అలా అంటావు?"

"అనకపోతే ఏమిటి ప్రకాశం? అస్తమానూ కల్యాణీ కల్యాణీ అంటావు కాని ఆలోచించు, అంతకంటే ఎక్కువ బరువు ఈడ్చుకొస్తున్నాను నేను. కల్యాణికి ఎలాగో అలాగా చదువు సాగుతూంది నాకదీ లేదు మధ్యలో ఆగిపోయి ఉద్యోగంలో తల దూర్చవలసి వచ్చింది. నాన్న సంగతి సరేసరి నీకు తెలుసు కానీ వీటన్నిటినీ తల్చుకుని గడియ గడియకీ కాళ్ళు చాపి కూర్చుని ఏడవడం నాకు చాతకాదు. ఆ పని ఆమెకు చాతనవును ఉంటారులే లోకంలో కొందరు నంగనాచులు విశాలమైన కళ్ళు తిప్పి వలవలా ఏడ్చేస్తే నీలాంటి జాలిగుండె మగవాళ్ళు ఆదుకుంటారు. నాలాంటి వాళ్ళను చూస్తే మాత్రం నీకు భయం" అనేసి హఠాత్తుగా ఆగిపోయింది ఇందిర.

"నీ సంగతి వేరు ఇందిరా! జీవితాన్ని ఎదుర్కొనే ధైర్యం ఉంది నీకు నీ దారికి ఏ విధంగానూ అడ్డుపడని నాన్న వున్నాడు. స్వశక్తిమీద ఆధారపడి బతుకుతున్నావు నీకూ ఆమెకీ తేడా లేదూ!"

"వుంది, తేడా ఎందుకు లేదూ? ఆమె నంగనాచితనం నా దగ్గర లేదు ఆమెలా జాలిగా కళ్ళు తిప్పడం నాకు చాతకాదు, అంత బరువుతోనూ ఇంకొకరిమీద ఒరిగిపోయి కాలక్షేపం చేద్దామనే దురాశ అంతకన్నా లేదు. నేను బలపడి ఇంకొకరికి బలమివ్వాలనే తత్వం నాది" అంది ఇందిర కాస్త ఉద్వేగంతో.

ప్రకాశం ఏమీ జవాబు చెప్పలేకపోయాడు. ఆ తరువాత మౌనంగానే యిద్దరూ యిల్లు చేరుకున్నారు చాలాసేపు తలుపు కొట్టాక గాని ఆనందరావుకు మెలకువ రాలేదు–తలుపు తీసినప్పుడయినా అతనికి మెలకువ వచ్చిందో లేదో ప్రకాశానికి అర్థం కాలేదు. ఏదో ఇంకో లోకంలో మనిషిలా కనబడి స్లోమోషను సినిమాలోలాగ తలుపు తీసి మళ్ళా గదిలోకి వెళ్ళి పడుకున్నాడు. ఆనందరావు అదృష్టవంతుడు అనుకున్నాడు ప్రకాశం. జీవిత సమస్యల్ని దులిపేసుకుని ఏ క్షణానికా క్షణం సుఖంగా

బ్రతికేయడం అతనిలోని ప్రత్యేకత అనుకున్నాడు. అస్పష్టమైన అలాంటి ఆలోచనల తోనే మెల్లెక్కి గదిలోకి వెళ్ళి మంచంమీదనున్న పరుపు చుట్టకు చేరబడ్డాడు బాగా అలిసిపోయింది శరీరం—నెమ్మదిగా జోళ్ళువిప్పి మంచం క్రిందకు తోసేసి అలాగే పరుపుచుట్టకు చేరబడిపోయాడు

కళ్ళు వాటంతటవే మూసుకుపోయాయి నిద్ర ముంచుకువస్తూంది కాని నిద్ర రానివ్వకుండా బుర్రనిండా ఏవేవో ఆలోచనలు, తలుపుదగ్గర సంఘర్షణ – తలుపు కవతల నిద్రవెల్లువ – ఇవతల ఏవేవో భావాల కోలాహలం. చిన్న కునుకు పట్టింది ప్రకాశానికి. అందులోనే ఏవో కలలు—కాని తాను కలలుకంటున్నాననే చైతన్యం తొలగిపోలేదు. దూరాన పల్లెటూరిలో కల్యాణి గుమ్మంమీద తలపెట్టుకొని ఏడుస్తూంది ఎందుకేడుస్తూంది చెప్మా! మరిచిపోయాడు తను; కలలో చిరాకేసిందతనికి – ఏడవక, ఏడుపంటే నా కసహ్యం అని కోప్పడ్డాడు కల్యాణిని. ఆమె తన వైపొకసారి బెంబేలుగా చూసి బావురుమని ఏడ్చింది అతనికి మరింత చిరాకేసింది ఎక్కడికో నడిచిపోతున్నాడు. రెండుకొండలమధ్య ఎత్తయిన ఘాటీరోడ్డుమీద అలా నడుచుకు పోతున్నాడు తను; కల్యాణి ఏడుపు అతనిని వెంట తరుముతూ వస్తూంది. నడకవేగం హెచ్చించాడు – ఏడుపు అతనిని వెంట తరుముతూ వస్తూంది నడకవేగం హెచ్చించాడు – ఏడుపు ఈలపాటగా మారింది బాగుంది అనుకున్నాడు సన్నని ఈలపాట గాలిలో ఎక్కడినుంచో తేలివస్తోంది నడచినడచి అలసిపోయాడు ప్రకాశం రోడ్డుప్రక్క బండరాయి నానుకుని చతికిలబడ్డాడు. ఇదేమిటి! ఇంత మెత్తగా ఉందేమిటి రాయి! మెత్తటి రాళ్ళుంటాయా ఎక్కడైనా!

ఎవరో భుజంపట్టి కుదిపేస్తున్నారు. మెలకువ వచ్చింది ప్రకాశానికి. ఎదురుగుండా నవ్వుతూ ఇందిర. గదిచుట్టూ కలయచూశాడు. అమ్మయ్యా! అనుకున్నాడు. తానున్నది రోడ్డుమీద కాదు, గదిలో–

"అదేమిటి ప్రకాశం! పరుపు పరుచుకోకుండా అలానే పడుకున్నావు" అంటూ కుర్చీ మంచానికి దగ్గరగా లాక్కుని కూర్చుంది ఇందిర

"ఎవరేనా వచ్చారా ఇందిరా?"

"ఎవరూ రాలేదే! ఈ అర్ధరాత్రి ఎవరు వస్తారు – ఎందుకలా అడుగుతున్నావు?"

"ఊ! ఏమీలేదు.. ఎవరో వచ్చినట్లయితేనూ" అంటూ బద్ధకంగా యిటునుండి అటు ఒత్తిగిలబోయాడు ప్రకాశం.

"ఒళ్ళు నొప్పులు చేస్తుంది.. ఏమిటా పడక–లే! పక్క వేస్తాను" అంటూనే అతనిని భుజం పట్టుకుని లేపటానికి ప్రయత్నించింది ప్రకాశం లేచి నాలుగడుగులు ముందుకు వేసి కుర్చీలో చేరగిలబడ్డాడు ఇందిర పరుపువిప్పి దుప్పటిని దులిపి దానిని అటూ ఇటూ చూసి "అబ్బే! ఇది బాగా మాసిపోయింది పెట్టె తాళం ఇలా ఇయ్యి ప్రకాశం! మరొకటి తీసివేస్తాను" అన్నది. "అబ్బ! ఈ అర్ధరాత్రి ఈ గొడవంతా దేనికి ఇందిరా! ఏదో ఒకటి వేద్దూ!" అని, "ఇంతకూ పెట్టెలో మరొకటి లేదు" అన్నాడు. "అయితే ఉండు, క్షణంలో వస్తాను" అంటూ మెట్లు దిగి క్రిందకు పారిపోయింది ఇందిర. "ఎక్కడి కిందిరా!" అని ఏదో గొణిగాడు కాని ప్రకాశం, ఇందిర తిరిగి మేడమీదకొచ్చే లోపల మళ్ళీ చిన్న మగతలో పడ్డాడు.

కల్యాణికి వాళ్ళ నాన్నకు జబ్బుగా ఉందని ఉత్తరం వచ్చినది మొదలు ఇప్పటిదాకా ప్రకాశం ఏదో తీవ్రమైన సంచలనంలో కొట్టుకుపోతున్నాడు కల్యాణి వెళ్ళిపోవడంతో ఏదో తనది అనుకున్నది చేజారి పోయినట్లయింది తనకేదో కావాలి! అది కల్యాణిలో కనిపించింది. ఇప్పుడు తనపక్కన కల్యాణి లేదు. ఐనా తనకేదో కావాలి.

తీయని కంఠం – మగత నిద్రలో తీయనిపాట– ఆ పాటలో మల్లెల వాసనలు; అదే! కన్నీళ్ళలా వున్నాయి! ఎందుకింత దుఃఖం! కల్యాణికి కాదు .కాదు .తనకే బరువుగా కనురెప్ప లెత్తాడు ప్రకాశం ఇందిర తెల్లని మల్లుదుప్పటి పక్కమీదపరిచి చిలిపిగా ప్రకాశం ముఖంమీదకు నీళ్ళుజల్లి "లే ప్రకాశం! ఏమిటింత మత్తుగా ఉన్నా వివాళ" అంటూంది ప్రకాశం లేచి కళ్ళు నులుముకుని ముఖంమీద చిందిన నీళ్ళన్నీ తుడుచుకుని పక్కమీదకు జరగబోయి మళ్ళీ ఏదో గుర్తు వచ్చినవాడిలా అటూయిటూ చూశాడు.

"మంచినీళ్ళు కావాలా?" అంది ఇందిర.

"ఊ!" అన్నాడు

ఇందిర తెచ్చియిచ్చిన నీళ్ళు గడగడ తాగేసి పక్కమీద పడుకున్నాడు ప్రకాశం అప్పటికి అతడింతవరకూ ఉన్న అవస్థలో నుండి కొంచెం తేరుకుని ఇందిరవంక కళ్ళు పెద్దవి చేసి చూశాడు. అంతగా అవయవ సౌష్ఠవాన్ని కప్పిపుచ్చలేని అతిపల్చని తెల్లని సిల్కుచీర, శరీరపు వంపులను మరింత స్పష్టంచేసేలాంటి బిగువైన నల్లని క్రేపుచోళీ ఇందిరతో పాటు ప్రకాశాన్ని పలుకరించాయి. వదులుగా వేసిన వాలుజడలో పెట్టుకున్న కనకాంబరం చెండు మరింత అందంగా కన్పిస్తూంది ఎర్రని పూలమధ్య ఆకుపచ్చని దవనం మత్తుగా వున్న ప్రకాశానికి మరింత మత్తెక్కించే వాసనలను వెదజల్లుతూంది, కుర్చీ అంచున కూర్చుని మోచేతిని మంచంమీద ఆనించి ప్రకాశం చూపులో చూపుకలిపి, అతని కళ్ళలోకి రెప్పలు వాల్చకుండా చూస్తూ "ప్రకాశం! యెందుకలా వున్నావు యేదో బాధపడుతున్నట్లున్నావు, నాకు చెప్పరాదూ?" అంటూనే అతనిచేతిని తనచేతిలోకి తీసుకుని మృదువుగా నిమిరింది. ప్రకాశానికి వెంటనే ఏమనాలో తోచలేదు ఒక్కక్షణం ఊరుకుని "అబ్బా! అబ్బా!" అన్నాడు తలనటూ యిటూ ఆడించి.

"తల నొప్పిగా ఉందా?" అని ఇందిర తన చేతిని అతని నుదుటి మీద వేసింది అంతే! అతని నరనరాల్లోకి ఏదో ప్రవహించినట్లయింది. స్విచ్ వేసిన తరువాత ఎలక్ట్రిక్ తీగలోలా – నిస్త్రాణంగా వున్న శరీరంలోకి కొత్త రక్తం ప్రవహించింది ఏదో లేని బలం వచ్చిందతనికి ఆ రక్తపుపోటు, ఆ కొత్తబలం ఇందిరను దగ్గరగా లాక్కున్నాయి. కుర్చీ అంచుమీద నుంచి ఇందిర అతని ఒడి నానుకుని ప్రక్కమీద కూర్చుంది అతను తన రెండు చేతులనూ ఆమె నడుంచుట్టూ పెనవేసి "ఇందిరా! అన్నివిధాలా ఏకాకిని, నన్ను విడిచిపెట్టకు" అన్నాడు ఆమె లాలనగా అతని జుట్టులోనికి తన వేళ్ళను పోనిచ్చి నిమురుతూ "అదేమిటి ప్రకాశం, అలా అంటావు...నేనెక్కడకు పోతాను. నువ్వు నావాడివి" అంది

ప్రకాశం హృదయంలో చీకటి కోణాలన్నిటిలో ఒక్కసారి దీపాలు వెలిగినట్లయింది. "నీకేం కావాలి కోరుకో" అని ప్రత్యక్షమైన పార్వతీ దేవిలా కన్పించిందతని కిందిర.

ఆమె రెండు చేతులనూ తన ముఖంమీద కప్పుకుని "అవును ఇందిరా, నేను నీవాడిని" అన్నాడు.

ఆమె మరింత అతనిమీదకు వంగి "ఏమిటి ప్రకాశం—యెందుకంత భయపడి పోతావు...దేనికి దిగులు" అంటూ అతని ముఖంలో ముఖం పెట్టి "చూడు—ఇది కాదు బతికే విధానం. యింతకన్న బాగా బతకాలి" అంది.

ప్రకాశానికి బతుకులోని బాగేమిటో యిప్పు డర్థమైనట్లయింది. ఇందిర చెప్పింది నిజం అన్నదతనిలోని ప్రత్యణువూ. ..అసహాయత, పిరికితనం, అణచివేసిన ఆశలేవేవో ఒక్కసారి తలెత్తాయి....అతనిలోని మానవీయత కట్టడుగున దాగివున్న బలమైన కోర్కెలన్నీ బయటపడినాయి.

అతని కళ్ళల్లో ఎరుపుదనం చూసింది ఇందిర. అతని నుదుటిమీద నున్న చేతిని తీసి మెల్లగా టేబిలువైపు పోనిచ్చి స్విచ్ నొక్కింది. టేబిలులైట్ ఆరిపోయింది. అప్పటికప్పుడే సగంరాత్రి గడిచిపోయింది. హేమంతపు చలివెన్నెల కిటికీలోంచి అస్పష్టంగా లోపల పడుతూంది. ఆ గ్రుడ్డి వెలుతురులో తెల్లనిచీరలోని ఇందిర, నల్లని రవికలోని ఆమె వయస్సు మరింత స్పష్టంగా కనిపించాయి ప్రకాశానికి. అత డిందిరను మరింత దగ్గరగా తీసుకున్నాడు ఆమె "ఏమిటి ప్రకాశం!" అంటూనే మరింత ఒదిగింది.

పని మనిషి వచ్చి వీధి తలుపు తట్టినపుడు ఇందిర మేడదిగి వెళ్ళింది. ప్రకాశం కాళ్ళదగ్గర దుప్పటిని మీదకు లాగుకుని గోడవైపు తిరిగి పడుకున్నాడు అత డలసిపోయాడు. తెల్లవారుఝామువేళ కిటికీలోంచి చలిగాలి బాగా వీస్తూంది. అతనికి హాయిగానే వున్నట్లనిపించింది. అంతలోనే కల; కలలో కల్యాణి – ఆమె ఏదో అనబోయి ఆగిపోయింది; ఇందిర పూర్తిచేసింది. ఇందిరా తానూ కలిసి ఎక్కడికో వెళుతున్నారు. దూరాన్నుంచి కల్యాణి "ప్రకాశం, ప్రకాశం" అని అరుస్తూ పరుగెత్తి రాబోయి పడిపోయింది...ప్రకాశం ఒకసారి వెనక్కి తిరిగి చూశాడు. కాని అతనికి చిరాకేసింది. మళ్ళీ ముందుకు నడిచేడు...అతనికి బాగా నిద్రపట్టింది. ఆ నిద్రలోనే మెలకువ. మెలకువలో ఏదో హాయి...అంతలోనే బాధ...ఏవో గుచ్చుకుంటున్నాయి. ముళ్ళు! ముళ్ళు! దారంతా ముళ్ళు. ముళ్ళు కూడా ఇంత హాయిగా గుచ్చుకుంటున్నాయేమిటి! కళ్ళల్లో ఇంత కాంతి ఎక్కడిది? చల్లని గాలుల మధ్య వెచ్చని కిరణాలు కాబోలు!

ప్రకాశం కళ్ళు విప్పి చూశాడు. టైమెంతయిందో కాని ముఖం మీద యెండ బాగా పడుతూంది. ప్రక్కనిండా వాడిన కనకాంబరాలు మృదువుగా గుచ్చుకుంటున్నాయి.

మెయిలు రావడానికి అరగంట టైముంది. ప్లాటుఫారమ్ చివర పెట్టె, బెడ్డింగు పెట్టుకుని కూర్చుంది కల్యాణి తుని స్టేషనుదాకా సాగనంపి, రైలు ఎక్కించడానికి వచ్చిన ఇద్దరు పెద్దమనుషులు ఆమె ఎదురుగా కూర్చున్నారు. మిట్టమధ్యాహ్నం. ఎండ తీవ్రంగా వున్నా, డిసెంబరు మాసపు శీతలత్వం గాలిలో ఉంది. ప్లాటుఫారమ్ మీద జనం కోలాహలంగా అటూ యిటూ తిరుగుతున్నారు, కల్యాణి దృష్టి యిటెటూ లేదు. తూరాన కొండవేపు చూస్తోంది.

ఎదురుగా చతికిలబడ్డ మునసబు చుట్టపొగ వదులుతూ, "వెయిటింగ్ రూమ్‌లో కూర్చో అంటే విన్నావు కాదమ్మా! ఆ దిక్కుమాలిన బండి ఇంకా అరగంటదాకా రాదు, ఎండ మాడిపోతోంది!" అన్నాడు.

రెండో పెద్దమనిషి అచార్లు వాళ్ళ గ్రామంలో ఆయుర్వేద వైద్యుడు. "అదేమిటి బావా! వెయిటింగ్ రూమ్ అంటావు అసలీ ప్రయాణం మానుకో తల్లీ అంటే విందా? పుట్టెడు దుఃఖంలో వున్న ఆడకూతురు పట్నం వెళ్ళి ఏం చేస్తుంది?" అన్నాడు.

మునసబు కల్యాణి నుద్దేశించి, "ఏం కల్యాణమ్మా! వినవా మా మాట?" అన్నాడు, కొంచెం జంకుతూనే. తన కళ్ళెదుట పుట్టి పెరిగిన పిల్ల. బాబయ్యగారూ అంటూ చనువుగా మసలిన తన గడ్డమీద పిల్ల. యిప్పుడెక్కడికో దూరంగా అన్ని బంధాలూ తెంచుకుని వెళ్ళిపోతోంది. ఆ పిల్లమీద తన కంత అభిమానమున్నదని మొన్నమొన్నటిదాకా మునసబు తెలుసుకోలేకపోయాడు. అరవయ్యోపడిదాటిన మునసబు తన కళ్ళముందు చాలా విషాదాల్ని చూశాడు. ఎన్నెన్నో ఏడుపులు విన్నాడు. మానవుడికి రాగల దుఃఖాలు అతనికి కొత్తగాదు. కాని– దిక్కులేని యీ కల్యాణి అతనిలో జాలితోపాటు ఆశ్చర్యాన్ని కలిగించింది. ఈ అమ్మాయి ఏడవదేం? తను చూశాడుగదూ, తండ్రికి జబ్బుగా వుందని వచ్చిననాటినుండీ అహర్నిశలూ తండ్రి మంచందగ్గరేవుండి సేవచేసింది; అలా గుడ్లనీరు పెట్టుకుంటూనే ఉంది. ఆ యిల్లూ, రోగి మంచం, వాళ్ళ నిస్సహాయతా–అవన్నీ చూసిన ప్రతివాళ్ళకూ కంటనీరు వచ్చింది. అంతే, రెండో రోజు రాత్రి అంతా ఐపోయింది. తెల్లవారు జాము రెండు గంటలయుంటుందప్పుడు. తండ్రి కడసారి కన్నుమూసినప్పుడు కల్యాణి పక్కనే ఉంది. అంతే, ఆ క్షణంనుండీ యీ పిల్లలో ఏదో మార్పు వచ్చింది. ఆ క్షణం నుండీ కన్నీళ్ళు లేనేలేవు యీామె కళ్ళలో ఏడవదేం? ముందు సంగతి ఏమిటని భయపడదేం?–మునసబుకి ఏమీ అర్థం కాలేదు

"ఏం కల్యాణమ్మా? వినవా మా మాట?" మళ్ళీ అడిగాడు మునసబు బెడ్డింగుమీద అచేతనంగా కూర్చున్న కల్యాణి మునసబు వేపు చూసింది. తెల్లని చీర కట్టుకున్న ఆమె మొఖంలో దైన్యంగాని, విషాదం గాని కనబడడంలేదు. "ఎందుకు వినను బాబయ్యగారూ! ఈ ప్రపంచంలో నాకింక మిగిలింది మీ యిద్దరే. కన్న కూతురుకంటె ఎక్కువగా ఆదుకొన్నారు ఎన్నటికీ మీ ఋణం తీర్చుకోలేను."

"ఐతే వెళ్ళిపోవాలనే పట్టుదల దేనికి?" అన్నాడు ఆచార్లు.

"వెళ్ళిపోక చేసేదేముంది బాబాయిగారూ! ఈ గడ్డకీ నాకూ ఋణం తీరిపోయింది."

"అదేంమాట కల్యాణమ్మా! మేమందరం ఏమైపోయాం? దేవుడు చిన్నచూపు చూశాడు. దాంతో ఆ అమాయకుడు మనకు దక్కకుండా పోయాడు, అంతమాత్రానికే మేం నిన్ను అర్థాంతరంగా వదిలేస్తామా? ఈ ఏడాది చదువు ఎలాగూ పోయింది ఈ స్థితిలో నువ్వు వెళ్ళినా ఏం చదవ గలవు గనక? నా మాట విను కల్యాణమ్మా! వెనక్కి రా పోదాం. కొన్నాళ్ళపాటు మా యింట్లో వుండు, నేనొకటీ మీ నాన్నొకటీ

అనుకోకు. అన్నదమ్ముల్లా మెసలేవాళ్ళం యిద్దరం. నీకేమైనా పట్టింపులుంటే పోనీ ఆచార్లుగారింట్లో–"

"ఎంతమాట బాబయ్య గారూ! నాకు అలాంటివి పుట్టుకనుండీ తెలియవు. నాన్న నేర్పలేదు. మీరు కూడా నేర్పలేదు."

"అలా అన్నదానివి ఉండిపోరాదా?" అన్నాడు మునసబు ఆప్యాయంగా. కల్యాణి వెంటనే జవాబు చెప్పలేదు. కొద్ది క్షణాలు ఆగి, "అలాగే ఉండిపోదును బాబయ్యగారూ! కాని చదువన్నది ఒకటి వుందిగదా! నాన్న కష్టపడి యింతవరకూ ఎలాగో చెప్పించాడు. ఎంత బాధపడి నాకు డబ్బు పంపించాడో మీకు తెలియనిదికాదు. ఇప్పుడు మానేస్తే అదంతా వృధా. అదీకాక, కష్టపడి ఓ డిగ్రీ అంటూ సంపాదించితే, నా పొట్ట నేను పోషించుకోగలను–" ఆగిపోయింది.

"అవును బావా! అదీ నిజమే, అందుకే నేనూ గట్టిగా చెప్పలేకపోతున్నాను" అన్నాడు ఆచార్లు.

మునసబు చుట్టపారేస్తూ, "పోనీలే కల్యాణమ్మా, ఆ చదువేదో చదివేసేయ్. డబ్బుకి నువ్వేం భయపడబోకు–ఇల్లు బేరం పెట్టాం గదూ! బాకీలు పోగా ఏమీ మిగలదనుకో. ఐనా – నేనున్నాను, నువ్వేం కంగారు పడకు, సర్దుతాను! కష్టపడి బి.యే ప్యాసవు" అన్నాడు.

"బి.యే.కాదు బావా, అదేదో ఆనర్సుట" సరిదిద్దాడాచార్లు.

"నువ్వొక్కడివీ–ఏదైతే అదే లెద్దూ!" అని నవ్వేశాడు మునసబు. "అది సరేగాని కల్యాణమ్మా! సెలవలకి మాత్రం యిక్కడకే వచ్చేయ్ మా లోగిలే నీకు పుట్టిల్లు, తెలుసా?" అన్నాడు కల్యాణి నుద్దేశించి.

"తప్పకుండా బాబయ్యగారూ!" అంది కల్యాణి. ఇంతలో రైలుకి గంట కొట్టారు. మునసబు చొక్కా లోపలి జేబులోంచి ఓ పొట్లాం తీసి అందులోంచి నోట్లు తీసి జాగ్రత్తగా లెక్కపెట్టి ఆమెకి అందిస్తూ, "ఇదిగో కల్యాణమ్మా! ఈ వందా ఖర్చుకి ఉంచుకో. తరువాత లెక్కలు చూసుకుందాంలే, దేనికీ యిబ్బంది పడకు, ఎంత కావాలో మొహమాట పడకుండా ఉత్తరం రాస్తూండు, పంపిస్తాను" అన్నాడు

ఆమె కళ్ళలో నీళ్ళు తిరిగినట్లే తిరిగి క్షణంలో మళ్ళీ అదృశ్యమైనాయి. మునసబు వేపు ఒక్కసారామె నిర్జీవంగా చూసి, డబ్బు తీసుకుని హ్యాండ్ బాగ్ లో పెట్టుకుంది

ఇంతలో రైలు వచ్చి ప్లాట్ ఫారమ్ మీద ఆగింది. ఆగీ ఆగడంతో కాఫీ టీ వాళ్ళ గోల ఎక్కువయింది. దిగేవాళ్ళు హడావుడిగా దిగుతున్నారు ఎక్కేవాళ్ళు ఏ పెట్టె ఖాళీగా వుందోనని పరుగెత్తి చూసుకుంటున్నారు. ఇంజను గట్టిగా అరిచి నీళ్ళు తాగడానికి ముందుకు వెళ్ళిపోయింది. అంతమంది జనాన్ని మోసుకుపోయే రైలుబండి గుండె ఆగిపోయిన మనిషిలా నిస్సహాయంగా నిలిచిపోయింది. మునసబూ ఆచార్లు కంగారుగా ఆడవాళ్ళ కంపార్టుమెంటు దగ్గరకి కూలివాణ్ణి తీసుకుని వెళ్ళారు పెట్టెదగ్గర అంతగా రద్దీగాలేదు. కల్యాణి సామాను లోపల జాగ్రత్తగా పేర్పించేసి కూలివాడికి డబ్బులిచ్చి పంపించేశాడు మునసబు. ఇంతలో కల్యాణి వచ్చి అక్కడే నిలబడిపోయింది. "ఎక్కేసేయ్ కల్యాణమ్మా–అనక చోటుండదు" అన్నాడు మునసబు

"మరేం ఫరవాలేదు బాబాయిగారూ! చోటులేకపోతే నించుంటాను. నాకు యీ ప్రపంచంలోనే చోటు లేదు. రైలులో దొరకలేదనే బెంగదేనికి?" అంది కల్యాణి.

"అదిగో అలాంటి మాటలే అనొద్దన్నాను కల్యాణమ్మా! ఈ రామినాయుడు చచ్చిపోయాడనేనా నీ ఉద్దేశం?" అన్నాడు మునసబు బాధగా

"హరిహరీ! అలాంటిమాటలు అనొద్దు బాబయ్యగారూ!" అంది కల్యాణి.

"ఐతే యింకెప్పుడూ అలా అనకు."

"అనను బాబయ్యగారూ, అనను."

ముగ్గురూ అలా మౌనంగా నిలబడిపోయారు. ఆచార్లు ఇంతలో అలా వెళ్ళి ఓ అరడజను బత్తాయిపళ్ళు తెచ్చి కంపార్టుమెంటులో కల్యాణి బెడ్డింగుమీద పెట్టాడు. ఆమె గమనించింది గాని ఏమీ మాటాడలేదు.

రైలు కదిలే టైమైంది. అంతవరకూ పరధ్యానంగా నిలుచున్న మునసబు ఒక్కసారిగా ఉలిక్కిపడినట్లు, "ఇంక మరి వెళ్ళిరామా అమ్మాయి! క్షేమంగా వెళ్ళి, వెళ్ళగానే ఉత్తరం రాయి! జాగ్రత్త. ఇబ్బంది పడకు.." అంటూ ఆగిపోయాడు. ఉత్తరీయంతో కళ్ళు తుడుచుకున్నాడు అరవైయేళ్ళవృద్ధుడు. అదే కళ్ళతో కనీసం అరవై చావుల్నీ అంతకు మించిన దుఃఖాలనూ చూసినవాడు. ఐనా కష్టానికి చెమ్మగిల్లే అలవాటు ఆ కళ్ళకింకాపోలేదు. అంతలో ఏదో అర్జంటు పని ఉన్నవాడిలాగా ఆ వృద్ధుడు, "సరేనమ్మాయి, వస్తామరి. రా ఆచార్లూ!" అనేసి, తిరిగి చూడకుండా గబగబా నడిచి వెళ్ళిపోయాడు. ఆచార్లు మాత్రం బండి కదిలేదాకా అక్కడే నిలబడ్డాడు.

రైలు కదిలింది. కల్యాణి పెట్టెలోకి వెళ్ళి కూర్చుంది. కిటికీలోంచి తల పెట్టి పరిగెత్తే దృశ్యాలను చూస్తున్న కల్యాణి తొడమీద చల్లనిచెయ్యి తగిలింది ఉలిక్కిపడి యిటు తిరిగింది ఆమె. తన యెదురుగా కూర్చున్న యువతి చెయ్యి తన తొడమీద వేసింది వసుంధర!

"ఏం వసుంధరా? ఎక్కడనుండి రావడం?" అంది కల్యాణి నిర్జీవంగా అప్పటికి వసుంధరకి ఏదో తట్టింది. వెంటనే చెయ్యి తీసేసుకుని "ఏం కల్యాణీ! నేనా? నేను రాజమండ్రీనుండి వస్తున్నాను. మా అక్కయ్యకు సుస్తీగా ఉందంటే చూడడానికి వెళ్ళాను. సరే; నువ్వా? వాల్తేరేనా రావడం?" అంది.

"ప్రస్తుతానికి" అని ముక్తసరిగా జవాబు చెప్పింది కల్యాణి.

"మీ నాన్నగారికి జబ్బుగా ఉందని కాలేజీలో విన్నాను. కులాసాగా ఉందా?" అంది మళ్ళీ వసుంధర.

కల్యాణి క్షణం ఆగి, "నాన్నగారు పోయారు. పదిహేను రోజులైంది" అంది కిటికీవేపు తిరిగి.

"హరిహరీ! ఎంతపని జరిగింది! నాకు తెలియనే లేదు కల్యాణీ!" అంటూ ఓదార్పుగా అంది వసుంధర.

అంతే. ఆ తరువాత చాలాసేపు యిద్దరూ మాటాడలేదు. రైలు జోరుగా పరిగెడుతోంది. అంతకంటే జోరుగా యిరువురి బుర్రల్లోనూ భావాలేవేవో కోలాహలం చేస్తున్నాయి. కల్యాణి చలనంలేని బొమ్మలా ఉండిపోయింది. ఆమె ముఖంలో

వుండి ఏం బాధ పడగలవు! అక్కడే ఉండరాదూ?" అన్నది. వసుంధర తన నుండి ఏదో తెల్సుకోవాలనుకుంటూందని కల్యాణికి తెలుసు. తనేమీ చెప్పలేక పోతూంది. "చెప్పుకోగలిగితే బాగుండును. కొంత బరువు తగ్గుతుంది" అనుకుంది

వసుంధర తనకెవరు?—అసలీ లోకంలో ఎవరికెవరు? తనకెవరు ఉన్నారు? తనకెవరూ ఏమీ కానప్పుడు ఎందుకు తన గోడు చెప్పుకోవటం?

బరువైన భావాలతో గుమురుకొన్న కల్యాణి గుండెలో నుంచి మాటలు వెలికిరావని వసుంధర గ్రహించింది. తనూ కల్యాణీ క్లాస్‌మేట్లు అయినా, ఆమెకు కల్యాణి గురించి అట్టే తెలియదు శ్రద్ధగా చదువుతుంది. తెలివైన అమ్మాయి. నెమ్మదైన నడత—అంతవరకే తెలుసు. ఈ మధ్య కల్యాణి ఎక్కడుంటుందీ – ఎలా ఉంటుందీ గాలివార్తగా విన్నది. ఎవరో మెడికల్ స్టూడెంటు కల్యాణికి చాలా దగ్గర స్నేహితుడనీ—వాళ్ళలా ఉంటారనీ ఇలా తిరుగుతారనీ అక్కడక్కడ అనుకుంటూంటే విన్నది.

ఇందిరను కల్యాణే ఒకసారి సినిమాహాల్లో వసుంధరకు పరిచయం చేసింది– "నాకు చాలా దగ్గర స్నేహితురాలు – ఈమె దగ్గరే ఉంటున్నాను నేను" అని.

క్లాసులోకి వస్తూ పోతూ పలకరించుకోవడంకంటే కల్యాణితో ఎక్కువ పరిచయం లేదు వసుంధరకు – కాని ఈ దినం అనుకోకుండా రైలులో కల్యాణి మూర్తీభవించిన శోకమూర్తిలా, కరడుగట్టిన కారు మేఘంలా తన కట్టెదుట కన్పించేసరికి వసుంధరలో సహజంగా ఉన్న ఔదార్యం సానుభూతిగా రూపొందింది.

"ఈ అమ్మాయి దేన్నో పోగొట్టుకుంది నిస్పృహ, అధైర్యం ఈమెను వెంటాడుతున్నాయి" అనుకుంది వసుంధర. కల్యాణికి మరింత దగ్గరగా జరిగి అనునయంగా మృదువుగా – "అలా బెంబేలు పడిపోకు కల్యాణీ! మనం ఎన్నిటినో జారవిడుచుకుంటాం, ఎందుకంత అధైర్యం?" అన్నది.

తొణకని కుండలా ఉన్న కల్యాణిని వసుంధర అనునయవాక్యాలు అడుగునుండీ కదిలించేయి—మండుటెండలో మహావృక్షపునీడలా కల్యాణికి వసుంధర మాటలు అనిర్వచనీయమైన ఓదార్పు నిచ్చాయి.

"ఈమె నాకెవరు? ఎందుకు ఈమెకు నా మీద యింత జాలి?" అనుకుని "ఎందుకు వసుంధరా! నేను ఎన్నిటినో పోగొట్టుకున్నాను కాదు, నా సర్వస్వం దానంతటదే నా నుండి దూరమైపోయింది, నా కింకేమీ మిగలలేదు. ఇలా చెపితే నీకర్థం కాదు. కాని ఇంకేమీ చెప్పలేని స్థితిలో ఉన్నాను, క్షమించు!" అన్నది కల్యాణి వసుంధర చేతులను తన చేతులలోనికి తీసుకుని.

"పోనీ – నాకేమీ చెప్పవద్దులే. కొన్ని బాధలను మాటలలో చెప్పుకోలేం, కాని ఒకటి చెబుతాను విను, భవిష్యత్తును గురించి ఏం చేయదల్చుకున్నా నువ్వు మాత్రం ఒంటరిగా ఉండవద్దు. ఈ స్థితిలో నువ్వు ఒక్కతెవ్వూ గది తీసుకుని ఉండడం నాకిష్టంలేదు. ఇంతవరకు నువ్వున్నలాడ్జిలో ఉండడం నీకిష్టం లేకపోతే మా యింటికి వచ్చేయి. నీకు తెలుసుగా, నేనూ మా పిన్నీ తప్పితే యింకెవ్వరూ లేరక్కడ నీకు బాధ కలిగించే వాతావరణం యేమీ లేదాయింట్లో. నిర్భయంగా నిస్సంకోచంగా నీకు తోచినన్నాళ్ళు వచ్చివుండు. ఇప్పుడు నాతో వచ్చినా సరే."

బండి అనకాపల్లి స్టేషనులో ఆగింది. ఆడవాళ్ళ కంపార్టుమెంటులో ఎక్కేవాళ్ళు ఎక్కువయిపోయారు –పెట్టెలో చాలా గోలగా ఉంది–ఒక నిండుచూలాలు చోటులేక తలుపుదగ్గిరే నిలబడిపోయింది. ప్రక్కనే అరవై ఏళ్ళ ముసలమ్మ క్రింద కూర్చుందుకు కూడా చోటు లేదే అని తలుపుకు చేరబడి పోయింది. బండి క్రిక్కిరిసి ఉంది ఒకరిమాట మరొకరికి వినబడటం లేదు.

అంతవరకూ హాయిగా కూర్చున్న వసుంధర ఆ గర్భిణీ స్త్రీనిచూసి తటాలున లేచిపోయి "ఇలా కూర్చోండి, నేను నిల్చుంటాను" అని తన చోటు చూపింది. ఏదో లోకంలో ఉన్న కల్యాణి వసుంధర లేచి నిల్చోడం చూసి మొదట తెల్లబోయింది. ఆ గర్భిణీ స్త్రీ జంకుతూ వసుంధరవైపు కృతజ్ఞతాపూర్వకంగా చూసి "మా అమ్మను కూర్చోనియ్యండి చాలు–నేను నిల్చుంటాను–" అనేసి వృద్ధురాలి చేయిపట్టుకొని వసుంధర చోటులోకి నడిపించి తీసుకువెళ్ళి కూర్చోపెట్టింది. వసుంధర ఆమె నంతటితో వదలిపెట్టలేదు – కల్యాణివైపు తిరిగి "లే కల్యాణీ" అని ఆమెను లేవగొట్టి "మీరిక్కడ కూర్చోండి, మేం నిల్చోగలం. వాల్తేరులో దిగిపోతాం" అన్నది ఆ అమ్మాయివైపు తిరిగి. ఆ అమ్మాయి మరింత ఆశ్చర్యపోయి – "మా అమ్మకు చోటిచ్చారు, మీరు కూర్చోండి పాపం, నాగురించి మీరెందుకు నిల్చోడం – మీరు దిగేక నేను కూర్చుంటాను లెండి" అన్నది నిల్చునే

వసుంధర, "అది కాదండీ – మీ అమ్మకోసం మీరు బాధపడినట్లే మీ కడుపులో పాపాయి 'మరి మా అమ్మ కూర్చోవద్దా?' అంటాడు. కూర్చోండి ఫరవాలేదు" అని ఆమె రెండు భుజాలమీద తన చేతులు వేసి బలవంతంగా కూర్చోపెట్టేసింది

తొలుచూలు కాబోలు వసుంధర మాటలకు ఆమె ముఖం సిగ్గుతో ఎర్రబారింది ముఖం కిటికీవైపు తిప్పేసి తనలో తనే నవ్వుకుంది వసుంధరలోని సహజ కారుణ్యమాధుర్యానికి ముగ్ధురాలై నిల్చున్న కల్యాణి కూడా "కడుపులో పాపాయి" అని వసుంధర అనేసరికి నవ్వేసింది.

అదే సమయంలో ఆ పెట్టెలో మరొక మూల పెద్ద రణగొణ ధ్వని జరుగుతూంది. కూర్చుని కాళ్ళుచాపుకున్న నలభైయేళ్ళ వనితను అప్పుడే బండెక్కిన ఒక కాలేజీ విద్యార్థిని "మామ్మగారూ! కాస్త కాళ్ళు కూడదీసుకోండి" అన్నదట. అంతలో ఆమెకు తగనికోపం వచ్చి, "మామ్మగారేమిటమ్మాయి? నీకు నేను మామ్మగారులా కన్పిస్తున్నానా? నువ్వేమో చిన్న పాపాయివా?" అంటూ దీర్ఘాలు తీస్తూ తిట్లతో, శాపనార్థాలతో పెద్ద దుమారం లేవదీసింది.

కొంతమంది–చిన్నపిల్ల! ఆమెతో నీకేమిటి అంటున్నారు. మరికొంతమంది–ఆమెను సమర్థిస్తున్నారు.

అనకాపల్లిలో మొదలయిన గగ్గోలు సర్దుమణగకముందే మెయిలు వాల్తేరు ప్లాటుఫారం చేరింది.

దిగేవాళ్ళను ఒక్కొక్కరినే దిగనిచ్చి వాళ్ళకు సామానులవీ అందించి నెమ్మదిగా దిగారు వసుంధరా, కల్యాణీ.

ప్లాట్ఫారం దాటిరాగానే వసుంధర "ఏం చేయబోతున్నావు మరి? చెప్పావు కావు. నాతో వస్తావా?" అంది.

కల్యాణి ఒక్క నిముషం ఆలోచించి "ముందు అక్కడికి వెళ్ళి అక్కడున్న సామాను కూడా తెచ్చుకుని వస్తాను. రేపు ఉదయం వస్తాను–మీ యిల్లు డాబా తోటలోనే కదూ?–సినిమాహాలు ప్రక్క యిల్లేనా?"

"ఆ! ఆ యిల్లే. ఒకసారి వచ్చావుగా–నీకెప్పుడు రావాలనుకుంటే అప్పుడు సందేహించకుండా వచ్చెయ్యి. నీ యిష్టం" అంటూ రిక్షా ఎక్కింది వసుంధర. కల్యాణి రిక్షాకూడా కదిలింది.

☆ ☆ ☆

కల్యాణి రిక్షా ఇందిర ఇంటిదగ్గర ఆగేసరికి పనిమనిషి సూరమ్మ ఎదురయింది.

"ఇంట్లో ఎవరూ లేరా?" అంది కల్యాణి.

"ఆనందరావుగారు నిద్రపోతున్నారు. ఇంకెవరూ లేరమ్మా!" అంటూ రిక్షాలోంచి బెడ్డింగు అందుకుంది సూరమ్మ.

కల్యాణి తిన్నగా తన గది దగ్గరకు వెళ్ళి, తాళం తీసి సామాను లోపలపెట్టించింది. రిక్షావాడు వెళ్ళాక బెడ్డింగు విప్పుతున్న కల్యాణితో "ఎంత కష్టమొచ్చిందమ్మా! నాయన పోయారంట" పరామర్శించింది సూరమ్మ. కల్యాణి ఆ ప్రసక్తి తేవడం యిష్టం లేనట్లు "స్నానానికి నీళ్ళు పెట్టు సూరమ్మా!" అంది.

స్నానం చేసి తిరిగి వస్తూంటే అప్పుడే నిద్రలేచిన ఆనందరావు ఎదురయ్యాడు. "ఓ! కల్యాణి! ఎంతసేపయిందివచ్చి?" అన్నాడు.

"ఇప్పుడేనండీ, అరగంటయింది. మెయిలులో వచ్చాను" అంది కల్యాణి.

"పాపం! చాలా ఇబ్బందులలో పడిపోయావు. అసలింతకీ మీ నాన్నగారికేం జబ్బుచేసిందమ్మా?"

"పక్షవాతం వచ్చింది."

"ఇక్కడికి తీసుకువచ్చేయవలసింది. ప్రకాశం ఉన్నాడు – పెద్దహాస్పటలుంది. జాగ్రత్తగా వైద్యం జరిగేది ఆ పల్లెటూరులో ఏం ట్రీటుమెంటు జరుగుతుందని! డాక్టర్లా ఏమైనానా! సరేలే, వెళ్ళి కాస్సేపు విశ్రాంతి తీసుకో, ప్రయాణం చేసొచ్చావు" అంటూ ఆనందరావు నూతి దగ్గరకు వెళ్ళిపోయాడు

ఆనందరావు పరామర్శ కల్యాణిని మరింత కలవరపెట్టింది.

ఇక్కడికు తీసుకువస్తే నాన్న బతికేవాడా? నిజంగా చూసేవాళ్ళా? "ప్రకాశం ఉన్నాడు" అంటే తనకేం లాభం? నిజంగా అంత చూసేవాడైతే తన నింత కష్టంలో ఇలా వదిలేస్తాడా? అయినా ఎక్కడికి వెళ్ళినా యిది బాగవదని డాక్టరు చెప్పాడు కదా! తుని నించి డాక్టరును రప్పించలేదు కనుకనా తను!

సాయంత్రం ఆరుగంటలయేక ఇందిరా ప్రకాశం కలిసివచ్చారింటికి. హాస్పిటలుకు వెళ్ళిన ప్రకాశం, ఆఫీసుకు వెళ్ళిన ఇందిర ఎలా కలుసుకున్నారో అర్థంకాలేదు కల్యాణికి.

ప్రకాశం మేడ మెట్లెక్కుతూ కల్యాణి గది తెరచి ఉండడం చూసి గతుక్కుమన్నాడు నెమ్మదిగా అడుగులో అడుగువేసుకుంటూ కల్యాణి గది గుమ్మం దగ్గర నిలబడి "ఎప్పుడూ రావటం?" అన్నాడు.

నిండుగా "కల్యాణీ" అని సంబోధించలేని అతని పిరికితనం కల్యాణి గుర్తించకపోలేదు. "మెయిలులో వచ్చాను" అన్నది.

అతడు గది గుమ్మంలో నిల్చునే – "ఇందిర నిన్ను చూడలేదులావుంది" అన్నాడు. ఆ మాట అతను ఎందుకన్నాడో అతనికే తెలియదు కాని కల్యాణికి అర్థమైంది. అతడింకేం మాట్లాడాలో తెలియక తికమక పడుతున్నాడు.

ప్రకాశానికిప్పుడు తనతో మాట్లాడడానికి మాటలు వెతుక్కోవలసి వచ్చింది. ఎంత విచిత్రమైన పరిణామం! ఇక్కడికొస్తే ఏం జరుగుతుందో తాను కొంత ఊహించుకుంది, కాని ఊహకు కూడా అందనంత దూరం పోయాడు ప్రకాశం. ఎదురుగా కన్పించాక తన ఉత్తరాలన్నీ అందేయనీ, కాని ఏదో కారణంచేత జవాబు వ్రాయలేదనీ, ఏదో ఒక సాకు చెప్పి...అందుచేత తానేమీ చేయలేకపోయాననీ అంటాడనుకుంది. కాని ప్రకాశం మాట తీరే మారిపోయింది. అతనికిపుడు తనతో మాట్లాడడానికి మాటలు లేవు.

కల్యాణి కిటికీవైపు తిరిగి నిల్చుంది. ప్రకాశం గోడవైపు తిరిగి తలుపు దగ్గరే నిల్చున్నాడు. ఇద్దరికీ ఏం మాట్లాడాలో తోచలేదు.

హ్యాండ్‌బాగ్ లోపల పడేసి జోడువిప్పి ఇందిర అక్కడికి వచ్చింది. వస్తూనే ప్రకాశాన్ని తోసుకుంటూ గదిలోపలికి అడుగుపెట్టి, "వచ్చేశావా?" అన్నది. అన్నదేకాని ఆ స్వరంలో మిళితమైన కాఠిన్యం...ఏదో వ్యంగ్యం.. కల్యాణికి కొట్టొచ్చినట్లు తోచాయి.

"వచ్చేశావా?" అన్నమాటలు, "వచ్చేశావేం? వస్తే మాకేం? ఎందుకొచ్చావు?".. అన్నట్లు రకరకాలుగా ప్రతిధ్వనించాయి–కల్యాణి అంతరాంతరాలలో

జవాబీయని కల్యాణిని ఎలా పరామర్శించాలో తెలియడంలేదు ఇందిరకు కూడ.

"కాఫీ త్రాగుదువుగాని రా" అంది చివరకి.

"అబ్బే నాకేమీ వద్దు, అలవాటు తప్పిపోయింది" అన్నది కల్యాణి, ఏదో అనకపోతే బాగుండదన్నట్లు. ఇందిర ఆమెకి మరింత దగ్గరగా వెళ్ళి "వెళ్ళిపోయిన మనుష్యులతో మనం వెళ్ళిపోతామా! వచ్చి కాఫీ తాగు, నీ కలవాటుందో లేదో నాకు తెలియదూ!" అన్నది. ఆ మాటలలో మార్దవం లేదు కేవలం తనకు క్లాసుమేటుగా మాత్రమే పరిచితమైన వసుంధర ప్రకటించిన మార్దవం–ఆమె మాటలలో, ఆమె స్పర్శలో గల సౌహార్దం తన గుండెల్లో ఇంకా ప్రతిధ్వనిస్తోంది. దానికి ప్రతిరూపంగా యిక్కడ ఇందిర స్వరంలోని కాఠిన్యం ఆమె గుర్తించగలిగింది

అంతవరకూ కొయ్యబొమ్మలా నిల్చుండిపోయిన ప్రకాశానికి ఇందిర మాట్లాడిన విధానం దారిచూపింది. "జరిగినదాని కెవరేం చెయ్యగలరు కల్యాణీ! ఏదో బాధలూ కష్టాలూ వచ్చాయని కాఫీ మానుకుని, భోజనం మానుకుని, ప్రయోజనం ఏమిటి– అనవసరంగా నీ ఆరోగ్యం కూడా పాడుచేసుకోవడం తప్పు?" అన్నాడు.

ఆ ప్రకాశమేనా ఈ ప్రకాశం? నా సర్వస్వం నువ్వే – నీ జీవితమే నా జీవితం – నీ సుఖదుఃఖాలన్నీ నావిసుమా– అని వర్ణించిన ప్రకాశమేనా ఇతను? ఒకనాడు "కన్నీ రెందుకు కల్యాణీ, నేనుండగా నీకు దుఃఖమా!" అన్న ప్రకాశమేనా ఇతడు?

కల్యాణికి దుఃఖం వచ్చేస్తూంది. కాని ఆపుకోవాలని చాలా ప్రయత్నించింది. తన కష్టసుఖాల్లో భాగం పంచుకోలేని వ్యక్తులముందు తన దుఃఖాన్ని వెల్లడిచేయడం ఆమె కిష్టం లేదు.

కాని ప్రకాశం అంతటితో ఊరుకోక "ప్రతివాళ్ళకీ చెడ్డరోజులు వస్తూంటాయి, పోతుంటాయి. బాధపడుతూ కూర్చుంటే ఏం లాభం?—ఒకరి కష్టాల్నొకరు తీసివెయ్యలేరనుకో!" అన్నాడు.

కల్యాణి హృదయంలో అభిమానం బుసలుకొట్టింది. విషాదం విస్తరిల్లింది. "ఛీ! ఇతడూ ఒక మనిషేనా?" అన్నంత అసహ్యించుకుంది. కాని తొణకకుండా—"నిజమే ప్రకాశం, ఎవరి కర్మ కెవరు కర్తలు? నా కష్టాన్నెవరు పంచుకోలేరు— వద్దుకూడా" అని గిరుక్కున ముఖం తిప్పేసుకుంది.

ఇందిరా ప్రకాశం కూడబలుక్కున్నట్లు ఒక్కసారే అవతలికి వెళ్ళిపోయారు—వాళ్ళు వెళ్ళిపోయిన కొంతసేపటివరకూ కల్యాణి జరిగిపోయిన, జరుగుతూన్న సంఘటనలను తల్చుకుంటూ నిల్చున్న భంగిమలోనే నిశ్చేష్టితురాలై వుండిపోయింది. వున్నట్లుండి నిద్రలోంచి లేచినదానిలా—గదిలోని తన సామానంతా పెట్టెలోను, బెడ్డింగులోను సర్దేసి, క్యాంపుకాటు మడిచేసి—గది గుమ్మంలో నుంచి బయటకి ముఖంపెట్టి "సూరమ్మా!" అని కేకేసింది.

"ఇందిరమ్మగారు కాఫీ పంపించారండీ!" అని కప్పు కాఫీతో అప్పుడే గది దగ్గరకు వచ్చిన సూరమ్మ కాఫీ అందివ్వబోయింది.

"ఇప్పుడేం వద్దు. త్వరగా పోయి ఒక రిక్షా తీసుకురా!" అంది కల్యాణి. కాఫీ లోపల యిచ్చేసి సూరమ్మ రిక్షాకోసం వెళ్ళింది

ఇందిర మళ్ళీ వచ్చి "ఎక్కడికైనా వెళుతున్నావా? చీకటి పడిపోతూంటే ఇప్పుడెక్కడికీ?" అంది.

కల్యాణి ముక్తసరిగా జవాబిచ్చింది "అవును, వెళ్ళిపోతున్నాను."

"అంటే?" అంది ఇందిర, అర్థం కానట్లు ముఖం పెట్టి.

"అంటే ఏమీలేదు, ఇక్కడ వుండదల్చుకోలేదు. మరెక్కడైనా రూము తీసుకునుంటాను."

"ఊహూ!" అంది ఇందిర దీర్ఘంగా నిట్టూర్చి, ఏదో తెలిసికొన్నదానిలా.

"కాఫీ తాగావా?" అన్నాడు ప్రకాశం మళ్ళీ క్రిందకు వచ్చి కల్యాణి గదిలో అడుగుపెడుతూ. ఆమెకు చిరాకు వేసింది. "వీళ్ళ బతుకంతా కలిసి కాఫీ తాగడంలోనే వుంది!" అనుకుని – దానికి జవాబు చెప్పకుండానే "నేను వెళ్ళిపోతున్నాను ప్రకాశం!" అంది, ఎలాగా ఆ వార్త అతని చెవిని వెయ్యాలి కనుక.

ప్రకాశాని కర్థంకాక తెల్లబోయి ఏమిటి సంగతన్నట్లు ఇందిర వైపు చూశాడు. ఆమె ప్రకాశంవైపు తిరిగి—"తను వేరే రూము తీసుకుంటుందట నేనేం చెప్పగలను చెప్పు? తన మనసుకిక్కడ ఉండడం బాగాలేదని తోస్తే బలవంతంగా వుంచినా బాధపెట్టడమే అవుతుంది. మనతో సరదాగా వుంటుందికదా అనే నేనూ రమ్మన్నాను కాని నాకు మాత్రమేం తెలుసు– ఈ యింట్లో అడుగుపెట్టినప్పటినుండి తనకన్నీ కష్టాలే వస్తాయని. వచ్చిన పదిహేను రోజులకే జబ్బుపడింది. ఆరునెలలు తిరగకుండానే

అన్ని రకాలా నష్టపోయింది" అని కల్యాణివైపు తిరిగి "నిజమే కల్యాణీ! ఒక్కొక్క ఇంట్లో అలాంటివి జరుగుతాయి. మేం అనకాపల్లిలో ఉండేటప్పుడు ఒకింట్లోకి అద్దెకు చేరాం. ఆ ఇంట్లోనే మా తమ్ముడు పోయాడు సరిగ్గా నెల తిరగకముందే ఆ తరువాతే మా నాన్నకు జబ్బుచేసింది, దానితో మా నాన్న హడలిపోయి మరొక్కరోజు ఆ ఇంట్లో ఉండనని ఇల్లు మార్చేశారు. అలాంటి అనుమానం కలగకపోవాలి కాని కలిగితే చాలా బాధగా ఉంటుంది ఆ ఇల్లు విడిచిపెట్టేవరకూ. ఆలోచించుకో.. నీకెక్కడ బాగుంటుందో అలాగే చేయి" అంది తాను చెప్పవలసినదంతా పూర్తయిందన్నట్లు.

తాను వెళ్ళిపోతాననటంలోని భావాన్ని ఇంత చక్కగా సమర్థించగల్గినందుకు నిజంగా ఆమె నభినందించింది కల్యాణి మనస్సులో. ఎంత చక్కటి వ్యాఖ్యానం చేసింది ! ఎంత గడుసుతనంగా మాటాడగలదు!

ఇందిర చెప్పినదానిలో కాదనటానికి తనకేం లేదు. ఆమె చెప్పిన దంతా నిజం – కాని తనందుకు వెళ్ళిపోతాననలేదు మరొక రూం చూసుకుంటాననటంలోని అంతర్యాన్ని నిజంగా గ్రహించక ఇందిర అలా అనుకుందా – ఏమో! గ్రహించకపోయినా మంచిదే, గ్రహించి తననేం చేయగలదు కనుక–"ఆరునెలలు తిరగకముందే అన్నిరకాలా నష్టపోయింది!" ఎంత చక్కటి సత్యం – నిజమే తనన్ని విధాలా నష్టపోయింది

ఇందిరకు సమాధానంగా కల్యాణి, "ఆలోచించుకున్నాను ఇందిరా! నువ్వు చెప్పినట్లు నే నన్నిరకాలా నష్టపోయాను. అందుకే వెళతాను" అన్నది.

ప్రకాశం చలించకుండా ఉండలేకపోయాడు – కల్యాణి వెళతాననడంలోని భావం అతని కర్థం కాకపోలేదు. ఇందిర వ్యాఖ్యానించటంలోని చతురిమా అర్థం కాకపోలేదు కల్యాణి "అన్నిరకాలా నష్టపోయాను" అన్న మాటలోని లోతు అతని గుండెల్లో దూసుకుపోయింది. అతనేమీ అనలేని స్థితిలో వున్నాడు

"ఇప్పుడేమంత తొందర–తరువాత వెళ్ళవచ్చు కల్యాణీ!" అన్నాడు చివరకి

సూరమ్మ "రిక్షాతెచ్చే నమ్మగోరూ!" అన్నది.

ఇందిర "ఆమెకంత బాధగా వున్నప్పుడు వెళ్ళనీ ప్రకాశం! యిలాంటప్పుడు మనం బలవంతపెడితే మరింత యిబ్బంది పెట్టినవాళ్ళమవుతాం" అన్నది

కల్యాణి ఆమె మాటలు వినిపించుకోకుండానే "ఈ సామాను రిక్షాలో పెట్టించు సూరమ్మా!" అన్నది.

అంతవరకూ ఆ రంగంలో లేని ఆనందరావు కూడా అక్కడికి వచ్చి "ఏమిటి? ఎక్కడికి మళ్ళీ ప్రయాణం?" అన్నాడు.

"ప్రయాణమేమీలేదు నాన్నా! కల్యాణి రూము మార్చుకుంటుందట, అంతే" అంది ఇందిర, ఆనందరావుకు సుబోధకంగా ఉండే పద్ధతిని. అతను "అలాగా! పోనీ హాస్టల్లో చేరితే మంచిది. నలుగురూ వుంటారు, కలివిడిగా వుంటుంది" అన్నాడు. పెద్దవాడు తానొక సలహా చెప్పకపోతే ఎలాగన్నట్లు..

సామానంతా రిక్షాలో పెట్టించేసి, సూరమ్మ..."వెళతారా అమ్మగోరూ?" అంది.

"ఆ...వెళుతున్నా..." అని సూరమ్మ చేతిలో ఒక రూపాయిపెట్టి "నమస్కారం బాబాయిగారూ! వెళుతున్నా" అన్నది కల్యాణి ఆనందరావువైపు తిరిగి.

"మంచిదమ్మా, అప్పుడప్పుడు వచ్చి స్నేహితులను చూసి పోతూండు!" అన్నాడు ఆనందరావు.

కల్యాణి మారుమాటాడకుండా రిక్షాలో ఎక్కి "డాబాతోటకి పోనియ్!" అంది.

రిక్షా కొంతదూరం కదలిపోనిచ్చి ఇందిర, "ముందే అంతా ఏర్పాటు చేసుకునే వచ్చింది, చూశావా నాన్నా!" అంది.

"పాపం దిక్కులేని పిల్ల, ఏదో అవస్థలు పడుతోంది. పోన్లెద్దూ!" అన్నాడు ఆనందరావు, ఔదార్య విస్ఫూర్తితో.

ప్రకాశం బరువుగా అడుగులు వేసుకుంటూ మేడమెట్లు ఎక్కాడు.

## 8

ఆదివారం సెలవు దినాన్ని ఎలా గడుపుదామా అని కూనిరాగంతో ఆలోచిస్తోంది ఇందిర ఉదయం తొమ్మిది గంటలైంది. మెట్లగదిలో వాలుకుర్చీలో కూర్చుని హాయిగా చుట్ట కాల్చుకుంటున్నాడు ఆనందరావు. ఎదురుగా చాప వేసుకుని కూర్చున్న ఇందిర అప్పుడే తలంటుకున్న జుత్తు చిక్కుతీసుకుంటూ, సన్నని కూనిరాగం తీసుకుంటూ బుర్రలో ఏవో కూడికలూ తీసివేతలూ చేస్తోంది. డిసెంబరు చలికాలపు అందమైన ఆదివారాన్ని ఏం చెయ్యాలి? ఆసుపత్రిలో అర్జంటుపని ఏదో ఉందంటూ ఎనిమిదింటికే ఉడాయించాడు ప్రకాశం. రెండురోజుల మధ్యాహ్నమై కృష్ణమూర్తి కనబడడమే లేదు ఎదురుగా ఖాళీగా వున్న మెట్లపక్క కల్యాణి గది ఆమె దృష్టిలో పడింది అన్నట్లు అతనికి యీ గది అద్దెకిచ్చేస్తే? అద్భుతంగా ఉంటుంది. నిన్న సాయంత్రమే కల్యాణి సామాను పట్టుకునిపోయింది పీడ వదలింది అనుకుంది ఇందిర ఎక్కడో దిక్కుమాలిన లాడ్జిలో ఉంటున్నాడు కృష్ణమూర్తి రూం యిస్తానంటే ఎగిరి గంతువేసి వస్తాడు. అద్దెలో కొంచమైనా కలిసివస్తుంది. తనలో తనే నవ్వుకుంది ఇందిర, కొంచెం ఏం కర్మ .. మళ్ళీ తనలో తనకే చిరాకు వేసింది. ఎప్పటికప్పుడే డబ్బుకోసం తడుములాట, లెక్కలు; అడుగుతీసి అడుగుపెడితే డబ్బుకావాలి తనకిచ్చే నూటముప్పైరూపాయల జీతంతో ఏది తలపెడదామన్నా కుదరడంలేదు

"ఇది ఉత్త వెధవ ప్రపంచం నాన్నా!" అంది ఉన్నట్టుండి.

ఆనందరావు కూడా ఆ క్షణంలో అదే ఆలోచిస్తున్నట్టు–"సందేహమేమిటి! ఆ సంగతి ఆచార్లువారు ఎప్పుడో చెప్పారు కదమ్మాయ్!" అంటూ ఇందిర అభిప్రాయానికి సాక్షిని హాజరు పెట్టాడు

"ఎవడా ఆచార్లు?" అడిగింది ఇందిర ఎవడో అర్థంకాక.

"నీకు తెలియదులే, ఆదిశంకరాచార్లువారు" అన్నాడు ఆనందరావు.

నాన్న చలోక్తులంటే ఇందిరకు తగని ప్రేమ. ఆ ప్రేమ ప్రకటన మాత్రం ఎప్పుడూ చిరాకు రూపాన్ని ధరిస్తుంది. "నువ్వొకడివి పోదూ, ఆ శంకరాచార్యెవడో నీలాంటివాడే ఐయుంటాడు. ఇవాళ ఆదివారం గదా! ఏం ప్రోగ్రాం వేసుకుందామనుకున్నా చేతిలో కాణీ లేదు. నా చేతిలో కాణీ లేకుండా చేసిన యీ ప్రపంచం వెధవది కాక మరేమిటి?" అంటూ నాన్నని కసిరింది.

ఆనందరావు పొగరాని చుట్టను పెదవులతో ఆప్యాయంగా లాలిస్తూ "ఉండుండు. అందుకే సర్కారు మొదటి పంచవర్ష ప్రణాలిక అంటూ లాటరీ వేసింది గెలిచిందా, బేడకి వందరూపాయలు కొనుక్కోవచ్చు, కాస్త ఓపిక పట్టు మరీ! ఇంతకూ ఇవాళ ప్రోగ్రాం ఏమిటి?" అన్నాడు.

ఇందిర జవాబు చెప్పలేదు. జడ అల్లుకోవడంలో నిమగ్నమైపోయింది

"ప్రకాశం భోజనానికి వస్తాడా?" అని మళ్ళీ ప్రశ్న వేశాడు ఆనందరావు

ఎందుకో ఇందిరకు తిక్క రేగింది. "రాడు. ఆసుపత్రినుంచి అలా హార్బరుకి వెళ్ళి సముద్రంలో పడిపోతాడట"అంది.

ఆ జవాబుతో ఆనందరావు మళ్ళీ మౌనం వహించాడు. కూతురు క్షోభ ఏమిటో అతనికి అర్థమైనా చెయ్యగలిగింది ఏదీలేదు. అన్నవస్త్రాలకు కూడా చాలీచాలని జీతం రాళ్ళతో కాలక్షేపం చేసే స్థితిలో ఇందిరకెప్పుడూ రాజీ కుదరలేదు. ఆ స్థితిమీద కోపం ప్రకోపించినప్పుడల్లా చుట్టుప్రక్కలవాళ్ళమీద విరుచుకుపడుతుంది ఆనందరావు అలాంటి జీవితాన్ని అడ్డదారిలో జయించేశాడు. చుట్టముక్కల్లోంచి బ్రహ్మానందాన్ని పిండుకోగలడు. క్షణం గడవటం కోసం ఎవరినైనా వాడుకోగలడు. అదేదీ కుదరనప్పుడు నిశ్చింతగా హాయిగా నిద్రపోగలడు. రేపు అనేది నేడై, ఆ నేడు యీ క్షణమైతే తప్ప దాన్ని గురించి అతడు ఆలోచించడు.

జడ ముగించిన ఇందిర తన గదిలోకి వెళ్ళి డ్రెస్సు మార్చుకొని మళ్ళీ వచ్చి మెట్ల గదిలో చతికిలబడింది. కాలక్షేపం చదువుకి ఏదైనా పుస్తకమూ, పత్రికాలాంటివి దొరుకుతాయేమోనని నలుమూలలా బద్ధకంగా చూస్తూండేసరికి గుమ్మం దగ్గర అడుగుల చప్పుడైంది. అటుచూసేసరికి కృష్ణమూర్తి ప్రత్యక్షం

"రావోయ్ రావుసాహెబ్! రా!" అంటూ పలకరించాడానందరావు

"అదేమిటండోయ్! కనీసం పద్మవిభూషణ్ పహిలేవర్గ్ అనైనా అనకూడదా?" అంటూ కృష్ణమూర్తి కిటికీలో కూర్చుని అర్జంటుగా తీసి సిగరెట్ వెలిగించాడు వెలిగిస్తూ ఇందిరవైపు తిరిగి, "తండ్రీ కూతురూ ఏమిటలా దిగాలుపడిపోయి కూర్చున్నారు? ఆదివారం ప్రోగ్రాం లేవో లేవా?" అన్నాడు.

"ప్రోగ్రాములు చాలా ఉన్నాయిగాని, ముందు నీ సంగతి చెప్పు. రెండురోజులై కనబడ్డమే మానేశావు, ఏం పాటుబడుతున్నావు" అంటూ నిలవేసింది ఇందిర

కృష్ణమూర్తి ఓ నవ్వు నవ్వేసి, "చాలా బిజీగా ఉన్నాను. ఐ. యే యస్‌కి చదివేస్తున్నాను!" అంటూ గంభీరమైన పోజు పెట్టాడు.

"ముందు బియ్యే పార్టు త్రీ సంగతేమిటి? ఎన్ని సెప్టెంబర్లు చూసినా దాని సంగతి ఏం తేల లేదుగా?" అంది ఇందిర.

"అదేమరి, వెధవది. ఐన ఆలస్యం ఎలాగూ అవుతోంది, రెండూ కలిపి చదివేద్దామని మొదలుపెట్టాను" అన్నాడు కృష్ణమూర్తి నిబ్బరంగా.

ఆనందరావు చుట్టపీక వీధిలోకి విసిరేస్తూ, "అదేమంచిదిలే, మళ్ళీ మళ్ళీ చదవనక్కరలేకుండా అన్నీ కలిపి ఒక్కసారే తగలెట్టేస్తే సరిపోతుంది" అన్నాడు.

ఒక్కసారిగా ఏదో జ్ఞాపకం వచ్చినట్లు ఇందిర "అన్నట్లు మొన్నమొన్ననేగా ఐ. యే. యస్. పరీక్షలకు పోయిందీ– నవంబరులో! ఇప్పుడేం చదువు?" అంది.



ఆనందరావు "వెర్రిదానా! మళ్ళీ నవంబరు రాదూ?" అన్నాడు.

ఇందిరకి అప్పుడర్థమైంది. "నిజమే సుమా! నాకు తట్టనేలేదూ!" అని ఒప్పేసుకుంది.

"అందుకే ఆడవాళ్ళకి బుర్రలు లేవంటారు" అని గెలుపు ప్రకటించాడు కృష్ణమూర్తి.

ఇందిర నిబ్బరంగా, "అంతపని నెత్తిన వేసుకోకు. ఆడవాళ్ళబుర్రల విలువ కట్టడానికి నీలాంటివాడి బుర్ర పనికిగాదు...అది సరే కాని కృష్ణమూర్తీ, ప్రస్తుతం నువ్వుంటున్న లాడ్జి సదుపాయంగానే ఉందా?" అంది.

"లాడ్జికేం? నవరత్న ఖచితంగా ఉంది. ఇంటిముందు గేటు, గేటు దాటితే పూలమొక్కలు, కింద రెండు గదులూ, పైన ఒక గదీ. ఒంటి స్తంభం మేడ ఐతే ఐంది గాని, తొమ్మండుగురం ఉన్నాం అందులో – చాలా భాగం నాలాంటి సెప్టెంబరు–మార్చి ప్రయాణీకులే; ఇద్దరు ఎన్. జీ. వోలు కూడా ఉన్నారు. వాళ్ళతో ఒక్కటే ఇబ్బంది– రెండో తారీకునుండి చేబదులడుగుతారు. ఆ వెధవ దురలవాటు మినహాయిస్తే, వాళ్ళంత మంచివాళ్ళు లేరనుకో. సాధువు సాధువు జై సీతారామ్. గోవులాంటివాళ్ళు. ఏం? లాడ్జి గొడవ ఎందుకొచ్చిందీ?" అన్నాడు కృష్ణమూర్తి.

"స్నానానికి వాటికీ సదుపాయంగా ఉందా?" అంది ఇందిర మళ్ళీ. ఆ ప్రశ్నల అంతరార్థం కృష్ణమూర్తికి అర్థం కాలేదు. "మా లాడ్జిలో చాలా మందికి స్నానం అనేది మా తెలుగు టీచరన్నట్లు వైకల్పికం–అంటే చేస్తే చేస్తారు లేకపోతేలేదు. మావాళ్ళకి అలాంటి పాతకాలపు పట్టింపులేవీ లేవు. ఇంతకీ ఏమిటివాళ విశేషం? రాణీగారు మా స్నానపానాదుల గురించిన విచారణ అధికంగా చేస్తున్నారు" అన్నాడు కృష్ణమూర్తి బుష్షర్టు జేబులోంచి సిగరెట్ కేస్ బయటికి తీస్తూ

మూడు నిమిషాల క్రిందటే ఆరిపోయిన చుట్ట నవతల పారేసిన ఆనందరావు క్షణంలో ముందుకు వంగి "అగ్గిపెట్టె కావాలా?" అంటూ ఆపదలో ఆదుకోబోయే వాడిలా ఆప్యాయంగా అందించి అతని అతని చేతిలోని సిగరెట్ పెట్టెని తన చేతిలోనికి తీసుకున్నాడు. ఇందిర ఒక నిముషంపాటు ఊరుకుని, "అధిక విచారణేమీ కాదు–అవశ్యం విచారించవలసి వచ్చే విచారిస్తున్నారు రాణీగారు" అంది వీధిలోకి చూస్తూ, కృష్ణమూర్తివైపు తిరగకుండానే.

"పోర్షనుకేం బాగానే వచ్చింది, ఇంక నాటకం మొదలు పెట్టవచ్చు" అన్నాడు కృష్ణమూర్తి తన సహజమైన ధోరణిలో. కాని ఇందిర ఎందుకో గతుక్కుమంది క్షణం మాత్రం నేనేదో నాటకమాడుతున్నానని ఇతని అభిప్రాయం కాబోలు అనుకుంది. మళ్ళీ మరుక్షణమే తేరుకొని "ఐతే విను–ఇదే నా నాందీ ప్రస్తావన– (శ్రీ) (శ్రీ) (శ్రీ) (శ్రీ) పద్మ విభూషణ్ పహిలేవర్గు–యింకేమైనా అవసరముంటే అవన్నీ ఐన–కృష్ణమూర్తిగారు వారి ఒంటి స్థంభం మేడనుండి మా మూడంతస్థుల డాబా యింటికి మకాం మార్చబోతున్నారు" అనేసి టక్కున ఊరుకుంది; ఏమి నీ జవాబు అన్నట్లు కనుబొమలెగరేసి అతనివైపు చురుకుగా చూసి. కృష్ణమూర్తికి ఇపుడు నిజంగా ఇందిర నాటకమాడుతున్నట్లే తోచింది. ఏమిటి సంగతి అన్నట్లు

తెల్లబోయి చూశాడామె కళ్ళలోకి. ఆనందరావు కూతురు వైపు సాలోచనగా చూసి ఇంత సరికొత్త ప్లాను ఇందిర బుర్రలో ఎప్పుడు మెరిసిందీ అనుకొని విస్తుపోయాడు.

ఇందిర గిలక గలగలలాడినట్లు నవ్వేసి "సెభాష్! మూడు తరాల వాడు మా నాన్నా, ముందుతరం నవయువకుడివి నువ్వూ, ఒక్కలాగే చల్లబడి పోయారేమిటి? అద్భుతమైన బ్రెయిన్ వేవ్ వచ్చి ఆషాఢ వర్షంలా మీద పడిందని నేను మురిసిపోతూంటే మాట్లాడవేమిటి కృష్ణమూర్తీ!" అని అరిచింది.

కృష్ణమూర్తి కొంచెం బోధపడినవాడిలా మొఖంపెట్టి "కవిత్వం బాగానే ఉంది కాని తీర్మానం నాకేం బోధపడలేదు" అన్నాడు.

"పోనీలే! ఉన్న కాస్త మెదడునీ సెప్టెంబరు మార్చిలకే కరిగించేశావు—అనవసరంగా నిన్ను ప్రయాస పెట్టడం నా ఒంటికసలే పడదు చూడూ! ఆ దిక్కుమాలిన లాడ్జిలో డబ్బు గుంజుకోవడంకోసం పీడకలల్లా పీడించేవాళ్ళమధ్య ఏం అవస్థపడతావు? అసలే సెప్టెంబరు, మార్చి కంపార్టుమెంటంటున్నావు. ఆ కంపార్టుమెంటులో ఉన్నప్పాళ్ళు ఎక్కడికీ చేరలేవు. హాయిగా మా దివ్య భవనంలోకి వచ్చేస్తివా—కుజుడు బుధుడి లోకో బుధుడు కుజుడులోకో వచ్చేసి అమాంతం జాతకం మారిపోవచ్చు. భోగానికి భోగం—చదువుకి చదువూ" అంటూ ఆనందరావుకేసి తిరిగి "ఏ లోకంలో ఉన్నావు నాన్నా! ఎంత లేదన్నా ఇంటికి పెద్దవాడివి – నువ్వు చెపితే కాదంటాడా కృష్ణమూర్తి?" అంది.

అంతవరకూ క్రితంరోజు ఆంధ్రపత్రికలో వాతావరణం సూచనల్ని దీక్షగా చదువుతున్న ఆనందరావు తటాలున పేపరు మడిచేసి "ఏమిటే, నేను చెబితేగాని కాదంటాడా కృష్ణమూర్తి? అబ్బే! అతనలాంటి అవకాశాలు పోగొట్టుకోడే–" అంటూ అతనివైపు తిరిగి "ఏమోయ్ గది సిద్దంగా ఉంది. ఇంటివాడు నీ ధర్మమా అని మొన్న వెల్ల వేయించేడు. గాలీ వెలుతురూ వద్దన్నా వస్తాయి—డాబాగదే అనుకో! ఐనా యిప్పట్లో వర్షాలబాధలేదు. సాయంత్రానికి నవమి వెళ్ళి దశమి వచ్చేస్తుంది" అన్నాడు.

తండ్రీ కూతురూ మాట్లాడినంతసేపూ మౌనంగా వినేసి కృష్ణమూర్తి "ఓ! అదా సంగతి! ఐనా నాల్గురోజుల భాగ్యానికింత హడావుడి దేనికి? ఎప్పుడో ఓనాడు కల్యాణి అమాంతం బండి దిగేస్తుంది. కాశీమజిలీల్లోలా నన్నో ఉడుతనో మిడతనో చేసేసి ఎక్కడ దాచేయగలరు? ఆవిడ గది ఆవిడకిచ్చేయకపోతే ఊరుకుంటుందా?" అన్నాడు.

హఠాత్తుగా కల్యాణి మాట విని ఆనందరావు "చెప్పుకో ఏం సంజాయిషీ చెప్పుకుంటావో" అన్నట్లు చూశాడు కూతురువైపు. ఇందిర మాత్రం భుజంమీదుగా జడ ముందుకు వేసుకొని సగం అల్లి వదిలేసిన చిగుళ్ళను ఉమ్మచుడుతూ "ఓయి వెర్రినాగమ్మా! కల్యాణి బండి దిగడం, మళ్లీ ఎక్కేయడం కూడా ఐపోయింది; ఉడతనో మిడతనో చేయడమేం కర్మం! రాజకుమారుడిలా హాయిగా ఉండొచ్చు. నీకేమిటి లోపం?" అన్నది—ఎక్కడలేని ఆదరణ కళ్ళలో ఒలికిస్తూ.

కృష్ణమూర్తి బిత్తరపోయి "ఏమిటి నువ్వనేది—కల్యాణి రావటమేమిటి? వెళ్ళట మేమిటి? ఎప్పుడు జరిగింది— ఎక్కడకెళ్ళింది?" అని గబగబా అడిగేశాడు.

కల్యాణి రాకపోకల గురించి అతడంత ఆదుర్దా వ్యక్తం చేస్తాడని ఇందిర ఊహించనేలేదు. అతడడిగిన అన్ని ప్రశ్నలలో ఏ ఒక్కదానికి సమాధానం చెప్పలేకపోతే ఏం ములుగుతుందో అన్నట్లు "నిన్ననే వచ్చింది, నిన్ననే వెళ్ళింది. ఎక్కడికెళ్ళిందో తెలియదుగాని, విశాఖపట్నం పొలిమేరలు దాటివుండదు" అంది.

ఆ తలతిక్క జవాబుకు కృష్ణమూర్తికి నిజంగా చిరాకేసింది. సీరియస్‌గా ముఖం పెట్టి "ఏమిటే అర్థం లేని వాగుడు- అసలేమైందో చెప్పరాదూ?" అని ఛీత్కారం చేశాడు. అతని ఛీత్కారంతో ఇందిర మరింత ముఖం ముడుచుకుంది. ఈ వ్యవహారం యిలా సాగుతే అసలుకే మోసం వస్తుందేమోనని ఆనందరావు కలుగజేసుకొని "ఆ అమ్మాయేదో ఆపదలోపడి వెళ్ళిపోతే మధ్య మీరిద్దరూ కొట్టుకుంటారేమిటి? అదికాదోయి కృష్ణమూర్తీ!–కళ్యాణి వాళ్ళ నాన్న పోయాడు కదూ! మనసువిరిగి ఇంకీ ఇంట్లో ఉండలేనని వెళ్ళిపోయిందంతే–ఊళ్ళో మరెవరినో ఆశ్రయించి ఉంటుంది. పాపం! దిక్కులేని పిల్లకదూ, ఎవరో ఒకరు చేరదీసే ఉంటారు" అన్నాడు.

కృష్ణమూర్తి ముఖం షాక్ తిన్నవాడిలా ఒక్కసారి పాలిపోయింది. "వాళ్ళ నాన్నగారు పోయారా! ఆవిడ ఉండలేనంటే మాత్రం నువ్వేమని పంపించేశావు ఇందిరా! అంత ఆపదలో ఉన్న మనిషి ఏమైనా అంటుంది. అలా అని గాలికి ధూళికీ వదిలేయడమే?" అన్నాడు ఆమె ముఖంలోకి పరీక్షగా చూసి." బాగుంది వరస. మహరాజా అంటే... అన్నట్లుంది. ఆవిడ కష్టాలన్నీ నేనేం తెచ్చిపెట్టానా? ఏదో మాతోపాటు సరదాగా ఉంటుందని చోటిస్తే ఇక్కడుండడంవల్లే తనకన్ని కష్టాలు వచ్చేయి, ఎక్కడికోపోతానంటే నేనేం చేయనూ? కొంగు పట్టుకుని వేలాడమన్నావా? కొన్నాళ్ళు నా యింట్లో ఉండి అలా విదిలించుకు వెళ్ళిపోయిందే–నేనెంత బాధపడాలో ఆలోచించావా?" అంది ఆమె అలిగిన సత్యభామ మూతిపెట్టి.

కల్యాణి వచ్చి వెళ్ళిపోవడంలోని అనౌచిత్యాన్ని ఎంత వివరం చేయాలో అంతా వివరించడానికి ప్రయత్నించింది ఇందిర. కాని అంతా విన్నాక కూడా అతనికి ఈ తండ్రీకూతురిద్దరూ చెప్పినదానిలో ఏమాత్రం సబబు గోచరించలేదు. అంతగా వ్యాఖ్యానించి ఆమె అతని సానుభూతినంతా తనవేపు తిప్పుకునేందుకు ప్రయత్నించింది కాని కృష్ణమూర్తికి కడుపులో కెలికినట్లయిది. ఏదో బాధ కలిగింది. అతడు ఒకరకంగా ఇందిరతోనూ ఆ యింటితోనూ బాగా పరిచయమున్నవాళ్ళలో లెక్క. ఐనా వ్యక్తులను గురించి ఎక్కువగా అతనెప్పుడూ ఆలోచించలేదు. వాళ్ళెలా బతుకుతున్నారు– వాళ్ళేం చేస్తుంటారు అనేది కూడా పట్టించుకోలేదు. అసలతను తనగురించి తనే ఎక్కువ ఆలోచించలేదెప్పుడూ. ఆ అవసరాన్ని కల్పించే జీవిత సమస్యలేవీ అతనికెదురు రాలేదు. నిలకడగా నాల్గు తరాల వరకూ తరిగిపోని ఆస్తి. తండ్రికొక్కడే కొడుకు. అర్జన గురించిన తాపత్రయం లేదు, వ్యయం గురించిన విచారమూ లేదు. అలాంటి కృష్ణమూర్తికి జీవిత సమస్యలేముంటాయి కనుక? అందంగా ఆకర్షణీయంగా నవ్విస్తూ కవ్విస్తూన్న ఇందిర ఇన్నాళ్ళూ అతనికొక ఆటబొమ్మగా కన్పించింది. హాయిగా ఆడుకున్నాడు. అన్నిసార్లక్కడికి వచ్చిపోయినా అతనికి కల్యాణితో పరిచయం తక్కువ. కల్యాణి గురించి 'ఏమిటీపిల్ల!' అని అతడెప్పుడూ ఆలోచించలేదు అంత మాత్రాన కల్యాణి గురించి అతనికొక

అభిప్రాయం లేకపోలేదు. ఏదో లీలగా తెలుసు—చల్లని మనిషి—మెత్తని మనస్సు — అనిపించిందతనికి. కల్యాణి తండ్రి చనిపోయాడు. ఆమె దుఃఖంలో ఉంది. ఆ దుఃఖంలో వచ్చి వెంటనే ఎక్కడికో వెళ్ళిపోయింది సామానుతో సహా. ఎందుకు వెళ్ళిపోయింది? ఎవరు వెళ్ళగొట్టారు? వీళ్ళంతా ఆమెనేం చేశారు? ఒక్కసారిగా కృష్ణమూర్తికి ఇందిరా కల్యాణీ సాక్షాత్కరించారు. కేవలం బాహ్యా స్వరూపంలో కాదు—వాళ్ళ అంతరంగాలు బయటపడినట్లయింది. అంతవరకూ కలగలుపుగా ఉన్న ఆలోచనల్లోంచి ఒక నిర్దిష్టమైన అవగాహన కలిగినట్లయింది మౌనంగా అర్థరహితంగా వీధివైపు చూస్తూ ఊరుకున్న కృష్ణమూర్తి తటాలున ఇందిరవైపు తిరిగి 'నాకంతా అర్థమైంది' అన్నట్లు, ఉరిమినట్లు చూశాడు. ఆ చూపుతో ఆమె అదిరిపడింది. కాని ఆ అదటును వ్యక్తం చేయకుండానే కూర్చున్న మనిషి దిగ్గునలేచి విలాసంగా ఒళ్ళు విరుచుకొని "జపం విడిచి లొట్టలలో పడ్డట్లుంది. ఉండు టీ తీసుకొస్తాను! చిలక కాస్త హుషారుగా పలుకుతుందేమో?" అన్నది.

కృష్ణమూర్తి ఏదో జ్ఞాపకం వచ్చినవాడిలా గబుక్కున లేచి నిల్చుని "వద్దు ఇందిరా! ఇప్పుడేం టీ, మధ్యాహ్నం అవొస్తూంటే—నేను వెళుతున్నాను" అంటూ ముందుకు నడిచాడు.

"అదేమిటా వాటం—ఆదివారం పూట వచ్చి వెంటనే వెళ్ళిపోతానంటావేమిటి? ఈ కొత్త అలవాటెప్పటినుంచీ? పోనీలే టీ తాగవద్దు. కారియర్ రానే వచ్చింది. ఆదివారం స్పెషల్ అయ్యర్ అవియల్ పంపించే ఉంటాడు. నీకిష్టం కదూ—భోజనం చేసి—" ఇందిర వాక్యం పూర్తికాకముందే అడ్డువచ్చి కృష్ణమూర్తి "భోజనం మరొకచోట బుక్ ఐపోయింది, ఒక ఫ్రెండు పిల్చాడు, అందుకే వెళ్తున్నా" అన్నాడు.

"ఏమిటోయ్ మరీ అంత బెట్టు చేస్తున్నావు. పోనీ భోజనం చేయగానే వస్తావా, సాయంత్రం అలా ఎక్కడికైనా పోదాం" అన్నది ఇందిర.

"ఇవాళింక లాభంలేదు ఇందిరా! అక్కడే సాయంత్రందాకా గడిపేస్తాను" అంటూ కృష్ణమూర్తి నడవగుమ్మం దాటుతూంటే ఆనందరావు ముఖం మీద నుంచి పేపరు అడ్డం తీసి "అరే! వెళుతున్నావుటోయ్! మరెప్పుడు మార్చేస్తావు మకాం?" అన్నాడు, అంతవరకూ జరిగినదేమీ విననివాడిలా.

కృష్ణమూర్తి వీధివసారా మెట్లు దిగుతూ వెనకకి తిరగకుండానే "ఆలోచిద్దాంలెండి తొందరేముంది?" అంటూ రోడ్డుమీదకు నడిచేడు.

ఎటు వెళుతున్నాడో ఎందుకు వెళుతున్నాడో తెలియకుండానే నడిచేస్తున్న అతన్ని కాలేజీరోడ్డు మలుపు తిరగగానే ఎవరో వీపుమీద చరిచారు. వెనక్కి తిరిగిచూస్తే ప్రకాశం. హాస్పిటలునుండి అడ్డదారంట వస్తున్నాడు. అలిసిపోయిన విగ్రహం. మెడలో నీరసంగా వేలాడుతున్న స్టెతస్కోపు. వెతికినా ఎక్కడా చిరునవ్వు కనపడని దిగాలుపడిన మొఖంతో ప్రకాశం "ఇంటికెళ్ళి వస్తున్నావా?" అని ప్రశ్నించాడు కృష్ణమూర్తిని. కృష్ణమూర్తి అతనివేపు తేరిపార చూసి మనిషేం ఇలా ఉన్నాడు అనుకున్నాడు. అతనికి వెంటనే కల్యాణి జ్ఞాపకమొచ్చింది. కల్యాణి వెళ్ళిపోవడంలో ఇతని పాత్రేమిటి? అని ప్రశ్నించింది కృష్ణమూర్తి మెదడు. ఈ ఆలోచనలన్నీ బుర్రలో మెదులుతూండగానే "ఆ ఇంటినుండే వస్తున్నా!" అనేసి "అవునుగాని కల్యాణి వాళ్ళ

నాన్నగారు పోయారట కదూ?" అన్నాడు. తలవని తలంపుగా ఎదురైన ఈ ప్రశ్నకు మరింత బెదరిపోయి "అదంతా జరిగి చాలా రోజులే అయిందిలే–" అంటూ "ఈ మధ్యనెక్కడా కనబడడం మానేశావు. ఊళ్ళోనే వున్నావా?" అనడిగాడు ప్రకాశం అడిగిన ప్రశ్నకు సరిగా సమాధానమైనా చెప్పకుండా మరేదో మాట్లాడుతున్న ప్రకాశం వాలకం కృష్ణమూర్తికేమీ అర్థం కాలేదు.

"ఊళ్ళోనే ఉన్నాను. పోనీ ఇది చెప్పు. నీకైనా తెలుసునా, కల్యాణి యిప్పుడెక్కడుంటూందో?" అన్నాడు కృష్ణమూర్తి. తనని చూడకుండానే వెళ్ళిపోతున్నవాడిని నేరకపోయి పిల్చానే అని ఉసూరుమన్నాడు ప్రకాశం. "కల్యాణెక్కడుంది చెప్పు?" అని తనని నిలదీసి అడిగినట్టయింది. నిజానికి ఎక్కడుందో తనకే తెలియదు ఏమని చెప్పగలడు? అతని మనసులో ఏదో పెట్టుకుని అడుగుతున్నాడని ప్రకాశానికి తెలిసింది. తానేదో నేరం చేసినట్టూ, కృష్ణమూర్తి ఆరా తీయడానికి వచ్చినట్టూ కనపడ్డాడు ప్రకాశం. భయంగా కంగారుగా చూస్తూ "తెలియదోయి– ఏమిటో అనాలోచితంగా తొందరపడి వెళ్ళింది" అన్నాడు. తండ్రీ కూతుళ్ళ మార్గానికి ప్రకాశం ధోరణేమీ భిన్నంకాదు అనిపించింది కృష్ణమూర్తికి. వీళ్ళెవరివల్లా అసలేం జరిగిందో తెలియదు. ఏదీ జరగకపోతే కల్యాణి అలా అర్ధాంతరంగా వెళ్ళిపోలేదు యిక ప్రకాశంతో ఏం మాట్లాడినా ఫలితం శూన్యం అనుకుని "వెళుతున్నా, పనుంది" అంటూ ముందుకు జారుకున్నాడు అతను. ఇంతటితో వదిలాడంతే చాలనుకుని లాడ్జివైపు నడిచాడు ప్రకాశం.

బరువుగా అడుగులువేస్తూ కృష్ణమూర్తి కల్యాణిగురించి తీవ్రంగా ఆలోచించాడు. ఎక్కడికి వెళ్ళుంటుంది? ఎవ్వరూ చెప్పరేం? మళ్ళీ వాళ్ళ వూరు వెళ్ళిపోలేదు గద! అక్కడెవరున్నారు కనుక! కల్యాణికి తండ్రితప్ప ఇంకెవరూ ఆసరా లేరని ప్రకాశమే చెప్పాడెప్పుడో. అతనికి మనుష్యుల నభిమానించడమే తెలుసు. ద్వేషించడం అతని తత్వంలో లేదు. ఎలాంటి సంఘంలోనైనా నిబ్బరంగా నిండుగా కాలక్షేపం చేయగలడు. జేబులెప్పుడూ నిండుగా ఉంటాయి. కనుక అవసరానికి ఆదుకునే సహాయబుద్ధి ఉన్నవాడు. కల్యాణి కేదో అన్యాయం జరిగింది. వీళ్ళందరూ కలిసి ఆమె కేదో చేశారు; ప్రతి ఒక్కరూ తప్పించుకునేందుకు చూస్తున్నారు – అనుకునేసరికి అతనికి ఏమైందో తెలుసుకోవాలనే తహతహ హెచ్చింది. తలవని తలంపుగా ఆమె ఎక్కడుందో తెలుసుకోవాలనే ఆసక్తి కలిగింది. ఎలా తెలుసుకోవడం? పోనీ యూనివర్సిటీకీ వెళితే – ఆవిడ క్లాస్‌మేట్స్‌ని వాకబు చేస్తే? ఏమైనాసరే కల్యాణి ఉనికి తెలుసుకుని ఒకసారామెను కలుసుకోవాలి–పట్టుదలగా బయలుదేరాడు కృష్ణమూర్తి.

☆ ☆ ☆

కాళ్ళీడ్చుకుంటూ ప్రకాశం తన రూంకు చేరి బట్టలు మార్చుకుని నీరసంగా ఈజీచెయిర్లో కూలబడ్డాడు. యింతలో ఇందిర వచ్చి "ఒంటిగంటయిది. భోజనం చేదాం రా!" అని పిలిచింది. "ఇదేమిటి నువ్వింకా భోంచెయ్యలేదూ?" అన్నాడు ప్రకాశం. మామూలు రోజుల్లో పదిగంటల కల్లా భోజనం చేసి ఆఫీసుకు పోయే ఇందిర ఆదివారాలలో కూడా ఆ టైముకే భోజనం చేసేస్తుంది. పగటిపూట ప్రకాశం కోసం ఆగడం ఆమె కలవాటు లేదు.

"ఆ ప్రశ్నలన్నీ తరువాత వేద్దువుగాని, ముందు భోజనానికి లేవయ్యా నాయనా!" అని గదిమింది ఇందిర. లక్ష ఆలోచనలతో బరువెక్కి వచ్చాడు ప్రకాశం. తిన్నగా ఊపిరైనా పీల్చుకోనివ్వదేమిటీ పిల్ల? ఎప్పుడు వచ్చినా గాలివానలా వస్తుంది. అందులోపడి కొట్టుకు పోవలసిందే యింక అనుకున్నాడు ప్రకాశం. లోలోపల విసుక్కుంటూనే- లేచి భోజనానికి వెళ్ళాడు.

భోజనందగ్గర కూర్చున్నంతసేపూ తన సహజమైన ధోరణిలో ఏవేవో కబుర్లు చెప్పింది. ప్రకాశం వాటిని వేటినీ బుర్రకెక్కించుకోకుండానే ఊ కొట్టాడు. అతను భోజనం కూడా సరిగా చెయ్యలేదు. "ఏం, మధ్యలో ఒక ఫీడింగు అయిందా ఏమిటి? అలా తింటున్నావు?" అంది ఇందిర. దానికికూడా ప్రకాశం "ఉహూ!" అనిమాత్రం అనేసి ఊరుకున్నాడు. భోజనమయాక సావకాశంగా మళ్ళీ అతని గదిలోకి వచ్చింది ఇందిర. పక్కమీద పడుకుని యింటి కప్పుకేసి చూస్తూ పరధ్యానంగా ఉన్న ప్రకాశం నోటికి జబర్దస్తీగా కిళ్ళీ యిచ్చింది. ప్రకాశం చిరాకుగా "నేను కిళ్ళీ వేసుకోను అని తెలుసుకదా, ఎందుకీ బలవంతం?" అన్నాడు. "వ్రతం చెడిపోదులెద్దూ – మరేం ఫరవాలేదు" అంది ఇందిర వెటకారంగా నవ్వి. కిళ్ళీ బుగ్గకి తోసేసి ప్రకాశం మళ్ళీ ఆలోచనలో పడ్డాడు. ఎందుకీ అమ్మాయి తననిలా వెంటాడుతూంది? లేదు లేదు. తనే ఆమె వెంటబడేలా చేస్తూంది. ఇందిర ముందు తన యిష్టానిష్టాలంటూ ఎప్పుడూ చెల్లలేదు. ఎలాంటి పరిస్థితులలోనూ తన మనసును కనిపెట్టి అందు కనుగుణంగా ప్రవర్తించదు. తనను ఆమె కనుగుణంగా తిప్పుకుంటుంది. ప్రకాశానికి తనమీద తనకే జాలివేసింది. అంతలోనే అసహ్యం వేసింది. ఆ అమ్మాయి ఎలా తిప్పితే అలా తిరిగిపోవడమేనా? నాకు వ్యక్తిత్వం అంటూ లేదూ – "ఏమిటి ప్రకాశం, మాట్లాడవేమిటి? ఎందుకంత దిగాలుగా ఉన్నావు, ఏం జరిగిందివాళ?" అంటూ ప్రకాశం ఆలోచనల కడ్డువచ్చింది ఆమె.

"ఇప్పుడా ఈ మాటడుగుతుంది?" అనుకున్నాడు ప్రకాశం. నిజానికి యింటికి రాగానే ఇందిర "ఎందుకలా ఉన్నావు చెప్పవూ?" అని లాలనగా అడుగుతుం దనుకున్నాడు. విపరీతంగా బరువెక్కిపోయి వచ్చాడు తను. ఎవరికో అదంతా చెప్పేయాలి. ఎలాగో ఆ బరువు దించేసుకోవాలి. అనుకున్నట్టు ఇందిర వెంటనే అడగలేదు. దానితో అతను మరింత బరువెక్కిపోయాడు.

"నీ కెందుకులే నా బాధలగురించి వినడం!" అన్నాడు కోపంగా.

"నాకు తెలుసులే నీ కెందుకు కోపం వచ్చిందో....రాగానే ఏమిటలా వున్నావు? చెప్పు చెప్పు అని నిన్ను బాధపెట్టేస్తే అదే నీకు బాగుండేది. ఆ మాటలలో పడి భోజనం కాస్తా మానేస్తే నీకు తృప్తి కదూ!" అంది ఇందిర. మళ్ళీ ఆ ప్రశ్నకు తట్టుకోలేకపోయాడు, ప్రకాశం. "అదికాదు ఇందిరా, ఎందుకిప్పుడా గొడవంతా!" అని అన్నాడు.

"వెర్రిమొర్రి జవాబులు చెప్పక ఆ గొడవేమిటో చెపుదూ!"

ప్రకాశానికి కావలిసినదదే. ఎలాగో అలాగ తనచేత వాగించాలి. అప్పుడుకాని మనస్సు తేలికపడదు. "గొడవ కేముంది? యివాళ మా మామయ్యొచ్చాడు" అని మొదలుపెట్టాడు.

"వస్తే..."

"ఇంక దమ్మిడీ పంపించడట. చదువుకోవాలనుంటే అప్పోసప్పోచేసి చదువుకో మన్నాడు. లేకపోతే యింటికొచ్చేసి హాయిగా వ్యవసాయం చేసుకోమన్నాడు. ఒక్క దమ్మిడీకూడా పంపించదలచుకోలేదని ఖచ్చితంగా చెప్పేశాడు."

"కారణం?" అంది ఇందిర ప్రశ్నార్థకంగా చూసి.

"కారణాలు లక్ష చెప్పాడు...ఉన్న ఆస్తి అంతా నా చదువుకే తగలేశాడట. అమ్మేయగా అమ్మేయగా గరువుకింద మాగాణి ఒక్క ఎకరం మాత్రం మిగిలిందట. హారిమీద గిరిపడ్డా దానిని అమ్మదలచుకోలేదట..."

"అవునుకాని ప్రకాశం! అమ్మడానికి అమ్మదల్చుకోకపోవడానికి మధ్యనతడెవడు? నువ్వెళ్ళి నీ వ్యవహారం చూసుకోలేవూ...నీ ఆస్తినంతా నీకు లెక్క చెప్పమను మిగిలిన భూమెంతుంటే అంతా అమ్మకం చేయించు.. చేతిలోకి డబ్బొ వస్తుంది, అక్కడితో ఆ లంపటం వదుల్తుంది." సుళువుగా తీర్మానించింది

"అవన్నీ చేస్తామే అనుకో...అప్పుడు మా అమ్మ గతేమిటి? ఇంత జరిగితే ఒక్కక్షణం మా అమ్మ నక్కడ ఉండనియ్యడు. దీనికంతటికీ అసలు కారణం వేరు ఇందిరా! ఎవరో కిట్టనివాళ్ళు నా గురించి చాలా అభాండాలు వేస్తూ, పెద్ద ఉత్తరం రాశారట. నే నాడపిల్లలతో తెగ తిరుగుతున్నాననీ, చదువు సంధ్యలెత్తిగట్టేశాననీ, షికార్లూ సినిమాలూ ఎక్కువయేయనీ...యింకా ఏవేవో. దానితో శివతాండవమెత్తుతున్నాడు."

"నువ్వో చిన్నపాపాయివీ మీ మామయ్య నీకో గార్డియనూ అనుకున్నా వేమిటోయ్ నిన్ను తీర్చిదిద్దటానికి! ఈ వైరాగ్యేశాలేం కుదరవు. నీకు రావలసింది నీ కప్పచెప్పమని గట్టిగా అడుగు, మీ మామయ్య రంగు కాస్తా బయటపడుతుంది."

"మరి మా అమ్మనేం చేయమంటా విందిరా? ఇప్పుడున్న పరిస్థితిలో ఆవిడను నాతో తీసుకువచ్చి ఎక్కడ పెట్టుకోనూ – ఇన్నాళ్లుగా ఆ యింటినంటిపెట్టుకుని ఉంది. మామయ్యతో తెగతెంపులు చేసికుంటానంటే ఆవిడ గోలు గోలు నేడుస్తుంది" అన్నాడు ప్రకాశం నిస్పృహగా.

"అమ్మ మామయ్యని వదల్లేదు, అమ్మని నువ్వు వదల్లేవు, ఇంక నే చెప్పేదేముందీ? మీ ముగ్గురూ కలసి కట్టకట్టుకుని ఏ గంగలోనైనా దిగండి..." అంటూ "నాకు నిద్దరొస్తోంది, నే పోతున్నా" అని క్రిందకి వెళ్ళింది ఇందిర.

ఆమె నిర్లక్ష్యానికి ప్రకాశం కుంగిపోయాడు. తన బాధతో తాదాత్మ్యం లేదు–సాను భూతిలేదు. కనీసం ఒక్క ఓదార్పు మాటలేదు. చివరకు ఏ గంగలోనైనా దిగండి అనేసి వెళ్ళిపోయింది. ఇదే కల్యాణైతే?...ఆ జ్ఞాపకంతో పాతాళానికి కుంగిపోతున్నట్లనిపించింది ప్రకాశానికి, ఇప్పుడు కల్యాణెందుకు గుర్తుకొస్తూంది? ఇన్నాళ్ళూ ఏమైపోయింది? సుఖాన్ని రుచి చూపించడానికి మాత్రమేనా ఇందిర? కష్టంలో సానుభూతి ఆశించకూడదా తను? అందుకు మాత్రం కల్యాణి కావాలా తనకు? ఈ ఇద్దరికీ ఏం తేడా? ఎలక్ట్రిక్ లైటుకీ చందమామకీ పోలికెక్కడ? కల్యాణి ఏమిటో తనకు తెలుసు. మరి తెలిసి తెలిసి ఎందుకలా చేశాడు? అమాయకంగా తన స్నేహాన్నాశ్రయించిందే–మనిద్దరం ఒంటరిగాళ్ళం, కలిసి ప్రయాణం చేద్దాం రా! అని ఆప్యాయంగా ఆహ్వానించింది. ఆ ఆహ్వానం అందుకున్నాడు–ఇదిగో నేను నీ వెంటే

ఉన్నానన్నాడు. అంటూనే సహస్ర యోజనాల దూరం వెళ్ళిపోయేడు. తానలా ప్రవర్తించకుండా వుంటే కల్యాణి వెళ్ళిపోయేదా? ఎన్నటికీ అలా వెళ్ళదు. పదిమంది ఇందిర లామె నవమానించినా ప్రకాశం తన ప్రక్కనుంటే కల్యాణి అలా వెళ్ళిపోదు అనుకున్నాడు.

ఉన్నట్టుండి ప్రకాశానికి ఇందిర మీద తగని కోపం వచ్చేసింది, ఏ ముహూర్తాన ఇందిర తన జీవితంలో ప్రవేశించిందో కాని, ఆ క్షణంనుంచీ తన జీవితాన్నంతా తలకిందులు చేసేసింది. ఎవరిచ్చారామెకీ అధికారం? ఎందుకు లొంగిపోతున్నాడు తను? కల్యాణిలాంటి వ్యక్తిని దూరం చేసుకున్నాడు. ఇంతకీ తనేం చేశాడు–ఇందిరే అన్నిటికీ అడ్డుపడింది. కల్యాణి వెళ్ళిన మర్నాడే తనకీ లోకంలోని బాధ్యతలేవీ గుర్తుకు రాని మరేదో లోకంలోకి లాక్కుని వెళ్ళింది. కల్యాణి మాట వచ్చినప్పుడల్లా ఏదో పోటుమాట విసిరింది. ఉత్తరం రాద్దామని కూర్చుంటే కలం కాగితం అవతలకు విసిరేసింది. అప్పట్లో ఎంతో బాధపడుతూ కల్యాణి ఉత్తరం రాసింది – ఒక్కసారి రమ్మని కోరింది. "పరీక్షలవుతున్నాయి గనుక ఎలాగూ వెళ్ళలేను – కనీసం ఉత్తరం వ్రాయనీ ఇందిరా!" అని తనెంతో ప్రయత్నించాడు. ఇందిర వింత ధోరణిలో వాదించింది. "ఉత్తరాలు వ్రాసీ తియ్యని కబుర్లు చెప్పీ ఎవరూ ఎవరినీ ఉద్ధరించలేరు. పరీక్ష వదులుకొని వెళ్ళగల ధీశాలివైతే వెళ్ళు–వెళ్ళినా ఏం చేస్తావు? నువ్వు వెళ్ళడం వల్ల అక్కడేం జరుగుతుంది? నీ దగ్గర డబ్బుందా–కల్యాణి కష్టం తీర్చడానికి? అదేగా ఆవిడ బాధ. ఆవిడకి కావలసినది నీ దగ్గర లేనప్పుడు ఎందుకా ఆర్భాటం? పరీక్ష మానుకొని ఆమె రమ్మంది అని పరుగెత్తితే–నిన్ను మళ్ళీ పరీక్షకు చదివిస్తుందా కల్యాణి?" – ఆ ధోరణికి, ఆ వాదనకు లొంగిపోయాడు తను.

ఛ! ఛ! లొంగిపోవడమేమిటి? ఇదిర చెప్పినదానిలో నిజం లేకపోలేదు. నువ్వేం చేయగలవు? నీ చేతిలో ఏముంది? అని తన అసహాయతను బట్టబయలుచేసింది తను శ్రద్ధగా చదువుకుంటున్నా తప్పకుండా పాసవుతున్నా చదువు పూర్తవడం పెద్ద గండంగా ఉంది. ఆడపిల్లలతో తిరిగి చెడిపోతున్నావని మామయ్య ఎంత తిట్టినా అదే నిజమయితే పరీక్షెలా ప్యాసయ్యాను అని అడగడానికైనా ధైర్యముంది తనకు. నిజంగా ఆనాడు కల్యాణి ఉత్తరం చూసి పరుగెత్తి ఉంటే పరీక్ష సున్న చుట్టేది, మామయ్యకు మరింత తిక్కరేగేది. ఎవరికోసమో పరీక్ష వదలుకుని పరిగెత్తావట అనికూడా అడిగేవాడు. అప్పుడు తనకు చెప్పకుందుకు జవాబు లేదు. మామయ్యకు కల్యాణైనా ఒకటే, ఇందిరైనా ఒకటే!

నిజమే! కల్యాణి కష్టాల్నాదుకునేటంత స్తోమత తనకు లేదు. కాని, ఏం చేయకపోయినా ఒక ఉత్తరం వ్రాసి ఉండాల్సింది తను. వెళ్ళగానే వ్రాసింది. తండ్రి పోయిన మర్నాడు వ్రాసింది. మళ్ళీ పదిరోజులకు మరొకటి వ్రాసింది. తను ఒక కార్డయినా వ్రాయలేదు.

తన అకృత్యాలకు తనను నిందించుకుంటూ, మళ్ళీ సమర్థించుకుంటూ తప్పంతా తనదికాదు; పరిస్థితులది అనుకుంటూ తేలిక పడడానికి ప్రయత్నిస్తున్నాడు ప్రకాశం. "నేనేం చేశాను? నేనేం చేయలేదు? అంతా అలా జరుగుతూంది – అంతే" అని సమాధాన పెట్టుకున్నాడు.

ఆలోచనా తరంగాలలో మునకలేసి అలిసిపోయి నిద్రపోయిన ప్రకాశాన్ని సాయంత్రం ఆరుగంటలయేక ఇందిర లేవగొట్టింది. మనస్సులో ఎంత చిరాకున్నా మైమరపించేలాంటి చిత్రమైన అందం. అందం కాదు ఆకర్షణ–ఇందిరలో ఏదో ఉంది. బద్ధకంగా కళ్ళు విప్పి "టైమెంతయింది ఇందిరా!" అడిగాడు ప్రకాశం.

"బీచికి వెళ్ళే టైమయింది. లే–జల్దీ–" అని తొందరపెట్టింది.

"ఇవాళెక్కడికీ కదలాలని లేదు ఇందిరా!" అన్నాడు అటునుంచి యిటు బద్ధకంగా వత్తిగిలి.

"మీ మామయ్యున్నాడనే! శీతకాలపు పొద్దు! సగం వెల్తురిప్పటికే పోయింది. అయ్యగారు లేచి అవతల అడుగు వేసేసరికి ఉన్న వెలుతురు కాస్తా యింకిపోతుంది. చీకట్లో ఏం చూడొచ్చాడులే మీ మామయ్య!"

ఎప్పటిలా ప్రకాశం లేచాడు. బట్టలు వేసుకున్నాడు. ఇందిరతో బీచికి వెళ్ళాడు. ఇద్దరూ కలసి చాలా దూరం తిరిగారు. ఇసకలో కబుర్లు చెప్పుకుంటూ ఎంతోసేపు కూర్చున్నారు.

"చలి వేస్తూంది. ఇంటికి పోదాం రా ఇందిరా!" అని ఒకటి రెండు సార్లు ప్రకాశం గొణిగాడు కాని ఆమె పడనీయలేదు.

"ఇంత హాయిగా ఉంటే చలేమిటోయి? షష్టిపూర్తి చేసుకున్నవాడిలా కబుర్లు చెబుతావు!" అంది.

ఇందిర దిగులుగా ఉన్న ప్రకాశానికి కాలక్షేపానికెన్నో కబుర్లు చెప్పింది వాళ్ళ బాస్‌ని చూసి అందరూ భయపడతారట. తనకి మాత్రం భయంలేదట వాళ్ళ బాస్‌కి కూడా తనంటే చాలా యిష్టమట. మధ్యాహ్నం ప్రకాశం మంచి మూడ్సులో ఉంటే మేటనీ సినిమాకి వెళ్ళాలని ప్లాను వేసిందట.

"ప్రొద్దుట కృష్ణమూర్తి వచ్చాడట కదూ?" అన్నాడు మధ్యలో ప్రకాశం.

"అవును వచ్చాడు. అతను రాకపోతే యూనివర్సిటీ పోస్టలుకైనా వెళ్దును. వచ్చి పోదెకబుర్లు నాలుగు చెప్పి వెళ్ళాడు–" అంటూ కృష్ణమూర్తికీ మధ్య బొత్తిగా మతి పోతూందనీ, ఏమిటో తననుకున్నలాంటి మనిషికాడనీ అరగంట వ్యాఖ్యానించింది. ఇందిర హుషారుగా మాట్లాడుతూ మధ్య చిలిపిగా తనమీద చేతులు వేస్తూ జుట్టు సవరిస్తూ ప్రకాశాన్ని మళ్ళీ వివశుడిని చేసింది. ఆ తన్మయంలో ప్రకాశం తన బెంగలన్నీ మరిచిపోయాడు. ఇందిర చెప్పిన వాటన్నిటికి "అవును – నాకూ అలాగే అనిపిస్తూంది..." "నిజమే సుమా – నేనూ అదే అనుకున్నాను" అనే ధోరణిలో వంతపాడాడు.

బీచినుంచి ఇంటికి వస్తూ ఇందిర ప్రకాశాన్ని "రేపు మీ మామయ్యతో ఏ సంగతి తేల్చేసుకో" అని మళ్ళీ హెచ్చరించింది. "ఆ మాట తల్చుకుంటే భయమేస్తూంది ఇందిరా!" అన్నాడు ప్రకాశం.

"ఏడిసినట్టుంది. నీకంత భయంగా ఉంటే నా దగ్గరికి తీసుకురా, నేనడుగుతాను!" అంది ఇందిర ధీమాగా.

"నే తీసుకు వచ్చేదేమిటి? రేపు తనే వస్తాడట ఎలాగానూ!"

"రానీ, నాకేం భయం లేదు!" అంది ఆమె.

మాటాడుతూ అగ్రహారం సందుల్లోంచి అడ్డుదారంట చెంగల్రావు పేటకు దారితీశారు. హఠాత్తుగా ప్రకాశం నిలబడిపోయి, "చచ్చాం! అదుగో మా మామయ్యొస్తున్నాడు" అన్నాడు.

"ఏడీ?"

"అదేం, అవతల లాంతరు స్తంభం దగ్గర ఎవరితోటో మాటాడుతున్నాడు. ఆ పంచె కట్టుకొని ఉత్తరీయం వేసుకున్నాడూ!"

"ఐతే అయింది కాని, అలా నిలబడిపోయావేమిటి?"

"ఇలా వెళితే ఎలాగూ ఎదురు పడతాం, ఈ పక్కవీధిలోంచి వెళదామా?" అన్నాడు ప్రకాశం సందేహిస్తూ.

"అంత భయమేమిటోయ్–కరుస్తాడా, మింగుతాడా–వెళ్ళి పలకరించే వెళదాం పద" అంటూ ముందుకు సాగింది ఇందిర. ప్రకాశం తప్పనిసరిగా అనుసరించాడు నాలుగంగల్లో అటునించి మామయ్యే వచ్చి తారసిల్లాడు.

## 9

అప్పుడప్పుడే తెల్లవారుతూంది. అంతవరకూ నిర్జీవంగా, నిర్మానుష్యంగా ఉన్న రోడ్డుమీద తిరిగి అలికిడి ప్రారంభమైంది. ధనుర్మాసం ప్రారంభమైంది కాబోలు, దూరాన ఎక్కడనుండో భజనపాటలు తేలి వస్తున్నాయి. తెల్లారకట్లనే నిద్రలేచిన కల్యాణి వీధి అరుగుమీద వాలుకుర్చీలో కూర్చుంది. పాలవాడు అంతకుముందే వచ్చి పాలుపోసి వెళ్ళాడు. వీధినానుకున్న గేటువేపు చూస్తూ కల్యాణి "మళ్ళీ తెల్లవారింది" అనుకుంది. ప్రహరీ గోడచుట్టూ ఉన్న పువ్వుల మొక్కలు రాత్రి మంచులో స్నానం చేసి స్వచ్ఛంగా ఉన్నాయి. ఓరగా వేసిన వీధిగది తలుపు తీస్తూ వసుంధర బైటికి వచ్చింది, రెండు చేతుల్లోనూ కాఫీ గ్లాసులు పట్టుకుని.

"అమ్మదొంగా! ఎప్పుడు నిద్రలేచావ్? నేను చూడనేలేదే?" అంది కల్యాణిని చూస్తూ.

జవాబుగా కల్యాణి చిన్న నవ్వు నవ్వేసి, "అప్పుడే కాఫీ తయారైపోయిందా?" అంది.

"తెల్లారకట్లే లేచి పాలవాడు ఎప్పుడొస్తాడా అని నిరీక్షిస్తూంటుంది మా పిన్ని. నిద్రలేవగానే ఆవిడకి కాఫీడోస్ పడాలి లేకపోతే మనిషి కాదు" అంది వసుంధర, కాఫీగ్లాసు కల్యాణికందిస్తూ.

గ్లాసు అందుకుంటూ కల్యాణి "ఈ వారం రోజులై నేను గమనించనేలేదు" అంది.

"ఈ వారం రోజులై యింకొకటి గమనించావు గనకనా?" అంటూ "నువ్వు యింకోలా అర్థం చేసుకోకు గాని– నిన్ను చూస్తే నాకు చాలా అసూయగా ఉంది కల్యాణీ!" అంది వసుంధర.

"అంటే?"

"వారం రోజులై ఒక్క యింట్లో మెసులుతున్నాం. చూస్తూన్నాను గదా—ఎప్పుడు చూసినా అప్పుడే స్నానం చేసి బట్టలు కట్టుకున్నంత ఒబ్బిడిగా ఉంటావు. పొద్దున్న నిద్రలేచినా అంతే. చీర నలగదు, జుట్టు రేగదు. ఆ కిటుకేదో నాక్కూడా కొంచెం చెబుదూ!" అంది వసుంధర

కల్యాణి పువ్వుల మొక్కలవేపు చూస్తూ, "అందులో కిటుకేమిటో నాకు తెలీదు, ప్రయత్నపూర్వకంగా నేనలా ఉండడం లేదు" అనేసింది, ఆలోచనలు ఏ ఆకాశాలోకాల్లోనో సంచరిస్తూన్నట్లు.

వసుంధర యింటికి కల్యాణి వచ్చి వారం రోజులు దాటింది. ఈ రోజు మళ్ళీ ఆదివారం. ఈ వారం రోజులూ వసుంధర కల్యాణిని అంటిపెట్టుకు తిరిగింది—కాలేజీ కూడా మానేసి. కల్యాణి మానసిక స్థితి ఏమిటి? వసుంధరకు అంతు చిక్కలేదు ఆమె ఏడిస్తే, ఆ ఏడుపు వసుంధరకు అర్థమై వుండును. ముందుగతి ఏమిటి? అని బెంగ పెట్టుకుంటే తను ఓదార్చగలిగి ఉండును. ఆ పిల్ల అటువంటివేమీ చెయ్యలేదు. ఆ అమ్మాయి తండ్రి మరణించాడు. నా అన్నవాళ్ళు లేరు. డబ్బు అసలే లేదు. ఆ స్థితిలో ఉన్న మనుషులు ఏం చేస్తారు? ఏమో, వసుంధరకు తెలియదు. కలవారి యింట్లో పుట్టి పెరిగింది వసుంధర. నాన్న ప్లీడరీ చేసి రెండు చేతులా ఆర్జించాడు. తన చిన్నతనంలోనే నాన్న పోయినా నలుగురన్నదమ్ముల తరువాత ఒక్కతే ఆడపిల్ల కావడం మూలాన అల్లారుముద్దుగా పెంచారు. రెండు తరాలు కూర్చుని తిన్నా తరగని ఆస్తి. ఆఖరన్నయ్యతప్ప, పెద్దవాళ్ళు ముగ్గురూ పెద్దపెద్ద ఉద్యోగాల్లో ఉన్నారు. ఆఖరన్నయ్య బెనారస్‌లో ఇంజనీరింగ్ చదువుతున్నాడు. పొరపొచ్చాలు లేని కుటుంబం. ఆఖరికి వదినెలకు కూడా వసుంధరంటే తగనిముద్దు. అన్నయ్యలు వదినెలు, మేనల్లుళ్ళు, మేనకోడళ్ళు, ఖర్చు పెట్టుకోవడానికి సమృద్ధిగా డబ్బు—వసుంధర సమస్యల్లా సమస్యలు లేకపోవడమే.

"పోనీలే, ఆ సంగతి వదిలేద్దాం గాని, ఇవాళ ఏం చేద్దాం చెప్పు. అహర్నిశలూ నువ్విలా యింట్లోనే కూర్చుండిపోవడం బాగులేదు. ఎలాగో తెప్పరిల్లి ముందుగతి ఆలోచించాలి" అంది వసుంధర.

కల్యాణి వెంటనే జవాబు చెప్పలేదు. కొంచెం సేపు ఆగి, "ఎంత ఆలోచించినా మనం చెయ్యగలిగేది ఏముంది వసుంధరా? జరిగినవన్నీ మన ఆలోచనల ప్రకారమే జరిగాయా? ఇలా నీ యింట్లో వచ్చి ఉంటానని కలలోనైనా ఊహించానా? మనం అనుకున్నవేవీ జరగవు. ఎప్పుడూ ఊహించనివి జరుగుతూంటాయి" అంది బరువుగా.

"అలాగని చేతులు ముడుచుకు కూర్చుంటామా కల్యాణీ? ఎవరికైనా తల్లి దండ్రులు శాశ్వతంగా ఉండిపోతారా? ఈ దుఃఖం ఎప్పుడో అప్పుడు అందరూ అనుభవించవలసిందే; ముందూ వెనకా. అంతే తేడా."

"నువ్వు చెప్పింది నిజమే వసుంధరా, ఆ కష్టంలోంచి తేరుకుంటున్నాను. తేరుకోక చేసేదేముంది గనుక? నీకు తెలీదు వసుంధరా! నేను చాలా మొండిదాన్ని, నాకూ ఆ సంగతి యిప్పుడే తెలుస్తోంది. చిన్నప్పటి నుండీ యీ ప్రపంచంతో నాకున్న అనుబంధమల్లా ఒక్క నాన్నే. లోకంలో అందరికీ ఎందరెందరో ఉంటారు. నాకు మాత్రం ఎవరూ లేరు. నా అనే ఒక్క బంధువు లేదు..."

"దానికేముందిలే, కొన్ని కొన్ని కుటుంబాలు అలాగే ఉంటాయి" అంటూ సరిపుచ్చపోయింది వసుంధర.

"–అలా కాదు వసుంధరా! ఎడారిలో ఒంటెలా ఇంత ఏకాకిగా మిగిలిపోయేవారు అరుదు. అలాంటివాళ్ళు యింక అసలే లేరనను. ఉంటారు ఈ ప్రపంచం అంటే నే నొక్కర్తెనే కాదుగదా! కాని మనిషిని పోలిన మనిషి ఉండరంటారు. ఐనా, నాపోటివాళ్ళు యింకా ఉంటేమాత్రం నాకేం సంతృప్తి? నా సమస్యలు నావి గదా!"

వసుంధర బాధ పడింది; అనాలోచితంగా తనలా అన్నందుకు ఆమె నొచ్చుకుందేమోనని. "నా ఉద్దేశం అదికాదు కల్యాణీ! బంధువర్గం ఎక్కువా తక్కువా ఉండడం మన చేతుల్లో లేదుగదా! అదే అనబోయాను" అంది.

కల్యాణి నిర్లిప్తంగా "ఏదీ మన చేతుల్లో లేదు వసుంధరా! నాకు బాగా అనుభవంలోకి వచ్చిన పాఠం అదొక్కటే, నా చేతుల్లోనే ఉంటే నాన్నను బతికించుకునేదాన్ని. లేదు కాబట్టే నాన్న నా చేతుల్లోనే పోయాడు. అక్కడితో నాకూ యీ ప్రపంచానికీ ఉన్న ఒక్క అనుబంధమూ తెగిపోయింది. ఐనా నేనింకా బతికేవున్నాను, ఆ ఘడియల్లో నాకు అనిపించింది, ఏ నూతిలోనైనా పడి చచ్చిపోవాలని. ఆ సంగతి మా మునసబు బాబాయి ముందే కనిపెట్టాడేమో, మూడు రాత్రిళ్ళూ మూడు పగళ్ళూ నాకు కాపలా కాచాడు. నేను చాలా మొండిదాన్ని వసుంధరా! ఇప్పటికి నేను రెండుసార్లు చచ్చాను. నాన్నతో సగం ప్రాణం పోయింది. మిగిలిన సగాన్నీ ప్రకాశం చంపేశాడు."

వసుంధర మళ్ళీ అడ్డొచ్చి, "అక్కడే నీతో ఒప్పుకోలేను. ప్రకాశం కాకపోతే వాడి తాత మరొకడు దొరుకుతాడు. అలాంటి బలహీనుడు వదలిపోవడమే మంచిదేమో! దురదృష్టమని ఎందుకనుకోవాలి! ఆ వ్యామోహంలోంచి బయటపడ్డావు, అంతే చాలు" అని ధైర్యం చెప్పబోయింది.

కల్యాణి మొహం కొంచెం జేవురించింది "నువ్వు పొరపాటు పడుతున్నావు వసుంధరా! నువ్వుకూడా దాన్ని వ్యామోహం అనుకుంటే నేనేం చెప్పగలను? మనుషుల్ని అర్థం చేసుకోలేకపోయానను, ఒప్పుకుంటాను. అతనిది వ్యామోహం అను. నిజమేనని యిప్పుడు నాకు తెలుస్తోంది. కాని నేనెప్పుడూ నువ్వనుకునే వ్యామోహంలో పడలేదు. ఎవ్వరేం అనుకున్నా నాకిపుడు భయంలేదు. కాని–నువ్వయినా నమ్ముతావా? కూడని చనువేదీ అతన్ని నా దగ్గరనుండి తీసికోనివ్వలేదు."

"ఛీఛీ! అలాంటి మాట నేను కలలోకూడా అనగలనా కల్యాణీ?" అంది వసుంధర.

కల్యాణి మళ్ళీ అందుకుని "దానికేం? లోకం అలాంటిది, నిన్న మనిద్దరం ప్రిన్సిపాల్ దగ్గిరికి వెళితే ఏమన్నాడు? ప్రకాశం పేరూ నా పేరూ జోడించి ఏవేవో కూశాడా లేదా? నేను ఊరు ఎందుకు వెళ్ళానంటాడు. నాన్న పోయాడు బాబోయ్ అని మొత్తుకున్నా అతనికి నా పరిస్థితి అర్థమైందా?" అంది కొంచెం ఉద్వేగంతో.

"పోనిద్దూ–అలాంటివేవీ మనం పట్టించుకోకూడదు. ఆయనకు మాత్రం నిజం నిలకడమీద తెలియకపోతుందా?" అంది వసుంధర.

కల్యాణి అపనమ్మకంగా చిరునవ్వు నవ్వి, "తెలుస్తుంది–తెలుస్తుంది–అవన్నీ ఉత్త మాటలు వసుంధరా! కొన్ని కొన్ని నిజాలు ఎన్నటికీ తెలియవు. ఈ మనుష్యులకి

అబద్ధం రుచించినట్లు నిజం రుచించదు. నిజం నిలకడమీద తేలుతుందనీ, ధర్మం జయిస్తుందనీ...అవన్నీ పుస్తకాలలో దగాకోర్లు రాసే మాటలు. చిన్నప్పటినుండీ నేను చూస్తున్నానుగా. ఈ ప్రపంచంలో అమలులో ఉన్న విలువలేమిటో యిప్పటికీ నాకు బోధపడలేదు. మా తాత చండశాసనుడని పేరు. రావణాసురుడనే వారంతా. చాలా ఘాతుకాలు చేశాడు. ఎన్నో కొంపలు కూల్చాడు. అతనికి కాలం హాయిగా వెళ్ళిపోయింది. డబ్బు సంపాదించాడు. పెత్తనం చెలాయించాడు. మా నాన్న అమాయకుడు. చాలా ధర్మంగా బతికాడు. ఎప్పుడూ ఇతరులే అతన్ని వాడుకున్నారుగాని, ఇంకొకళ్ళనుండి అతను తీసుకున్న దేమీలేదు. తెగించి ఒక్క తప్పుపని చేసి ఎరుగడు. బతికున్న ప్రతి మనిషి తన వాడేనని అభిమానంగా చూసేవాడు. ఫలితం? ఇదిగో నేను మిగిలాను మా నాన్న పుణ్యఫలంగా. తాకట్టులో ఉన్న యిల్లు మిగిలింది. ఆచార్లుగారి వడ్డీ మిగిలింది" అంటూ ఆగిపోయింది.

వసుంధరకి నిజంగా ఆ క్షణంలో జీవితం అంటే భయం వేసింది. సినిమాలో కూర్చున్న రిజర్వ్డు తరగతి ప్రేక్షకురాలికి; దుఃఖదృశ్యాలు చూస్తే కలిగే అనుభూతే ఆమెకీ కలిగింది. ఇలాంటి సినిమాలను ఇదివరకెప్పుడూ చూడలేదు ఈ పిల్లదేదో మామూలు దుఃఖమూ మామూలు కష్టమూ కాదు అనుకుంది మనసులో ఐతే మరేమిటి? వసుంధరకు బోధపడలేదు. కొన్ని నిముషాలు యిద్దరూ అలా మౌనంగా ఉండిపోయారు.

కాసేపుండి వసుంధరే–"ఆచార్లుగారంటే నిన్ను రైలుదాకా వచ్చి దిగబెట్టాడన్నావు, ఆయనేనా?" అనడిగింది.

"ఆఁ ఆయనే."

"వడ్డీ ఏమిటి?"

"ఏముంది? ఇంటిమీద మా నాన్నచేసిన అప్పుకి వడ్డీ మునసబూ ఆచార్లూ యిద్దరూ ఆ యిల్లు పంచేసుకుంటే నాకు కాణీ మిగలదు. ఇంకా నేనే బాకీ ఉంటానేమో. ఐనప్పటికీ మునసబు బాబాయి వంద రూపాయలు చేతిలో పెట్టాడు. ఎప్పుడవసర మొచ్చినా ఉత్తరం రాస్తే యింకా పంపిస్తానన్నాడు. ఈ చదువు పూర్తవడానికి అతను సహాయం చేస్తాడనే నమ్మకం నాకుంది. పోతే ఆచార్లుగారు మాత్రం అరడజను బత్తాయిపళ్ళు చేతిలో పెట్టి పంపించేశాడు. మా తాతగారే ఆ ఆచార్యులుని చిన్నప్పటి నుండీ ఇంట్లో పెట్టుకుని, భోజనం పెట్టి వైద్యం నేర్పారు" అంది కల్యాణి.

ఇంతలో పనిమనిషి వచ్చి యిద్దర్నీ స్నానానికి పిలిచింది. "పద కల్యాణీ! స్నానాలు చేసేద్దాం. తొందరగా తయారైతే మంచిది. తొమ్మిది గంటలకి మీ ఫ్రెండు కృష్ణమూర్తి వస్తానన్నాడు గదా!" అంది వసుంధర.

కల్యాణి మొహం ముడిచేసుకుని, "అన్నట్టు అదో గొడవ ఉంది కదూ! మరిచేపోయాను. నువ్వే ఏదో మాటాడి పంపించేయి, నాకు మాటాడాలని లేదు" అంది.

"అదేమిటలా అంటావ్? అతనెవరో నాకు ముక్కూ మొహం తెలియదు, ఆగంతుకంగా నిన్న రోడ్డుమీద తారపిల్లి నిన్ను పలకరిస్తే, నీకు తెలిసినవాడేమో,

ఎందుకైనా పనికివస్తాడని ఓసారి యింటికి రమ్మన్నాను, ఏం, నీకంత బాగా తెలియదా?"

"బాగా తెలియదు కాని, అతన్ని దూరంగా ఉంచాలన్నంత బాగామాత్రం తెలుసు. ప్రకాశానికి స్నేహితుడు మొదట్లో. ఆ మూలంగా వస్తూ పోతూ ఇందిరకు చాలా కావలసిన వాడయాడు. బాగా డబ్బుంది కాని యింకేమీ లేదు. కొంచెం విలాస పురుషుడు" అంది కల్యాణి.

"అదా సంగతి? ఇప్పటిదాకా చెప్పావుకావేం? మనం యింట్లో లేమని పిన్నితో చెప్పించేయనా పోనీ?" అని వసుంధర ప్రశ్నవేస్తే, "వద్దువద్దు, అతనెలాంటివాడైతే మనకేం? ఇంటికొచ్చిన మనిషిని అమర్యాద చెయ్యకూడదు. మనం కొంచెం ముభావంగా ఉంటేసరి. అర్థంచేసుకుని అతనే వెళ్ళిపోతాడు. కొంచెం కులాసా మనిషి అన్నానేగాని చెడ్డవాడనలేదే నేను!" అని కల్యాణి తన అభిప్రాయాన్ని వివరించి చెప్పింది. తరవాత యిద్దరూ స్నానానికి వెళ్ళిపోయారు.

☆ ☆ ☆

సరిగ్గా ఆ ఘడియల్లో కృష్ణమూర్తి కొచ్చిన్ కేఫ్‌లో కూర్చుని వేడి వేడి పెసరట్టు తింటున్నాడు. క్రితం రాత్రల్లా అతనికి నిద్రలేదు. రెండో ఆట సినిమా చూశాడు. అప్పటికీ నిద్రరాక లాడ్జిలో ఎన్.జీ.వో.లను లేపి పేకాట ఆడాడు. తెల్లవారేవరకూ బలవంతంగా వాళ్ళచేత ఆడించాడు. పదిహేను రూపాయలదాకా ఓడిపోయాడు. వెధవ పదిహేను రూపాయలు పోతేపోయాయిగాని మరిచిపోదలుచుకున్న వెన్నో తాత్కాలికంగా మరిచిపోగల్గాడు. ప్రకాశం, ఇందిర, ప్రకాశం-మేనమామ శేషావతారం, ఆనందరావు–వాళ్ళందరి స్మృతులూ అతన్ని భూతాల్లాగ వెంటాడాయి. అంతవరకూ జీవితంలో దేనికీ భయపడని కృష్ణమూర్తి ప్రకాశం మేనమామను చూసి నిజంగా భయపడ్డాడు. నల్లని ఆరడుగుల శేషావతారం కృష్ణమూర్తిని మూడురోజులనుండీ నానా మాటలూ అని, చివరకి చెయ్యిచేసుకుందుకు కూడా సిద్ధపడ్డాడు. మూడురోజుల క్రితం ఒక మధ్యాహ్నం వెతుక్కుంటూ వచ్చిన శేషావతారం తన నిద్ర చెడగొట్టడమేకాక కయ్యానికి దిగాడు. ప్రకాశాన్ని అన్నివిధాలా చెడగొట్టింది తనేనట. అమ్మాయిలందర్నీ లాడ్జిలో చేర్చి, తానేదో ప్రకాశం చదువంతా చెడగొట్టాడట. "ఎవరో కల్యాణి అనే పిల్లను నువ్వే లేవదీసుకొచ్చి ప్రకాశం లాడ్జీలో ఉంచావటగా! ఆ పెద్ద మనిషి ఆనందరావుగారు అంతా చెప్పారులే. ఈ వేషాలు కుదరవని అయనేమో ఆ లేచిపోయిన పిల్లను బయటకు గెంటేస్తే నువ్వు మా వాడితో పోట్లాట వేసుకున్నావటగా!" అంటూ తనతో తగవుకు వచ్చాడు. మొదట్లో కృష్ణమూర్తికి శేషావతారం అంటూన్న మాటలకి తలాతోకా తెలియలేదు. క్రమంగా బోధపడింది. కల్యాణి అనే పిల్లను తను తీసుకొచ్చి ప్రకాశం యింట్లో పెట్టాడు. ఆ పిల్ల అక్కడికి రాగానే కృష్ణమూర్తిని మరచిపోయి ప్రకాశం మీద మోజు చూపించింది. అదంతా గ్రహించిన ఆనందరావుగారు సంసారులున్న యింట్లో యీ గొడవంతా ఏమిటని ఆ అమ్మాయిని పంపించేశారు. ఆ కక్షకొద్దీ ప్రకాశం మీద అభాండాలు వేస్తూ కృష్ణమూర్తి శేషావతారానికి ఆకాశరామన్న ఉత్తరాలు వ్రాశాడు. శేషావతారం గొడవలో అతనికి అర్థమైన కథ అదీ.

శేషావతారం అంత గల్లంతు చేసినా అతను గట్టిగా కలుగచేసుకుని ఏమీ అనలేకపోయాడు. "ఏమిటి మీరనేది? దీనికేమైనా అర్థం, ఆధారం ఉందా? ఆనందరావిలా ఎందుకు చెప్పాడు? పదండి, మీ ముందరే అడుగుతాను" అందామని కృష్ణమూర్తి లోలోపల అనుకున్నాడేకాని నిజానికి ఆ క్షణంలో అతని నోటంట మాటే రాలేదు. అనవలసిన మాటలన్నీ శేషావతారం అనేశాడు. కృష్ణమూర్తి నిరుత్తరుడవటాన్ని అతని నేరానికొక నిదర్శనంగా తీసికుని శేషావతారం మరింత రెచ్చిపోయి "నీకు డబ్బుండగానే సరా! నువ్వే వేషాలేసినా చెల్లిపోతుందనుకున్నావా? ఏం ఆ తెచ్చిపెట్టుకున్న పిల్లనేదో నీ లాడ్జిలోనే పెట్టుకోలేకపోయావు? ఏదీ ఇక్కడ ఒక్క పెద్దమనిషీ లేడు సమయానికి. ఉంటేనా– నలుగురినీ అడిగేద్దును, మీరంతా చూస్తూ ఎలా ఊరుకున్నారయ్యా! ఇంత వ్యవహారం జరుగుతూంటే?అని" అంటూ మాట్లాడాడు. కృష్ణమూర్తి సహజంగా భీరువు కాడు, భయంతో నోట మాటరాకుండా పోయిందనడానికి. కాని అతనికి భయపడడానికీ ఎదుర్కోడానికీ ఇదివరకెన్నడూ ఇలాంటి పరీక్షా ఘట్టాలు రాలేదు. నిశ్చింతగా నిర్భయంగా కాలం గడిచిపోతూంది. మిన్ను విరిగి మీద పడుతుందని ఏ మానవుడూ ఊహించుకోలేడు. హఠాత్తుగా ఒక క్షణంలో నిజంగా అలా జరిగితే అప్పటికప్పుడేం చేయగలడు? దయ్యాలై తనని పీక్కుతింటారేమోనని కృష్ణమూర్తి ఎలా ఊహించుకోగలడు? అతని ఊహాకందని విషయం జరిగింది. కల్యాణిని తను లేవదీసుకురావడమేమిటి? ప్రకాశాన్ని పాడుచేయడమేమిటి? శేషావతారానికి ఆకాశరామన్న ఉత్తరాలు వ్రాయటమేమిటి? ఇదంతా ఆనందరావు చెప్పడమేమిటి? ఇందులో ఏది నిజం గనుక? 'అది కాదు మీరు పొరబడుతున్నారు అసలు విషయం ఇదీ!' అని చెప్పటానికి కూడా వీలులేదు. శేషావతారం అనేదానిలో ఏదీ అవుననటానికి వీలులేదు గనుక. జగమంతా మిథ్య–ఈ సృష్టి. ఈ విశ్వం, ఈ మనుష్యులూ, సంబంధ బాంధవ్యాలూ, అంతా మిథ్య అనే తలంపు వచ్చినపుడు మానవుడు దేని గురించీ ఆసక్తి చూపలేడు. అంతా మిథ్య అయినపుడు ఆసక్తి దేనిమీద? కృష్ణమూర్తి వింటున్నదంతా మిథ్య. అంతా అబద్ధం. తానెరిగినదానికీ శేషావతారం ఆరోపిస్తున్న దానికీ ఎక్కడా పోలిక లేదు. అందుకే అతడు ఆశ్చర్యంతో స్తంభించిపోయి అంతా వింటూ నిల్చుండిపోయాడు.

శేషావతారం వెళ్ళిపోయాక అలా ఏకాంతంగా కాసేపు పడుకుని సాయంత్రం అయాక రోడ్లన్నీ తిరిగాడు కృష్ణమూర్తి – ఏమిటి విచిత్రం? మనుష్యులెందుకిలా ప్రవర్తిస్తారు? ఎక్కడుంది దీనికి కీలకం? అని ఎంత ప్రశ్నించుకున్నా అతనికి జవాబు దొరకలేదు. ఇంత జరిగినా నోరు మూసుకుని తానెందుకూరుకోవాలి? వెళ్ళి ఆనందరావు నడిగితే? అవును అడగాలిసిందే. అడిగి ఏం లాభం? శేషావతారంతో ఇన్ని అబద్ధాలు చెప్పిన ఆనందరావు తనతో తిరిగి అబద్ధం చెప్పడని ఎక్కడుంది? అసలావిషయమే తనకేం తెలియదని కూడా అనేయగలడు అనిపించింది కృష్ణమూర్తికి. సాయంత్రం ఏడుగంటలదాకా తిరిగి తిరిగి, 'ఏమైతే అయింది, దీని అంతు కనుక్కోవాలి. ఆనందరావు నడిగేస్తాను. ఏం చెపుతాడో తేలిపోతుంది' అనుకుని ఇందిర యింటికి వెళ్ళాడు. నడవ తలుపు ఓరగా వేసి ఉంది. తను సరాసరి లోపలికి వెళ్ళాడు. ఆనందరావు అతని గదిలో కూర్చుని పేపరు చదువుకుంటున్నాడు. అతను లోపలికి అడుగు పెట్టగానే ఆనందరావే ముందు పలకరించాడు– "ఏమోయి,

ఎప్పుడు ఊరినుండి రావటం" అని అంతవరకూ ఆనందరావు నేమేమిటడగాలో, ఎలా ముందు ప్రారంభించాలో ఆలోచించుకుంటున్న కృష్ణమూర్తి అతని మొదటి ప్రశ్నతోటే గతుక్కుమని "అదేమిటి? ఊరినుండి రావటమేమిటి? ఎవరు చెప్పారు?" అన్నాడు "అలా కుర్చీలో కూర్చో - అయితే నువ్వూరికి వెళ్ళలేదూ? ఎవరో అన్నారు - నువ్వూ ఆ అమ్మాయీ కలసి ఎక్కడికో వెళుతుంటే ట్రెయినులో చూశామని - అయితే అది జరిగి చాలా రోజులైంది కాబోలు" అన్నాడు ఆనందరావు జేబులోంచి చుట్టతీసి వెలిగించి.

కృష్ణమూర్తి మొహం తిరిగినట్లయింది....కాని అంతలోనే తేరుకుని "ఏ అమ్మాయి- ఎవరి గురించి మాట్లాడుతున్నారు?" అన్నాడు.

"ఎవరి గురించో నీతో ఎందుకు మాట్లాడుతానూ! నీ గురించే - నువ్వు కల్యాణిని తీసుకొని వెళ్ళావని వినికిడి" అని ఆపేశాడు ఆనందరావు. కృష్ణమూర్తికి ఉక్రోషమూ, కోపమూ పెల్లుబికిపోతున్నాయి కుర్చీలో కూచున్నవాడల్లా దిగ్గునలేచి "ఆనందరావుగారూ! అబద్ధాలాడడానికీ, కథలల్లి ప్రచారం చేయడానికీ మీది అందెవేసిన చెయ్యి అని అర్థం అయింది. నాతోటే మీరిలా మాట్లాడగల్గినపుడు శేషావతారంతో చెప్పినవన్నీ ఒక లెక్కలోకి రావు. కాని దీనంతటివల్లా మీరు సాధించేదేమిటి?" అన్నాడు ఆవేశంతో తీక్షణంగా అతనివైపు చూసి.

ఆనందరావు వీసం చలించకుండా నెమ్మదిగా చుట్ట నోట్లోనుంచి తీసి పొగవదల్తూ "వూరికే ఆవేశపడతావేమిటోయ్. నీ అవసరాలు నీవి-నువ్వేదో తప్పుచేశావని నేనెవ రితోనూ చెప్పలేదు. కల్యాణిని తీసుకొచ్చింది నువ్వుకాదూ-ఆమెను లేవదీసుకెళ్ళింది నువ్వు కాదా! జరిగింది జరిగినట్లు చెప్పానంతే" అన్నాడు

కృష్ణమూర్తి ముఖం జేవురించింది. అతనిలోని అణువణువూ ఆనందరావు మీద అసహ్యంతో నిండిపోయింది మరొక్కమాట అతనితో మాట్లాడడానికికూడా అసహ్యమేసింది. గిరుక్కున తిరిగి వెళుతూ లోపలకి తొంగిచూసి "ఇందిరా!" అని అరిచాడు.

"ఇంట్లో లేదు" అన్నాడానందరావు ముక్తసరిగా.

కృష్ణమూర్తి బయటికి వచ్చేశాడు. తలెత్తి డాబామీదకు చూశాడు. కాని ప్రకాశం రూంలో దీపం లేదు

కృష్ణమూర్తికి ఒక్కసారిగా పిచ్చెక్కినట్లయింది. తనకే మతిపోయిందా, లేక ఆనందరావుకా? అర్థంకాలేదు తనకు. ఆ రాత్రంతా అర్థంకాని బాధతో మూల్గిం దతని మెదడు. మరునాడుదయం హాస్పిటలుకు వెళ్ళి ప్రకాశాన్ని కలుసుకుందుకు ప్రయత్నించాడు కాని ప్రకాశం దొరకలేదు. ఏమీ తోచక కృష్ణమూర్తి తిరిగిన చోట తిరగకుండా తిరిగాడు. నాలుగు పెట్టెలు సిగరెట్లు కాల్చాడు. కనీసం పది కప్పులైనా కాఫీ తాగాడు. పూర్ణాలో మొదటి ఆట సినిమా చూసి, సరస్వతీలో మళ్ళీ రెండో ఆట సినిమాకి వెళ్ళాడు. ఈ ఆరాటంలో మధ్యమధ్య కల్యాణి ఎక్కడుందసలు ఎలా తెలుసుకోడం అనే బాధ ఎక్కువవుతూ వచ్చింది. ఆ మర్నాడు మధ్యాహ్నం యూనివర్సిటీకి వెళదామా అనుకుని బయలుదేరిన కృష్ణమూర్తికి తోవలో బస్సు స్టాపుదగ్గర కల్యాణి, వసుంధర కన్పించారు. ఎదురుగా వెళ్ళి పలకరించాడు. కల్యాణి

ముభావంగానే జవాబు చెప్పింది. "ఎక్కడుంటున్నారు?" అని ప్రశ్నించాడతను. "ఇదిగో ఈ అమ్మాయి దగ్గర" అని వసుంధరని పరిచయం చేసిందామె. ఇంతలో బస్సు వచ్చేసింది. "వస్తాం" అని బస్సెక్కిపోతూ వసుంధర "ఒకసారి మా యింటికి రండి" అని ఆహ్వానించింది. "మీ ఇల్లెక్కడో చెబుతారా దయచేసి!" అనడిగాడు కృష్ణమూర్తి "డాబా తోటలో సినిమాహాలు ప్రక్కనే ఉన్న డాబాయిల్లు" అంటూనే బస్సెక్కిందీ. కృష్ణమూర్తి బస్సుకదలబోతూంటే "రేపు ఉదయం తొమ్మిది గంటలకు వచ్చి కలుసుకుంటాను" అనేసి వెనక్కి తిరిగిపోయాడు.

అక్కడనుండి అతని కాళ్ళు సరాసరి వాల్తేరు రైల్వేస్టేషనువేపు దారితీశాయి. సగం దూరం వెళ్ళేదాకా ఎటు వెళుతున్నాడో తనకే తెలియదు కల్యాణి కనపడింది, ఎక్కడుందో తెలిసింది. లోలోపల అతనికేదో అనిర్వచనీయమైన సంతృప్తి కలిగింది. ఉన్మత్తుడివలె నడక సాగించాడు. అల్లంత దూరంలో వాల్తేరు స్టేషను కనిపించేసరికి తప్పుదారి పట్టినట్లు గ్రహించాడు. రైల్వే పరిసరాలలో నిలుచునేసరికి హఠాత్తుగా మెరుపువంటి ఆలోచన తట్టింది, వాచీ చూచుకున్నాడు. ఐదు గంటలు అప్పుడే దాటింది. ఇంకో పదినిముషాల్లో ఇందిర ఆఫీసునుండి ఆ దారినే ఇంటికి రిక్షాలో వెళుతుంది. కాస్సేపు ఆ రోడ్డుమీదే పచారుచేస్తే ఇందిర ఎదురుపడవచ్చు.

అంతపనీజరిగింది. దూరంనుండివస్తున్న ఆమె రిక్షానుపోల్చి ఎలక్ట్రిక్ స్తంభాన్ని ఆనుకుని నించున్నాడు. అతన్ని రిక్షా సమీపించగానే ఇందిర చేటంత మొహం చేసుకుని సీటులోంచి ముందుకి వంగుతూ రిక్షావాడిని ఆపమని "హల్లో మైడియర్ కృష్ణమూర్తీ! ఎక్కడనుండి ఎక్కడికి?" అని పలుకరించింది.

కృష్ణమూర్తి సీరియస్‌గా మొహం పెట్టి "మీ ఆఫీసుకే, నిన్ను కలుసుకుందామనే వస్తున్నాను" అన్నాడు.

ఇందిర రిక్షా దిగిపోయి "అరె! తమాషాగా లేదూ! ఎలాగైనా నిన్ను, కలుసుకోవాలని నిన్నటినుండీ అనుకుంటున్నాను అసలు యీ సాయంత్రం మీ లాడ్జికి రావాలనుకుంటున్నాను భలేవాడివే! ఇద్దరం ఒక్కలా ఆలోచిస్తూ, ఒకరికోసం ఒకరం తహతహలాడిపోతున్నామన్నమాట!" అంటూ ఫుల్‌స్టాపులూ, కామాలూ లేకుండా గలగలా మాటాడేసింది. కృష్ణమూర్తి దిగ్భ్రాంతుడైనాడు, ఏమిటి యీ అమ్మాయి? ఎంత చక్కగా నటించగలదూ! అనుకున్నాడు; పెల్లుబుకుతున్న కోపాన్ని అణచిపెట్టి.

"ఇంత తహతహలాడేదానివి మొన్న సాయంత్రం యింట్లో ఉండికూడా లేనట్లు నాన్నచేత బొంకించావేం? కల్యాణిమీదా నామీదా లేనిపోని పుకార్లు పుట్టిస్తున్నావేం? మొత్తంమీద భలేదానివి ఇందిరా! నీతో జోక్యం పెట్టుకోవడం నాదే బుద్ధిపొరపాటు!" అన్నాడు. ఇందిర జవాబు చెప్పలేదు. మౌనంగా అలా నిలబడిపోయింది. ఇద్దరి కళ్ళూ కలుసుకున్నాయి. ఉన్నట్టుండి ఆమె కళ్ళలో గిర్రున నీళ్ళు తిరగడం మొదలెట్టాయి. అశ్రుబిందువులు అలా దొర్లిపోయాయి. ఆ హఠాత్పరిణామానికి కృష్ణమూర్తి గుండె చెదిరిపోయింది.

"అదేమిటి ఇందిరా!" అన్నాడు. అంతకంటే ఏమనడానికీ అతనికి మాటలు పెగలలేదు.

ఇందిర చప్పున పైటకొంగుతో కళ్ళు తుడిచేసుకొని "పోదాం వసావా?" అంది. "ఎక్కడికి? ఇంటికేనా?" అని కృష్ణమూర్తి అంటే, "కాదులే–చెప్తాను పద. ముందు రిక్షా ఎక్కు" అంది ప్రాధేయపూర్వంగా కృష్ణమూర్తి ఇందిర పక్కనే కూర్చున్నాడు.

దారిలో రుద్ధకంఠంతో ఇందిర చెప్పడం సాగించింది. "జరిగినదానికి నన్ను క్షమించు కృష్ణమూర్తీ! నాకంతా తెలిసింది. ఆ దిక్కుమాలిన శేషావతారం–అంటే ప్రకాశం మేనమామ–నీ దగ్గరకొచ్చి వెధవ కూతలేవో కూశాడట కదూ! నాన్నతో చెపుతూంటే విన్నాను–"

కృష్ణమూర్తి అడ్డు తగిలి, "నా సంగతి సరే–ఆ దిక్కులేని కల్యాణిమీద మీకందరికీ అంత కక్ష దేనికీ? తండ్రి చచ్చి ఆ పిల్ల ఏడుస్తూంటే యీ లేనిపోని స్కాండల్సన్నీ దేనికి?" అన్నాడు.

"రామ రామ! ఏం చెపితే నమ్ముతావు నువ్వు? ఎలా చెపితే నమ్ముతావు? చాలా విషయాలు నా ప్రమేయం లేకుండా జరిగిపోయాయి కృష్ణా!" అంది ఇందిర.

కృష్ణమూర్తి అదిరిపడ్డాడు. "కృష్ణా!? అదేమిటి–అలా పిలవడం ఎప్పటినుండీ?" అన్నాడు.

ఆ ప్రశ్నకి జవాబు చెప్పకుండా ఇందిర మళ్ళీ ప్రారంభించింది "నీతో చాలా చెప్పుకోవాలి. నీకు చాలా సంగతులు తెలియవు కృష్ణా! ఊ ఇందిర ఏమిటో నీకు అసలే తెలియదు."

"తెలియకేం? బాగా తెలుసు. అందులో వారం రోజులనుంచీ మరీ బాగా తెలుసు ఆ తండ్రికి తగిన కూతురువి!" అన్నాడు కృష్ణమూర్తి కసిగా

"జరిగిందేమిటో పూర్తిగా ముందు విను కృష్ణమూర్తీ! అనక నీ యిష్టం వొచ్చినట్లు నన్ను అర్థం చేసుకో– ఫరవాలేదు నీతో వచ్చిన తంటాయే ఇది నేనేమిటో నీకు అర్థంకాలేదు ఇంతవరకూ ఆ అవకాశం కూడా రాలేదు. నా అంత దురదృష్టవంతురాలు మరొకర్తె లేదనుకో కృష్ణమూర్తీ! హాయిగా ఆడుతూ పాడుతూ బతికేసే ఇందిరను నువ్వు ఎరుగుదువు గాని రాత్రులకు రాత్రిళ్ళు ఒంటరిగా గదిలో కూర్చుని ఏడ్చే ఇందిర నీకు తెలీదు. నాకు జీవితంలో పెద్దశాపం మా నాన్న అనుకో."

"మీ నాన్నకేం? మహారాజు! ఏదో నువ్వు ఆర్జించి పెడుతూంటే తింటూ, నాబోటివాళ్ళ జేబులు తడుముతూ చుట్ట కాల్చుకుంటూ పడున్నాడు నువ్వు ఎన్ని ఆటలాడినా కిక్కురుమనడు."

"అదే నా ఖర్మ కృష్ణమూర్తీ! నువ్వేకాదు, లోకం అంతా అలా అనుకొంటుంది. కాని–లోగుట్టు పెరుమాళ్ళకెరుక. నలుగురిముందూ అలా ఉంటాడు. ఒక్కర్తెనూ ఉన్నప్పుడు ఎంత రంపంకోత పెడతాడో, ఎన్నెన్ని మాటలంటాడో ఎవరికి తెలుస్తుంది? శత్రువులకి కూడా జన్మ జన్మాలకీ అలాంటి నాన్న వొద్దు. ఎంతసేపూ తన సుఖమే తనది. మొదటి నుండీ వక్రమార్గాలకి అలవాటు పడ్డాడు. నువ్వనుకుంటున్నావు గాని నాన్న దగ్గర నాకెంత చనువో అంత భయం. ఆడవాళ్ళ మనస్సు నీకు తెలియదు కృష్ణమూర్తీ! విధిలేక, గతిలేక–యీ ఉద్యోగం చేస్తున్నాను. మా నాన్న కూడా

అందరిలాంటి నాన్న అయితే నాకిన్నితిప్పలెందుకు? నాకూ ఓ యిల్లూ, సంసారం, నాదీ అనుకునే ఒక బతుకూ—"

"—అదంతా సరేలే, దానికీ యీ మధ్య జరిగిందానికీ సంబంధం ఏమిటి?"

"చాలా సంబంధం ఉంది నాన్న చేస్తున్నది కొంతవరకూ తప్పే ననుకో నామీద కసి తీర్చుకుంటున్నాడు కాని, ఒక్కటి తెలుసుకో కృష్ణమూర్తీ కల్యాణి కూడా నువ్వనుకొనేంత అమాయకురాలు కాదు. ప్రకాశానికీ ఆ అమ్మాయికీ మధ్య చాలా గ్రంధం నడిచింది ఎంతవరకూ వెళ్ళకూడదో అంతవరకూ వెళ్ళారు కాని మళ్ళీ యిద్దరిమధ్యా ఎందుకో పోట్లాట వచ్చింది అంచేత ప్రకాశం మీద కసి తీర్చుకోడానికి అతని మేనమామకి దొంగ ఉత్తరాలు రాసింది తనకీ ప్రకాశానికీ మధ్య నేనేదో అడ్డువస్తున్నానని ఆవిడగారి అనుమానం చూడు ఎలా ఉందో! దొరక్క దొరక్క నాకు ప్రకాశమే దొరికాడా? పోనీగదా అవస్థలు పడుతోందని యింట్లో తెచ్చిపెట్టుకుంటే ఎన్ని గొడవలు సృష్టించిందో చూడు. అసలాపిల్ల తత్వమే అంత. ప్రకాశంతో స్నేహం చెడిపోయాక ఆవిడగారి దృష్టి నీమీద పడింది"

ఆ మాట వినేసరికి కృష్ణమూర్తికి తేలు కుట్టినంత పనైంది. "నాన్సెన్స్! ఎందుకు ఇందిరా, అంతలేసి మాటలనేస్తావు? ఆ అమ్మాయి నాతో తెగించి ఒక్క అయిదు నిముషాలు మాటాడిన పాపాన ఎన్నడూ పోలేదు" అన్నాడు.

"అలా అన్నావా? గది మార్చేసిన రోజున నాన్న అడిగాడు, అంత అర్జంటుగా ఎందుకు వెళ్ళిపోతావని, 'కృష్ణమూర్తి నాకోసం వేరే గది చూశాడు' అంది కావలిస్తే నాన్ననడుగు"

"అడగాలిసిందే మీ నాన్నని! నీ అసలు క్షోభ వేరు ప్రకాశానికీ నీకూ మధ్య ఆ అమాయకురాలు అడ్డొచ్చింది, నువ్వూ మీ నాన్నా కలిసి ఆ చవటగాడిని బుట్టలో వేసుకు ఆడిస్తున్నారు. తీరా వాళ్ళ మేనమామ వచ్చి గొడవ చేసేసరికి యింకెవరిమీదో అన్నీ తోసేసి, మీరు తప్పుకుని ప్రకాశాన్ని కాపాడారు. కాని—"

ఇందిర చాలా ఉద్వేగంగా "ప్రమాణపూర్తిగా చెపుతున్నాను కృష్ణమూర్తీ! నాకలాంటి ఆలోచనలు లేవు. ఒకింట్లో ఉంటున్నాం గనక చనువుగా ఉంటే ఉంటున్నానేమో గాని—దొరక్క దొరక్క నాకా కోతి ప్రకాశమే దొరకాలా?" అని హెచ్చుస్థాయిలో అంది

"ఏమిటా కేకలు! మన గొడవంతా ఆ రిక్షావాడికి కూడా వినబడాలా?" అని అతను మందలింపచూశాడు. కాని ఇందిర, "వింటే విన్నాడు. ఇలా ఎంతమందికని భయపడుతూ బతకను నేను? కావలిస్తే ఆ కల్యాణినీ ప్రకాశాన్నీ ఊరేగమను నాకేం? అంతేలే కృష్ణమూర్తీ! యివి కల్యాణి వంటి నంగనాచులకే రోజులు—చాపకింద నీరులా ఉండి తెరవెనుక ఎన్ని భాగోతాలాడినా చెల్లిపోతూంది నాలా డబడబలాడేస్తూ నిష్కపటంగా అందరితోనూ చనువుగా ఉంటే అన్నీ బాధలే" అని మరింత ఉద్రేకంగా అంది.

ఇంతలో రిక్షా మెయిన్‌రోడ్డు సమీపించింది. "ఇక్కడింక దిగిపో కృష్ణమూర్తీ! నాన్నచూస్తే చంపేస్తాడు. నాన్న యిప్పుడన్నీ కొత్తరూల్సు పెట్టాడు. జరిగిన గొడవలు చాలు, యింక ఎవరితోనూ చనువుగా తిరక్కు అన్నాడు" అంది ఇందిర

అతను రిక్షా దిగి వెళ్ళిపోయాడు. అతనివైపు లాలనగా చూస్తూ ఇందిర, "మళ్ళీ ఎప్పుడు కలుసుకోవడం? కొన్నాళ్ళదాకా యింట్లో కలుసుకోవడం మంచిది కాదు. రేపు సాయంత్రం ఐదింటికి మా ఆఫీసుకి రారాదూ? ఇద్దరం కలిసి బీచికి పోదాం నీతో ఇంకా చాలా ముఖ్యమైన సంగతులు చెప్పాలి" అంది.

"చూద్దాంలే!" అన్నాడు అతను.

"చూద్దాం కాదు. తప్పకుండా రావాలి లేకపోతే నామీద ఒట్టే!...మా కృష్ణమూర్తి మంచివాడమ్మా! తప్పకుండా వస్తాడు! రేపు మధ్యాహ్నం ఫోన్ చెయ్యి. టాటా!" అని చెయ్యి ఆడించింది. రిక్షా కదిలిపోయింది.

అతనికి బుర్ర తిరిగిపోయి కడుపులో ఏదో తిప్పినట్లయింది. నడుచుకుంటూ తిన్నగా లాడ్జి చేరుకున్నాడు.

ఆ రాత్రే రెండో ఆట సినిమా చూశాడు. తెల్లవార్లూ పేకాడాడు.

☆ ☆ ☆

హోటల్లో కూర్చుని పెసరట్టు తింటున్న కృష్ణమూర్తికి క్రితం సాయంత్రం ఇందిరతో జరిగిన సంభాషణంతా టేప్ రికార్డింగ్‌లా బుర్రలో మార్మోగుతున్నది. తను చిత్తుగా ఓడిపోయాననుకున్నాడు ఇందిర చాతుర్యం తలచుకుంటే అతనికి భయం వేసింది. ఇందిరలాంటి వ్యక్తిత్వం అతని అనుభూతికి అందనటువంటిది. అతను పుట్టిపెరిగిన వర్గం వేరు. అక్కడి వాతావరణం వేరు ఇన్ని సూక్ష్మాతిసూక్ష్మమైన ఉద్వేగాలేవీ అతని పరిధిలో ఎన్నడూ తారసిల్లలేదు. జీవితాన్ని రెండు చేతులతోనూ ఆస్వాదించేవాళ్ళు అక్కడా ఉన్నారు గాని, గమ్మత్‌లు ఎరుగరు. చాపల్యాలను వాళ్ళు తీర్చుకునే పద్ధతులు వేరు అందులో మానసికమైన వేదనలు ఏవీ వుండవు. ఏ కోర్కెలయినా, ఇంద్రియాల వరకే పరిమితం గాని మనసులదాకా ప్రసరించవు డబ్బుకోసం మోసాలు చెయ్యడాలు, ఆడపిల్లకోసం బరిసెలతో నరుక్కోవడాలు, పొడుచుకోవడాలు యివన్నీ ఉంటాయి గాని-వాటిలో అర్థం కానిదేదీ ఉండదు అందరికీ తేటతెల్లమైన ఉద్వేగాలవి. ఇప్పుడు తననుభవిస్తున్నది ఇంకో రకం ఉద్వేగం. మానసిమైన అశాంతి యిదివరకెన్నడూ తను ఎరుగడు. ఇప్పుడది అతనిని వేధిస్తున్నది. ఏం కావాలి? స్పష్టమైన ఆలోచనలేవీ అతని మెదడులో లేవు గాని-అతని మానసిక కాసారంలోకి కొత్తరకం రంగు రంగుల చేపలు ప్రవేశించి గమ్మత్ గమ్మత్‌గా యీదుతున్నాయి. అవన్నీ కలగాపులగంగా అడుగు నుండి పైకీ, ఆ మూలనుండి యీ మూలకీ దూసుకుపోతుంటే, ప్రశ్నాతరంగాలు లేచి అతన్ని వేధిస్తున్నాయి, ఇందిర మంచిమనిషా, చెడ్డమనిషా? ఎందుకిలా అందరినీ ఏడిపించేస్తోంది? ఇంకొకర్ని ఏడిపించనిదే తాను సుఖపడడం చేతకావడంలేదేం ఆ అమ్మాయికి? అన్నీ పోగొట్టుకొని ఎన్ని త్యాగాలు చేసినా కల్యాణికి కష్టాలమీద కష్టాలే ఎందుకు వస్తున్నాయి?

ఎవరో వెన్నుమీద చరిచినట్లయింది అతనికి. "వెళ్ళు, కల్యాణిని వెంటనే చూడు" అని ఎవరో అన్నట్లనిపించింది. గబాగబా కాఫీ ముగించి రోడ్డుమీద పడ్డాడు సిగరెట్ వెలిగించి డాబాతోట వేపు నడక సాగించాడు. తీరా వెళితే కల్యాణి తనతో సరిగా మాటాడుతుందా? తన భయానికి తనకే నవ్వొచ్చింది. ఆమెతో

తనెప్పుడూ చనువుగా మాటాడలేదు. కాని, ఆమెను చూస్తే ఎప్పుడూ తనకు గౌరవభావమే కలిగింది. ఏదో నిండుతనం, హుందాతనం ఆమెలో కనిపించేవి. కల్యాణి మర్యాద యిచ్చి మర్యాద పుచ్చుకొనే అమ్మాయి అనే భావం ఎప్పుడో అతనిలో స్థిరపడిపోయింది. కల్యాణి సరిగానే మాటాడుతుంది కాని, తను ఆమెతో సరిగా మాటాడగలడా అనుకున్నాడు.

ఇల్లు సమీపించాడు. గేటు తలుపు ఓరగా తీసి ఉంది. ఇల్లు ఇదేనా అని సందేహిస్తూ లోపలికి అడుగుపెట్టాడు. ముందరి అరుగుమీద కుర్చీలు వేసి ఉన్నాయి అదుగో కల్యాణి! కర్ర కుర్చీలో ఒదిగి కూర్చుంది పక్క కుర్చీలో వసుంధర మూడోమనిషి ఎవరో వాళ్ళకెదురుగా కుర్చీలో కూర్చుని మాటాడుతున్నాడు. ఎవరది?

కృష్ణమూర్తి రావడం దూరంనుండి చూసిన వసుంధర, "ఓ కృష్ణమూర్తిగారా! రండి రండి! కల్యాణీ! మీ కృష్ణమూర్తిగారు వచ్చారు. అప్పలమ్మా! యింకో కుర్చీ తీసుకురా!" అని లోపలకు కేక పెట్టింది. మెట్లెక్కుతున్న అతను తన కళ్ళను తనే నమ్మలేకపోయాడు! మూడో కుర్చీలో కూర్చుంది మునసబు రామినాయుడు. మెట్లమీదే కొయ్యబారిపోయిన కృష్ణమూర్తికి ఒక్క అడుగు ముందుకు పడలేదు

అప్పలమ్మ కుర్చీ తెచ్చివేసింది "రండీ కృష్ణమూర్తిగారూ! రండి కూర్చోండి" అంది వసుంధర.

"కూర్చోండి కృష్ణమూర్తిగారూ!" అంది కల్యాణి.

కూర్చున్నాడు అతను.

## 10

సరిగ్గా అదే సమయాన–ఆ డిసెంబరు ఆదివారం ఉదయం తొమ్మిది గంటల ప్రాంతాన–ఇంకో ఇంటి అరుగుమీద ప్రకాశం కూర్చుని ఆలోచనల్ని నెమరు వేసుకుంటున్నాడు. ఆ రెండు అరుగులకీ మధ్య కొన్ని వందల మైళ్ళదూరం ఉంది. సమయం అదేనైనా, వసుంధరా, కల్యాణీ, రామినాయుడూ, కృష్ణమూర్తీ కూర్చున్న ఇంటరుగు వాల్తేరులో ఉంటే ప్రకాశం కూర్చున్న ఇంటరుగు నిడదవోలుకి నాలుగుమైళ్ళదూరంలో వేలివెన్ను గ్రామంలో ఉంది. పాతకాలపు పెంకుటిల్లది. తండ్రి తాతల నుండి శేషావతారానికి సంక్రమించిన మండువా లోగిలి శేషావతారం ఆ యింటిలోనే పుట్టి పెరిగాడు ప్రకాశం తల్లి ఆ యింటిలోనే పుట్టింది ప్రకాశం పుట్టింది ఆ యింట్లో కాదుగాని, తన మూడో యేట తండ్రిపోయినప్పటినుండి అక్కడే ఆ యింట్లోనే పెరిగాడు– శేషావతారం పడగనీడలో పెరిగాడు.

వేరొక అరుగుమీద రామినాయుడికి అభిముఖంగా ఉన్న కుర్చీలో కృష్ణమూర్తి ఏ క్షణాన కూర్చున్నాడో, అదే క్షణాన ప్రకాశం కుర్చీలోంచి చివాలున లేచి అరుగుమీద పచారుచేయడం మొదలుపెట్టాడు. అత్తయ్య వీధిగుమ్మంలోంచి అరుగుమీదకు తొంగిచూసి,"అబ్బాయ్ ప్రకాశా, కాఫీ యిదిగో, తీసుకో" అంది ప్రకాశం అదిరిపడి "కాఫీ పొద్దున్నే తాగేశా నత్తయ్యా!" అన్నాడు.

అత్తయ్య చిరునవ్వు ఒలకబోస్తూ, "తెలుసోయ్! ఎప్పుడో చీకటుండగా తాగిన కాఫీ ఇంకా కూర్చుందా? ఈపాటికి అరిగేపోయుంటుంది. మీ పట్నంవాళ్ళకి కాఫీ లేందే క్షణం గడవదుగా, తీసుకో!" అంటూ గ్లాసు అందించింది. ప్రకాశానికి ఏమీ బోధపడలేదు. ఆ "పల్లెటూరు" అత్తయ్య రోజుకి అధమపక్షం పదిసార్లయినా కాఫీ తాగుతుంది. కాఫీ లేకపోతే ఆవిడకు కళ్ళు తిరుగుతాయి; గుండెదడ వస్తుంది. అదటుంచి, ఎన్నడూ లేనిది యింత అభిమానం ప్రకటిస్తోందేమిటి అత్తయ్య? కాఫీ సంగతి దేవుడెరుగు, అత్తయ్య పొద్దున్న ఒకసారి యిచ్చే కాఫీకూడా ఏ రకానిదో ప్రకాశానికి చిన్నప్పటినుంచీ అనుభవమైన విషయమే. అత్తయ్యకి మావయ్యకీ "ఫస్టుఫీల్టరు" కాఫీ; తనకీ, అమ్మకీ ఆ మిగిలిపోయిన పిప్పిలోనే మరిన్ని ఉడుకునీళ్ళు పోసిన కాఫీ. తల్లీ వంట చేస్తూంటే అత్తయ్య వేరే కుంపటిమీద టిఫినుచేసి గోప్యంగా తన కూతుళ్ళకిద్దరికీ పెట్టుకునేదికాని తన సంగతే పట్టించుకునేది కాదు. భోజనాల దగ్గిరా అత్తయ్య అదే సంస్కారం ప్రదర్శించేది అత్తయ్య వడ్డిస్తే తను భోజనం చేసిన అనుభవాలు వంటబట్టేసిన ప్రకాశానికి, తదుపరి పెరిగి పెద్దవాడై కాలేజీకి వెళ్ళాకకూడా అన్నం తినడమంటే హోయి పోయి బాధపడేవాడు. ఎక్కడ అన్నానికి కూర్చున్నా అత్తయ్య అప్యాయమే జ్ఞాపకమొచ్చి అన్నహితవు పోగొట్టుకున్నాడు అలాంటి అత్తయ్య హఠాత్తుగా ఇలా రెండోసారి కాఫీ ఇస్తోందేమిటి?

అక్కర్లేదనే ఆత్మాభిమానం ప్రకటించే ధైర్యం లేదు తనకి. మళ్ళీ గ్లాసు అందుకుంటూ "మావయ్య ఏం చేస్తున్నాడు?" అన్నాడు

"స్నానం చేస్తున్నారు. నిన్ను ఎక్కడికీ వెళ్ళొద్దన్నారు, పనుందట" అనేసి అత్తయ్య లోపలికి అదృశ్యమైంది.

క్రితం రోజు రైలుప్రయాణం, రాత్రి నిద్రలేమి, మనస్సులో అశాంతి– అన్నిటివల్లా అలసిపోయి ఉన్నాడు ప్రకాశం. కాఫీగ్లాసు గబగబా కాళీచేసి వాలు కుర్చీలో కళ్ళుమూసుకు పడుకున్నాడు. తన శరీరం తనకే బరువుగా తోచింది. "ఎవరిది యీ శరీరం? నేనంటే ఎవరు?" అనే తాత్విక జిజ్ఞాసలో పడ్డాడు ఎవరు తను? ఎవరేమిటి?. ఎవరేమిటి డాక్టరు ప్రకాశం, ఎం.బి బి.యస్., ఇందిరకు ప్రియస్నేహితుడు, కల్యాణికి అభయహస్తం ఇచ్చిన ధీరోదాత్తుడు, వెంకాయమ్మగారికొడుకు, శేషావతారంగారి మేనల్లుడు– అలా అలా ఏవో స్మృతి సరిహద్దులలో ఆలోచనలతో మరీ బరువెక్కిపోయి చిన్న కునుకు పట్టి కుర్చీలో అలాగే నిద్రపోయాడు.

మేనమామ శేషావతారం ఇంతట్లో స్నానం ముగించి బట్టలు వేసుకున్నాడు అతని శరీరానికి అలసటగాని, మనస్సుకు అశాంతికాని లేవు. ఆరడుగుల శరీరం అతనిది. నల్లనాపరాయితో చేసినది. ఆ మనస్సులో ఎప్పుడూ ఎత్తుగడలూ పన్నుగడలూ, డబ్బుకోసం పాచికలూ తప్ప ఇతరమైన అశాంతి ఏదీలేదు. అతని చదువల్లా జీవితమనే బడిలో. అతనికి తెలిసిందల్లా డబ్బు అనేది చాలా గొప్ప పదార్థమని; దేవుడికి పర్యాయపదమని. తప్పుడుసాక్ష్యాలు పలకడం, దొంగదస్తావేజులు సృష్టించడం అతనికి వెన్నతో పెట్టిన విద్యలు. వితంతువుల ఆస్తులు కాజేయడం అతని ముఖ్య ఆదర్శాలలో ఒకటి. నీతి, అవినీతి రెండింటికీ శేషావతారం అతీతుడనే చెప్పాలి. మనిషి ప్రవర్తనకు అటువంటి రెండు విభాగాలు ఉన్నాయని అతని

కెన్నడూ తట్టలేదు. చేప నీటిలో ఈదుతుంది. అది దాని సహజగుణం. పక్షి గాలిలో ఎగురుతుంది. అదీ అంతే. ఆ ఈదడానికీ ఎగరడానికీ నీతి అవినీతులుండవు. అలాగే శేషావతారం డబ్బుమీద వ్యామోహానికీనూ. కర్ణుడు సహజ కవచ కుండలాలతో పుట్టినట్లు ధనార్జనకు కావలసిన హంగులన్నిటితో శేషావతారం అవతరించాడు. "అబద్ధపు సాక్ష్యం చెప్పడం తప్పు కదయ్యా?" అని యెవరైనా అంటే అతను నిజంగా ఆశ్చర్యపోతాడు. "అదేమిటండీ! అలా అంటారు? లక్ష్మి దానంతటదే నడిచివస్తుందిటండీ! ప్రయోజకుడన్నవాడు నాలుగు రాళ్ళు సంపాదించుకోవడం ముఖ్యంకాని అడుగడుగునా మీనమేషాలు లెక్క పెడుతూ కూర్చుంటే తెలివితక్కువ కదండీ!" అంటాడు అందుకే చెల్లెలి భర్తపోయినపుడు చెల్లెలినీ, మేనల్లుడినీ తెచ్చి ఇంట్లో పెట్టుకున్నాడు. చెల్లెలు ఏమీ ఎరుగని అమాయకురాలు. భర్త పోయిననాటికి పదెకరాల పొలం ఉండేది. శేషావతారం చెల్లెలి ఆస్తికి యాజమాన్యం వహించి ఆ కష్టానికి ప్రతిఫలంగా క్రమంగా దాన్ని కరిగించి, కొంత మేనల్లుడి చదువు పెట్టుబడిగా పెట్టి, కొంత రాజమండ్రిలో తానొక ఇల్లు కట్టుకునేందుకు సద్వినియోగం చేశాడు. డబ్బు మేనల్లుడిదే అయినా చూస్తూ చూస్తూ అందులో కొంత నెలనెలా అతడికి పంపడం బాధాకరంగా వుంది ఈ ప్రపంచంలో ప్రేమలు రకరకాలు కొందరు వ్యక్తుల్ని ప్రేమిస్తారు. మరి కొందరు విజ్ఞానాన్ని ప్రేమిస్తే, ఇంకొందరు కళలని ప్రేమిస్తారు. శేషావతారం రూపాయలను ప్రేమిస్తాడు. ప్రేమికుడు ప్రియురాలి ఎడబాటు సహించలేడు శేషావతారం ప్రియురాలు డబ్బు.

కష్టపడి రాజమండ్రిలో ఇల్లయితే కట్టాడు కాని అది పూర్తయేసరికి ఐదువేలు అప్పులలో పడ్డాడు తీర్చడమెలా? ఒక్క నాలుగునెలలు కళ్ళు మూసుకుంటే ప్రకాశం డాక్టరవుతాడు ఆ డాక్టరు ప్రకాశం కళ్ళుతెరచేటప్పటికి "అబ్బాయి! నీ డాక్టర్ గిరీకే ఆస్తంతా కరిగిపోయింది ఇంక నీది అనేది దమ్మిడీ లేదు" అని చెప్పడానికీ, అవసరమైతే లెక్కలు చూపించడానికీ. తగిన ఏర్పాట్లన్నీ ఇదివరకే పూర్తి చేసుకున్నాడు శేషావతారం. అందుచేతే ఇంటిమీద తెచ్చిన ఐదువేలూ తీర్చడానికి ప్రకాశం ఆస్తి ఏమీ లేదుగాని ప్రకాశం మిగిలాడు. మంచి వ్యాపారస్థులకు ఏ వస్తువు ధర ఎప్పుడు పెరుగుతుందో, ఎప్పుడు తగ్గుతుందో, ఎప్పుడు గిరాకీ హెచ్చుతుందో కరతలామలకం. శేషావతారం వస్తువులతో వ్యాపారం చేయడు. కాని మనుష్యులతో వ్యాపారం చేయడంలో మంచి విజ్ఞత కలవాడు. ఎక్కడ గిరాకీ ఉందో క్షణంలో తెలుసుకోగలడు గిరాకీని బట్టి ధర పెంచేయగలడు ఎలాగైనా బేరాన్ని లొంగదీసుకొని నాలుగు డబ్బులు చేసికోగలడు. కిందటేడు రామప్ప కూతురు పెళ్ళి కాలేదని ఆ ఇంటిల్లిపాదీ కుంగిపోతున్నారని విని ఆపద్బాంధవుడిలా వెళ్ళి, అమలాపురంలో అపరకర్మలు చేయించే పౌరోహిత్యుని కొడుకుని వెతికి పట్టుకొచ్చాడు. ఆ పెళ్ళికూతురికి ఒక కాలు కుంటి. అందుకే ఎన్ని సంబంధాలొచ్చినా తిరిగిపోతున్నాయి. శేషావతారం ఆదుకోకపోతే ఆ అమ్మాయి గతి ఏమయ్యేదో! సమయానికి సంబంధం వెతుక్కొచ్చాడు. రామప్పకున్న ఒకే ఒక ఆస్తి నాలుగు గదుల పెంకుటిల్లు. నాలుగుచోట్ల తిరిగి ఆ ఇంటి మీద రెండువేలు అప్పిప్పించాడు శేషావతారం. అప్పిప్పించినందుకు ఐదు వందలు, సంబంధం వెతికితెచ్చినందుకు రెండు వందలు, ఈ కుంటిపిల్లను పెళ్ళాడడానికి వాళ్ళను ఒప్పించినందుకు మరొక వంద

అంటూ ఎనిమిది వందలు కాజేశాడు "పౌరోహిత్యాలు చేసుకునేవాడికి, అందులో బ్రహ్మాండమయిన చెవుడున్నవాడికి ఎవరిస్తారయ్యా వెయ్యిన్నూటపదహార్లు కట్నం?" అని ఆ యిప్పించిన ఘనకార్యానికి నూట పదహార్లు అమలాపురం పంతులు దగ్గర పుచ్చుకున్నాడు. మొత్తంమీద ఆ కుంటిపిల్ల ధర్మమా అని శేషావతారం ఆ యేడు పొలం పెట్టుబడికి సంచిలోంచి దమ్మిడీ వెచ్చించకుండా పోయింది.

నెల్లాళ్ళ క్రితం చుట్ట కాల్చుకుంటూ వీధరుగుమీద కూర్చుని, ఏదో వ్యవహారంలో తన సలహాకోసం వచ్చిన పెద్దకాపుతో శేషావతారం కష్టం సుఖం మాట్లాడాడు. మొగుడు చచ్చిననాటినుండి చెల్లెలినీ చెల్లెలికొడుకునీ సాకటానికే తన ఆస్తిలో సగం తరిగిపోయిందట. వాళ్ళ బావ ఆస్తికి మించిన అప్పులుచేసిమరీ పోయాడట. ఆ అప్పులన్నీ వడ్డీలతో సహా తీర్చేసరికి ప్రకాశం ఆస్తి కానీ మిగలకపోగా తనకు తలప్రాణం తోకకి వచ్చిందట. ఇన్నీ చెప్పి శేషావతారం క్లుప్తంగా తన బాధ వివరించాడు. "వాడికోసం ఇంత ఖర్చయిందని నేనేం బెంగపడ్డంలేదు నాయుడూ! నా బెంగంతా మా చెల్లెలి గురించే! నాకంటె నాలుగేళ్ళు చిన్నదన్నమాటే కాని కాటికి కాళ్ళు చాచుకుని కూచుందది. ఆ కొడుకన్నవాడు ప్రయోజకుడై ఎప్పుడైనా ఇంతన్నం పెడతాడా అని ఉండదూ మరి. ఉగాది పండగ నాటికి ప్రకాశిగాడి చదువయిపోతుందనుకో! కాని ఏం లాభం? మరో సంవత్సరం ఏదో ట్రైనింగ్ ఉందట- వల్లకాడు ట్రైనింగ్. అదేదో ఐనప్పటికేదెలాగుంటుందో-ఈ ముసలి ప్రాణాలు రెండూ ఉంటాయో ఊడతాయో" అన్నాడు. పెద్దకాపు పళ్ళన్నీ బయటపడేలా నవ్వేసి "నీకేం తెగులయ్యా ఇప్పుడప్పుడే చచ్చిపోవడానికి-ఇలాంటి ట్రైనింగులెన్నైనా చూసేస్తావు ఇంతకీ అంత చదువు చదివిన మేనల్లుడు గురించా నీకు దిగులు? ఇప్పుడు కట్నాలగిరాకీ ఎలాగుందో తెలుసా? నీకు తెలియనిదేముందిలే? అలాగంటావు కాని అల్లుణ్ణి బేరానికి పెట్టావంటే ఆరువేలు గుమ్మరిస్తారు. వేసంగినాటికి చదువయిపోతుందంటున్నావుగా! ముహూర్తం పెట్టించి ఆ మూడు ముళ్ళూ వేయించేయి-ఇంక ట్రైనింగంటావా? ముసలావిడని తీసికెళ్ళి కొత్తకాపరం పెట్టేయమను. ట్రెయినింగూ అవుతుంది, ముసలావిడ కోరికా తీరుతుంది" అన్నాడు.

ఆరడుగుల శేషావతారం ఆ సలహాతో ఆకాశం అంత ఎత్తు పెరిగిపోయాడు. ఛ ఛా! వెధవ మెదడుకీమాత్రం ఆలోచనే తట్టలేదేమిటిన్నాళ్ళూ-అని తిట్టుకున్నాడు. నిజానికది తనకు రావలసిన ఆలోచన. అంతమంచి ఎత్తుగడలు యింకెవరి బుర్రలో ఉండడానికి హక్కు లేదనుకున్నాడు శేషావతారం. పెద్దకాపు కూడా గట్టివాడైపోతున్నాడే అని అతని మేధాశక్తికి ఈర్ష్య పడ్డాడు కూడా. మేనల్లుణ్ణి ఒక యింటివాడిని చేసి ఇంటిమీద అప్పు వడ్డీతోసహా తీర్చేయవచ్చుననే ఆలోచనతో శేషావతారం మనసు కుదుటపడింది. కాని ఆ నిశ్చింత నాల్గురోజులపాటైనా ఉండనీయకుండా శేషావతారం గంగవెర్రులెత్తేలాంటి సమాచారం వచ్చిందతనికి. ఒకటి కాదు, వారంలో మూడు ఆకాశరామన్న ఉత్తరాలు వచ్చాయి. ప్రకాశం చదువు మానేసి ఆడపిల్లలతో షికార్లు చెలాయిస్తున్నాడనీ, అసలు కాలేజీకి సరిగా రావటమే లేదనీ-వ్యవహారం అంతకంతకు మించిపోతూందనీ. వచ్చే వేసవిలో ఆ పని కాస్తా అయిందనిపించుకొని యింటిమీద తణకా తీర్చేసి కాలుమీద కాలు వేసుకొని కూర్చోవచ్చనుకున్నాడు తను. ఆకాశరామన్న

ఉత్తరాలు చూడగానే అర్జంటుగా వ్యవహారం తేల్చేసుకోవాలి అనిపించిందతనికి. ముందు పట్నం వెళ్ళి సంగతీ సందర్భమూ తెలుసుకోవడమూ లేక సంబంధం ఖాయం చేసుకొని వెళ్ళిరావడమా అని ఆలోచించాడు. ఈ ఆలోచనలనించి తెప్పరిల్లకముందే ఒక సువార్త వినిపించిందతనికి...రాజమండ్రిలో ఒక పెద్దమనిషి తన ఏకైక పుత్రికకు పెళ్ళవక బాధపడుతున్నాట్ట. మంచి సంబంధం దొరికితే కట్నం ఎంతైనా ఇస్తానంటున్నాడట మునుపు రాజమండ్రిలో ప్రకాశాన్ని చదువుకు పెట్టిన ఇంటాయన ఈ వార్త కాస్తా శేషావతారం చెవిని వేశాడు శేషావతారం క్షణం అశ్రద్ధ చేయకుండా "అమ్మాయి వయస్సెంత? మంచి సంబంధం ఎందుకు దొరకలేదు? కట్నం ఎంతిస్తారు?" అని అన్నీ వాకబు చేశాడు. "పిల్లదానికి వయస్సెంతో లేదట. పదిహేనేళ్ళే ఉంటాయట తండ్రి చాదస్తుడవడంతోటి ఒకటే తొందర పడుతున్నాడట. అమ్మాయికి అవలక్షణాలేమీ లేవట కాని, కొంచెం పళ్ళు ఎత్తు, కొంచెం రంగు నలుపు—ఆ మాత్రపు ఈ మాత్రం చదువున్న వాడెవడైనా దొరకకపోడు కాని, అమ్మాయి తండ్రికి తన అల్లుడు ఏ డాక్టరో, ఇంజనీరో అవాలని పట్టుదలగా ఉందట. మీ అల్లుడు డాక్టరేగదూ—తండ్రిలేని పిల్లాడు. చిన్నప్పటినుండి పెంచి పెద్దవాడిని చేశావు—ఇంతకన్న మంచి సంబంధం ఏమిటి? మంచి కుటుంబం—కట్నం అయిదారువేలకు తక్కువ ఉండదు అదీగాక ఒక్కతే కూతురాయె—ఇవాళ కాకపోతే రేపైనా ఆ యింటిలక్ష్మి కంతటికీ ఆ అమ్మాయే హక్కుదారు. బాగా ఆలోచించు!" అని గట్టిగా నొక్కి చెప్పి మరీ వెళ్ళాడా పెద్దమనిషి.

"వెదకబోయిన తీగ కాలికి తగిలిం"దన్నట్లు శేషావతారాన్ని కింతకన్నా సదవకాశ ముండబో దనిపించింది. ఈ సంబంధం ఖాయం చేసేస్తే తన చిక్కులన్నీ తీరిపోతాయనిపించింది. అదీగాక తాను మేనల్లుడికేం అన్యాయం చేయబోవడం లేదు. పెంచి పెద్దవాడిని చేశాడు. పెద్ద చదువు చెప్పించాడు ఒక యింటివాడిని చేయబోతున్నాడు. ఇంత కలిగిన కుటుంబానికి కావలసినవాణ్ణే చేసి విడిచిపెడితే వాడి బతుకు వాడు బతుకుతాడు. ఇంత చేసేక కట్నం డబ్బు స్వంతానికి వాడుకున్నా అడిగేవాళ్ళెవరూ ఉండరు అనుకున్నాడు శేషావతారం. వెంటనే రాజమండ్రిలో పిల్లదాని తండ్రికి ఉత్తరం వ్రాసి పడేశాడు. వారం పది రోజుల్లో తీరిక చేసుకుని రావలసిందనీ కట్నకానుకల విషయం స్వయంగా మాట్లాడాలనీ. అన్ని విషయాలూ వివరంగా చెప్పకపోయినా చెల్లెలికి చెప్పకుండా ఏ విషయం దాచడతను. "గరువుక్రింద పొలం అమ్మకానికి పెట్టేనమ్మాయ్!" అంటాడతను. "దానికేముందిరా అన్నయ్యా! ఏదీ చెయ్యకపోతే ఇంత భారమెలా మోస్తావు నువ్వు మాత్రం? ఎలాగో అబ్బాయి చదువు గట్టెక్కిస్తివా, అంతేచాలు" అని నిండుగా సమాధానం చెబుతుందా అమాయకురాలు. వెంకాయమ్మకు కొడుకు చదువయిపోవడ మొక్కటే మహదాశయం. కొడుకు డాక్టరయితే వెంకటేశ్వరుడికి దీపారాధన చేయించుతానని మొక్కుకుంది. డాక్టరీ కాస్తా పూర్తయితే సమస్తమైన ఈతిబాధలూ వైదొలగుతాయని ఆమె ప్రగాఢ విశ్వాసం. అలాంటి వెంకాయమ్మకు ఉన్నట్లుండి శేషావతారం కొడుక్కి పెళ్ళి సంబంధం ఖాయం చేస్తున్నాడని తెలిసేసరికి అన్నగారిమీద ఎక్కడలేని భక్తి ప్రపత్తులు వెల్లివిరిశాయి. తనకొడుకుని పెద్దవాణ్ణి చేశాడు. తాను కోరిన చదువు చెప్పించాడు. ఇప్పుడొక యింటివాణ్ణి చేయబోతున్నాడు. అంతకంటే తనకేం కావాలి...? తనూ తన

కొడుకూ కోడలూ–ఇంకా దేవుడు మేలు చేసి తన అదృష్టం బాగుంటే మనవల్ని కూడా ఎత్తుకుంటుంది. ఈ ఆలోచనలన్నీ కలియబోసుకుని ఉప్పొంగిపోయింది వెంకాయమ్మ. కొడుకు డాక్టరీ చేస్తూంటే, కోడలు చేసిపెడుతూంటే, తను మనవల్ని ఆడించుతూ హాయిగా కూచోవచ్చు–సినిమాలోలా ఆ దృశ్యాలన్నీ వెంకాయమ్మ కళ్ళముందు తారట్లాడాయి 'నా యిల్లు' అనేమాట మరిచిపోయి దశాబ్దాలయింది వెంకాయమ్మకి. కాపరానికి వెళ్ళిన మరుసటేడు కొడుకు పుట్టాడు కొడుకు మూడేళ్ళ వాడప్పుడే తను విధవరాలయింది. ఆనాటినుండీ అన్నగారింట్లో అన్నగారి దయవల్ల బతుకుతూంది.

శేషావతారం వ్యవహారాలన్నీ తెరిపి చేసుకొని "ప్రకాశిగాడిని చూసి చాలా రోజులయింది. ఒకసారి పట్నం వెళ్ళి చూసొస్తానే అమ్మాయ్!" అన్నాడు చెల్లెలితో ప్రయాణ సన్నద్ధం అంతా చేసుకున్నాక. చెల్లెలు లోతుకుపోయిన కళ్ళను తృప్తిగా చెమర్చి "అంతకంటేనా అన్నయ్యా! చదువు ధ్యాసలో పడి బొత్తిగా కళ్ళబడడం మానేశాడు వాడు ఎలా ఉన్నాడో ఏమిటో! వీలైతే రెండురోజులుండిపోదువుగాని రమ్మని తీసుకురా!" అన్నది.

క్రిందటి ఆదివారం విశాఖపట్నంలో అడుగు పెట్టగానే స్టేషనునించి తిన్నగా నడిచి కొత్త అగ్రహారం వెళ్ళాడు శేషావతారం. వాళ్ళావిడకి వేలు విడిచిన మేనమామ పదిహేనేళ్ళాయి ప్లీడరీ గుమాస్తా చేస్తున్నాడా ఊళ్ళో. కూడా తెచ్చిన సంచీని వాళ్ళింట్లో పడేసి స్నానం ముగించి సరాసరి ఆసుపత్రికి వెళ్ళేడు, ప్రకాశం జాడ కనుక్కుందుకు. కిష్టయ్యలా మూడురోజులు ప్రకాశాన్ని వెతుక్కుంటూ కూర్చోక ముప్పయి నిమిషాల్లో ప్రకాశాన్ని పట్టేశాడు శేషావతారం. "మావాడెక్కడుంటాడో తెలుసునా?" అని, "ప్రకాశం అండీ! అయిదో సంవత్సరంలో ఉన్నాడు. ఎర్రగా పొట్టిగా ఉంటాడు" అని కనిపించిన ప్రతిమనిషినీ అడిగేశాడు. ఔట్ పేషెంటు డిపార్టుమెంటు దాటకుండానే జగన్నాధం కనిపించాడు. అతనినీ ఆ మాటే అడిగాడు. జగన్నాధం రకీమని "కె.యస్. ప్రకాశమేనా?" అని పోల్చేసి, "రండి, నేను చూపిస్తాను" అంటూ ప్రకాశమున్న వార్డుకి తీసికెళ్ళి, "మీ మామయ్యొచ్చాడోయ్, నీకోసం ఒకటే వెతుక్కుంటున్నారు" అనేసి హుషారుగా ఈల వేసుకుంటూ వెళ్ళాడు జగన్నాధానికి ప్రకాశం మేనమామరాకతో, కొండంత సంతోషం కలిగింది. చూస్తానుగా ప్రకాశిగాడి ఆటలింకెలా సాగుతాయో అనుకున్నాడు మనసులో. మూడు నెలల క్రితం ప్రకాశం తనతో పోట్లాట పెట్టుకున్న విషయం అతని బుర్రలో రగులుతూనే ఉంది. జగన్నాధానికి ఆడపిల్లలతో స్నేహం చేయడమంటే తగని సరదా! ఆ విషయంలో అతని ప్రయత్న లోపమేమీ ఉండదు. కాని దురదృష్టమేమిటంటే, ఏ ఒక్క ఆడపిల్లా అతనితో పదిరోజులకు మించి చనువుగా ఉండలేదు. అతని గుణగణాలలో ఆ విశిష్టత ఉంది. పాపం! అతనెవరి స్నేహం పోగొట్టుకోడు. కాని వాళ్ళే అతనికి దూరంగా పోతూంటారు. పోనీ ఆ అనుభవం అందరికీ జరిగితే అసలు మనుష్యులే అంత అని సరిపెట్టుకునేవాడు. లోకం అలా కనబడటంలేదు–తన లాడ్జిమేటు శ్రీనివాసరావు నిన్న మొన్న ఫస్టియర్‌లో చేరినాడు, అప్పుడే వాళ్ళ క్లాసుమేటు సునంద స్నేహం సంపాదించేశాడు. సంపాదించి దానిని శాశ్వతం

చేసేసుకుంటున్నాడు ఎనాటమీ డిమాన్‌స్ట్రేటరు డాక్టరు రాజేశ్వరరావు ఫిజియాలజీ ట్యూటర్ డాక్టరు ప్రియంవద స్నేహితులే కాదు, త్వరలో పెళ్ళి చేసుకోబోతున్నారని అందరికీ తెలిసింది అన్నిటికీ భయపడుతూ అందరికి ఒదుగుతూ వట్టి చవటగాడిలా ఉన్న ప్రకాశిగాడికి–"టిమిడ్ ప్రకాశం" అని నిన్న మొన్నటిదాకా తను హేళన చేసే ప్రకాశానికి యిద్దరు వయస్సులో వున్న పిల్లల స్నేహమేమిటి! అందులో ఎవరు మరీ దగ్గర స్నేహితులో తనకు తెలీదు కాని మొత్తంమీద ప్రకాశం కూడా ఆ ఛాన్సు కొట్టేడు. మరి తన మాటేమిటి అని చాలాసార్లు చాలా బాధపడ్డాడు జగన్నాథం. సరదాగా బీచికి వెళుతూ సినిమాలకీ, షికార్లకీ వెళుతూ–విశాఖపట్నంలో కొల్లలుగా ఉన్న అందమైన ప్రదేశాలకి జంటగా విహరించడానికి తనకెవ్వరూ దొరకరేం–అనేదే అతని బాధ. అలా అని బాధపడి చివరికి అతనికి లోకంలోని యీ అన్యాయాన్ని అరికట్టడానికి ఒక్కటే మార్గం తోచింది. ఏ యిద్దరు జంటగా కనిపించినా వాళ్ళకో వాళ్ళ వాళ్ళకో ఉత్తరాలు వ్రాసేయడం, ఉన్నవీ లేనివీ కల్పించి వాళ్ళగురించి వీళ్ళకి వీళ్ళగురించి వాళ్ళకీ ఏవేవో వ్రాసేయడం. ఈ కొత్త భారాన్ని నెత్తిన వేసుకున్నాక జగన్నాథం చాలా వ్యయప్రయాసలు పడుతున్నాడు. అలాగే ప్రయాసపడి శేషావతారం ఎడ్రసు తెలుసుకున్నాడు. ఓపికగా కూర్చుని వారంలో మూడు ఆకాశరామన్న ఉత్తరాలు పోస్టులో పడేశాడు. అందుకే శేషావతారం రాకతో అతని మనస్సుకు తృప్తి.

శేషావతారం ఇంటిదగ్గర 'ప్రకాశిగాడి నొకసారి చూసివస్తానే అమ్మాయ్' అనీ చెల్లెలితో యెంత అప్యాయంగా చెప్పి వచ్చాడో, ప్రకాశాన్ని చూసీ చూడగానే అంత రౌద్రాకారం దాల్చాడు. "ఒకసారి బయటికి రారా అబ్బాయి" అని హుంకరించి అవతలికి తీసుకెళ్ళాడు. హాస్పిటలు గేటు దాటకుండానే ఆ చెట్టుక్రింద నిల్చోపెట్టి ఆవేళ నానా మాటలు అనేశాడు–"నీ సంగతంతా తెలిసిందిలేవోయి. చదవేస్తే ఉన్న మతీ పోతూంది" అని తిట్టిపోశాడు. "ఆడపిల్లలతో జల్సా తిరుగుళ్ళు తిరిగేటంత పెద్దవాడవయ్యావురా! నీ కోసం దమ్మిడీ ఖర్చుపెట్టదల్చుకోలేదు. చాలు, జరిగింది చాలు....ఇంటికి పద!" అంటూ మొహం వాచేటట్టు చీవాట్లు వేశాడు. ప్రకాశానికి ఏమనటానికీ నోరు రాలేదు. మేనమామంటే సింహస్వప్నం. మెడిసిన్‌లో చేరినదాకా అతని చేతి ధాటిని చూసినవాడే తను. అంతెత్తు మనిషి యెదురుగా నిలబడి కొట్టినంత పని చేస్తూంటే పిల్లిలా వణికిపోయాడు. శేషావతారం అంతటితో వదలి పెట్టక "రేపు వస్తానుగా నీ లాడ్జికి. అక్కడ వ్యవహారం ఏమిటో. నిన్ను బుట్టలో వేసుకున్న ఆ ఫోగసుకత్తె యెవతో అంతా చూస్తాను చదువు లేకపోతే పోయె రేపు నువ్వెక్కడకీ కదలకు నే వొచ్చేదాకా అక్కడే వుండు తెలిసిందా?" అంటూ అరగజానికో అడుగు వేసుకుంటూ వెళ్ళిపోయాడు ప్రకాశం కిమ్మనకుండా ఇంటికి దారితీశాడు.

మేనమామ చీవాట్లన్నీ కిక్కురుమనకుండా తిని యింటికి చేరిన ప్రకాశాన్ని మాలీసుచేసి మనిషిగా చేయటానికి ప్రయత్నించింది ఇందిర. ఇందిర సన్నిధానంలో ప్రకాశం ఆమెను కాదనలేడు. మేనమామ ఎదుట బడితే యెదిర్చి మాటాడలేడు ఇందిరా శేషావతారం వాళ్ళవాళ్ళ పరిధుల్లో పద్ధతుల్లో బలమైన వ్యక్తిత్వం ఉన్నవాళ్ళు ఇద్దరిలో యెవరిని అనుసరించాలో ప్రకాశం నిర్ణయించుకోలేడు. నిర్ణయించుకున్నా

అమలులో పెట్టలేదు. ఆ సాయంత్రం ఇందిర బలవంతంచేస్తే యిష్టం లేకపోయినా భయపడుతూనే బీచికి వెళ్ళాడు. తిరిగివస్తూ దారిలో మేనమామ కంటబడ్డాడు. శేషావతారం గడుసుగా నవ్వుతూ ప్రకాశాన్ని పలకరించి "ఏమిరా, ఇంటికేనా?" అన్నాడు. ప్రకాశం జంకుతూ "అవును మామయ్యా!" అన్నాడు కళ్ళెదురుగుండా ఉన్న ఇందిరను శేషావతారం పూర్తిగా విస్మరించి ఆమె లేనట్టే ప్రకాశంతో "సరే వెళ్ళిరా! పొద్దున్న మీ లాడ్జికి వస్తాను.... తొమ్మిదింటికి...ఎక్కడికీ వెళ్ళకు" అనేసి చక్కాబోయాడు. ఇందిర కా ప్రవర్తన అర్థం కాలేదు. కాని లోలోపల ఆమె కెందుకో భయం వేసింది. మళ్ళీ గుంభనగా "చూశావా ప్రకాశం! మీ మామయ్యేమిటో మైరావణుడన్నట్లు మాటాడావు. పిల్లిలా వెళ్ళిపోయాడు చూశావా! ఇందిరంటే ఏమిటనుకున్నావు!" అని గర్వంగా తన విజయాన్ని ప్రకటించింది

"పిల్లిలాంటి" మామయ్య మర్నాడు తొమ్మిదింటికి ఇందిర ఇంటిదగ్గర హాజరై పెద్దపులిలా విజృంభించాడు. అటువంటి మనుషుల్ని ఎలా యెదుర్కోవడమో ఇందిర కనుభవంలో లేని విషయం. అత డుపయోగించే భాషే వేరు ఆ భాష విని ఇందిర కూడా హడిలిపోయింది శేషావతారం రౌద్రాకారం దాల్చి "ఎవర్తిరా యిది! దీనినీ నిన్నూ పోలీసుల కప్పగిస్తా నేమనుకున్నావో" అని ప్రకాశాన్నీ, "సిగ్గులేదూ నీకు? ఆడపిల్లవు కావూ! గవర్నమెంటుకి రాసి నీ ఉద్యోగ మూడబీకిస్తా నేమనుకున్నావో!" అని ఇందిరనీ, "కూతురిని ముగ్గులోకి దింపి కాలక్షేపంచేస్తున్నావుటయ్యా! వీధిలో పెద్ద మనుషుల్ని నలుగురినీ పిలిచి నీ సంగతేమిటో అడుగుతానుగా" అని ఆనందరావునీ హుంకరించేసరికి అతనితో వ్యవహరించడమెలాగో అందులో ఏ ఒక్కరికీ బోధపడలేదు ఆనందరావే కొంచెం తేరుకుని శేషావతారం చెప్పిన ప్రతీదీ రైటే అని ఒప్పేసుకుని, అలాంటివి జరగకూడదని గట్టిగా అతనితో అంగీకరించి– "అసలు సంగతి నే చెప్తానుగా, మీరు వినండి" అని శేషావతారాన్ని కూర్చోబెట్టాడు ఈ కాలం కుర్రాళ్ళు యెలా చెడిపోతున్నదీ, ఆడపిల్లలు రాను రాను ఎలా బరితెగిస్తున్నదీ రసవంతంగా వివరిస్తూ వాటన్నిటిపట్లా తన అసహ్యాన్ని ఘాటుగా ఉద్ఘాటించాడు "శేషావతారంగారూ–అసలు సంగతి నేను చెపుతానుగా. పదండి, అలా వెళ్ళి కొంచెం కాఫీ తాగుదాం" అంటూ అతనిని బయటకు తీసికెళ్ళాడు.

కాఫీ హోటల్లో కూర్చోబెట్టి సమృద్ధిగా ఫలహారం పెట్టించి, శేషావతారానికి ఆనందరావు రుచివంతమైన కథ చెప్పాడు ప్రకాశం కొంతలో కొంత తప్పుదారి పట్టిన మాట వాస్తవమే. స్వతహాగా అబ్బాయి మంచివాడు. కాని చెడ్డస్నేహాలవలన దారి తప్పాడు. కృష్ణమూర్తి అని ఒకడున్నాడు. అలాగే కల్యాణి అనే ఒక అమ్మాయి ఉంది. వాళ్ళిద్దరు ప్రకాశాన్ని చెడగొట్టారు. వృద్ధిలోకి రావలసిన కుర్రాడు అలా అయిపోతూండడం చూసి వాళ్ళిద్దరినీ వెళ్ళగొట్టి ప్రకాశాన్ని ఒక కంట కనిపెడుతూ ఇంట్లో ఉంచుకొని బాగుచేయడానికి ప్రయత్నిస్తున్నాడు ఆనందరావు అంతేగాని ప్రకాశాన్ని చెడగొట్టింది ఇందిరా కాదూ–కూతురు అటువంటిపోకడలు పోతే తను ఊరుకునే రకమూ కాదు–ఈ సారాంశాన్నే ఆనందరావు పసందైన మాటలలో పెట్టి, పిదప కాలం పిదప బుద్ధులనీ గట్టిగా తిట్టి, లోకంలో శేషావతారంలాంటి వాళ్ళుండబట్టే యీ మాత్రమైనా వానలు పడుతున్నాయన్నాడు.

కట్టుకథను శ్రద్ధగా విన్న శేషావతారం అందులో ఒక్కముక్క నమ్మలేదు కాని, యీ కూటంలో యింకెవరో ఉన్నారని మాత్రం తెలుసుకున్నాడు. కాని తొందరపడకూడదు. ఈ వ్యవహారంలో యిద్దరు ఆడపిల్లలున్నారు ఇద్దరిలో ఎవరి దగ్గర ఎక్కువ డబ్బుంది? డబ్బు, అదీ మనకు ముఖ్యం. అతని బుర్రలో రకరకాల వ్యూహాలు ఒక్కసారి మెరిశాయి.

"ఆ కల్యాణి....మీరు చెప్పిన అమ్మాయి...ఎవరి తాలూకు? కాస్త కలవారి పిల్ల అయుంటుంది. లేకపోతే యిన్ని వేషాలెలా వెయ్యగలదు?" అని డిప్లమాటిక్‌గా ఆనందరావుని ప్రశ్నించాడు

ఆనందరావు అంతకన్నా ఘటికుడు. "అబ్బే! కాసుకి గతిలేని పిల్ల తల్లీదండ్రీలేని అనాథ. అందుకే ప్రకాశంలాంటి కుర్రాళ్ళని బుట్టలో వేసుకొని కాలక్షేపం చేస్తోంది" అన్నాడు.

"ఛస్!" అనుకున్నాడు శేషావతారం ఐతే లాభం లేదు.

"సరేలెండి, యీ వ్యవహారాలు చూడగా చూడగా నాకే మతి పోతోంది. కాస్త నిదానంగా ఆలోచించాలి. నాకింకా బోలెడు పనులున్నాయి. ఆ కృష్ణమూర్తి అన్నారే, వాడి బస ఎక్కడో?"

వివరించి చెప్పాడు ఆనందరావు. "సరే వస్తాను, మళ్ళీ రేపు కలుసుకుంటాను. మా వెధవని కొంచెం జాగ్రత్తగా మసులుకోమనండి" అనేసి శేషావతారం ఆనందరావుని హోటల్‌లోనే వదిలిపెట్టి వెళ్ళిపోయాడు.

బోలెడు పనులున్నాయి అన్న శేషావతారం మాట పూర్తిగా అసత్యం కాదు. అక్కడకు దగ్గరగానే ఉన్న అరకులోయలో యిళ్ళ స్థలాలు చవకగా దొరుకుతున్నాయనీ, వెయ్యిగజాలూ ఏభయిరూపాయలకే యిస్తున్నారనీ. భార్య మేనమామవలన విని ఆ ప్రయత్నంలో పడ్డాడు. ఆ పనులు చూసుకుంటూ మధ్య మధ్య కృష్ణమూర్తి లాడ్జికి వెళ్ళి మాటలతో యధోచిత సత్కారం చేసి సంతృప్తి పడ్డాడు. ఆ విధంగా మూడు రోజులపాటు మనుషులందర్నీ ఊపి చూశాక శేషావతారానికి ఒకటి తేట తెల్లం అయింది. వాళ్ళందర్ని లొంగదీయడం ఏమంత కష్టం కాదు. అందర్నీ మెతుకుపట్టి చూశాడు. మేనల్లుడింకా పూర్తిగా తన స్వాధీనం తప్పిపోలేదు. డబాయించి యింటికి తీసుకుపోయి మూడుముళ్ళూ వేయించి మరీ పంపవచ్చు. మేనల్లుడు తన దృష్టిలో ఉత్తచెవలవాజెమ్మేకాని, వరుల మార్కెట్టులో వాడికి కొంచెం ధర ఉంది. ఇందిర, కల్యాణి లాంటివాళ్ళు వాణ్ణి చవగ్గానే కొనేయాలని చూస్తున్నారు. ఇవన్నీ సమగ్రంగా ఆలోచించాక నాలుగు రోజుల తర్వాత ప్రకాశంతో అన్నాడు– "ఒరే అబ్బాయ్! శనివారం మెయిలుకు మన ప్రయాణం, సిద్ధంగా ఉండు పరీక్షలు ఐపోయాయి గదా! మీ అమ్మకూడా నిన్ను చూడాలంటోంది ఓ వారం రోజులు నువ్విక్కడ లేకపోతే కొంప మునిగిపోదు. శనివారం పొద్దున్న మెయిలుకి, జ్ఞాపకం ఉంచుకో. నాకు చాలా పనులున్నాయి. ఓసారి అరకులోయ వెళ్ళాలి. అక్కడ ఓ నివేశన స్థలం బేరం చేస్తున్నాను" అని.

మేనమామకి ఏం జవాబు చెప్పాలో ప్రకాశానికి తెలియలేదు. లోలోపల ఎక్కడో కురుపులాగ కల్యాణి స్మృతి అతన్ని సలుపుతున్నది. ఇందిరను విడిచి వారం రోజులుండాలంటే ఆ ఆలోచనే బాధాకరంగా ఉంది. క్రమంగా ఇందిరతో సహచర్యం

అతనికి అలవాటైపోయింది. ఆమె సాన్నిధ్యంలో, ఆ మాటకొస్తే ఆమె పరిష్వంగంలో అతనికి శాంతి లేదు. ఏదో చెప్పలేని వేదన మాత్రమే అనుభవించేవాడు కాని, అది లేకపోతే మరింత బాధ. ఇందిర సేదదీర్చే శీతల పానీయంవంటిదిగాదు, కడుపులో మంటలు పుట్టించే ఘాటైన బ్రాందీవంటిది. కాని, ఎంత తప్పించుకొని పారిపోదామన్నా అతని స్వాధీనంలో లేని ఏ దౌర్బల్యమో అతన్ని ఇందిరకు దాసుడిగా చేసింది. తనూ దిగజారిపోతున్నాడు ఇందిర గుప్పెటలో నలిగిపోతున్నాడు కాని గుప్పెట వదలించుకోవాలని లేదు వేరొకరు–ఆ పని చేసి తనను దూరంగా తీసుకుపోతే బాగుండును. మేనమామ అందుకే వచ్చాడు. కాని ఇందిర లేకపోతే అతనికి తోచదు, "అదే వచ్చిన చిక్కంతా. ఆమెతో కలిసి బతకలేను ఆమె లేకపోతే అంతకంటె బతకలేను!" అనుకున్నాడు.

శుక్రవారం రాత్రి సుఖం పండించే బరువు పులకరింపుల మధ్య ఇందిర చెప్పిన సలహా శ్రద్ధగా విన్నాడు ప్రకాశం. "దేనికీ కంగారుపడకు ప్రకాశం! ముసలాడు గట్టివాడే అనుకో. ఐనా ఏం చేస్తాడు? చల్లగా అతనితో మీ ఊరు వెళ్ళి, అన్నీ తెగతెంపులు చేసుకో. దిక్కుమాలిన పొలం ఒకటో అరో ఎకరం ఉంటే అమ్మేసెయ్. అమ్మని తీసుకుని యీ వూరు వచ్చేయ్. తరువాత సంగతి చూసుకుందాం అన్నీ నేను ఏర్పాటు చేస్తానుగా! బతికినన్నాళ్ళు నిండుమనిషిగా బతకాలి గాని–ఎందుకు యీ భయాలన్నీ!" అంటూ ఇందిర చేసిన నయబోధ అతనికి చాలా హితవుగా కనబడింది. "ఇందిర లేకపోతే నాకు బతుకు లేదు" అనుకున్నాడు.

మర్నాడు మేనమామతో కలిసి స్వగ్రామానికి ప్రయాణం చేస్తూన్నప్పుడు అసలు సంగతి బైట పడింది. మేనమామ దస్త్రం విప్పాడు. "ప్రయోజకత్వం అంటే నీతీ జాతీ లేని ఆడపిల్లతో కులకడం కాదురా అబ్బాయ్! వీధిలోకి వెళితే దమ్మిడీ ఆర్జించలేని వాడివి నీకు స్త్రీ వ్యసనం ఒకటా! వ్రతం చెడినా ఫలం దక్కాలని పోనీ వాళ్ళవల్ల నీకేమైనా లాభం ఉందా అంటే–కానీకి రికాణా లేని బికార్లు వాళ్ళు. నువ్వు ఇలాంటివాడివవుతావని తెలిస్తే నీ చదువుకి ఇంత డబ్బు తగలేసేవాడినా? వెధవ పోకిరీ వేషాలు వెయ్యక నీ బాగేదో నువ్వు చూసుకో. లక్షణమైన సంబంధం చూశాను. రేపో మాపో ముహూర్తం చూసి మూడుముళ్ళూ వేయించుతాను అంతగా కావాలంటే వెంటనే పెళ్ళాన్ని తీసుకెళ్ళి కాపురం అఘోరించు" అనేసరికి ప్రకాశం తల దిమ్మెక్కి పోయింది.

"అదేమిటి మావయ్యా! పెళ్ళి విషయంలో కూడా నాకు యిష్టాయిష్టాలుండ కూడదా?" అనగలిగాడు ధైర్యం చేసి.

"నీ యిష్టం ఎవడిక్కావాలిరా– బోడి యిష్టం ? ఈ ప్రపంచంలో అన్నీ మన కోరిక ప్రకారమే జరుగుతాయా? నీ కోరిక ప్రకారమే మీ నాన్న చనిపోయాడా? నీ యిష్ట ప్రకారమే యీ రైళ్ళు తిరుగుతున్నాయా? అంతా ఘటన. అన్ని విధాల మనకి పనికొచ్చే సంబంధం చూసుకోవాలిగాని–నీ ఒక్కడి యిష్టమూ చూసుకొంటే అక్కడికి ఐపోయిందనుకున్నావా? ఈ వేషాలు నా దగ్గిర కుదరవు. నేను చూపించిన పిల్లను నువ్వు చేసుకు తీరవలసిందే!" అని తెగేసి చెప్పాడు మేనమామ.

☆ ☆ ☆

కుర్చీలో మగతగా పడుకున్న ప్రకాశానికి 'నిద్దరోతున్నావురా?' అనే మేనమామ కేక వినబడింది. ఉలిక్కిపడి లేచాడు. "లేదు మావఁయ్యా! ఏం? ఊరికే తోచక పడుకున్నాను. స్నానం చేసేశావా?" అన్నాడు.

"ఆఁ అన్నీ అయాయి.నువ్వుకూడా తయారై సిద్ధంగా ఉండు రాజమండ్రినుంచి పెద్దమనుషులొస్తారు, మనల్ని తీసికెళ్ళడానికి."

"తీసుకెళ్ళడానికా? ఎందుకూ?"

"ఎందుకేమిట్రా నీ తలకాయ! పెళ్ళికూతుర్ని చూడడానికి."

ప్రకాశం కుర్చీలోంచి లేచి నించొని, "నాకే పెళ్ళికూతురూ అక్కర్లేదు మావఁయ్యా! నేను ఎక్కడికీ రాను" అన్నాడు భయంతో కూడిన చొరవతో

శేషావతారం వికటంగా ఒక చిరునవ్వు నవ్వి, "ఓహో! అలాగా! నిన్న చెప్పిందంతా గాలిలో పోయిందన్నమాట! ఏ పెళ్ళికూతురూ అక్కర్లేకే కాబోలు వాల్తేరులో ఇద్దరు పెళ్ళికూతుళ్ళను వెంటేసుకు ఊరేగావు!" అన్నాడు సాగదీస్తూ.

ప్రకాశం మాటాడలేదు.

శేషావతారం తాపీగా జేబులోంచి చుట్టతీసి వెలిగిస్తూ, "కూర్చోరా అబ్బాయ్! అలా బెంబేలు పడిపోకు, కూర్చో" అన్నాడు. ప్రకాశం కూర్చున్నాడు. చుట్టకాల్చే సౌఖ్యాన్ని అనుభవిస్తూ శేషావతారం మొదలుపెట్టాడు: "ఇలా వినరా ప్రకాశం! నీకూ కొన్ని ఏళ్ళొచ్చాయి, పట్నంలో చదువు వెలిగించావు. రేపో మాపో డాక్టరువి కాబోతున్నావు...ఇప్పటికైనా కళ్ళు తెరచి కొంచెం నీ చుట్టూరా ప్రపంచాన్ని చూడు. ఇంతవరకూ జరిగింది పోనీ, వదిలేద్దాం. దానికేం, నీ వయస్సు అటువంటిది. కంటికి సదరుగా ఉన్న ఆడపిల్లలు కనిపించారు నీ మనస్సు చలించింది ప్రకృతి ధర్మం మనచేత అనేక పొరపాట్లు చేయిస్తుంది. నేనొక్కటి చెపుతాను వినరా అబ్బాయ్! ఒక్క డబ్బు వ్యామోహం తప్ప ఇంక ఏ వ్యామోహం ఉన్నా మనిషి చెడిపోయి అధోగతికి పోతాడు. నీ ప్రేమలూ అభిమానాలూ అన్నీ మిధ్య అనుకో. డబ్బులేనివాడు శవంతో సమానం డబ్బులేకపోతే నువ్వు డాక్టరీ చదివేవాడివా? మీ నాన్న మిగిల్చిపోయిందానితోటే నీ చదువు సాగిందనుకున్నావా? నా డబ్బు కూడా నీ మీద ఎంతో తగలేశాను. నీ చదువు కాదుగాని అందరం దివాలా తీశాం. ప్రతి దమ్మిడీ పద్దు రాశాను. కావలిస్తే పెద్దమనుషుల్ని పిలిచి చూపిస్తాను. నా డబ్బు నా, కిచ్చేసి నీ కిష్టమొచ్చినట్లు ఊరేగు, నా అభ్యంతరంలేదు అంతేగాని, ఇంత పెట్టుబడి పెట్టాక నీకు రెక్కలొచ్చి పారిపోతానంటే కుదరదు" అని ప్రకాశం వేపు చురచురా చూశాడు. మళ్ళీ అందుకుని, "పోనీవయ్యా, మాటవరసకు నువ్వు చెప్పిందే ఒప్పుకుందాం. ఎలాగూ ప్రేమించినవాడివి కాస్త పనికొచ్చే పిల్లనుచూసి ప్రేమించలేకపోయావా? కట్నాలూ కానుకలూ అక్కరలేదనుకుందాం. మన పలివెల వెంకటరత్నం గారి అబ్బాయి ఏం చేశాడు? బి.ఏ. చదువుకుంటూండగానే, తనకు లెక్చరరుగా ఉన్న అమ్మాయినే ప్రేమించాడు. ఆ అమ్మాయే వాడికి చదువు చెప్పించింది. సూట్లు కుట్టించింది. ఆ కుటుంబాన్నంతనీ ఆదుకుంటూ,గ జీతం అంతా వాళ్ళమీదే ఖర్చు పెడుతోంది. ప్రయోజకత్వం అంటే అలా వుండాలి. వాడూ ప్రేమించాడు. నువ్వూ ప్రేమించావు, కాని ఏం లాభం? ఏ పనిచేసినా ఓ అర్థం ఉండాలి. మనకు ఓ కానీ కలిసి వచ్చేదిగా ఉండాలి నీకంటే ఇందిర గడుసుది.

ఉత్తరోత్రా నీ ఖరీదెంతో ఆ పిల్ల కనిపెట్టేసింది ..అలాంటి తెలివితేటలు నీ కెక్కడివీ? లేవు. లేనప్పుడు ఇంకో ఏర్పాటు చూసుకోవాలి. అంతే. అందుకే రాజమండ్రీ సంబంధం ఖాయం చేశాను ఆరువేల రొక్కం కళ్ళ చూస్తాం. ఆరు నూరయేదీ, నూరు ఆరయేదీ....మూడు ముళ్ళూ పడేదాకా నువ్వు గుమ్మం కదలడానికి వీలులేదు. తెలిసిందా?" అని చుట్ట అవతల పారేసి ధీమాగా కుర్చీ వెనక్కి చేరబడ్డాడు.

ఆ ఉపన్యాసంతో ప్రకాశం జావ అయిపోయాడు మావయ్య ఇనుప పిడికిలి అతని పీక నొక్కేస్తున్నట్లనిపించింది. ఈ ఉప్పెన ఎలా తప్పించుకోవడం? ఇందిర హితబోధ అతని చెవిలో రింగుమంది. "బతికినన్నాళ్ళు మనిషిగా బతకాలి, మావయ్యతో తెగతెంపులు చేసుకో!" ఎలా తెగతెంపులు చేసుకోవడం? ఆ మనిషిని వదిలించుకోవడం ఎలా? అమ్మ గతి ఏం కాను?

ప్రకాశం ఏ పరిస్థితినీ ఎప్పుడు సూటిగా ఎదుర్కోలేదు. ఎదురుగా భూతం కనబడితే గట్టిగా కళ్ళు మూసేసుకుని అలా నిలబడిపోతాడు, పోరాడలేడు. భూతం తన దారిన తను చక్కాపోయిందా సరేసరి. లేదా రెక్కపట్టుకు లాక్కెళ్ళిందా, వెళ్ళిపోతాడు. కోరికలయితే ఉన్నాయిగాని వాటికోసం నిలబడగలిగే శక్తి లేదు. నిర్ణయాలు తీసుకోవడం అసలే చాతకాదు. అన్ని నిర్ణయాలనూ చివరిదాకా వాయిదా వేసేసి, ఆఖరి క్షణాన ఏం జరిగితే దానికి తలవొగ్గడమే అతని తత్వం. ఇప్పుడీ గండం తప్పించుకోవడం ఎలాగ? పోనీ యిప్పటినుండీ తగాయిదా దేనికి? పెళ్ళికూతుర్ని చూసినంత మాత్రాన అంతా అయిపోతుందా ఏమిటి? చూసి, పిల్ల నచ్చలేదంటే సమస్య ప్రస్తుతానికి వాయిదా పడుతుంది రాజమండ్రీ వెళ్ళి అక్కడనుండి అలాగే వాల్తేరు వెళ్ళవచ్చు. ఆ ఆలోచన వచ్చేసరికి హృదయం కొంత తేలిక పడింది.

"సరేలే మావయ్యా! ముందు పిల్లను చూసొద్దాం. తరువాత విషయాలు తరవాత ఆలోచిద్దాం. వాళ్ళకి మటుకు ఏమీ మాట యివ్వకు" అన్నాడు.

శేషావతారం తృప్తిగా నవ్వుకున్నాడు. అంతవరకూ దిగజారిన వాడిని ఎంత దూరమైనా జుత్తు పట్టుకు యీడ్చికెళ్ళి ఏ పనైనా చేయించవచ్చునన్నది యిట్టే గ్రహించాడు. "వీడు ఎంత చవట!" అనుకున్నాడు. ఇటువంటివాడిని నమ్ముకున్న ఆ విశాఖపట్నం ఆడపిల్లల్ని తలుచుకొని శేషావతారం కూడా క్షణమాత్రం జాలిపడి, మేనల్లుడి దౌర్బల్యాన్ని ఒకరకంగా అసహ్యించుకున్నాడు. ఒకరకంగా తృప్తి చెందాడు "సరే, అయితే లోపలికెళ్ళి స్నానం అవీ చేసి తయారవు. భోంచేసి మధ్యాహ్నం బండికి బయలుదేరుదాం!" అన్నాడు.

ప్రకాశం లోపలికి వెళ్ళిపోయాడు.

## 11

రామినాయుడికి అభిముఖంగా కుర్చీలో కూర్చున్న కృష్ణమూర్తికి లిప్తపాటు ఒళ్ళు జలదరించింది. గుండె బరువెక్కి నరనరాల్లోనూ భయం ప్రవహించింది. మరుక్షణంలో మళ్ళీ దిటవు తెచ్చుకుని స్థిమితపడడానికి ప్రయత్నించాడు. రెండేళ్ళ క్రితం జరిగిన

చిన్న సంఘటన ముసలాడికింకా జ్ఞాపకం ఉంటుందా అనుకున్నాడు. ఇంతకూ తను పొరపడుతున్నాడా? ఆ మునసబు రామినాయుడేనా ఇతను? కాదేమో బహూశా మనిషిని పోలిన మనుషులుండకూడదా? అతని మెదడులో వెయ్యి ఆలోచనలు క్షణంలో మెరిసి కంగారుపెట్టాయి.

పుట్టినప్పటినుండి కృష్ణమూర్తి గారాలబిడ్డగా పెరిగాడు వరసగా ఆరుగురు ఆడపిల్లల తరువాత కలిగిన కొడుకు గాబట్టి తల్లితండ్రులు చేతులమీద నడిపించి పెంచారు. తక్కిన బంధువర్గమూ అలాగే చూశారు. ఎన్నడూ ఒంటిమీద దెబ్బపడి ఎరగడు. అటువంటి అతను పెరిగి పెద్దవాడై, బి. ఏ చదువుతూన్నంత వాడైనప్పుడు, రెండేళ్ళక్రితం దెబ్బపడ్డాడు. ఒకేఒకటి చెళ్ళుమని లెంపకాయ అదీ పదిమంది సమక్షంలో. ఆమాటకొస్తే దేవుడికి కనుచూపుమేరలో అనగా సింహాచలం కొండమీద అనవసరంగా, తను చెయ్యని నేరానికి లెంపకాయ తిన్నాడు కొట్టినవాడు "ముసలాడు" రామినాయుడు పదిమంది విద్యార్థి స్నేహితులతో కలిసి వేడుకగా తను సింహాచలం కొండమీదికి "పిక్నిక్"కని వెళితే, తమతోపాటే యాత్రికుల గుంపు ఒకటి తారసిల్లింది. నాలుగైదు కుటుంబాలు కలిసి యాత్రకని వచ్చినట్లున్నాయి. అందులో పడుచు అమ్మాయిలు పదిమంది పైగా ఉండడంతో విద్యార్థి గుంపులో హర్షాతిశయం వెల్లివిరిసింది. నవ్వులు, కేరింతలు, పాటలు, యీలలు ప్రారంభించారు అందులో ఒక రసజ్ఞుడు "అప్పన్నకొండ" పాట ఎత్తుకున్నాడు. ఆ గుంపులో ఉన్న కొద్దిమంది మగవాళ్ళు కొంచెం మెతకరకమేమో, విద్యార్థుల ధాటిని విస్తుబోయి చూశారేగాని నివారించలేకపోయారు. ఇంతలో కొంచెం ముందు అడుగు వేస్తున్న కృష్ణమూర్తిని వెనకనుండి ఎవరో తోశారు. ఆ ఊపుతో అతను వెళ్ళి ముందున్న గుంపులో ఒక అమ్మాయిమీద ఒరగడంతో, యిద్దరూ కలిసికట్టుగా కింద పడిపోయారు దాంతో గోల రేగింది. అమ్మాయి తాలూకు మగవాళ్ళు తిట్లు లంకించుకుంటే విద్యార్థులు వాళ్ళమీద పడి కొట్టడానికి సిద్ధపడ్డారు. ఇంత తతంగమూ క్షణంలో జరిగిపోయింది. గుంపుకు ఎదురుగా వస్తున్న ఒక వృద్ధుడు వీళ్ళని సమీపించుతూ, జరిగింది చూశాడు. అమ్మాయి కింద పడిపోయాక గబగబా అడుగులు వేస్తూ గుంపు మధ్యకు ఉరికాడు. ఒక్కపొలికేక పెట్టి, ముందున్న కృష్ణమూర్తిని జుట్టు పట్టుకు యింకొంచెం ముందుకు లాగి ఊచిపుచ్చుకుని ఒక్క లెంపకాయ యిచ్చేసరికి విద్యార్థి బృందం అంతటికీ కళ్ళు బైర్లు కమ్మాయి కృష్ణమూర్తికి రోషం ఉక్రోషం ఒక్కసారి పెల్లుబికి– "ఎవడ్రా నువ్వు–రాస్కెల్!" అన్నాడు. ముసలాడు కోపంతో కంపించిపోతూ, "పళ్ళు రాలతాయి జాగ్రత్త! ఎవడా? ఐతే విను నందూరు మునసబు రామినాయుణ్ణి ఫో! నీ దిక్కున్నచోట చెప్పుకో. మళ్ళీ యీ కొండమీద మీరెవరైనా ఆడపిల్లల్ని అల్లరిచేసారా–రక్తం కళ్ళ చూస్తాను! పొండి– మీరు మనుషులు కారు, గాడిదలు. పొండి!" అని అరిచాడు. ఆడవాళ్ళని చూసి, "మీరు వెళ్ళండమ్మా. పోకిరి వెధవలు. వీళ్ళ అంతు నేను చూస్తానుగా!" అన్నాడు. ఆ దెబ్బతో గుంపుకు ఎక్కడలేని ధైర్యమూ వచ్చి అందరూ విద్యార్థులను చెడామడా తిట్టారు. విద్యార్థి బృందం తలవంచుకుని తిరుగుముఖం పట్టింది.

నిజానికి ఆనాడు కృష్ణమూర్తి తప్పేమీ లేదు. అనవసరంగా పరాభవం పొందాడు. తను జన్మలో మరిచిపోలేని అనుభవం అది. "మునసబు రామినాయుణ్ణి" అనే

వాక్యం, రామినాయుడు విగ్రహం, అతని స్మృతిపథంలో శాశ్వతంగా ఉండిపోయాయి; ఉండిపోతాయిగూడా.

ఆ మునసబు రామినాయుడేనా యితను? ఎంత ప్రయత్నించినా ముఖంలోని భయం, కళ్ళల్లో బెరుకు దాచుకోలేకపోయాడు కృష్ణమూర్తి...ఎవడీ ముసలాడు? ఒక గ్రామ మునసబుమాత్రుడికి తనెందుకు భయపడాలి?

పాపం, కొత్తచోట సంకోచపడుతున్నాడు అనుకుంది వసుంధర. నిశ్శబ్దాన్ని భంగం చేస్తూ–"ఏం కృష్ణమూర్తిగారూ! బాగున్నారా?" అంది.

కృష్ణమూర్తి బెదురుతూ బెదురుతూ, "కల్యాణిగారిని చూడడానికి వచ్చానండీ!" అనగల్గాడు.

"ఫరవాలేదు కూర్చోండీ! మీ గురించి చెపుతూ ఉంటుంది మా కల్యాణి ఏం కల్యాణీ! నిన్నరాత్రేకదా మాటల్లో ఈయన గురించి వచ్చిందీ?" అని వసుంధర చిరునవ్వుతో కల్యాణివైపు చూసింది.

కల్యాణికి ఆ క్షణంలో అతనిమీద జాలి వేసింది. అతడు ఎలాంటివాడైతేనేం, యిక్కడకు రావడంలో వెకిలి ఉద్దేశమేమీ లేదని ఎందుకో ఆమెకు అనిపించింది. తనమీద అభిమానంతో వచ్చాడు.

"థాంక్స్ కృష్ణమూర్తిగారూ! జ్ఞాపకం ఉంచుకుని చూడడానికి వచ్చారు" అని కల్యాణి మునసబు వేపు తిరిగి, "బాబయ్యగారూ! ఈయన కృష్ణమూర్తిగారనీ–నాకు తెలిసిన ఆయన. కాలేజీలో చదువుకుంటున్నారు" అంది. మళ్ళీ అతనివేపు తిరిగి, "ఆయన మా బాబయ్యగారండీ! నందూరు మునసబుగారు" అంది.

కృష్ణమూర్తి మునసబు నుద్దేశించి, "నమస్కారం నాయుడుగారూ! ఇదివరకోసారి మనం కలుసుకున్నాం, గుర్తుపట్టారా!" అన్నాడు సస్పెన్సు భరించలేక.

రామినాయుడు, "చిత్రంగా ఉందే! ఎక్కడా నిన్ను చూసిన గుర్తులేదయ్యో! ఏవీ అనుకోకబ్బాయ్! ఎక్కడ చూశావు నన్ను?" అన్నాడు.

మళ్ళీ తికమకపడ్డాడు కృష్ణమూర్తి. ఈ ముసలాడు నాటకమాడుతున్నాడా? లేక నిజంగా మరచిపోయాడా? "రెండేళ్ళక్రితం సింహాచలం కొండమీద మిమ్మల్ని చూశాను" అన్నాడు. రామినాయుడు అతన్ని పూర్తిగా మరచిపోయాడు. "ఏమో నాయనా! ఏం జ్ఞాపకం రావడం లేదు. కొండమీదంటే ఏం చెప్పగలం! ఇప్పటికి నలభైయేళ్ళనుంచి ఏడాదికి రెండుసార్లు సింహాచలం వెళుతున్నాను ఎప్పుడు నిన్ను చూశానో ఏమిటో జ్ఞాపకం లేదయ్యో! పోనీలే! దానికేం గాని–మా కల్యాణమ్మని చూడడానికొచ్చావా? ఇస్కూలులో తెలుసా నీకు మా కల్యాణమ్మ?" అన్నాడు అతనికేం చెప్పాలో తెలియలేదు. ఇంతలో కల్యాణే "అవును బాబయ్యగారూ! ఇద్దరం ఓ కాలేజీలోనే చదువుకుంటున్నాం" అని సర్దేసింది.

రామినాయుడు తాపీగా చుట్ట తీసి వెలిగించి "మంచిది నాయనా! బుద్ధిమంతుడల్లే ఉన్నావు, బాగా చదువుకో. మా కల్యాణమ్మకు చాలా కష్టం వొచ్చింది నాయనా! నీకు తెలుసునో లేదో–" అంటూంటే కృష్ణమూర్తి అర్థోక్తిలో అడ్డువచ్చి–

"విన్నానండీ!" అన్నాడు మొహం అదోలా పెట్టి

కల్యాణి మనసు చివుక్కుమంది. అతనితో ఎందుకా ప్రసక్తి? సంభాషణ మార్చాలని, "ఈ మధ్య ఇందిరను చూశారా కృష్ణమూర్తిగారూ? కులాసాగా ఉందా?" అంది.

"చూశానండీ, నిన్నసాయంత్రం మిమ్మల్ని కలుసుకున్నాకనే చూశాను. ఆవిడకేం, హాయిగా ఉంది..."

"ప్రకాశం కనబడుతున్నాడా?"

"లేదండీ! రెండు మూడు రోజుల క్రితం వాళ్ళింటికెళితే–లేడు. ఆ తరువాత మరి నేను వెళ్ళలేదు" అన్నాడు కృష్ణమూర్తి.

"మరి నిన్న సాయంత్రం ఇందిరకోసం వెళ్ళినప్పుడు ప్రకాశం కనబడలేదా?"

"వాళ్ళింటికి వెళ్ళలేదు నేను. ఇందిర ఆఫీసునుంచి వచ్చేస్తూ రోడ్డుమీద తారసిల్లింది."

"ఓహో!" అంది కల్యాణి.

ఉన్నపాటున రామినాయుడు లేచి నించొని "నేను వెళ్ళిరానా కల్యాణమ్మా! సాయంత్రం ప్యాసింజరుకి వెళుతున్నాను. మళ్ళీ కలవడం పడదేమో!" అన్నాడు.

కల్యాణి కూడా లేచి నించొని, "అదేమిటి బాబయ్యగారూ! వొచ్చి అరగంట కాలేదు, అప్పుడే వెళ్ళిపోతానంటారూ!" అంది.

వసుంధర కూడా నుంచోని "ఉండండి నాయుడుగారూ! తొందరేం; భోంచేసి వెళుదురుగాని! నేనొకటీ మీ కల్యాణొకటీ కాదు" అంది.

మునసబు ఆ మాటకే చలించిపోయి కళ్ళలోకి చెమ్మదనాన్ని అపుచేసుకొంటూ–

"అమ్మమ్మ, ఎంతమాట తల్లీ! చిన్నపిల్లవైనా కష్టం సుఖం తెలిసినదానివి. అమ్మాయిని కడుపులో పెట్టుకు కాపాడుతున్నావు, అన్నాడు."

"ఈ మాత్రానికేనా నాయుడుగారూ!"

"అదేం మాటమ్మా! నీకు తెలియదా–రోజులెలా ఉన్నాయో? కాలం మారింది తల్లీ! అందరూ దగుల్బాజీలయిపోయారు. కొడుక్కి తండ్రి బరువు. తల్లికి పిల్ల బరువు. అలాంటి రోజులొచ్చాయి. అందుకే మా కల్యాణమ్మ ఉత్తరం చూసి ఆశ్చర్యపోయాను, ఈ రోజుల్లో యిలాంటి మనుషులింకా ఉన్నారా–అని ఇంతలో పని తగిలింది. సరే చూసి పోదామని వచ్చాను. మా కల్యాణమ్మకి నేనేం చెయ్యలేకపోయినా–"

కల్యాణి ఆ మాటకు అడ్డొస్తూ, "అదేం మాట బాబయ్యగారూ! ఇంతవరకూ చేసింది ఎవరు, మీరు కాకపోతే?" అంది.

"అప్పుడే అయిపోయిందా నాయుడుగారూ! ముందింకా యెంత చెయ్యాలో!" అంది వసుంధర.

"ఏమో తల్లీ! ఈ ఘటానికి ఎప్పుడు పిలుపు వస్తుందో! అరవై మూడు దాటిందా! ఇంకెన్నాళ్ళు! సామానంతా సర్దేశాను. బాదర బందీలన్నీ తెమల్చేసుకున్నాను."

వసుంధర నవ్వేసి, "మరేం భయంలేదు నాయుడుగారూ! బెర్నార్డ్‌షాలాగా మీరు నూరేళ్లూ దరిదాపు చూస్తారు దానికేంగాని, మధ్యాహ్నం భోజనానికి మీరిక్కడకు

రావలసిందే, తప్పదు. మీకు ఉత్తరం రాసినట్లు నాకు కల్యాణి చెప్పనేలేదు. చూశారా దొంగపిల్ల!" అంది.

"పిచ్చిపిల్లమ్మా! మా కల్యాణమ్మ ఉత్త పిచ్చిపిల్ల!" అన్నాడు నాయుడు.

"భోజనానికి వచ్చేయండి బాబయ్యగారూ!" అంది కల్యాణి.

"సరే, యిద్దరు పెంపుడుకూతుళ్ళు బలవంతం చేస్తూంటే కాదనడం తప్పు. అందులో మీలాంటివాళ్ళ గొప్పింటి లోగిళ్లో కావాలంటే మాత్రం మాలాంటివాళ్ళకు భోజనం దొరుకుతుందటమ్మా! అంతా మా కల్యాణమ్మ చలవ. మా ప్లీడరుగారు ముందే పద్దు చెప్పేశారు, యీ పొద్దు అక్కడే భోజనానికి. దానికేముందిలే, రానయ్యా ప్లీడరూ అంటాను. సరేగాని, కొంచెం ఆలస్యం అవుతుందే, ఎలాగ మరి! ఊళ్ళో రెండుమూడు పనులు చూసుకోవాలి. ఒంటిగంట అవుతుందేమో! మీకు శ్రమగదా!" అన్నాడు మునసబు.

వసుంధర వెంటనే,"మీ యిష్టం, ఒంటిగంటకు కాదు, రెండింటికి రండి. ఆదివారం గదా! మస్తుగా టిఫిను వేశాం. అందరం కలిసే సరదాగా భోంచేద్దాం" అంది.

"ఇంట్లో యింకెవరూ పెద్దవాళ్ళులేరమ్మా? వాళ్ళకి బాగుంటుందా? పోనీ ఈ మాటుకి యీ ముసలాడిని వదిలెయ్యకూడదా తల్లీ!"

"వీల్లేదండీ! ఇంట్లో మా పిన్ని తప్ప యింకెవ్వరూ పెద్దవాళ్ళు లేరు, ఉన్నా. వాళ్ళూ నాలాగే అనేవారు" అంది వసుంధర.

"మంచిది తల్లీ! అలాగే వస్తాను. సరేగాని, కల్యాణమ్మా–ఒక్కమారిలా వస్తావా? నువ్వు కూడానమ్మా" అన్నాడు నాయుడు, ఏదో ఏకాంతంగా చెప్పాలని సూచిస్తూ.

లోపలి హాల్లోకి దారి తీసింది వసుంధర. ముగ్గురూ అక్కడికి వెళ్ళాక, మునసబు "మరేంలేదు కల్యాణమ్మా! ఆ ఇంటి వ్యవహారం సంగతే. గ్రామంలో నలుగురు పెద్దల్నీ పిలిచి, ఆచార్లుని కూడా కూచోపెట్టి అందరికి నచ్చచెప్పాను. వెధవలోకం అమ్మా, వెధవలోకం. పాపం, మీ నాన్న మెతకవాడు. అదే మీ తాత అయితేనా? అలాంటివాడే కావాలిలే యీ ప్రపంచానికి. మీ నాన్నలాంటివాళ్ళు పనికిరారు అవునా, మన ఆడపిల్లకి మనమే అన్యాయం చేస్తామా అని కూక లేశాను. ఎలాగో బేరం పెట్టానులే. శరభయ్యదేవర యిల్లు తీసుకుందికీ, రెండు వేల ఆరువందలివ్వడానికి ఒప్పుకున్నాడు. నిదానం మీదైతే మూడువేలు రాబట్టవచ్చు. కాని ఏం చేస్తాం? ఆచార్లు ఒకటే కాకి గోల. ఆచార్లు పాపం–మంచివాడే కాని, అర్ధణాకోసం ప్రాణం విడుస్తాడు. శరభయ్య దగ్గిర ఆ డబ్బు ముందే తీసుకుని, ఆచార్లు కివ్వవలసిన పధ్నాలుగు వందలూ మొహానకొట్టాను. పోగా–చిల్లర మల్లర అప్పులు రెండొందలు తీర్చేశాను. నేను మిగిలాను. నా సంగతే–" అన్నాడు.

"మీ కివ్వవలసిన బాకీ ఎంత బాబయ్యగారూ?" అంది కల్యాణి.

"ఎంతైతేనేం తల్లీ! ఏదో దేవుడింత యిచ్చాడు. కొడుకులు ప్రయోజకులైనారు. కూతుళ్లు కూడా మనవల తల్లులయారు–నీకు తెలియందేవుంది. ఈ బాకీ నన్ను రక్షిస్తుందా? పోయేటప్పుడు కూడా తీసుకువెళతానా? నాకేం అక్కర్లేదు కల్యాణమ్మా! నీ కష్టాలు గట్టెక్కి నువ్వో యింటిదానివైతే నా కంతే చాలు,"

అని లోపలి జేబులోంచి కాగితం పొట్లాంతీసి, "ఇవిగో తల్లీ! ఇంద వెయ్యి పది పచ్చకాయితాలున్నాయి. తీసుకో, నీ పేర బ్యాంకులో వేసుకొని, ఆ చదువేదో–" అన్నాడు.

కల్యాణి కళ్ళలో గిర్రున నీళ్ళు తిరిగాయి. వెంటనే ఒక్కడుగు వెనక్కువేసి– "క్షమించండి బాబయ్యగారు! ఇందులో ఒక్క కానీ నా కక్కర్లేదు, మీ బాకీ కూడా జమకట్టుకుని, ఏమైనా మిగిలితే యివ్వండి, లేకపోతే లేదు" అంది.

ఆ జవాబుకి మునసబు గతుక్కుమన్నాడు. మళ్ళీ తేరుకుని, "కల్యాణమ్మా! ఒక్కసారి నా మొహం చూడు! నా కాళ్ళమీద ఆడుకున్నదానివి. యివాళ నా మాట కాదంటావా? ఈ విషయంలో నేను చెప్పినట్లు వినాల్సిందే" అని కొంచెం ఆజ్ఞాపిస్తున్నట్లుగా అన్నాడు.

"ఇంకేం చెప్పినా వింటాను బాబయ్యగారు! ఇదిమాత్రం వినను, మా నాన్నే బతికుంటే తీసుకోనిచ్చేవాడా?" అంది కల్యాణి

"మీ నాన్నే బతికుంటే నువ్విలా ఉండేదానివా? మీనాన్నొకటీ నేనొకటీనా!" అని, "నువ్వేనా కాస్త నచ్చచెప్పు వసుంధరమ్మా!" అన్నాడు మునసబు.

వసుంధర యిరుకులో పడింది. కల్యాణి చూపిస్తున్న ఆత్మాభిమానాన్ని కాదని ఏం సలహా చెప్పగలదు? ఎలా చెప్పగలదు? "పోనీలెండి, యీ విషయం ప్రస్తుతానికి వాయిదా వేసి, భోజనాలయ్యాక ఆలోచిద్దాం" అంది.

మునసబు నవ్వేసి "ఇద్దరికిద్దరే గడుసువాళ్లు అమ్మాయి నా మాట వినకపోతే నేనసలు భోజనానికే రాను!" అన్నాడు.

"అలా కాదు, మధ్యాహ్నం నేనేదో యేర్పాటు చేస్తానుగా"! అంది వసుంధర

"ఐతే, యీ పొట్లం నా తరఫున దాచిపెట్టు. నేనలా ఊళ్ళోకి వెళ్ళాలి. జేబులో ఉంటే ప్రమాదం" అంటూ పొట్లం వసుంధర చేతిలో పెట్టి గిర్రున వెనక్కి తిరిగి అరుగుమీదికి వెళ్ళిపోయాడు మునసబు. అక్కడ పేపరు చదువుతూ కునికిపాట్లు పడుతున్న కృష్ణమూర్తితో "వెళ్ళొస్తానబ్బాయ్!" అనేసి మెట్లు దిగిపోయాడు.

అక్కడ హాల్లో జేవురించిన మొహంతో కల్యాణి, "ఎందుకు తీసుకున్నావు వసుంధరా!" అంది. ఆ కంఠ ధ్వనిలో ఏదో వసుంధరను భయపెట్టింది. "ఆయనలా అకస్మాత్తుగా చేతిలో కుక్కేసి వెళ్ళిపోతే యేం చెయ్యను కల్యాణీ! మధ్యాహ్నం వచ్చాక యిచ్చేద్దాంలే" అంది. ఇద్దరూ వీధరుగుమీద కొచ్చారు.

కృష్ణమూర్తిని చూసేసరికి ఇద్దరికీ ఒక ఆలోచన కలిగింది. "క్షమించండి కృష్ణమూర్తిగారు! ఇంతసేపూ మిమ్మల్ని ఒక్కర్నే ఒదిలేశాం!" అంది వసుంధర

"ఏంచేస్తున్నారింతసేపూ?" అంది కల్యాణి.

"నిన్నటి హిందూపేపరు క్షుణ్ణంగా బట్టీ పట్టేశాను" అన్నాడు కృష్ణమూర్తి నవ్వుతూ.

"ఆనందరావు గారైతే హాయిగా ఒక్కరూ కూర్చుని పేకాట ఆడుకునేవారు ఒక్కరూ కూర్చుని పేకాట ఆడడం ఏమిటో నాకు చచ్చినా బోధపడదు" అంది కల్యాణి.

"అంతేనా?–అందులోనూ తనను తనే దగా చేసుకుంటాడు" అన్నాడు కృష్ణమూర్తి.

"గమ్మత్తు మనిషిలా ఉన్నాడే ఓసారి చూపిద్దూ కల్యాణీ!" అంది వసుంధర.

కల్యాణి మాటాడలేదు. కొంతసేపు ముగ్గురూ మౌనంగా కూర్చుండిపోయారు. కృష్ణమూర్తి తనరాక వాళ్ళకి అయిష్టంగా ఉందేమోననే అనుమానంలో పడి, "నేను వెళ్ళిరానాండీ?" అన్నాడు కల్యాణి వేపు చూస్తూ అది గ్రహించిన వసుంధర, "అప్పుడే వెళ్ళిపోతారా? కూర్చొండి కాసేపూ! నలుగురు స్నేహితులూ వచ్చి కనబడుతూంటే కల్యాణికి కొంచెం ధైర్యంగా ఉంటుంది" అంది

కృష్ణమూర్తి బరువుగా, మొహమాటంగా "కల్యాణిగారు కూడా అలా అనుకుంటే నాకు చాలా సంతృప్తిగా ఉంటుంది. వారికి నామీద కొన్ని ఇంప్రెషన్సు ఉండి ఉంటాయి. అవిడలా అనుకునేందుకు అవకాశమూ ఉందనుకోండి ఐనా, అవిడంటే నా కెపుడూ గౌరవమే! ఈ సమయంలో నా వల్ల అయే సహాయం ఏదైనా ఉంటే సంతోషంగా చేస్తాను" అన్నాడు, ఎలాగో ధైర్యం చిక్కబట్టుకొని.

కల్యాణి "అదేమిటి కృష్ణమూర్తిగారూ! నేను మీగురించి ఏమీ అనుకోలేదే? అనుకోవలసిన అవసరం ఏముందీ?" అంది.

"అనుకోకపోతే సంతోషమే. ఎలాగో ఓలాగ అది తెలియ చెప్పకుందామనే వచ్చాను పోనీగాని, మీరు కాలేజీకి వెళుతున్నారా' అన్నట్లు మొన్నటినుండీ క్రిస్‌మస్ సెలవులు కదూ!"

"ఇప్పుడు సెలవులే అనుకోండి. మళ్ళీ జనవరి మూడో తేదిదాకా కాలేజీ లేదు. ఐనా అటెండెన్సు గొడవొకటి వచ్చి పడిందిగా! ప్రిన్సిపాల్‌ని చూసాను. ఏమంత సుముఖంగా లేదు" అంది కల్యాణి.

కృష్ణమూర్తికి ఒక్కసారిగా ఉత్సాహం వచ్చింది "దానికేముందండీ! ఎలాగైనా సర్దుబాటు చెయ్యవచ్చును. మెడికల్ సర్టిఫికెట్ ప్రొడ్యూస్ చేద్దాం. నాకు తెలిసిన డాక్టరు ఒకాయన ఉన్నాడు. కావాలంటే హెల్ప్‌చేస్తాడు, లేకపోతే యింకో ప్రొఫెసర్ గారున్నారు. అన్నట్టు మీది ఎకనామిక్సు గదూ? ఆయనే నాకు తెలిసిన ప్రొఫెసరు. నా చేత చాలా పనులు చేయించుకున్నాడు. కావాలంటే వెళ్ళి మాటాడతాను, మధ్యాహ్నం ఆయన్ని చూడనా?" అన్నాడు

"తప్పకుండా వెళ్ళి ఆ పని చేయించుకు రండి చూద్దాం! ఏం కల్యాణీ?" అంది వసుంధర.

"ఓ! అంతకంటేనా!" అంది కల్యాణి.

తరువాత ఓ పావుగంట ఏవేవో అలాంటి విషయాలే మాటాడి, వసుంధర యిచ్చిన కాఫీ ఆప్యాయంగా తాగేసి, "సాయంత్రం నాలుగింటికి వచ్చి ప్రొఫెసరు ఏమన్నాడో చెపుతాను. ఫరవాలేదు లెండి, ఎలాగోలాగ పని జరిగేట్టు చూద్దాంగా!" అని, "తప్పకుండా రండి" అని వసుంధరచేత అనిపించుకొని వెళ్ళిపోయాడు కృష్ణమూర్తి.

అతను వెళ్ళిపోయాక ఆలోచిస్తూ అలాగే వుండిపోయింది కల్యాణి. "ఏమిటాలోచిస్తున్నావు కల్యాణీ!" అన్న వసుంధర ప్రశ్నకు తుళ్ళిపడింది.

"ఆః ఏంలేదు. కృష్ణమూర్తి గురించే ఆలోచిస్తున్నాను" అంది.

"మనిషి స్వతహాగా మంచి వాడల్లే ఉన్నాడు నువ్వంటే మంచి అభిప్రాయమే ఉన్నట్టుంది" అంది వసుంధర. జవాబుగా కల్యాణి చిన్న నవ్వు నవ్వింది

మధ్యాహ్నం ఒంటిగంటకు వచ్చాడు మునసబు. వెంటనే వడ్డనకి ఏర్పాట్లు చేసింది వసుంధర. కులాసాగా కబుర్లు చెప్పుకుంటూ అన్నాలు తిన్నారు. ఒక గంట నిద్రపోయి తరువాత లేచి కాఫీతాగి అయిదుగంటల పాసింజరుకు వెళ్ళిపోతా నన్నాడు మునసబు. ముందర గదిలో అతనికి పక్క వేయించింది వసుంధర. తనూ కల్యాణీ లోపలకు పోయి కాస్సేపు మంచంమీద నడుంవాల్చారు.

"నాలుగ్గంటలకు ఆయన వెళ్ళిపోతానంటున్నాడు. ఆ డబ్బు సంగతి ఏం చెయ్యమంటావ్?" అంది వసుంధర.

"అదో ప్రశ్నా వసుంధరా? అభిమానం కొద్దీ ఏదో ఆయనంటే నేను దొరికింది గదా అని తీసేసుకోవడమే? ఆయన పొట్లాం ఆయనకిచ్చేయ్." అంది కల్యాణి కొంచెం కఠినంగా. వసుంధర మరి మాటాడలేదు. ఏదో పుస్తకం చదువుకుంటూ పడుకుంది.

మధ్యాహ్నం మూడున్నర దాటాక పిన్నిగారు గదిలోకి వచ్చి "అమ్మాయ్ వసూ! ఆయనెవరో బండికి వెళ్ళిపోతాడన్నావ్? కాఫీ తెచ్చాను, తీసికెళ్ళి ఇస్తావా?" అంది. గ్లాసు అందుకొని వసుంధర అరుగుపక్క ముందుగదిలోకి వెళ్ళి "నాయుడుగారూ!" అంది. మునసబు మెలుకువగానే ఉన్నాడు. "ఏవమ్మా! కాఫీ తెచ్చావా? ఒంట్లో అలసటగా ఉంది" అంటూ మంచంమీంచి లేవబోయాడు. నిల్చునేసరికి కళ్ళు తిరిగి తల దిమ్మెక్కిపోయింది. మళ్ళీ మంచంమీద కూలబడి "తల తిరుగుతోందమ్మా! పక్కలో ఏమిటో నొప్పిగా ఉంది" అన్నాడు

"కొంచెం కాఫీ తాగండి, తేరుకుంటారు" అంది వసుంధర. నెమ్మదిగా గ్లాసు అందుకుని రెండు గుక్కలు తాగేసరిగి మరి కూర్చోలేకపోయాడు. పక్కలో నొప్పి ఎక్కువైపోయింది. అయాసపడుతూ "ఏవిటోనమ్మా...అకస్మాత్తుగా ఏవిటో ఆయాసంగా ఉంది. అదే సర్దుకుంటుందిగాని, ఓ రిక్షా తెప్పించు, స్టేషన్‌కు పోతాను" అన్నాడు.

"వెళుదురుగాని లెండి, ఇంకా చాలా టైముంది. కాస్త సర్దుకున్నాక చూద్దాం. రిక్షాకేం, నిముషంలో వస్తుంది. కాస్సేపలా పడుకోండి" అని లోపలకు వెళ్ళి "కల్యాణీ! మీ మునసబుగారికి ఏమిటో ఆయాసం వచ్చింది లేవబోయేసరికి కళ్ళు తిరిగాయి. రిక్షా పిలిపించు వెళ్ళిపోతానంటున్నారు" అని అంది. కల్యాణి ఆదుర్దాగా పరుగెత్తుకుంటూ వచ్చి, "ఏవిటి బాబయ్యగారూ!"అంటూ ఒంటిమీద చెయ్యివేసి చూసింది. ఒళ్ళు చల్లగానే ఉంది. మొహంలో విపరీతమైన యాతన కనబడుతోంది. ఆయాసంతో మనిషి గిలగిలలాడిపోతున్నాడు.

వసుంధర పరిగెత్తుకుంటూ వంటింట్లోకి వెళ్ళి "పిన్నీ పిన్నీ ! ఆ నాయుడుగారికి సడన్‌గా ఆయాసం వచ్చింది. చాలా బాధపడుతున్నాడు. ఓసారి వచ్చి చూద్దూ, డాక్టర్ని పిలవాలేమో!" అంది. పిన్ని నెమ్మదిగా వచ్చి, మంచందగ్గర నించొని, "ఎక్కడ నొప్పి బాబుగారూ!" అంది. బాధపడిపోతున్నాడు నాయుడు. పిన్నిగారు ఒక్క నిముషం తేరిపార చూసి "డాక్టర్ని పిలవడం మంచిది వసూ!" అంది. వసుంధర కంగారుపడింది. ఏ డాక్టర్ని పిలవడం? తన కెవరూ డాక్టర్లు తెలియదే! కల్యాణి అంతకంటే భయంగా అలా నిలబడిపోయింది.

ఇంతలో కృష్ణమూర్తి వీధరుగు మీదకు వచ్చి, "కల్యాణిగారూ!" అని కేక పెట్టాడు. ఆ కేక విని వసుంధర ఒక్క అంగలో అరుగుమీదకు దూకి, "మీరా కృష్ణమూర్తిగారూ! సమయానికి వచ్చారు. మునసబుగారికి సడన్‌గా ఛాతీలో నొప్పి వచ్చింది," అంది.

"అయ్యో! ఏం నొప్పండి అదీ! ఏం చేద్దాం మరి?" అన్నాడు కృష్ణమూర్తి. అతని కంఠకంటే కంగారు.

"అర్జంటుగా వెళ్ళి ఓ డాక్టర్ని తీసుకురాగలరా?" అంది వసుంధర.

"ఓ! క్షణంలో తీసుకొస్తాను. పక్కవీధిలోనే ఒక డాక్టరు ఫ్రెండున్నాడు కుర్రాడే గాని అఖండుడు. మూడేళ్లు సర్వీసులో ఉండి మొన్ననే రిజైన్ చేసి ప్రాక్టీసు పెట్టాడు, అతన్ని తీసుకురానా?"

"ఎవరో ఒకరు, త్వరగా తీసుకురండి" అంది వసుంధర. కృష్ణమూర్తి పరిగెత్తుకు వెళ్ళాడు.

వసుంధర వీధరుగుమీద కూర్చుంది. ఆ అమ్మాయికి జబ్బులన్నా శారీరక యాతనలన్నా అమిత భయం. దూరంనుండి ఏం కావాలన్నా చేస్తుంది కాని, దగ్గిరగా వచ్చి చూడలేదు. సుఖం, అనురాగం ఉన్న వాతావరణం మధ్య హాయిగా పెరిగిన దవడాన్న దుఃఖం, రుజ, బాధ ఆమెకు కొత్త.

కల్యాణి నాయుడు మంచం దగ్గరగా కుర్చీవేసుకు కూర్చుంది. నాయుడు ఆయాసంతో రొప్పుతున్నాడు. ఊపిరి పీల్చడం కష్టంగా ఉంది. పడుకోవడం కూడా కష్టంగా ఉంది. పైకి నిబ్బరంగా కూర్చున్నా కల్యాణి లోలోపల కంగారుపడుతోంది మధ్యాహ్నం భోజనం చేసేదాకా బాగున్న నాయుడుకి ఇంతలో ఏమొచ్చింది? పాపం, తనను చూడడంకోసం వచ్చాడు. వూరుగాని వూరు, చోటుగాని చోటు తనే ఒకరింట్లో తలదాచుకుంది. వాళ్ళేమనుకుంటారో! ఫరవాలేదు, కాస్సేపటిలో తగ్గిపోతుంది. డాక్టరు వస్తే బాగుండును. వెళ్ళిన కృష్ణమూర్తి ఇంత అలస్యం చేస్తున్నాడేమిటో? డాక్టరు దొరికాడో లేదో? లేక కృష్ణమూర్తి అక్కడనుండి అలాగే ఉడాయించాడా? వెధవ ఆలోచనలు. ఆమె మనస్సు పరిపరివిధాల పోతోంది.

వెళ్ళిన పావుగంటలో డాక్టర్ని తీసుకువచ్చాడు కృష్ణమూర్తి. "కల్యాణి! డాక్టరు గారొచ్చారు" అని వసుంధర గొంతు వెనుకనుండి వినబడి కల్యాణి కుర్చీలోంచి లేచింది. ఆమె వెనకాలే షరాయి, చొక్కా తొడుక్కుని చేతిలో స్టెతస్కోపు పట్టుకుని నిలుచున్న యువకుడు కనపడ్డాడు. 'ఈయనేనా డాక్టరు! ఇంతకుర్రాడు డాక్టరేమిటీ?' అనుకుంది కల్యాణి. అప్రయత్నంగా పక్కకు తప్పుకుంది.

నాయుడు లేవబోయాడు. డాక్టరు అతని భుజం మీద చెయ్యివేసి "లేవకండి అలాగే పడుకోండి" అంటూ స్టెతస్కోపు తగిలించుకుని పరీక్ష చేశాడు. వాచీ చూశాడు. వాచీ చూస్తూ నాడి చూశాడు. కల్యాణి వేపు తిరిగి "తలగడాలు ఎత్తుపెట్టి వాలుగా కూర్చోపెట్టండి. పూర్తిగా పడుకుంటే ఆయాసం యెక్కువవుతుంది" అని బ్యాగ్ తీసి, ఇంజక్షన్ సిరంజిలోకి మందు యెక్కించాడు.

"ఏమిటండీ డాక్టరుగారూ—ఏమిటిది? ఎంతసేపట్లో తగ్గిపోతుంది?" అంది గుమ్మందగ్గిర నుంచున్న వసుంధర.

"ఫరవాలేదమ్మా, కాస్సేపటికి తగ్గిపోతుంది. కృష్ణమూర్తీ, యిలా వచ్చి కొంచెం చెయ్యిపట్టుకో!" అని, డాక్టరు ఇంజక్షన్ యిచ్చాడు నాయుడికి.

నాయుడు చాలా ఆయాసపడుతూ, యెంతో కష్టంమీద "మీకు లేనిపోని గొడవ తెచ్చిపెట్టాను వసుంధరమ్మా!" అన్నాడు.

"ఫరవాలేదు నాయుడుగారూ! దానికేమిటీ! కాస్సేపటిలో తగ్గిపోతుంది. భయపడకండి, డాక్టరుగారొచ్చారుగా!" అంది వసుంధర

"ఏమిటోనమ్మా! నీ కెందుకీ శ్రమంతా? ఏం డాక్టరు బాబూ! నన్ను మా యిల్లు చేరుకునేట్లు చేయండి ఎలాగైనా. ఆ తరువాత ఏమైనా ఫరవాలేదు" అని రొప్పుతూ రొప్పుతూ మధ్యమధ్య అనగల్గాడు నాయుడు.

డాక్టరు ఇంజక్షన్ పెట్టె సర్దుకుంటూ, "మీకేం భయం లేదండీ! చూడండి, పది నిముషాల్లోనే ఆయాసం సర్దుకుంటుంది" అన్నాడు.

ఎవరూ మాటాడలేదు. డాక్టరుకూడా అలాగే నాయుడి వంక తదేకంగా చూస్తూ కుర్చీలో కూర్చున్నాడు. వసుంధర వెళ్ళి వీధరుగుమీద కుర్చీలో కూర్చుంది. కృష్ణమూర్తి గుమ్మందగ్గిర నిలబడ్డాడు. కల్యాణి గోడకు చేరబడి నిలబడింది

పది నిముషాలు గడిచాయి క్రమంగా నాయుడికి ఆయాసం తగ్గి కాస్త మాగన్నుగా కళ్ళు మూతలుపడ్డాయి. డాక్టరు అప్పుడు కుర్చీలోంచి లేచి బ్యాగ్ తీసుకుని, వీధరుగుమీద కుర్చీలో చతికిలపడుతూ, "ఆయన తాలూకువాళ్ళు ఎవరండీ యిక్కడ?" అన్నాడు

వసుంధర లోలోపల వణికిపోతూ—"ఏమండీ? ఏం? సీరియస్సా?" అంది. ఏవో మాటలు వినబడేసరికి కల్యాణీ కృష్ణమూర్తీ బయటకు వచ్చారు.

"ఏం లేదు, నేనడిగింది చెప్పండి!" అన్నాడు డాక్టరు.

కల్యాణి కొంచెం ముందుకొచ్చి, "నేనేనండీ, కల్యాణినీ! నా కోసం వచ్చారాయన, నాకు బాబాయ్ అవుతారు. ఏం? అసలు ఏమిటో చెప్పండి, దాపరికం లేకుండా!" అంది

డాక్టరు ఒక్కక్షణం కల్యాణి మొహం వేపు తేరిపార చూశాడు. "ఎవరీ అమ్మాయి? ఎక్కడో చూసినట్టుందే! చాలా పరిచితమైన మొహం!" అనిపించిందతనికి.

ఆ క్షణంలో కల్యాణికీ అలాగే అనిపించింది "ఎక్కడో చూశానితన్ని, ఎప్పుడు చెప్మా! బాగా తెలిసినవాడిలా కనబడుతున్నాడు" అనుకుంది.

"కృష్ణమూర్తీ! ఆ తలుపు రెక్క వేసేయ్!" అన్నాడు డాక్టరు. కృష్ణమూర్తి జోడు చప్పుడు కాకుండా, ఎత్తి ఎత్తి అడుగులు వేసుకుంటూ నాయుడు పడుకున్న గది తలుపు పైనుండి వేశాడు.

డాక్టరు జేబులోంచి సిగరెట్ తీసి వెలిగిస్తూ, "చూడండి కల్యాణి గారూ! మీరేమీ కంగారు పడకండి. కాని తెలుసుకోవడం మంచిది. ఆయనకు హార్ట్ ఎటాక్ వచ్చింది. చాలా మైల్డ్‌గా వచ్చిందనుకోండి. అయినా చెప్పలేం. ఈ జబ్బు రాకపోవాలిగాని, వస్తే ఏం జరుగుతుందో డాక్టర్లకి కాదుగదా, దేవుడికైనా తెలీదు. ముందు వెంటనే హాస్పిటల్‌కు తీసికెళ్ళి ఎడ్మిట్ చేయండి. ఆక్సిజన్ యివ్వాలి. విడవకుండా దగ్గిర నర్సు ఉండాలి. ఎమర్జెన్సీ కేసు గనక హాస్పిటల్‌లో ఉంచడం అవసరం." అన్నాడు.

కల్యాణి గుండెల్లో ఒక్కసారి జలపాతం హోరు పెట్టింది. కీకారణ్యంలో జంతు ధ్వనుల లాంటివి ఏవో వినబడ్డాయి. కాని తేరుకోవాలి. జారిపోకూడదు. తనకి జారిపోయి భయపడడానికి కూడా జీవితం అనుమతి నివ్వడం లేదు.

"అయితే, దయచేసి మీరే ఆ సాయం చేసిపెట్టండి డాక్టరుగారూ! ఆసుపత్రికి ఎలా చేర్చడమో, ఎక్కడ ఎవళ్ళతో మాటాడ్డామో కూడా నాకు తెలీదు" అంది.

కృష్ణమూర్తి "భయపడకండి కల్యాణిగారూ! నేనున్నానుగా! నాయుడుగారికి నయం అయేదాక నేను మీతోనే ఉంటాను" అన్నాడు.

"నా దగ్గిర యెనభై రూపాయలదాకా ఉన్నాయి సరిపోతాయా డాక్టరుగారూ!" అంది కల్యాణి, ఆవేదనతో.

"డబ్బుకేమిటి కల్యాణీ! నేనున్నానుగా!" అంది వసుంధర

కృష్ణమూర్తి కొంచెం ఆవేశంతో, "మిమ్మల్ని ఎవ్వరూ వదిలెయ్యరు కల్యాణిగారూ! డబ్బుకేం భయపడకండి. అన్ని ఏర్పాట్లూ నేను చేస్తాను" అని డాక్టరువేపు తిరిగి, "ఏం డాక్టరూ! నువ్వు కొంచెం దగ్గిరుండాలి. ఎలా తీసికెళదాం?" అన్నాడు. డాక్టరు లేచి నుంచొని, "పద! ఏంబులెన్సుకు టెలిఫోన్ చేద్దాం" అన్నాడు ఇద్దరూ కలసి బయటకు పోయారు.

వాళ్ళు వెళుతున్న వేపే చూస్తూ అలా నిల్చుండిపోయింది కల్యాణి. వెనకనుండి వచ్చి ఆవిడ భుజంమీద చెయ్యి వేస్తూ వసుంధర, "కంగారుపడకు కల్యాణీ! మన చేతుల్లో ఎంతవరకూ ఉందో అంతవరకూ చేద్దాం పెద్ద ఆసుపత్రి ఉంది సాయపడే మనుషులున్నారు. డాక్టరు–పాపం–మంచివాడల్లే ఉన్నాడు అవసరమైతే డబ్బుకి కూడా నువ్వేం కంగారుపడకు నేనుండగా నీకేం యిబ్బంది రాదు" అంది.

ఇవతలకి తిరిగి కల్యాణి ఒక్కసారి వసుంధర మొహంలోకి చూస్తూ–రుద్ధకంఠంతో, "నా వల్ల నీకెంత యిబ్బంది వసుంధరా! నావంటిదాన్ని ఇంట్లో చేర్చుకుంటే నీకెన్ని ఆపదలో చూశావా?" అంది

వసుంధర కల్యాణిని దగ్గిరగా తీసుకుని, "ఛా పిచ్చిపిల్లా! ఏం మాటలవి! ఆపదలు మనుషులకు రాక మానులకొస్తాయా? ఐనా యిందులో నాకిబ్బంది ఏముంది? ఆయన్ని ఆరోగ్యంగా మళ్ళీ నాళ్ళింటికి పంపించేస్తే అంతేచాలు. లే, డ్రెస్సు మార్చుకో. ఏంబులెన్సు వస్తుంది, పోదాం" అంది.

కల్యాణి కన్నీళ్ళు తుడుచుకుంటూ, "నువ్వుండిపో వసుంధరా! నేను కృష్ణమూర్తిని తీసుకుని వెళతాను" అంది.

"అలాగంటేనే నాకు కోపం వస్తుంది. నీతోపాటే నేనూను, పద" అంది వసుంధర.

ఏంబులెన్సు రావడానికి అరగంట పట్టింది. దాని వెనకాతలే కారులో డాక్టరూ కృష్ణమూర్తి వచ్చారు.

"కల్యాణీ! ఈ డాక్టరుగారికి కారుకూడా ఉందే!" అంది వసుంధర నెమ్మదిగా.

అటెండర్లు నాయుడుగారిని స్ట్రెచర్‌మీద తీసుకెళ్ళి ఏంబులెన్సులో పడుకోబెట్టారు. ఇంజను స్టార్టయింది.

"నేను ఏంబులెన్సులో ఎక్కుతాను" అంది కల్యాణి కట్టుబట్టలతోనే రోడ్డుమీదికి వచ్చి. వసుంధరా కృష్ణమూర్తీ ఒకరి మొఖం ఒకరు చూసుకున్నారు.

డాక్టరు తన కారు ఫ్రంటు సీటు తలుపు తెరిచాడు. కల్యాణి దగ్గరగా వచ్చి "మీరు నా కారులో కూర్చోవాలి!" అన్నాడు

"ఏంబులెన్సులో ఎక్కకూడదా?" అంది కల్యాణి ఉద్రేకంతో.

ఒక్కసారి కల్యాణి మొహం వేపు చూశాడు డాక్టరు ఉన్నట్టుండీ ఆమె జబ్బపట్టుకుని, "కూడదు. నేను చెప్పినట్టు వినాలి మీరు" అని లాక్కెళ్ళి కారు వెనుక సీటులో కూర్చోబెట్టి, వసుంధరవేపు తిరిగి "మీరూ వస్తున్నారా?" అన్నాడు "వస్తున్నానండీ!" అంది వసుంధర. "ఐతే త్వరగా ఎక్కండి మరి, ఆవిడపక్క కూర్చోండి. రా, కృష్ణమూర్తీ! నువ్వు ముందు కూర్చో" అంటూ చక్రం ముందు కూర్చొని కారు స్టార్ట్ చేశాడు. ఏంబులెన్సు అప్పుడే యాభైగజాల ముందుంది. కారు స్పీడుని హెచ్చిస్తూ "ఈ అమ్మాయి నిదివరకెక్కడో చూశాను!" అని మళ్ళీ అనుకున్నాడు డాక్టరు.

రెండు వాహనాలూ కింగ్ జార్జ్ హాస్పిటల్‌కి దారి తీశాయి. అస్తమయ సూర్యకాంతి పొడలు పొడలుగా కల్యాణి మొహంమీద పడుతోంది రోడ్లన్నీ అలికిడిగా ఉన్నాయి. వాళ్ళందర్నీ చూస్తూన్న కల్యాణికి యీ లోకమే యింకేదో ప్రపంచంలాగా కనబడుతోంది. ఇంతలో హాస్పిటల్ గేటు సమీపించింది కారు.

## 12

అంబులెన్సు ఔట్ పేషెంటు గేటుముందర ఆగింది. డాక్టరు చక్రవర్తి కారు మరికొంచెం లోపలికి వెళ్ళి ఆగింది. డాక్టరు కారుదిగి కాజుయాలిటీ రూముకు వెళ్ళడం రెండునిముషాలు కూడా పట్టలేదు అదృష్టవశాత్తు అతనికి తెలిసిన డ్యూటీ డాక్టరున్నాడు. "హార్టు ఫెయిల్యూర్ కేస్" అంటూ నాలుగు మాటల్లో ఆ కేస్ గురించి చెప్పేసి అడ్మిషన్‌కి కావలసిన ఏర్పాట్లన్నీ చేసేశాడు. వెంటనే కారు మళ్ళించి స్పెషల్ వార్డు గేటు దగ్గరికి పోనిచ్చాడు. అంబులెన్సు అతని వెంటే వెళ్ళింది.

స్ట్రెచర్‌లో తనను తీసుకొని స్పెషల్ వార్డు మెట్లెక్కుతూంటే రామినాయుడికి మెలుకువ వచ్చింది. తానెక్కడున్నాడో తనకే తెలియని అయోమయంలో ఉన్నాడు. గంట క్రిందట డాక్టరు ఇచ్చిన ఇంజక్షను–తీసి పారేసినట్లు అతని ఆయాసాన్ని తగ్గించేసింది. అలసటలోని సుఖంతో నిద్రపట్టేసిందతనికి. తనను దేనిమీదో పడుకోబెట్టి ఎక్కడికో తీసుకెళుతున్నారని గ్రహించాడు రామినాయుడు. ఏదో వెర్రి భయంతో "కల్యాణమ్మా" అని నీరసంగా పిలిచి స్ట్రెచర్ మీద నుండే తలెత్తి చూడాలని ప్రయత్నించాడు కాని తల తిరిగి పోతూంది, అతని పిలుపు గొంతులోనే ఉండిపోయింది. స్పెషలువార్డు గదిలో మంచంమీద పడుకోబెడుతూంటే కళ్ళువిప్పి నలువైపులా కలయచూశాడు రామినాయుడు. ఒక నర్సు పక్క సర్దుతూంది. డాక్టరు మరొక నర్సుతో ఏదో చెపుతున్నాడు. కల్యాణి, వసుంధర గజం దూరంలో

నిల్చున్నారు. కృష్ణమూర్తి గుమ్మం అవతల నిల్చున్నాడు. తనను హాస్పిటలులో చేర్చారు అని క్షణంలో తెలిసిపోయిందతనికి. ఎందుకో అతని కళ్ళు చెమ్మగిల్లాయి. "కల్యాణమ్మా!" అని పిల్చాడు మళ్ళీ మరింత గొంతు పెగల్చుకొని. కల్యాణి ఆదుర్దాగా పైకివచ్చి "ఏంబాబాయిగారూ! మెలుకువ వచ్చిందా! ఇప్పుడెలా ఉంది? కొంచెం నయంగా ఉందా?" అని వరుసగా ప్రశ్నలు వేసేసింది.

రామినాయుడు కల్యాణి ముఖంలోకి జాలిగా ప్రేమగా చూసి – "ఎందుకమ్మా! మీ అందరికీ ఈ శ్రమ? ఈ ముసలాడు నీకింత కష్టం కల్గిస్తాడనుకోలేదు! ఏ కారో మాట్లాడి మా యింటికి పంపించేయరాదూ తల్లీ?" అన్నాడు.

"అదేమిటి బాబాయిగారూ! ఇందులో శ్రమ కేముంది? ఒకటి- రెండు రోజులుంటే అంతా సర్దుకుపోతుంది. అప్పుడు అలాగే వెళుదురు గాని" అంది కల్యాణి.

ఇంతలో డాక్టరు, రామినాయుడు దగ్గరికి వచ్చి "ఎలా వుందండీ?" అంటూ నాడి చూసాడు.

"మీ దయవల్ల ఇందాకటంత బాధలేదు. కాని గుండెల్లో ఏదో గుబులు బాబూ! ఏమిటో సరిగా చెప్పలేను. దుడుకుగా ఉంది–"

"ఫరవాలేదు, మీరేం కంగారు పడకండి; తగ్గిపోతుంది, అనవసరంగా ఏమీ మాట్లాడ కండీ" అంటూ కల్యాణివైపు తిరిగి "ఈయన మాట్లాడకుండా చూడాలి మీరు" అన్నాడు కల్యాణి సరే నన్నట్లు తల ఊపింది.

మరి పావు గంటలో డ్యూటీ డాక్టరు వచ్చాడు. రామినాయుడిని వివరంగా పరీక్ష చేశాడు. చక్రవర్తిని గది అవతలకి తీసుకెళ్ళి ఇద్దరూ ఏదో మాట్లాడుకున్నారు–స్టాఫ్ నర్సుని పిలిచి ఏమేం చేయాలో అంతా చెప్పాడు. ఒక ఇంజక్షన్ యిచ్చాడు. ఆక్సిజన్ తెప్పించి పక్కనే పెట్టించాడు. ప్రతి అరగంటకి పల్సు చూడమన్నాడు. "అవసరమయితే ఆక్సిజన్ వెంటనే స్టార్ట్ చెయ్యండి" అని చెప్పాడు. మరో ఇంజక్షన్ యిచ్చి మళ్ళీ ఎనిమిది గంటలకి వచ్చి చూస్తాను అని చెప్పేసి వెళ్ళిపోయాడు డ్యూటి డాక్టరు. రామినాయుడు తనచుట్టూ జరుగుతున్న గడబిడంతా చూస్తూనే ఉన్నాడు, కొంత అర్థం అవుతూంది, కొంత అర్థం కాలేదు. గుండెలో బాధ, తల దిమ్ముగా ఉంది. బయట తా నెరగని వాతావరణం. వీటన్నిటిమధ్యా తనకేమౌతుంది? ఇంతలో ఇంత ముంచు కొచ్చిందేమిటి? మనిషన్న తరువాత చావు రాక మానుతుందా! అందుగురించి తనకేం దిగులులేదు. తన కోరికల్లా ఒక్కటే –ఏం జరిగినా ఆ పుట్టిపెరిగిన గడ్డమీద–కావలసిన వాళ్ళందరిమధ్యా జరిగితే బాగుండును. మనస్సులో కోరిక మనస్సులోనే ఉంది– మళ్ళీ మాగన్నుగా నిద్రపట్టింది రామినాయుడికి.

మంచానికి దగ్గరగా తలవైపు నిల్చుంది కల్యాణి. కన్నార్పకుండా రామినాయుడువైపు చూసింది. అరవైయేళ్ళు వస్తేనేం కాక ఎంత దృఢంగా ఉంది శరీరం! ఆ వేళ పొద్దున్నే కదూ కోర్టుకాగితాలు చక్కబెట్టుకుని ఊరంతా తిరిగివచ్చాడు! ఇంతలో ఇంత ముంచుకు వచ్చిందేమిటి? పాపం! తనని చూడటానికి వచ్చాడు, ఎంతదశ పట్టింది? మళ్ళీ లేస్తాడా! స్పష్టంగా పరిస్థితి ఇదీ అని చెప్పకపోయినా డాక్టరు పద్ధతిచూస్తే ఈ కేస్ సీరియస్ అని తెలుస్తూనే ఉంది అనుకుంది కల్యాణి.

వసుంధర దూరంగా కుర్చీలో కూర్చుంది ఇంటిదగ్గర బయలుదేరాక ఇంతవరకూ ఒక్క మాటైనా మాట్లాడలేదా అమ్మాయి వసుంధర ఇంతవరకూ హాస్పిటలుకు వచ్చి ఎరగదు. ఆ గంభీరత, ఆ నిశ్శబ్దత చూస్తే ఆమెకు భయం. పదిహేనేళ్ళప్పుడు వేసవి సెలవులకి కలకత్తాలో వాళ్ళ బాబాయి ఇంటికి వెళ్ళింది తండ్రికి అపెండిసైటిసు వచ్చింది, సీరియస్‌గా ఉంది అని టెలిగ్రాము వచ్చి, తానింటికి చేరుకునేసరికే అంతా ముగిసిపోయింది. తండ్రిలేని లోపమొక్కటే ఆమెకు తెలుసు. అన్నలూ వదినెలూ ఆ కష్టాన్ని ఇట్టే మరపింపచేసేశారు. అంతేకాని, జబ్బులూ, ఆపరేషన్లూ, డాక్టర్లూ, ఆసుపత్రులూ వసుంధర ఎరగదు. అందుకే అంత భయం.

కృష్ణమూర్తి సిగరెట్‌మీద సిగరెట్ కాల్చుతూ బయటే పచార్లు చేస్తున్నాడు. ఆరుగంటలయింది–విజిటర్సు అందరూ వెళ్ళిపోవలసిందిగా వార్డుబాయ్ బెల్లు మోగిస్తున్నాడు. ఒక్కొక్క గదిలోంచి ఆడా మగా పిల్లలూ పెద్దలూ బయటికి వచ్చేస్తున్నారు శీతాకాలపు రాత్రి చీకట్లను పరుచుకుంటూ వస్తూంది కారిడార్ చివర గోడ కానుకుని నిలబడి ఉన్న కృష్ణమూర్తి దగ్గరికి వెళ్ళి డాక్టరు చక్రవర్తి "మరేమిటి భాయీ! నేనింక వెళ్ళాలి. చూశావుగా నా క్లినిక్‌లో ఎలా ఉన్నవాళ్ళని అలా వదిలిపెట్టి వచ్చాను. అదీగాక ఊళ్ళో రెండుమూడు కేసులు చూసుకోవాలి" అన్నాడు.

కృష్ణమూర్తి "అయ్యో, వెళ్ళకపోతే ఎలాగ ! అదిసరేలే, ఇంతకీ ఏమిటంటావు ఇతని సంగతి?" అన్నాడు.

"చెప్పానుగా హార్టుఫెయిల్యూర్ అని. కేసేమో సీరియస్సే. ఇంక ముసలాయన మామూలు మనిషనటం కల్ల. కాకపోతే ఎప్పుడు ఎలా గుంటుందీ అన్నది చెప్పడం కష్టం. సాయంత్రం నేను వచ్చినప్పుడున్న పరిస్థితి యిప్పుడు లేదు. కాస్త సర్దుకుంది. ఇలాంటి కేసులో అదేం చెప్పలేం కృష్ణమూర్తీ–అంతా దైవాధీనం. మరి నేను పోయిరానా?"

"ఈ రాత్రికేం భయం లేదుకదా!" అన్నాడు మళ్ళీ కృష్ణమూర్తి ఏదో బెంగగా.

"ఉండకూడదు. రా! వాళ్ళతో కూడా చెప్పేసి వెళతాను" అంటూ రామినాయుడున్న గదివైపు నడిచాడు కృష్ణమూర్తిని కూడా వెంట తీసికొని మరొకసారి రామినాయుడిని పరీక్షించి పల్సు చూసాడు డాక్టరు. "ఇందాకటి కంటే ఇప్పుడు చాల నయంగా ఉంది. మరి నేను వెళతానండి" అన్నాడు కల్యాణి ముఖంలోకి చూసి.

"అయ్యో, మీరు వెళ్ళిపోతే ఎలా! మా కసలు ఏం తెలీదు–ఎంత శ్రమ అయినాసరే మాతోపాటు మీరు ఉండాల్సిందే" అంది ప్రాధేయపూర్వకంగా కల్యాణి. కృష్ణమూర్తి నచ్చచెప్పాడు. అతనికి వేరే కేసులున్నాయనీ వెళ్ళి చూసుకోవాలనీ. వసుంధర "ఆ కేసులు చూసేసుకొని వెంటనే వచ్చేయండి" అంది. "హాస్పిటలు డాక్టరుతో చెప్పాను, అంతా ఆయన చూసుకుంటాడుగా!" అని నసిగాడు డాక్టరు. "నువ్వేదో చేసేస్తావనీ వాళ్ళు చెయ్యలేరనీ కాదు డాక్టర్! ఊరికే మాతోపాటు ఉంటే కాస్త ధైర్యం. ఒక గంటలో పనులన్నీ చూసుకుని వచ్చేద్దూ?" అన్నాడు కృష్ణమూర్తి. సరేనంటూ వెళ్ళాడు డాక్టరు.

డాక్టరు వెళ్ళాక స్పెషల్ రూము నానుకుని ఉన్న బాల్కనీలో నుంచున్నాడు కృష్ణమూర్తి. అప్పటికి బాగా చీకటి పడిపోయింది. హాస్పిటల్‌లో అన్ని మూలలా

లైట్లు వెలుగుతున్నాయి మూడో అంతస్థున్న స్పెషల్ రూము బాల్కనీలో నిల్చుంటే హాస్పిటలంతా కన్పిస్తూంది. విజిటర్సు అందరూ వెళ్ళిపోయారు. ప్రశాంతంగా ఉంది. అప్పుడప్పుడు డాక్టర్ల కోటులూ నర్సుల గౌనులూ వార్డుకీ వార్డుకీ మధ్య తిరుగుతూ కన్పించాయి కృష్ణమూర్తి జనరల్ హాస్పిటలుకు చాలాసార్లు వచ్చాడు–ఎవరెవరో స్నేహితులు హాస్పిటలులో చేరినప్పుడు. కాని ఇవాళ అతనికేదో కొత్తగా ఉంది. ఉదయంనుండీ జరిగిన సంగతులన్నీ నెమరువేసుకుంటున్నాడతను. ఆమాటకొస్తే ఉదయంనుండీ ఏమిటి, వారం రోజులై ఎన్ని సంఘటనలు జరిగాయి! అంతవరకూ ఒక పద్ధతిలో ఒకేస్థాయిలో నడుస్తూన్న తన జీవితం ఏదో మార్గం పట్టినట్టనిపించిం దతనికి, ఇందిర, ప్రకాశం, శేషావతారం, కల్యాణి, వసుంధర–వీళ్ళందరినీ చుట్టుకున్న వింత వింత వాసనలు – కృష్ణమూర్తి మెదడులో పొగలు కమ్ముకున్నట్లు కమ్ముకుంటున్నాయి. వీటన్నిటిపైనా రామినాయుడు–ఉదయం తలవని తలంపుగా అతను ఎదురయాడు – మధ్యాహ్నం వెళ్ళేసరికి పరిస్థితి మారిపోయింది రామినాయుడు కల్యాణికెలా తెలుసో అదంతా తెలియదు కృష్ణమూర్తికి. కాని ఆమెకు రామినాయుడంటే అమితమైన అభిమానం, గౌరవం ఉన్నాయి. అతనికే అపద వచ్చినా కల్యాణి గిలగిలలాడుతుందని తెలుసు.

"కృష్ణమూర్తిగారూ, ఇలారండీ"అంది కల్యాణి బాల్కనీలోకి చూసి. కృష్ణమూర్తి అదిరిపడి గదిలోకి వెళ్ళాడు.

కల్యాణి తగ్గించిన స్వరంతో –"చూశారా ఇందాకటికంటె మనిషి ఆయాస పడుతున్నట్లు లేరూ? అసలిది నిద్రేనంటారా! మైకం కమ్మడం లేదు కదా!" అంది భయంగా. వసుంధర కుర్చీలోంచి లేచి మెల్లగా అడుగులు వేస్తూ మంచం పక్క నిల్చుంది–నిజంగానే రామినాయుడు ఎక్కువ ఆయాసపడుతున్నాడు. శ్వాస పీల్చుకోడానికి ఎంతో బాధ పడుతున్నట్లుంది. వీపు వెనకాతల ఎత్తులు పెట్టి వాలుగా పడుకోబెట్టారతన్ని. ఇంటిదగ్గర చొక్కా విప్పేసి ఉత్తరీయం గుండెలమీద వేసుకుని పడుకున్న నాయుడిని అలానే ఆసుపత్రికి తీసుకొచ్చారు. వెడల్పయిన ఛాతీమీద ఎడమభాగం చూసేవాళ్ళు భయపడేలా అదురుతోంది. మెడమీద నరాలు బలంగా కొట్టుకుంటున్నాయి. కల్యాణి నుదుటిమీద చెయ్యి వేసింది. పాదాలు, చేతులు తడిమి చూసింది. చెమటలు పడుతున్నాయి బాగా చల్లగా ఉన్నాయి. "ఆ నర్సునొకసారి పిల్చుకురండి" అంటూ వెర్రిముఖం పెట్టేసింది కల్యాణి

కృష్ణమూర్తి నర్సును పిల్చుకొచ్చాడు. ఆవిడ వచ్చి నాడి చూసి వెంటనే పక్కనున్న ఆక్సిజన్ గొట్టాన్ని నెమ్మదిగా రోగి ముక్కులో పెట్టింది. రామినాయుడు మైకంలో లేడు–కాని మగత మగతగా ఉన్నాడు. ముక్కులో గొట్టం పెట్టగానే కళ్ళు విప్పి "ఏమిటమ్మా ఇదంతా!" అన్నాడు విసుగుగా.

"మరేంలేదు బాబాయిగారూ! మీకు ఊపిరి తీసుకుందుకు కొంచెం సులువుగా ఉంటుందని ఇది పెట్టారు" అంది కల్యాణి.

ఇంతలో డాక్టరు చక్రవర్తీ, డ్యూటీ డాక్టరూ కలిసి వచ్చారు. మళ్ళీ ఇద్దరూ పరీక్షించారు. వెంట వెంటనే ఆ చేతికి ఈ చేతికీ ఇంజక్షన్లు యిచ్చేశారు.

ఆక్సిజన్ బుడగలు బుడగలుగా రామినాయుడు ఊపిరితిత్తులలోకి వెళుతూనే ఉంది. అయినా ఆయాసం, ఎగశ్వాస అంతకంతకు హెచ్చుతూనే ఉన్నాయి.

అరగంట వ్యవధికూడా లేకుండా శరీరానికి సూదిపోట్లు పడినా ఒక్క అరగంట కూడా తెరిపిగా కనబడడం లేదు. అతనికి పూర్తి మెలకువా లేదు, నిద్రా లేదు. ఇంజక్షన్ యిస్తే 'అబ్బా!' అని మూల్గుతాడు అంతలో కళ్ళు మూసుకుని పడుకుంటాడు అతను ఊపిరి తీసుకున్నప్పుడల్లా బరువుగా బాధగా గుండెల్లోనుంచి ఏదో శబ్దం వెలువడుతూంది

రాత్రి పది గంటలదాకా కూర్చుని డ్యూటీ డాక్టరు "హాస్పిటలంతా రౌండ్సు చేసిరావాలి. నువ్వుంటావు కదూ చక్రవర్తీ? చూస్తూ ఉండు. ఇంకెంత సేపున్నా ఇంతేకదూ" అనేసి వెళ్ళిపోయాడు. డాక్టరన్న మాటలతో అక్కడ అందరికీ స్పష్టమైపోయింది, ఇది తిరుగు ముఖం పట్టేది కాదని. కల్యాణికి పట్టరాని దుఃఖం వచ్చేసింది. కళ్ళంట నీళ్ళు ఆగలేదు. "ఇంకేం లాభంలేదా డాక్టర్?" అంది చక్రవర్తితో

"కొన్ని గంటల వ్యవధి.. మీరలా బెంబేలు పడిపోతే ఏం దారి? అలా దిగజారిపోకండి... ధైర్యం తెచ్చుకుంటేకాని దేనినీ ఎదుర్కోలేరు" అన్నాడు చక్రవర్తి అందరూ చెప్పే మాటలే అవి, అయినా అతను చెప్పినప్పుడు ఆత్మీయులెవరో ఓదార్చినట్లయింది కల్యాణికి. వెంటనే కళ్ళు తుడిచేసుకుంది. అవును, ధైర్యంగా ఉండాలి ఎప్పటికప్పుడు అలాగే అనుకుంటూంది తను. ప్రకాశం దగా చేసినపుడు, నాన్న చచ్చిపోయినప్పుడు, ప్రిన్సిపాల్ విముఖంగా మాటాడినప్పుడు...ఎప్పుడూ ఈ మాటే అనుకుంది. ధైర్యంగా ఉండాలి, దిగజారిపోకూడదు అని అవే మాటలు అతని మనస్సులోంచి వచ్చాయి ఎందుకో ప్రకాశం జ్ఞాపకం వచ్చాడు కల్యాణికి. నాన్న ఆ తెల్లవారు ఝామున పోతాడనగా అతని మంచం పక్కనే కూర్చుని తను ఆలోచించుకుంది–ప్రకాశం తన ప్రక్కనే ఉంటే ఎంత బాగుండును అని అతను డాక్టరు తనకీ లోకంలో ఒకే ఒక ఆత్మీయుడు. తనంత ఆపదలో ఉన్నప్పుడు అతడే తన పక్కనుంటే ఎంత సహాయంగానో ఉండేది అనుకుంది. ఆ రోజు తానెంత పొరపాటు పడిందీ తరువాత కొద్దిరోజుల్లోనే తెలిసిపోయింది "ఏకాకిగా ఉన్నాను, అన్ని విధాలా నష్టపోయాను ఈ లోకంలో నాకు మిగిలింది నువ్వొక్కడివే, ఒక్కసారి రా!" అని మరీ మరీ వ్రాసింది ఫలితం? తన అభిమానం దెబ్బతిన్నది ప్రకాశం లోతులేని మనిషి అని తెలుసుకుంది.

"ఎన్ని గంటలలా నిల్చుంటారు? ఆ కుర్చీ వేసుకుని కూర్చోండి" అన్నాడు చక్రవర్తి. ఆలోచనలోంచి తేరుకుని, రామినాయుడి మంచానికి దగ్గరగా కుర్చీలాక్కుని కూర్చుంది కల్యాణి. అప్పటికప్పుడే రాత్రి పన్నెండు గంటలు దాటింది బాల్కనీలో పచార్లు చేసిచేసి కృష్ణమూర్తి అక్కడే కుర్చీలో జారగిలబడ్డాడు అతనికి తెలియకుండానే చిన్న కునుకు పట్టింది గోడనానుకుని ఉన్న డ్రెస్సింగు టేబిలు ప్రక్క కుర్చీలో కూర్చుంది వసుంధర. ఒక్కొక్క నిముషం గడిచేకొద్దీ భయంతో గడ్డకట్టుకుపోతోంది వసుంధర. ఆ అమ్మాయికి చావంటే విపరీతమైన భయం. అందులోనూ మానవుని చరమదశను, సమీపిస్తున్న మృత్యువును, ఆమె ఎన్నడూ చూడలేదు. బాల్కనీలో కూర్చుందుకు విపరీతంగా చలిగా ఉంది. కృష్ణమూర్తి ఆ చలిలోనే కూర్చున్నాడు. అంత చలిలోనూ అతనికి కుర్చీలోనే నిద్ర పట్టింది. ఆ గదిలో నిశ్శబ్దంలో ఉండుండి రామినాయుడి

మూల్గు. నిముషాలు గడిచేకొలదీ వేగమౌతున్న ఊపిరి ఆయాసంతో అరడుగు ఎత్తు లేస్తూ పడుతూ ఆన కిట్టెదుట ఉన్న ఆ మానవాకారం చూడలేకపోయింది వసుంధర. భయంతో బిగుసుకుపోయింది. తాను చూడలేని ఆ దృశ్యాన్ని కళ్యాణి ఎలా చూడగలుగుతూంది! అంత దగ్గరగా ఎలా కూర్చుంది! మధ్యమధ్య అతని నుదుటిమీద చెమట తుడుస్తుంది నోట్లోంచి నీళ్లు కారుతూంటే తుడుస్తూంది ఈ అమ్మాయి కెంత సహనం! ఎంత ధైర్యం అనుకుంది వసుంధర

అప్పటికప్పుడే ఒంటిగంట దాటింది బాల్కనీలోకి వెళ్ళలేక అటు చూడలేక కుర్చీని గోడవైపు తిప్పి తలని డ్రెస్సింగుటేబిలుమీద ఆనించి ఏదో ఆలోచిస్తూ కళ్ళుమూసుకుంది వసుంధర అలాగే కునుకుపట్టింది.

డాక్టరు కొంతసేపు అవతలికివెళ్ళి స్టాఫ్‌నర్సుతో మాట్లాడివచ్చాడు కొంతసేపు అటూఇటూ పచార్లుచేశాడు. నర్సెస్ టేబీలుమీద ఉన్న "సండేస్టాండర్డు" చేతపుచ్చుకొని మళ్ళీ వచ్చి కుర్చీలో కూర్చున్నాడు

"డాక్టరుగారూ ఇప్పుడొకసారి చూడండి" అన్నది కళ్యాణి నెమ్మదిగా

డాక్టరు నాడిచూచి "పరిస్థితి అంతకంతకూ మారిపోతోంది. అయినా ఇంతకంటే చేసేదేమీలేదు కల్యాణిగారూ! ఆ ఘడియకోసం అలా నిరీక్షించడమే " అన్నాడు డాక్టరు.

హాస్పిటలు డ్యూటీడాక్టరు చెప్పినప్రకారం గంటగంటకీ హౌస్ సర్జన్లు వచ్చి ఇంజక్షను యిచ్చి వెళుతున్నారు ఆక్సిజన్ ఊపిరితిత్తులను కాపాడుతూనే ఉంది. అయినా గుండె అంతకంతకీ తొందరగా కొట్టుకుంటుంది. ఎగశ్వాస హెచ్చుతూంది

"ఇందాక ఇంజక్షన్ యిస్తే కొంచెం తగ్గినట్లుంది, ఇప్పుడదీ లేదు" అంది కల్యాణి నిస్పృహతో.

"మిమ్మల్నింకా ఆశ బాధిస్తూంది. చివరిదాకా ఏదో చేయడం మన విధి కాబట్టి ఈ ఇంజక్షనులూ అవీనూ.. చెయ్యవలసినదానిలో లోపం ఏమీ జరగలేదుకదా అని తృప్తిపడాలి" అన్నాడు చక్రవర్తి

"మీరు చెప్పింది నిజమే! కాని పూర్తిగా పోగొట్టుకున్నదాకా దేనిమీదా ఆశవదులుకోలేం గదా!"

డాక్టరు చిరునవ్వు నవ్వేడు. "మరికొన్ని అనుభవాలు అయేదాకా అలాగే అనిపిస్తుందిలెండి. పోవడం, పోగొట్టుకోవడం అనేది మనచేతుల్లో లేదని తెలిసినప్పుడు ఈ ఆశలన్నీ తగ్గుతాయి అప్పుడు ఇది తప్పకుండా మనకు దక్కుతుంది అని దేనిగురించి అనుకోవడానికైనా భయపడతాం."

అతని వ్యాఖ్యానంతో కల్యాణికి లోపలినుంచి ఏదో కదలిపోయింది. "మరికొన్ని అనుభవాలు..." అన్నాడు. ఇంకా ఏం అనుభవాలు? ఇంకా ఏం పోగొట్టుకోవాలి? ఇప్పుడేముంది గనుక తనకు పోగొట్టుకుందుకు? డాక్టరు చెప్పిన మనస్తత్వం తనకీ పాటికేరావాలి. నిజమే, "ఇది నాది" అనుకోవడం భ్రమ. ఎప్పుడేది చేతులోంచి జారిపోతుందో.. చెప్పలేం. ఈ డాక్టరేది చెప్పినా తన కన్వయించేటట్లే చెపుతాడేమిటి? ఏదో తెలిసినవాడిలా మాట్లాడతాడు కాని అతను తనకెలా తెలుసు? ఎక్కడా కలుసుకోలేదు...ఎప్పుడూ చూడలేదు

మోచేతిని కుర్చీమీద అనించి తలను పక్కవాటుగా చేతికిచేర్చి పరధ్యానంగా కూర్చుంది కల్యాణి. డాక్టరు అప్రయత్నంగా తలెత్తి ఆమె వంక చూశాడు ఆమె కళ్ళువిప్పి చూస్తూనే ఉంది. కాని ఆ చూపులిక్కడెక్కడా లేవు ఆ చూపుల్లో ఇందాకటి ధైర్యం లేదు. భయంకూడా ఉన్నట్లులేదు ఒక చిత్రమైన ప్రభావంతో మెరసిపోతున్నాయి కళ్ళు క్షణమాత్రం తేరిపార చూసి చూపు దించేసుకున్నాడు డాక్టరు. ఎన్నిసార్లు చూసినా ఎక్కడో చూసిన అమ్మాయిలాగుంటుదేం? వూరకనే చూసినట్లుకాదు. పరిచయమైన వ్యక్తిలా అనిపిస్తుంది అసంభవం. ఈమెతో తనకు పరిచయం లేదు. ఇదేదో చిత్రమైన అనుభూతి తన వూహ ఏదో భ్రమ ఎందుకో డాక్టరు మెదడు బరువెక్కింది అన్నీ అప్రస్తుతమైన, అసంగతమైన ఆలోచనలు. అప్పుడున్న పరిస్థితి, తన మనస్థితి ఈ రెండింటిమధ్యా యోజనాల దూరం–డాక్టరుకు భయంవేసి కల్యాణిని మాటల్లోకి దింపేడు

"ఈయన మీకు బాబాయిగా రవుతారా?" అన్నాడు ఆమెతో ఏం మాట్లాడాలో తెలియక.

ఆలోచనలలో సుదూర యాత్రచేస్తూ..ఏమిటి వింత ప్రపంచం, ఎలా అర్థం చేసుకోవడం– మానవుడు బతకాలంటే, నిలబడాలంటే ఏం చేయాలి..అని రిసెర్చి చేస్తూంది కల్యాణి. అతని ప్రశ్నతో మళ్ళీ వాస్తవ జగత్తులోకి వచ్చింది. "ఏమన్నారూ! మా బాబాయి గురించా! అపుడు..చిన్నప్పటినుండీ ఆయనను 'బాబాయి' అని పిలవటం అలవాటు. మా వూరి మునసబు, మా నాన్నగారికి చాలా దగ్గర స్నేహితుడు కష్టాల్లో సుఖాల్లో ఆదుకున్నవాడు నన్ను కన్నకూతురుకంటె ఆపేక్షగా చూస్తాడు" అంటూంటే ఆమె కంఠం ఆర్ద్రమైంది మళ్ళీ కనుకొలకుల్లో నీళ్ళు నిలిచాయి. నెమ్మదిగా కళ్ళు తుడుచుకుంది

"అదిగో అదే కూడదనేది–తండ్రిలాంటి మనిషి చేజారిపోతూంటే బాధే కాని అతనికి వయస్సు మళ్ళింది. అతనింటిలో అతనికేం జరిగినా బాధపడవలసినదంతగా లేదు. ఈ ఊళ్ళో ఇలా అకస్మాత్తుగా రావటం వెంటనే కబురయినా వెళ్ళే అవకాశం లేకపోవటం అదొక్కటే బాధగా ఉంది " అన్నాడు చక్రవర్తి అనునయంగా.

కల్యాణి కామాటలు ఓదార్పునివ్వడంలేదు–"వద్దు డాక్టరుగారూ, అవన్నీ చెప్పకండి తండ్రిలాంటి మనిషికాదు – తండ్రే చేయిజారిపోయి నెల్లాళ్ళు కాలేదింకా, ఇంతలో మళ్ళీ ఈ దుర్ఘటన మొన్నటివరకూ నాన్న చెపుతూంటే వినడం తెలుసు. అంతేకాని ఈయన ఎంతమంచివాడో ఎంత ఉపకారో ఈమధ్యనే తెలిసింది. అందుకే నా కనిపిస్తుంది...మన చుట్టూ వున్న మనుష్యుల విలువలు మన కష్టదినాల్లోనే తెలుస్తాయి. అది బాగా అనుభవమైంది నాకు" అన్నది

డాక్టరుకామాటలు వింతగా తోచాయి, ఏమిటీ అమ్మాయి? నిండా ఇరవై యేళ్ళున్నట్టులేవు. ఎంత ఎదిగిపోయినట్లు మాట్లాడేస్తుంది! మనుష్యులూ, విలువలూ, కష్టాలూ అంటూంది– అన్నింటిని చవిచూసిందా?

వార్డులో గడియారం మూడు కొట్టింది రామినాయుడు కళ్ళుతెరచి బాధగా మూల్గాడు. కల్యాణి గభాలున దగ్గరగా వెళ్ళి "బాబాయిగారూ! ఇటుచూడండి" అన్నది. అతని కర్థమైంది బరువుగా తలతిప్పి కల్యాణి వైపొకసారి చూసి

ఏదో గొణిగాడు. అతడేమన్నాడో కల్యాణి కర్థం కాలేదు మరింత దగ్గిరగా వంగి "ఏమిటి బాబాయిగారూ!" అన్నది మళ్ళీ ఏదో చెప్పబోయాడతను కాని సరిగా చెప్పలేకపోయాడు. కల్యాణి కేమీ అర్థం కాలేదు కాని నందూరు అన్నమాట మాత్రం వినబడింది లోపల ఏదో చెప్పాలని ఉంది అతనికి స్మృతి తప్పిపోలేదు కాని శరీరం పట్టుతప్పిపోయింది

డాక్టరు నాడి చూచి నిస్పృహగా చెయ్యి వదిలేశాడు నాడి మినుకుమినుకుమం టూంది వళ్ళంతా గాజుబారిపోయింది ముక్కులోని గొట్టాన్ని తీసి అక్సిజను సరిగా వెళుతుందో లేదో చూసి మళ్ళీ సర్దిపెట్టాడు డాక్టరు ప్రాణవాయువెంత పంపించినా ప్రాణాలు హరించిపోతున్నాయి. రక్తంలోకి ఎన్ని మందులెక్కించినా రక్తస్రావం సన్నగిల్లుతూంది. ఎగశ్వాస తగ్గించటానికెన్ని ఏర్పాట్లుచేసినా ఊపిరితిత్తులు బాధతోనే పనిచేస్తున్నాయి. చివరిదాకా విధితో పోరాడడమే నా పని అన్నట్లు అతని గుండె లేనిశక్తి తెచ్చుకొని పనిచేస్తోంది చలికాలం రాత్రి తెల్లవ్వారుఝామయింది. డాక్టరు సిగరెట్టు కాల్చడానికి కారిడర్‌లోకి వెళ్ళాడు కల్యాణి ఏమీతోచక గదిలోనే అటూయిటూ పచారుచేసింది...ఒక్కొక్క నిమిషం బరువెక్కిపోతూంది ఒట్టి నిరీక్షణ—అరవై ఏళ్ళు నిండుజీవితం జీవించి అకస్మాత్తుగా, అర్థాంతరంగా ఆయువు పోగొట్టుకుంటున్న ఆ వృద్ధుని అంతిమ క్షణాలకోసం, ఇలాంటి క్షణాలను లెక్కపెట్టి .యిలాగే నిశ్శబ్దంగా నిరీక్షించి ఎన్నోరోజులు కాలేదింకా, యింతకంటే భయంకరమైన నిరీక్షణ యింకేదైనా ఉంటుందా?

బాల్కనీలోకి వెళ్ళింది కల్యాణి ఆ చలిలో కర్రకుర్చీలో ముడుచుకుని తన కాళ్ళమీదే తలనానించి నిద్రపోతున్నాడు కృష్ణమూర్తి నిద్ర సుఖమెరుగదంటారు నిద్ర కష్టాన్ని కూడా ఎరగదేమో అనుకుంది కల్యాణి. ఎవరికి కష్టం? రామినాయుడుగురించి కృష్ణమూర్తికి బాధెందుకుండాలి? అతనెవరో?.. ఇదివరలో తానెరిగిన కృష్ణమూర్తికీ ఇతనికీ ఎంత తేడా...తనమీద అతనికా గౌరవం ఎందుకు? తనతోపాటు ఈ చలిలో ఈ రాత్రంతా జాగారమెందుకు? వసుంధర మాత్రం—పాపం, ఆ పిల్ల ఇలాంటి కష్టాలెరుగదు. అసలే భయం ఈ ఘట్టాన్నిచూసి ఏమనుకుంటుందో? తనని చేరదీసినందుకా ఆమెకీ శిక్ష—అన్నిటికంటె చిత్రం ఈ డాక్టరు కృష్ణమూర్తి పిల్చాడు కదా అని ఏదో వచ్చి చూసిపోవలసినవాడు. బతిమాలితే కాదనలేక రాత్రంతా ఉండిపోయాడు. ఒక్కసారి కన్ను మూయలేదు స్వార్థంలేని సేవ అనుకుంది కల్యాణి

గడియారం ఇంకా నాలుగు కొట్టలేదు. డాక్టరు సిగరెట్టు కాల్చేసి బయటే పచార్లు చేస్తున్నాడు వసుంధర నిద్రపోతూనే ఉంది. తనచుట్టూ ఎవ్వరూలేని సమయంచూసి రామినాయుడి ప్రాణాలు చల్లగా గాలిలో కలసిపోయాయి. ఒక్కసారి మేల్కొన్నదానిలా గభాలున లోపలకు వచ్చింది కల్యాణి—వచ్చి స్థాణువులా రామినాయుడి ఆకారంప్రక్క నిల్చుంది. అలా ఎంతసేపు నిల్చుందో తెలియదు డాక్టరు లోపలికివచ్చి లాంఛనానికి నాడిచూసి స్టెతస్కోపుతో కూడా చూసేసి—"వెరీసారీ" అంటూ దుప్పటితో కళేబరాన్ని పూర్తిగా కప్పేశాడు. ఆక్సిజన్ వృథాకాకుండా గొట్టాన్ని తీసేసి సిలిండరు మూత తిప్పేశాడు. కల్యాణి చలనంలేకుండా అలా కొంతసేపు నిల్చుంది ఆమె ఏడుస్తూందేమోనని భయపడ్డాడు డాక్టరు. కల్యాణి కళ్ళలో నీళ్ళులేవు

కల్యాణి వసుంధరను లేవగొట్టి "అంతా ఐపోయింది ఇప్పుడేం చెయ్యాలో చెప్పు" అంది. వసుంధర "నిజంగానే!"అని ఒకవెర్రికేకవేసి బాల్కనీలోకి పరుగెత్తింది కల్యాణి ఆమెవెనకాలేవెళ్ళి "అలా భయపడకు వసుంధరా! అనుకున్నదేకదూ! నువ్వు బిగుసుకుపోతే నాకేం దారి? కర్తవ్యమేమిటో చెప్పు–" అంది.

ఈ మాటలకు కృష్ణమూర్తి తుళ్ళిపడిలేచి "ఏం జరిగింది కల్యాణిగారూ!" అన్నాడు డాక్టరుకూడా అక్కడకు వచ్చి "అతనింక లేడు" అన్నాడు కృష్ణమూర్తి గాభరాగా లేచి నిల్చుని–క్షణం ఆలోచించి–"వాళ్ళవాళ్ళెవరూ లేరు– మనమేం చెయ్యాలిప్పుడు?" అన్నాడు

"అదే మీరాలోచించి చెప్పండి కృష్ణమూర్తిగారూ!" అంది కల్యాణి అతనివైపు తిరిగి.

"ఏం చేయడానికీ వాళ్ళ తాలూకు వాళ్ళెవరైనా ఉండాలికదా–డాక్టరూ! బాడీ గురించిన ఏర్పాట్లు నువ్వు చెయ్యి– నేను ఆరుగంటల ప్యాసింజరులో నందూరు వెళ్ళి తిరుగుబండిలో వాళ్ళవాళ్ళని తీసుకొస్తాను" అన్నాడు.

"అంతే చెయ్యాలి, బాడీని మార్చ్యురీలో ఉంచమంటాను–నువ్వు వెంటనే బయల్దేరి సాయంత్రానికెలాగైనా తీసుకురా!" అన్నాడు డాక్టరు.

"అంతకంటె మరో మార్గమున్నట్లు లేదు ఇంతవరకూ శ్రమపడ్డారు–ఆ ప్రయత్నాలేవో చేయించండీ" అంది కల్యాణి వాళ్ళిద్దర్నీ ఉద్దేశించి ప్రాధేయపూర్వకంగా

"శ్రమేమిటండీ? మన సమక్షంలో జరిగింది కనుక మనమే బాధ్యత తీసుకోవాలి ఆ ఏర్పాట్లన్నీ మేమిద్దరం చూస్తాం. ముందు మీ యిద్దరినీ ఇంటిదగ్గర దింపి వస్తాను పదండి" అన్నాడు డాక్టరు వసుంధర భయంతో ఈ సంభాషణ. ఎంతవరకూ విన్నదో తెలియదు కాని "వాళ్ళవాళ్ళొచ్చేదాకా మనింటికే తీసుకుపోతేనో" అని మాత్రం అంది. కల్యాణి ఆశ్చర్యంగా ఆమెవైపు చూసి "వద్దు వసుంధరా! అలాంటివి పెట్టుకోకు. బాబాయి కెక్కడ ప్రాప్తం ఉంటే అక్కడే జరుగుతుంది–ఇంతకీ జీవంలేని శరీరమెక్కడుంటేనేమిటి? ఆయనగారు చెప్పినట్లు చేయడమే మన విధి – పద ఇంటికి పోదాం – వచ్చినపని అయిపోయింది" అంటూ బయటికి దారితీసింది.

అంతభయంలోనూ వసుంధర "కల్యాణికింత గుండెనిబ్బరం ఎలా వచ్చింది చెప్మా!" అనుకుని నివ్వెరపోయింది.

అనుకున్న ప్రకారం ఆ సాయంత్రానికి రాలేకపోయాడు కృష్ణమూర్తి. మర్నాడు ప్రొద్దుటి బండిలో దిగారు – కృష్ణమూర్తీ రామినాయుడి పెద్దకొడుకూ చిన్న కొడుకూను వస్తూనే హాస్పిటలుకు వెళ్ళి మార్చ్యురీలోని శవాన్ని బయటికు తీయించారు. తండ్రి శవాన్ని చూసి చిన్నకొడుకు బావురుమన్నాడు–పెద్దకొడుకు నిబ్బరంగానే ఊరుకున్నాడు శవాన్ని హాస్పిటలువాళ్ళు అధీనానికిచ్చేక కృష్ణమూర్తి డాక్టరుని పిలుచుకురావడానికి వెళ్ళేడు బయలుదేరివస్తూ డాక్టరు "నిన్న సాయంత్రం రావడానికి వీలవలేదా–" అన్నాడు. కృష్ణమూర్తి గట్టిగా నిట్టూర్చి "ఏం మనుషుల నుకున్నావు వాళ్ళు–నేనసలు బతికి బయటపడతాననుకోలేదు మనం పడ్డ శ్రమంతా వాళ్ళకర్థం కాదు. ఇచ్చిన ట్రీట్‌మెంటు, తీసుకున్న శ్రద్ధ వాళ్ళు తెలుసుకోరు. వెళ్ళి ఈ కబురు చెప్పగానే ఒక గంటవరకూ ఇంటిల్లిపాదీ పెద్ద శోకాలు పెట్టారు.

తరువాత ఈ సంగతెలా జరిగిందన్నారు జరిగిందంతా చెప్పాను పెద్దకొడుకు నన్ను కొట్టొచ్చినట్లుగా వచ్చి, "ఒక్కనాడు మంచానపడి ఎరగడు–ఒక్కనాడు మూల్గినట్లు వినలేదు–మహారాజులా వెళ్ళిన మనిషి మరి తిరిగి రాడంటే ఎలా నమ్ముతామయ్యా–చెప్పేకబురుకు అర్థం పర్థం ఉండాలి" అని ఎగిరిపడ్డాడు. వాళ్ళతో ఆ పరిస్థితిలో పోట్లాడి లాభం లేదని మంచిమాటలు చెప్పి, అక్కడికి రండి అంతా తెలుస్తుందని లాక్కొచ్చాను. వట్టి మూర్ఖులు చక్రవర్తీ! ఆ ముసలాయనకున్న నెమ్మదీ–మంచితనం మచ్చుకైనా లేవు వాళ్ళల్లో వాళ్ళన్నీ చిత్రమైన అనుమానాలు పడుతున్నారు" అని కథ ముగించాడు కృష్ణమూర్తి.

"బాగుంది. ఇదొక గొడవా! వట్టి బైతుల్లా ఉన్నారే–ఆ ముసలాడిని పుణ్యం కట్టుకుని మనమేం బాగుపడాలట– అనుమానాలకైనా అర్థం ఉండొద్దూ!" అన్నాడు డాక్టరు.

"సరి! అంత ఆలోచనే ఉంటే అలా వాగుతారా వాళ్ళు? నువ్వొస్తున్నావు కదూ, ఆ జబ్బుసంగతీ అదీ తెలియచెప్పు" అన్నాడు కృష్ణమూర్తి.

శవాన్ని బయట ఉంచుకొని ఆసుపత్రి ఆవరణలోనే కాచుకు కూచున్నారు వాళ్ళు. కృష్ణమూర్తీ, డాక్టరూ అక్కడికి చేరగానే మళ్ళీ అదే పురాణం ప్రారంభించారు. ఇందులో ఏదో మోసం ఉంటుందని వాళ్ళ అనుమానమట. పోలీసులకి రిపోర్టుచేసి శవపరీక్ష చేయిస్తారట. కృష్ణమూర్తితో మాట్లాడినంత పరుషంగానూ డాక్టరుతో మాట్లాడారు వాళ్ళమాటలకు డాక్టరు బెదిరిపోలేదు. ఇలాంటి రకాలు చాలా చూశాడతను సర్వీసులో ఉన్నప్పుడు అకస్మాత్ మరణాలు, అపోహలు – పోలీసులూ, బెదిరింపులూ, పోస్టుమార్టమ్‌లూ – ఇవన్నీ తనకు బాగా అనుభవమే.

"అదిసరే! మీకు తోచినది మీరంటున్నారు నేను చెప్పేది వినండి. మీ నాన్నగారికి నిన్న సాయంత్రం నాలుగు గంటలప్పుడు సడన్‌గా గుండె జబ్బువచ్చింది–అసలాయన ఇదివరకు కూడా మీరనుకున్నంత ఆరోగ్యంగా లేడు–అతనికి తెలీకుండానే అతనికి గుండెజబ్బుంది. శ్రమ కలవాటుపడిన మనిషి కాబట్టి ఆమాత్రం ఈమాత్రం అలసటను లక్ష్యపెట్టి ఉండడు. అలా కాకపోయినా ఆ వయస్సులో గుండెజబ్బు ఎప్పుడైనా రావచ్చు. మీరు పిచ్చిపిచ్చి అనుమానాలకుపోయి పోలీసుల దాకాపోతే డాక్టరు మాటమీదే నమ్మకం లేదన్నమాట. అంతదాకా వస్తే నా ప్రతిష్ఠకు భంగం కలుగుతూంది కాబట్టి నేనూ ఎంతవరకైనా వెళతాను అటుపైన మీ యిష్టం–" అనేసి "పద కృష్ణమూర్తీ! ఇలాంటి బ్రూట్స్‌తో మనకేం పనిలేదు" అని కారెక్కేశాడు

కృష్ణమూర్తి చల్లగా చావుకబురు చెపితే రామినాయుడు పెద్దకొడుకు ఊరంత గొడవచేశాడు డాక్టరు గట్టిగా మాటలాడేసరికి చల్లబడిపోయాడు. టాక్సీ చేయించుకుని తండ్రి శవాన్ని వాళ్ళ ఊరు తీసుకుపోయాడు

☆ ☆ ☆

ఆవేళ సాయంత్రం డాక్టరు వసుంధర యింటికి వెళ్ళి జరిగినగొడవంతా చెప్పాడు నిజంగా లోకంలో ఇలాంటి మనుష్యులుంటారా అని ఆశ్చర్యపోయింది కల్యాణి "రామినాయుడు కొడుకులా వీళ్ళు!" అనుకుంది "పోనీ ఆ వెయ్యిరూపాయలూ వాళ్ళకిచ్చేశారా?" అంది కల్యాణి

"ఆహా! ఆ డబ్బు కృష్ణమూర్తి ముందే యిచ్చేశాడు—అదే వాళ్ళ అనుమానానికి హేతువైంది. వాళ్ళ నాన్న కోర్టువ్యవహారం చూసుకు వస్తానని బయలుదేరాడట కాని అంత డబ్బు చేతపుచ్చుకుని వెళ్ళినట్లు వాళ్ళకు తెలీదట అసలు మనమంతా కలిసి ఏదో కుంభకోణం చేశామనీ ముసలాడి దగ్గర యింకా చాలా డబ్బుండాలనీ అది కాజెయ్యడానికే అతన్ని చంపేసి, అంతా తీసుకుని యీ వెయ్యీ వాపసు ఇచ్చామని కూడా అన్నారట" అన్నాడు డాక్టరు

కల్యాణికి నిజంగా ఏడవాలో నవ్వాలో తెలియలేదు అభిమానం ఉండబట్టి చూసిపోదామని వచ్చి గుటుక్కుమన్నాడు - రామినాయుడు గుండెల్లో నొప్పి అన్నదగ్గరనుంచీ చివరిదాకా సర్వవిధాలా చేయవలసినదంతా చేశారు నా అన్నవాళ్ళు దగ్గర లేకపోయారేకాని ఏం లోటు జరిగింది? ఆ పల్లెటూళ్ళో ఏమీ చేయలేని నిస్సహాయ స్థితిలో నాన్న ఆఖరి క్షణాలను గుండె రాయిచేసుకుని చూసింది తను మృత్యువు కబళించేస్తుంటే అడ్డుకునే శక్తి ఎవరికీ ఉండదు కాని చెయ్యగలిగింది చేశాము అనే సంతృప్తి కూడా లేకపోవడం ఎంత దుర్భరం? కాని రామినాయుడికి క్షణం ఆలస్యం లేకుండా వైద్యసహాయం జరిగింది. స్నేహితులంతా తన బాధల్ని పంచుకుని శక్తి వంచనం లేకుండా సాయం చేశారు. ఆఖరికి తనతోపాటు జాగారం చేశారు. ఇంత జరిగితే ఆఖరికి పర్యవసానమేమిటి? డబ్బుదగ్గర అనుమానాలొచ్చాయి మనిషి పోయాడు కాని డబ్బు మిగిలింది డబ్బుకి చావులేదా? అదే విచిత్రం. డబ్బుకి చావు లేదు చంపుతుంది కాని చావదు. ఆ వెయ్యిరూపాయలూ ఎవరివి? ఎవరివో తనకు తెలియదు తనవి మాత్రం కావు నిర్జీవమైన ఒక యింటి ఖరీదులో భాగం అవి. ఆ యిల్లు ఎవరిదో ఆ మనిషే యిప్పుడు లేడు. డబ్బుమోసుకొచ్చిన మనిషి అంతకన్నా లేడు రెండు మరణశయ్యలు దాటి నడిచి వచ్చిన డబ్బది తల్చుకుంటేనే భయం. అందుకే నాయుడు కొడుకుల కిచ్చేయమని పంపించేసింది. వాళ్ళ అనుమానానికి అది మరింత దోహదమైంది. అవును, బతుకే ఒక పెద్ద అనుమానం. మనిషిని మనిషి నమ్మడు. చావుబతుకులను నమ్మడు. అవి కలిగించే దుఃఖాలను కూడా నమ్మడు. బతుకనేది అంతకంతకు పదునెక్కిపోతుంటే ఎంత జాగ్రత్తగా అడుగువేసి ఏం లాభం?

"ఏమిటాలోచిస్తున్నారు కల్యాణిగారూ! ఆ మూర్ఖులగురించా! అంతగా ఆలోచించడానికి వాళ్ళు తప్ప యింకెవరూ దొరకలేదా మీకు?" అన్నాడు డాక్టరు

"మరేం లేదు డాక్టరుగారూ! మనుష్యులూ వాళ్ళ పోకడలూ చూస్తూంటే వింతగా వుంది" అంది కల్యాణి

డాక్టరు చిరునవ్వు నవ్వి "వింతగా వుంటే ఫరవాలేదు, బాధగా వుండకూడదు కాని యింకా ఏం చూశారు! ఈ ప్రపంచంలో వున్నవే వింతలు మనిషి మనిషిని పీక్కుతినడం— అబ్బో ఇప్పటిదా, అనాదినుంచీ వుంది. కాని వింతలో వింత చూశారా! మనిషి మనిషిని పీక్కుతింటాడు మళ్ళీ మనిషికోసం మనిషి ప్రాణం యిస్తాడు. మనుషుల్లో రకాలున్నారు కల్యాణిగారూ!" అన్నాడు

"ఏమో! నాకు కనబడుతున్నది ఒక్కటే రకం" అని నిట్టూర్చింది కల్యాణి.

"ఎంత మాటన్నారు! నిజం చెప్పండి. అందరూ ఒక్కటే రకమైతే మీరిప్పుడిక్కడ ఉండేవారా! ఆసుపత్రిలో వసుంధర మీకోసం జాగారం చేసేదా! రామినాయుడు

మిమ్మల్ని చూడడానికి వచ్చేవాడా అసలు? అందరూ ఒక్కరకం కారు కల్యాణి గారూ! ఆ నమ్మకం మీకెప్పుడు లేదో అప్పుడే మీరూ రామినాయుడు కొడుకుల రకంవాళ్ళే అయిపోతారు."

కల్యాణికి అర్థం కాలేదు, "అంటే?" అంది

"అంటే మరేమయింది? నమ్మకాలు పోగొట్టుకున్నవాళ్ళు వాళ్ళు, పోనీ మొదటినుంచీ నమ్మకాలే లేనివాళ్ళు మీరూ ఆ పనే చేస్తున్నారిప్పుడు. ఏమిటి తేడా?" అని ప్రశ్నించాడు డాక్టరు.

సిగ్గుపడింది కల్యాణి ఇతనేమిటిలా అంటాడు? "కాదు డాక్టరు గారూ! కాదు. నేను యింకో రకాన్నేమో కాని వాళ్ళ రకం మటుకు కాదు" అంది.

"ఆశలూ విశ్వాసాలూ పోయాక ఏ రకమైనా ఒకటే" అన్నాడు డాక్టరు.

కల్యాణి మొహం జేవురించింది. "కబుర్లకేం డాక్టరుగారూ! ఎన్నైనా చెప్పవచ్చు. ఒడ్డున కూర్చున్నవాడికి నీటిలో మునకలు వేసేవాడిబాధ ఏం తెలుస్తుంది? నీళ్ళు మంచివి, తాగితే చల్లగా ఉంటాయి, స్నానం చెయ్యి, ఒళ్ళు శుభ్రంగా వుంటుంది అని చెప్పి ఏం ప్రయోజనం?"

"పొరబడుతున్నారు కల్యాణిగారూ! అలా చెప్పటంలేదు నేను అలా చెప్పేవాళ్ళంటే నాకూ అసహ్యమే."

"విశ్వాసాలు పెంచుకోమని చెప్పటం సులువే డాక్టరుగారూ! కాని ఇవాళ నాకేం మిగిలింది? బాబాయిగారు పోవడంతో ఈ ప్రపంచంతో నా ఆఖరి బంధం కూడా తెగిపోయింది. ఇవాళ నేను ఏకాకిని. ఆశలు లేవు విశ్వాసాలూ లేవు ఆలంబనం లేదు. ఏమీలేదు."

"అలా అనుకోవడం పొరపాటు కల్యాణిగారూ! మీ కథేమిటో నాకు తెలియదు కాని తెలుసుకున్నా ఈ మాటే అంటాను. అవన్నీ తరువాత మాట్లాడుకుందాం కాని ప్రస్తుతానికి మనకందరికీ కొంచెం డైవర్షన్ అవసరం. ఆరుగంటలకి కృష్ణమూర్తి వస్తానన్నాడు. నలుగురం కలిసి సినిమాకు పోదాం పదండి."

తుళ్ళిపడింది కల్యాణి. ఏమిటీ వింతమనిషి? రోజు మధ్యాహ్నం పరిచయంతో ఇంత చనువు తీసుకుంటున్నాడేమిటి? "నేను రాలేను డాక్టరు గారూ! సినిమాలు చూసే స్థితిలో లేను. వసుంధరకూడా రాదేమో! మీరిలా అడగడమే అసందర్భం."

అతను గంభీరంగా "ఏమీ అసందర్భం లేదు, మీరిప్పుడు ఉన్న స్థితిలో సినిమా చూడ్డమే చెయ్యవలసిన పని రాలేకపోవడమేమిటీ? రాగలరు–తప్పకుండా రాగలరు" అన్నాడు.

"ఈ స్థితిలోనా!"

"అవును – ఈ స్థితిలోనే. నేను చెప్పినట్లు వినక తప్పదు మీరు అవును, ఈ స్థితిలో అలా చెయ్యడం కొందరికి ఘోరంగా ఉండొచ్చు కాని నేనెప్పుడూ ఘోరమైన పనులే చేస్తూంటాను, చేయిస్తాను కూడా" అన్నాడు చక్రవర్తి.

కల్యాణికి అతనిమీద ఎక్కడలేని కోపమొచ్చింది. అలా బలవంతపెట్టడాన్ని అసహ్యించుకుంది. "సరే పదండి, నిండా మునిగినవాళ్ళకు చలేమిటీ? ఇంతేకదా!

వస్తానులెండి. సినిమాకి తీసికెళతారో ఎక్కడికి తీసికెళతారో! ఎక్కడికైనా సిద్ధమే!" అంది.

అతను కుర్చీలోంచి లేచి "మీమీద మీకే అంత కసి ఉండకూడదు కల్యాణిగారూ! లెండి, లోపలకు వెళ్ళి వసుంధరగారిని కూడా సిద్ధంకమ్మనండి. నేను వెళ్ళి మళ్ళీ వస్తాను" అన్నాడు.

"వసుంధర స్నానం చేస్తూంది నే చెపుతాలెండి. ఇద్దరం ఆరు గంటలకు రెడీగా వుంటాం. సరేనా" అంది వెగటుగా

అతను నవ్వేసి "సరే! నేను వెళ్ళి మళ్ళీ వస్తాను" అని గేటుదాటి వెళ్ళిపోయాడు.

కల్యాణి అతనివైపే చూస్తూ "ఎవరితను? నాకిష్టంలేని పనులన్నీ నాచేత చేయించడానికి ఎవరిచ్చారితని కధికారం? ఇంత బండమనిషేమిటో? పైగా డాక్టరట, డాక్టరు! వెళతాను, సినీమాకి తప్పకుండా వెళ్ళి ఈ మనిషి సంగతేమిటో తెల్సుకుంటాను" అని తనలో తానే ఒక నిశ్చయానికి వచ్చింది. స్నానం చేసి డ్రెస్ మార్చుకుందుకు లోపలకు వెళ్ళిపోయింది

## 13

"మళ్ళీ వారం రోజుల్లో పనులన్నీ చక్కబెట్టుకు వస్తాను" అని ఇందిరతో చెప్పి వెళ్ళిన ప్రకాశం దగ్గరదగ్గర పక్షం రోజులు గడిచినా తిరిగి రాలేదు. మామయ్యను ఎదిరించి ప్రకాశం సక్రమంగా తిరిగి రాగలడనే నమ్మకం ఇందిరకు పూర్తిగా లేకపోయినప్పటికీ, తనమీద పెంచుకున్న వ్యామోహం వల్లనైనా కొంత ధైర్యంగా ప్రవర్తించగలడేమోనని అనిపించింది. పక్షం రోజులైనా మనిషి అజాపజా లేకపోయేసరికి అతడు తిరిగి తనదగ్గరకు వస్తాడనే ఆశ వదులుకుంది.

ఆ శనివారం ఉదయం అవే ఆలోచనలతో ఇందిర నిద్ర లేచింది లేచింది మొదలు ఏమిటో ఆమె మనసులో చికాకుగానే ఉంది ఉదయం పాలవాడు ఆలస్యంగా వచ్చాడు; నాన్న చేసిన కాఫీ ఏడ్చినట్లుంది కుళాయిలో నీళ్ళు రాలేదు. కుళాయిబాధ ఎప్పుడూ ఉన్నదే పోనీ నీళ్ళు పట్టి ఉంచుకుందామంటే సంసారంలో ఉన్నవి రెండేరెండు బిందెలు. "ఛీ! ఏం బతుకులు, ఏం బతుకులు!" అనుకుని స్నానం లేకుండానే తల దువ్వుకొని బట్టలు వేసుకుంది. షిఫాన్‌చీర కట్టుకుంది. "ఇదే జీవితంలో గమ్మత్తు పట్టుమని యింట్లో రెండుబిందెలు లేవుగాని, షిఫాన్‌చీరకు మాత్రం లోటు లేదు!" అనుకుంది. రిష్టువాచీ చేతికి తగిలించుకుంటూ, "నాన్నా! పొద్దున్నే వెధవకాఫీ యిచ్చావు. హోటల్‌కి వెళ్ళి ఓ కప్పు మంచికాఫీ తీసుకురా! బ్రాందీలాంటి కాఫీ!" అంది. "దానికేం! ఓ రూపాయి యిలా పడేయ్ రెండు కప్పులు తీసుకొస్తాను!" అన్నాడు ఆనందరావు.

కుర్చీమీద కాళ్ళు ఉంచి జోళ్ళు తొడుక్కుంటూ, "నా బ్యాగ్‌లో ఒకే ఐదురూపాయలనోటుంది. అది మార్చవయ్యా!" అంది

"అది నిన్నసాయంత్రం ఖర్చుచేశాంగా! సాయంత్రం భావన్నారాయణ వచ్చాడు చూడూ, అప్పుడు తీశాను" అన్నాడు ఆనందరావు

ఇందిరకు అంతా అర్థమైంది భావన్నారాయణంటే సాక్షాత్తూ అగస్త్యుడంతటివాడు. పోలీసు సబిన్‌స్పెక్టరు చేస్తూ ఔపోసనాలు ఎక్కువై మర్యాదగా డిస్మిస్ అయినవాడు. తరువాత కాంగ్రెసులో చేరి తద్వారా దేశసేవ చేద్దామని ప్రయత్నిస్తున్నాడు ప్రస్తుతం పట్టణ కాంగ్రెసు కమిటీ జాయింట్ సెక్రటరీ చీకటి పడేసరికి రంగుపానీయం లేనిదే ఉండలేడు. ఇద్దరూ ఉద్యోగాలు చేసే కాలం నుండీ ఆనందరావూ అతనూ చాలా సన్నిహితులు. ఇద్దరూ ఒకేసారి దయాల్బాగు రాధాస్వామి మతంలో చేరి కొంత కాలం దాని అంతు చూశారు. క్రితంసారి ఇందిర బ్యాగ్‌లోని అయిదు రూపాయల ధర్మమా అని ఇద్దరూ కొంతసేపు యీ క్షుద్ర ప్రపంచాన్ని మరిచిపోగలిగే మైకాన్నీ ఆనందాన్నీ పొందగల్గారు.

"ఏడిసినట్లుంది. వాడొకడూ నా ప్రాణానికి ! వెధవ శనిమొహం వాడూనూ. నువ్వన్నీ యిలాంటిపనులే చేస్తావు నాన్నా! ఇప్పుడెలాగ? స్ట్రాంగ్ కాఫీ పడకపోతే ఏమిటోలాగ వుంది" అని విసుక్కుంది ఇందిర.

ఓస్! అలా చెప్పు. అయ్యరుదగ్గిర గాత్రం పాడి తీసుకొస్తానుండు" అని ఫ్లాస్కు తీసుకుని బయటకు వెళ్ళాడు ఆనందరావు. 'గాత్రం పాడడం' అంటే అరువు చెప్పేయడమన్నమాట ఆనందరావు పారిభాషిక నిఘంటువులో ప్రతిమాటకీ ప్రత్యేకార్థం ఉంది.

అరువు కాఫీ తాగేసి మేడమీద ప్రకాశం గదిలోకెళ్ళి ఒంటరిగా కాస్సేపు కాలక్షేపం చేసింది ఇందిర. మనసులో అశాంతి. అప్రయత్నంగా అద్దంలో మొహం చూసుకుంది మొహం కొంచెం నలతగా ఉంది 'ఇరవై రెండేళ్ళకే ముసలిదాన్నయిపోతున్నాను కాబోలు!' అనుకుంది. ఆలోచనలు పరిపరివిధాల పోయాయి. ఆఫీసుచాకిరీ, చాలీచాలని జీతం–నాన్నతో కాపరం–జీవితం యింత వెలితిగా ఉందేమిటి! ఎక్కడుంది దీని కీలకం? ఈ ప్రకాశం ఏమైనాడు? వీడొకడూ, చవటదద్దమ్మ. అలా ఆలోచించుకుపోతూంటే ఆమెకే భయం వేసి, గబగబా లేచి మొహానికింత స్నో, పౌడరూ రాసుకుని క్రిందికి దిగింది. "చూస్తానుగా, యీ వెధవ ప్రపంచం నాకెందుకు లొంగిరాదో!" అని కసిగా అనుకున్నది.

క్యారియర్ భోజనం చేసి రిక్షా ఎక్కి ఆఫీసుకు వెళ్ళింది. చేతిలో కానీ లేదు స్టేట్ రిక్షావాడు ఇందిరను డబ్బులడగడు రెండు మూడు రోజులకోసారి ఓ పావలా ఎక్కువ వేసి ఇచ్చేస్తుంది ఇందిర.

ఆరోజు శనివారం. మధ్యాహ్నం ఒంటిగంటకు ఆఫీసు అయిపోతుంది. త్వరగా ఇంటికిపోయి ఏదైనా మ్యాటినీ సినిమాకు పోదామనుకుంది. డబ్బో? తనలో తనకే నవ్వొచ్చింది. ఆపద్బాంధవుడున్నాడుగా, ఆఫీసరు–అనుకుంది. రిజిష్టరులో సంతకం పెట్టి సీటులో కూర్చునేసరికి ఎదురుగా టేబిలుమీద అడుగు ఎత్తుగా ఫైళ్ళు పడి వున్నాయి. ఆమె గుండె గుభేలుమంది పైనున్న ఒకటి రెండింటిని తిరగేసి చూసి, 'వెంకటస్వామీ' అని చప్రాసీని పిలిచింది.

"ఈ ఫైళ్ళన్నీ నా టేబిలుమీద ఎందుకు పడేశావ్ వెంకటస్వామీ? ఇవి ఫోటాసాబ్ సెక్షన్‌వి, తీసికెళ్ళి వైదేహి టేబిలుమీద పడెయ్" అంది.

"వైదేహిగారు యివాళ రాలేదండి, సెలవు పెట్టారు. అవన్నీ యివాళ అర్జంట్

డాక్‌లో వెళ్ళాలట. మిమ్మల్నే టైప్ చెయ్యమన్నారు" అన్నాడు ఏభైఏళ్లున్నా, డబ్భైయేళ్ళవాడిలా కనబడే వెంకటస్వామి.

"ఎవరు?"

"ఛోటాసాబ్."

ఇంతట్లోకే సులోచనాలు సవరించుకుంటూ, ఊడిపోతున్న పంచి ఎగదోసుకుంటూ సెక్షన్ సూపరెంటు మజుందారు అద్భుతమైన ఇంగ్లీషులో "ఇందిరాదేవీ! ఒంటిగంటలోపున ఆ డ్రాఫ్టులన్నీ మీరు టైప్ చెయ్యాలి. బైదేహి రాలేదు ఛోటాసాబ్ చెప్పాడు" అన్నాడు.

కోపాన్ని అణచుకుంటూ, "ఆల్ రైట్ మిష్టర్ మజుందార్, కాని బడాసాబ్ వర్కు అలస్యమవుతుంది. ఆ తరువాత మీ యిష్టం" అంది

"అదంతా నాకు తెలీదు ఇందిరాదేవీ! ఛోటాసాబ్ చెప్పాడు; ఆనక నీ యిష్టం" అని మజుందారు తన సీట్లోకి వెళ్ళి కూర్చున్నాడు. ఆడపిల్లల్ని ఆఫీసుల్లో వెయ్యడం ఎప్పుడు ప్రారంభమైందో అప్పటినుండే ఇండియా అన్నివిధాలా తగలడిపోయిందని అతని దృఢనమ్మకం.

ఇందిరకు మజుందారుమీద మింగేద్దామన్నంత కోపం వచ్చింది ఒక్కసారి తనటేబిలుమీద ఫైళ్ళ పోగు చూసింది. అవన్నీ తను టైపు చెయ్యాలి! ఒంటిగంటలోపున! చిన్నప్పుడు నాయనమ్మ అంట్లు తోమడం జ్ఞాపకమొచ్చింది. గంపెడు అంట్లగిన్నెలు ముందువేసుకుని తోముకుంటూ కూర్చునేది నాయనమ్మ తనకీ నాయనమ్మకీ ఏమిటి తేడా? ఆ మాటకొస్తే నాయనమ్మే నయం నాయనమ్మ ఎవరికిందా పనిమనిషి కాదు తనో? చదువుకున్న తను, ఉద్యోగం చేస్తున్న తను, స్వేచ్ఛావాయువులు పీలుస్తూ అన్ని స్వాతంత్ర్యాలూ ఉన్న తను–ఇంకెవరి ఇంట్లోనో జీతానికి తోముతోంది.

పదినిముషాలు అలా ఆలోచిస్తూ కూర్చున్నాక, విసురుగా లేచి ఛోటాసాబ్ గదిలోకి వెళ్ళి "గుడ్ మార్నింగ్ సార్!" అంది ఆ 'సార్' ముప్పైయేళ్ళ యువకుడు. తెలుగువాడే. వాళ్ళ నాన్న మిడిల్ స్కూల్ టీచరు యువకుడు హఠాత్తుగా ఐ.ఏ.యస్. ప్యాసై ఛోటాసాబ్ అయిపోయాడు

ఛోటాసాబ్ తలెత్తి చూశాడు "ఏం?" అన్నట్లు

"జి.సెక్షన్ ఫైళ్ళన్నీ ఇవాళే టైప్ చెయ్యాలాండీ?" అంది వయ్యారం వలకబోస్తూ.

ఛోటాసాబ్ దగ్గిర అలాంటి వయ్యారాలు పనిచెయ్యవు. పదిమంది విలాసవతులకంటె ఒక్క ఆఫీసు ఫైలు అతన్ని ఎక్కువ ఆకర్షిస్తుంది

"అవును. అర్జంటుగా పన్నెండులోపున టైప్ చేసి సంతకానికి పంపించండి. ఇవాళ స్టెనో వైదేహి రాలేదు" అన్నాడు

"అయితే బడాసాబ్ అర్జంటు వర్కు ఆపేయమంటారా?" అంది ఇందిర.

"ఆపేయండి. ఆయనతో నేను చెప్తాను" అన్నాడు ఛోటాసాబ్.

నిశ్శబ్దంగా బైటకి వచ్చేసింది ఇందిర బడాసాబ్ గదిలో అలికిడి విని ఆయన గదిలోకి వెళ్ళింది. బడాసాబ్ శుద్ధ కావేరీ జలం తాగిన తంజావూరు తమిళుడు. యాభైయేళ్ళవాడు. గుమాస్తాగా ఉద్యోగంలో చేరి ఆఫీసరు అయాడు.

"గుడ్ మార్నింగ్ సార్!" అంది ఇందిర

"వెరీ గుడ్ మార్నింగ్. ఏం కావాలి ఇందిరా?" అన్నాడు. ఇందిరంటే అతనికి వల్లమాలిన అభిమానం.

"ఛోటాసాబ్ బండెడు వర్కు ఇచ్చారు, వైదేహీ రాలేదట ఆ పనంతా నేనే చెయ్యాలట. ఇవాళ శనివారం. అదంతా చెయ్యాలంటే సాయంత్రం వరకు కూర్చున్నా తెమలదు" అంది ఇందిర, జాలిమొహం పెట్టి.

బడాసాబ్ ఇరుకులో పడ్డాడు ఇందిరమీద తనకెంత అభిమానమున్నా, సాటి ఆఫీసరు ఆర్డరు తోసిపుచ్చమని చెప్పలేడు డిసిప్లిన్‌కు భంగం. అంతేకాక, తనలా పైకి తేలిపోకూడదు

"సారీ ఇందిరా! నేనేం చెయ్యలేను చెయ్యమంటే చెయ్యాల్సిందే- వర్క్ ఫస్ట్" అనేసి తలవంచేసుకుని కాగితాలు చూసుకోవడం మొదలుపెట్టాడు, "ఇంక నువ్వు వెళ్ళొచ్చు" అన్నట్లు.

ఇందిర మొహం చిట్లిస్తూ, "అవును చచ్చినట్లు చెయ్యాలి కాబట్టి చేస్తాను. కప్పు టీ కూడా లేకుండా చేస్తాను" అంది.

ఆఫీసరు తలెత్తి "అదేమిటి?" అన్నాడు.

"అంటే మరేం లేదు, ఇవాళ నా దగ్గిర కానీ లేదు" అంది ఇందిర.

ఆఫీసరు నవ్వేసి, "అంతేనా!" అని జేబులోంచి పర్సుతీసి, ఓ పదిరూపాయల కాగితం ఇందిర కందిస్తూ, "ఇది దగ్గిరుంచు చప్రాసీని పిలిచి టీ తెప్పించు—నేనూ తాగుతాను" అన్నాడు

నోటు మడిచి గుప్పెట్లో పెట్టుకుని చల్లగావచ్చేసింది ఇందిర చప్రాసీని పిలిచి టీకి పంపించి టైపుమిషను ముందు కూర్చుని పని ప్రారంభించింది వైదేహీ ఎందుకు రాలేదు? మళ్ళీ పెళ్ళిచూపులకు ఎవరైనా వచ్చారా? ఎందరు "పెళ్ళికొడుకులు" చూసుకుందికి వచ్చినా వైదేహికి పెళ్ళికావడం మాత్రం అసంభవం అనుకుంది ఇందిర.

చామనచాయగా బొద్దుగా ఉంటుంది వైదేహి. ఇందిరకంటె అయిదేళ్ళు పెద్ద. సర్వీసులో కూడా ఇందిరకంటె సీనియరు. బి. ఏ ప్యాసయింది ఆరుగురు అన్నదమ్ములమధ్య ఒక్కతే ఆడపిల్ల అందరూ ఏవో ఉద్యోగాలు చేస్తున్నారు. ఒక్కరికీ పెళ్ళికాలేదు ముగ్గురన్నయ్యలు హార్బరులో పనిచేస్తున్నారు ఆ ఇంటిల్లిపాదికీ జీవితాశయం ఒక్కటే; చెల్లెల్తికి పెళ్ళిచెయ్యడం. స్కూలుఫైనలునుండే చదువు మానిపించేసి పెళ్ళి చెయ్యాలని చూశారు. ఎప్పటికప్పుడు సంబంధం కుదిరినట్లే కుదిరి ఆఖరి క్షణంలో తెగిపోయేది. ఎందువల్ల అలా జరుగుతుందో ఎవరికీ అర్థం కాలేదు. అన్నదమ్ములు వాళ్ళ ప్రయత్నం వాళ్ళు మానకుండా చేస్తూనే ఉన్నారు. అమ్మాయిని ఎక్కడికీ కదలనివ్వరు. ఉద్యోగం చేసే గంటలు మినహా తక్కిన అన్ని సమయాల్లోనూ అమ్మాయిని అతిభద్రంగా కాపాడుతారు. ఎవరెవరో వరుల్ని వెతికి తీసుకువచ్చి చెల్లెల్ని చూపిస్తుంటారు. వైదేహి సెలవు పెట్టిందంటే పెళ్ళికొడుకు చూసుకుందికి వచ్చాడనే లెక్క

పన్నెండు గంటలయేసరికి చప్రాసీ ఇందిరకు ఓ ఉత్తరం తెచ్చి యిచ్చాడు. "ప్రొద్దున్న డాక్‌లోనే వచ్చిందమ్మా! యివ్వడం మరచిపోయాను" అన్నాడు, ప్రకాశం దస్తూరితో

వచ్చిన కవరు. ఆత్రంగా కవరుచించి కాగితం బయటకు తీసింది ఉద్వేగాలకు లోనుగావడం ఇందిర తత్వంలోనే లేదు. అలాంటిది కవరు విప్పేసరికి ఆమె గుండెలు దడదడా కొట్టుకున్నాయి. చిన్న ఉత్తరం. ఒక పావుటావు కాగితంమీద రెండుపక్కలా రాశాడు ప్రకాశం. చదవడం పూర్తయాక ఇందిర మొహం జేవురించింది. ఉత్తరం హ్యాండ్ బ్యాగ్‌లో పెట్టేసింది "సరే, అదన్నమాట సంగతి. కానీ, ఇంతలోకే ఇందిర బెంగపెట్టుకు కుంగిపోదు" అని తనకు తనే ధైర్యం చెప్పుకుంది. మోచేతులు టేబిలుకి ఆనించి అలా ఆలోచిస్తూ కూర్చుంది అలా ఎంతసేపు కూర్చుందో తనకే తెలియదు. హఠాత్తుగా చప్రాసీ వెంకటస్వామి వచ్చి, "టైపింగ్ ఎంతవరకూ వచ్చింది ఇందిరమ్మా, ఛోటాసాబ్ అడిగి రమ్మన్నారు" అన్నాడు.

ఇందిరకు ఎక్కడలేని కోపమూ వచ్చింది "నువ్వూ ఆ ఛోటాసాబూ కలిసి ఉప్పుటేరులో దిగి చావండి!" అంది, రూములో అందరికీ వినబడేటంత గట్టిగా. ఇందిర కళాకళలు వెంకటస్వామికి మామూలేగాని, రోజూకంటె యివాళ ఇంకొంచెం ఘాటుగా ఉండడంచూసి, చల్లగా అక్కడనుంచి తప్పుకున్నాడు. ఇంతలోకే ఆమె వెనకనుండి, "నమస్కారమండీ!" అని ఓ మొగ గొంతుక వినబడింది. వెనక్కి తిరిగిచూస్తే, వైదేహి రెండో అన్నయ్య ప్రసాద్ నిలబడి వున్నాడు

"ఏమండీ?" అంది, అస్తవ్యస్తంగా ఉన్న మనస్సును అదిమి పెడుతూ. వైదేహి అన్నదమ్ములతో ఆమె కంతగా పరిచయం లేదు..అప్పుడప్పుడు చెల్లెలికోసం ఆఫీసుకువస్తే పలకరించుకోవడం తప్ప. వైదేహి యింటికి తనెప్పుడూ వెళ్ళలేదు వైదేహి తనింటికి రాలేదు.

"క్షమించండి, మీతో కొంచెం పనుండి వచ్చాను" అన్నాడు ప్రసాద్

"చెప్పండి ఏమిటో!" అంది

"కొంచెం అలా వరండాలోకి వస్తే మాటాడదాం."

"ఇప్పుడు కుదరదండీ, చాలా పనిలో ఉన్నాను. ఒంటిగంటలోపున యీ చెత్తంతా టైప్ చెయ్యాలి. చీటికీ మాటికీ మీ వైదేహి సెలవు పెట్టేస్తుంది, ఆ పనంతా నా నెత్తిన పడుతోంది" అంది ఇందిర

ప్రసాద్ కళ్ళు రెండూ అదోలా తిప్పి భావకవిలాగ నిట్టూర్చాడు "అలా అనకండి ఇందిరగారూ! చాలా అవసరమైన పని దయచేసి మీరు కొంచెం సాయం చెయ్యాలి!" అన్నాడు కంఠంలో ఉద్రేకంతో.

"అసలు విషయమేమిటో చెప్పండి"

"మా వైదేహి విషయం"

"సాయంత్రం మా యింటికి రారాదూ? తీరుబాటుగా మాటాడుకోవచ్చు?"

"అలా కాదు ఇందిరగారూ, చాలా అర్జంటు" అంటూ ప్రాధేయపడ్డాడు కళ్ళల్లో నీళ్ళు తిరిగినంత పర్యంతం అయిందతనికి.

"సరే, బయట వరండాలో నిలబడండి, ఒక అరగంటలో వస్తాను" అనేసి ఫైల్స్ సర్దుకోవడం ప్రారంభించింది. అతను వెళ్ళి ఆఫీసు వరండా బయట యింకా దూరంగా నిల్చున్నాడు భయం భయంగా.

"పానకంలో పుడకలాగు వీడొకడూ మధ్యన" అని విసుక్కుంది ఇందిర అసలే మనసు వికలంగా ఉంది. ఆఫీసరు మొండి పట్టుదల, ప్రకాశం లెటర్ యివన్నీ చాలక వైదేహి అన్నవొకడు అనుకుంది. గబగబా ఫైళ్ళు సర్దేసి ఛోటాసాబ్ గదిలోకి వెళ్ళి "సారీ సార్! సగం డ్రాఫ్టులు కొట్టేశాను తక్కినవి సోమవారం ప్రొద్దున్నే వచ్చి చెయ్యొచ్చాండి? నేను అర్జంటుగా యింటికి వెళ్ళాలి. వంట్లో ఏం బాగులేదు" అంది. ఛోటాసాబ్ లోలోపల నవ్వుకున్నాడు. ఇంక అంతగా హింసించకూడదనుకున్నాడో ఏమో, "సరే! వెళ్ళిరండి" అన్నాడు. బ్యాగ్ తీసుకొని ఒక్క అంగలో బయటపడింది ఇందిర.

సిగరెట్ మీద సిగరెట్ కాలుస్తూ బయట పచారు చేస్తున్నాడు ప్రసాద్. ఇందిర అతన్ని సమీపించి, "చెప్పండి, ఏమిటి సంగతి?" అంది

"పని అయిపోయిందా? ఇంటికేనా?" అన్నాడు ప్రసాద్ "అవును" అంది ముక్తసరిగా ఇందిర.

"ఐతే అలా నడుస్తూ మాటాడదాం రండి"

"బాగుందడోయ్ వరస! ఏమిటి మీ ఉద్దేశం? మిమ్మల్ని వెంటేసుకుని రోడ్డుమీద నడవనా? ఇంకా నయం ! ఆ చెప్పేదేదో యిక్కడ చెప్పదలుస్తే చెప్పండి. లేకపోతే నేను పోతాను" అంది

"అలా అనకండి ఇందిరగారూ! మీరొకటీ మా చెల్లెలొకటీ కాదు"

ఆ మాటతో ఇందిరకు మరింత అసహ్యం వేసింది "ఇంకా నయం! మీలాంటి అన్నయ్యలుంటే ఈ పాటికి రైలుకిందపడి చచ్చేదాన్ని."

ప్రసాద్ తెల్లబోయాడు "అదేమండీ అలాగన్నారూ?" అన్నాడు.

ఇందిర విజృంభించింది. "కాకపోతే! ఆ వైదేహి కాబట్టి మీతో వేగుతోంది–నోరులేని పిల్ల–"

"ఆ నోరులేని పిల్ల ఏం చేసిందో తెలిస్తే మీరిలా మాటాడరు"

ఏమంటున్నాడూ? ఇందిరకు ఆసక్తి కలిగింది అతనివంక ప్రశ్నార్థకంగా చూసింది

"ఉదయం నిద్రలేచినప్పటినుంచీ మా వైదేహి కనబడడంలేదు లెటర్ రాసిపెట్టి వెళ్ళిపోయింది" అన్నాడు ప్రసాద్ బిక్కమొహం వేసి.

ఇందిర కాళ్ళక్రింద నేల జరిగినట్లయింది లిప్తపాటు లోకాలు జోగిపోయాయి, చీకట్లొగిపోయాయి. వైదేహి పారిపోవడమా? అంతకన్నా అసందర్భం యింకొటుందీ? చెవులపిల్లి తిరగబడుతుందా?

మళ్ళీ తేరుకుని "మంచిపని చేసింది. కావలసిందే మీకు. లేకపోతే–చిన్నపిల్లను అణచిపెట్టినట్లు అణచిపెడితే ఏం చేస్తుంది? ఇరవైనాలుగు గంటలూ నిఘాలో పెట్టి చంపితే ఏం చేస్తుంది? కనబడిన ప్రతి తలమాసిన వాడినీ లాక్కొచ్చి పెళ్ళికొడుకంటూ చూపిస్తే ఎంత ఓర్చుకుందామన్నా తిక్క రేగుతుంది. గంగాళంలో పిల్లిని ముంచినట్లు మరీ అంత అభిమానంతో ఉక్కిరిబిక్కిరి చెయ్యకూడదు ఎవరినైనా!" అంది.

ఇందిర కొంచెం హెచ్చుస్థాయిలో మాటాడేసరికి ప్రసాద్ భయపడ్డాడు "కొంచెం నెమ్మదిగా మాటాడరూ దయచేసి? పరువుపోయి అసలే కుమిలి కుమిలి ఏడుస్తున్నాం."

"ఇన్నాళ్ళూ ఆ పిల్లను ఏడిపిస్తూన్నారేమో, యిప్పుడు మీ రేడుస్తున్నారు! పదండి, యిక్కణ్ణుంచి పోదాం" అంటూ చకచకా ముందుకు నడిచింది, ప్రసాద్ ఆమె ననుసరించాడు.

రోడ్డువారగా ఆమె పక్కనే నడుస్తూ ప్రసాద్ చెప్పిన సారాంశం యిది; ఎలాగైతేనేం వైదేహికి పెళ్ళి సంబంధం కుదిరింది పెళ్ళికొడుకు వెటరినరీ డాక్టరు చేస్తున్నాడు. "అంటే పశువుల డాక్టరా?" అన్న ఇందిర ప్రశ్నకు "అలాగే అనుకోండి పోనీ!" అనేసి తిరిగి ప్రారంభించాడు "వద్దంటే మేం మాత్రం బలవంతంగా దాని మెడకు కడతామా చెప్పండి. నిన్నరాత్రి అడిగితే అంతా యిష్టమే నన్నట్లు అన్నిటికీ ఊ అంది తెల్లవారేసరికి ఓ కాగితం ముక్క రాసి పడేసి ఎక్కడికో వెళ్ళిపోయింది" అన్నాడు

"మీ బాధపడలేక ప్రాణాలు విసిగి 'ఊ' అనుంటుంది నిన్న అంతేకాని, నిజంగా యిష్టమైతే ఈ పనెందుకు చేస్తుందీ!" అంది ఇందిర.

"అదేనండీ! యిష్టంలేదని యిప్పుడు తెలిసిందనుకోండి... ఆ మాట ముందే చెపితే?"

"చాల్లెండి. నా దగ్గర మీరు ప్రగల్భాలు పలుకకేం? ఆ మధ్య వోసారి వైదేహి యిలాగే సెలవు పెడితే మాటవరసకు ఏమిటి సంగతి అని అడిగాను. అప్పుడు టూకీగా తన పెళ్ళిచూపుల గొడవంతా చెప్పుకొచ్చింది ఈ ఏడాదిలో ఓ యాభయి మందికి తనని చూపించారుట మీరు వెతికి వెతికి బతిమాలి పట్టుకొచ్చిన ప్రతి పెళ్ళికొడుకు మొనగాడూ తీరికూర్చుని సవాలక్ష గొంతెమ్మ కోరికలు కోరడమట మీతో నిక్కచ్చిగా కిందటిమాసే చెప్పిందట కదూ! నా యిష్టంవచ్చినవాడిని నేను చూసుకుంటాను, మీరింక వెతకడం వెర్రిని మానేయండని. అది చాలదూ ఆ అమ్మాయికి మీరు తెచ్చే ంబంధా లిష్టంలేవని తెలియడానికి? వూరికే నంగనాచి కబుర్లు చెప్పకండి."

ఆమె పెట్టిన చీవాట్లన్నీ చల్లగా తినేసి ప్రసాద్ తలవంచుకునే ముందుకు నడుస్తూ "పోనీలెండి, తప్పంతా మాదేననుకోండి. జరిగినదానికి లెంపలేసుకోమన్నా సిద్ధమే. ఇంతకీ వైదేహి ఎక్కడుందో చెప్పి పుణ్యం.. ."

"ఏమండోయి! పిల్లిలా నా వెంటబడి ఏదో చెమక్కులు చేస్తున్నారే! వైదేహి ఎక్కడి కెళ్ళిందో నాకేం తెలుసు మధ్య" అని అతని మాట పూర్తికాకుండానే అతనిమీద కస్సుమంది.

ప్రసాద్ మరింత వినయం తెచ్చిపెట్టుకుని "మరలా కోపం తెచ్చుకోకండి. మీ స్నేహితురాలు కనుక మీకంతా తెలిసే ఉంటుందని మా చెల్లెలు మాకు దక్కితే చాలు, మీకేమాత్రం తెలిసినా చెబుతారనే ఆశపడి వచ్చాను" అన్నాడు జాలిగా.

"వైదేహి ఇలాంటి విషయాలన్నీ నాకు చెప్పి చేసేటంత స్నేహితురాలు కాదు ఏదో ఒక ఆఫీసులో పనిచేస్తున్నాం కనుక వస్తూ పోతూ కూడా అయిదు నిమిషాలు మాట్లాడుకోవటం తప్పితే పట్టుమని పది నిమిషాలు కూడా ప్రత్యేకంగా మాట్లాడుకోలేదు మేమెప్పుడూ. అసలు నిన్నను మేమిద్దరం కలియనేలేదు" అంది

"పోనీ, ఈ మాటైనా చెప్పండి; మాటిమాటికీ నా యిష్టం వచ్చినవాడిని చేసుకుంటాను అనేది...వా డెవడు?"

"బాగుంది వరస–పారిపోయిన అమ్మాయిని అడిగితే ఏం వినాలసొస్తుందో అని నోరు మూసుకుని వూరుకుని మధ్య నన్ను పట్టుకు సతాయిస్తున్నారేమిటి?"

"ఎంతమాట? మిమ్మల్ని బాధించాలనే ఉద్దేశంతో ఏమీ అడగడం లేదు. మా అపదకొద్దీ అడగాల్సి వస్తూంది అడగకేం! దానినీ అడిగేం కాని చెపితేనా! చెప్పాల్సివచ్చినపుడు చెపుతానంది తరచూ మీ గురించి ఇంట్లో చెపుతూంటుంది, ఆడపిల్లలంటే మీలా ధైర్యంగా ఉండాలని. అప్పుడే ఏ ఆడపిల్లయినా జీవితంలో తనకు కావలసినది తాను సంపాదించుకోగలదని అంటూండేది. మీరంటే అంత ఆదరమున్నాక మీకు తన సంగతులన్నీ చెప్పకుండా ఉంటుందా?" అని నసిగాడు ప్రసాద్.

ఇందిర స్వరం హెచ్చించి చిరాకుగా "లేదు బాబోయ్! లేదు మీ అమ్మాయికి నాగురించి గొప్ప అభిప్రాయముంటే ఉండొచ్చుగాని ఆవిడ ఎవడిని ప్రేమించిందో ఎవడితో లేచిపోయిందో అవన్నీ మాత్రం నాకేం తెలియదు" అంది.

"అలా అనకండి. ఎక్కడికీ లేచిపోయే పిల్లకాదది బంధువుల ఇళ్ళకూ వెళ్ళదది 'నేనేమీ అయిపోను. మీ అభిప్రాయం మార్చుకునేదాకా ఈ యింటిగుమ్మం తొక్కను' అని వ్రాసింది ఉత్తరంలో అది తప్పకుండా మీ యింటికే వచ్చుంటుందని నా నమ్మకం!"

"ఎంత చెప్పినా ఎక్కడేమిటి చెప్మా ఇతనికి!" అనుకుని ఇందిర "మీతో వాగివాగి నీరసం వస్తూంది నాకు అంత అనుమానమైతే వచ్చి చూసుకోండి కావలిస్తే మా యిల్లంతా సోదా చెయ్యండి ముందొక రిక్షా పిలవండి ఇప్పటికే మీ మూలంగా సగం దూరం నడిచొచ్చాను" అంది అలసిపోయినట్లు ముఖంపెట్టి చేతిరుమాలుతో ముఖం తుడుచుకుంటూ.

ప్రసాద్ అంతా మీ అజ్ఞానుసారమే అన్నట్లు గబగబా నాలుగడుగులు ముందుకు వెళ్ళి రెండు రిక్షాలు తీసుకొచ్చి, "రిక్షా తెచ్చాను–మీరు మరొకలా అనుకోకపోతే నేనుకూడా వస్తాను మీ యింటికి" అన్నాడు, ఎటో చూస్తూ రోడ్డుప్రక్క ఒయ్యారంగా నిలబడ్డ ఇందిరతో.

ఆమె రిక్షా ఎక్కుతూ "ఓ! తప్పకుండా రండి! ఇంటిదగ్గర మా నాన్న ఉన్నాడు, నాకు రాయగా మిగిలిన అముదమంతా అతనికి రాద్దురుగాని" అంది.

ఇంటికి వెళుతూ దారిలో ఆమె ఆలోచనలు పరిపరివిధాల పోయాయి. వైదేహి ఎందుకు పారిపోయినట్టు? తన కాళ్ళమీద తను నిలబడగలిగే చదువూ ఉద్యోగమూ ఉన్నాయి ఆ అమ్మాయికి ధైర్యంగా నిలబడి ఎదురు చెప్పకూడదూ! అంత పిరికిగా ఇంట్లోంచి పారిపోవడమేం కర్మ! చిత్రంగా వుంది. ఆ అమ్మాయికి అన్నీ ఉన్నాయి. ఆప్యాయంగా చూసే అన్నయ్య లున్నారు. తను సంపాదిస్తేకాని ఆ పూటకి గతిలేదు అన్న బాధేమీ లేదు. ఆ అమ్మాయి సుఖం కోసం, ఆమె బతుకును తీర్చిదిద్దాలని తాపత్రయపడే మనుష్యులున్నారు. ఆ తాపత్రయంతోటి చెల్లెలిని ఓ ఇంటిదాన్ని చెయ్యాలని వాళ్ళు తెగ సంబంధాలు వెతుకుతున్నారు. చిత్రమేమిటంటే, ఆ అప్యాయతే ఆమెకి వెగటుగా తోచింది. తనను వైదేహితో పోల్చి చూసుకుంది. తనకేముంది నిజానికి? తనమీద ఆధారపడిన నాన్న తప్పితే,

అప్యాయతా అభిమానంగల వ్యక్తులంటూ తనకు లేరు. నాన్నకు తన గురించీ తన భవిష్యత్తు గురించీ బాధ్యతలే లేవు అతనికి తెలిసిందల్లా ఒకటే– తనకు పక్కతాళం వేస్తూ పబ్బం గడుపుకోవడం అతనికి కావలసిందల్లా ఒకటే– ఎలాగో అలాగ అతని అవసరాలు గడిచిపోవడం. ఆమె మనస్సులో లోలోపల బాధ కలిగింది. చెల్లెలు ఒక్కపూట కనబడకపోతే ఎంత కంగారుగా పరిగెత్తుకొచ్చాడు వాళ్ళన్నయ్య! అలాంటిది నాన్నకేమీ అక్కరలేదు తను అర్ధరాత్రిదాకా ఇంటికి రాకపోయినా అతనికి చింతలేదు. ఎవళ్ళతో ఎక్కడికి వెళ్ళిపోయినా బాధపడడు. "అయ్యో! అమ్మాయేం బాధపడుతోందో!" అనేలాంటి అనుభూతి అతనిలో మృగ్యం

రెండు రిక్షాలూ ఆమె ఇంటిముందు ఆగాయి వీధి గుమ్మందగ్గిరే ఎదు రయాడానందరావు. "నాన్నా! ఈయన ప్రసాద్ అనీ మా ఆఫీసులో నా కోలైపిస్టు వైదేహి లేదూ వాళ్ళన్నయ్య ఆ అమ్మాయి ఎందుకో ఇంట్లో వాళ్ళమీద అలిగి పారిపోయిందట. మనం ఆ అమ్మాయి నెక్కడో దాచేశామని ఈయనగారి అనుమానం."

"సోదా చేసుకొందు కొచ్చాడా ఏమిటి!" అని ఆనందరావు చుట్ట నోట్లో పెట్టి అగ్గిపుల్ల వెలిగించి "చేసుకోమను, ఎవరొద్దన్నారు?" అన్నాడు నడవలో ఈజీ చెయిరులో కూలబడుతూ. ఆనందరావు కూర్చోమనకపోయినా పక్కనున్న కుర్చీలో కూర్చుని ప్రసాద్ "అదికాదండీ బాబాయిగారూ! ఏదో చిన్నతనం!· తొందరపడి ఇంట్లోంచి వెళ్ళిందన్న మాటేకాని అది అట్టేదూరం వెళ్ళి ఉండదని నా నమ్మకం. మీ అమ్మాయి గారంటే దానికి విపరీతమైన గౌరవం. అందుకని మీ యింటికి వచ్చిందేమోననీ!" అని నసిగాడు.

"బాగుందయ్యా బాగుంది అసలా పిల్లెవరో నేను చూడలేదు మా యింటికి ఎన్నడూ వచ్చెరుగదు. పోనీ చూసుకోమంటున్నాం కదూ, ఇల్లంతా చూసుకోండి" అన్నాడానందరావు.

"అదికాదు నాన్నా! ఇంత గడబిడ పడేదానికి బదులు పోలీసు రిపోర్టు ఇవ్వకూడదూ?" అంది ఇందిర వెటకారంగా ప్రసాద్ వైపు చూసి.

ప్రసాద్ రెండు చేతులా నోరు నొక్కేసుకుని "అసలే ఇంటి గౌరవమంతా గంగపాలయిందని కుమిలి ఛస్తున్నాం. పోలీసు రిపోర్టొకటా?" అన్నాడు.

"ఓహో! మీకింటి గౌరవం నిలబడితే చాలన్నమాట. ఆ అమ్మాయి ఏమైనా ఫరవాలేదు కాబోలు!"

ఆనందరావు అందుకున్నాడు. "ఏమిటి ఇందిరమ్మా! నీ వెర్రికాని ఆ అమ్మాయి ఏమైపోతుంది? ఎందుకయిపోతుంది? నేను చెపుతాను విను. ఇంట్లోంచి పారిపోయేవాళ్లెప్పుడూ ఏదో అయిపోవడానికి పారిపోరు. వాళ్ళకు కావలసినట్లు బతకటానికి వెళతారు. ఇంతకీ ఆ అమ్మాయేమైనా పసిపాపా! నీకంటె అయిదారేళ్ళు పెద్దదే అన్నావు కదూ! ఈ పాటికి మద్రాసు మెయిలు చాలా దూరమే వెళ్ళుంటుంది." తండ్రీ కూతుళ్ళ ధోరణితో ప్రసాద్ నీళ్ళు కారిపోయాడు, నిజంగా వైదేహి, తన చెల్లెలు అంత పని చేసుంటుందా? ఒక్కర్తే రైలు ప్రయాణమైనా చేసెరగదే? మరో వూరు పారిపోవడమే! తల్చుకుందుకే భయమేసిందతనికి. దిగాలుగా

ముఖం పెట్టేసి "నేను వెళ్ళొస్తానండీ ఇందిరగారూ!" అన్నాడు "ఆహా! వెళ్ళండి" అంది ఇందిర.

అతను కనుచూపుమేర దాటిపోయాక "వెళ్ళాడూ! బతికామందరమూను, ఈ త్రాష్టుడిని వెంటేసుకొచ్చావేమిటి? పాపం, ఆ అమ్మాయే కాబోలు నువ్వు వెళ్ళగానే మనింటికొచ్చింది 'మేమిద్దరం ఒక ఆఫీసులో పనిచేస్తున్నాం ఇందిర వచ్చేదాకా ఇక్కడే వుంటాను. ఆవిడతో పనుంది' అంది అన్నాడు ఆనందరావు

"ఏమిటీ! వైదేహి యిక్కడికే వచ్చిందా! మరి చెప్పావుగావేం అతడున్నంత సేపూను? ఇంతకీ వచ్చి ఎక్కడికి వెళ్ళింది?"

"ఎక్కడికి వెళ్ళడమేమిటి! ఇక్కడే వుంది. ప్రకాశం రూంలో ఉంది వెళ్ళి సంగతేమిటో కనుక్కో!"

"అదేమిటి నాన్నా! అతనిముందు అంత నాటకమెందుకాడావైతే? ఆ పిల్లనతనికప్ప చెప్పేస్తే వదలిపోయేదిగా గొడవంతా!"

"నీతో చెప్పకుండా ఆ మాట బయట పెడితే నువ్వేమంటావో అని అనుకున్నాను. నువ్వు వచ్చేదాకా హరిహర బ్రహ్మాదులు వచ్చినా తన జాడ చెప్పవద్దని ఆ అమ్మాయి ఊరికే బతిమాలుకుంది" అన్నాడానందరావు నడవలోంచి తన గదిలోకి వెళుతూ

"బాగుంది! ఉన్నవన్నీ చాలక ఇదొక గొడవ సరే, బట్టలు మార్చుకుని మేడమీదకెళ్ళి నేను కనుక్కుంటానులే సంగతేమిటో!" అని లోపలకు వెళ్ళింది ఇందిర.

బట్టలు మార్చుకుని నాన్న గదిలోకి వచ్చి "పడుకుంటున్నావా నాన్నా! ఇదుగో మన హీరో ఉత్తరం రాశాడు చదివేసి మరీ పడుకో" అని నాన్న మంచం మీదకు చేతిలోని కవరును గిరవాటేసింది గుమ్మందగ్గర నిల్చునే

"ఏం రాశాడో చెబుదూ?" అన్నాడానందరావు బద్ధకంగా ఒత్తిగిలి.

"ఏం రాస్తాడో తెలీదూ! చెప్పడానికి కూడా అసహ్యం!" అని ముఖం తిప్పేసుకుంది చీదరగా.

"అబ్బ! మూడు ముక్కల్లో చెప్పరాదూ!"

"నేను చెప్పను, నువ్వే చదువుకో!"

"ఇప్పుడేం తొందరలే, తరువాత చదువుతాను – ఆ గూట్లో పడెయ్యి" అంటూ కవరు పక్కకు తోసేసి "అన్నీ మనమనుకున్నవే కదూ! అలాంటివాటికి బాధపడకూడదు" అన్నాడు.

"ఏమిటీ నాన్నా నువ్వనేది? ఊళ్ళో ఎవరికో ఏదో అయితే మధ్య నాకెందుకు బాధ?" అని విసవిసలాడుతూ మేడమెట్లెక్కి వెళ్ళింది.

వరండాలో కాళీగా ఉన్నమంచం వాల్చుకుని గోడవేపు తిరిగి పడుకుంది వైదేహి.

"హలో వైదేహీ! చాపకింద నీరులా ఉండి పెద్ద హీరోయిన్‌వై పోయేవేమిటోయ్?" అంది పైకి వస్తూనే ఇందిర.

వైదేహి అటునించిటు తిరిగి "అవకేం చెయ్యడం చెప్ప–పరిస్థితులలా వచ్చినపుడు" అంది.

"ఓస్! నిజంగా ఘనకార్యం చేశాననుకుంటున్నావేమిటి? పరిస్థితులలా వస్తే నిలబడి పోట్లాడగలగాలి కాని పారిపోయి రావడం ఏం గొప్ప!" అంది ఇందిర, వైదేహి పక్కనే మంచంమీద కూర్చుంటూ

"నేనేదో ఘనకార్యం చేశానని మురిసిపోవడంలేదు ఇందిరా! నువ్వు చెప్పినట్లు నిలబడి పోరాడగలిగినన్నాళ్ళు పోరాడాను ఇంక ఓపిక లేకపోయింది. నీరసమొచ్చింది ఏదో ఒకలాగ ఆ కొంపలోంచి బయటపడితే అంతేచాలని వచ్చేశాను, మరేం చెయ్యడానికి తోచక."

"ఇంతకీ ఏం జరిగింది చెప్పు—ఇప్పుడంత ప్రమాదం ఏమొచ్చింది?"

"ప్రమాదమంటే ప్రాణాపాయం రాలేదనుకో. వాళ్ళు చెప్పినట్లల్లా వినేస్తే కడుపులో చల్ల కదలకుండా పదికాలాలపాటు పదిమంది పిల్లల్ని కంటూ బతికేయవచ్చు—ఎటొచ్చీ వాళ్ళు ఎవడో ముక్కూ మొహమెరుగనివాడిని పట్టుకురావడం—వీడిని పెళ్ళాడు అని ఒక తాడు బిగించడం అంటే నాకసహ్యం వద్దు మొర్రో అంటే వినరుకదా! నిన్న మళ్ళీ ఒక సంబంధం చూసి నిర్ణయం చేసేసుకుని వచ్చారట మా అమ్మా పెద్దన్నయ్యానూ. వాడెవడో వెటరనరీ డాక్టరుట—నిక్షేపంలా గవర్నమెంటు ఉద్యోగం చేస్తున్నాడు—ఆస్తి ఉంది. ఎంతమందిని చూసినా నువ్వు వెళ్ళగొట్టేస్తున్నావని మేమే మాటాడి వచ్చేశాం అన్నారు. వాడి ఫోటో ఒకటి తెచ్చి నా మొహాన పడేశారు."

"దాన్ని గిరవాటేసి ఈ వేషాలేం సాగవు, నా యిష్టం లేకుండా మీరేం చెయ్యలేరు అని చెప్పాలిసింది అంతమాత్రానికే పారిపోయి రావడమెందుకూ! మరింత చులకనవడానికి?" అంది ఇందిర

"ఆ యింటి సంగతి నీకు తెలియదు ఇందిరా! నీకేం, హాయిగా నీ స్వేచ్ఛకు అడ్డు రాకుండా నిన్ను కంటికి రెప్పలా కాపాడే నాన్న ఉన్నాడు పీడించుకుతింటానికి చుట్టూ పదిమంది లేరు. అర్థంలేని అభిమానాలొలకబోసి ఉక్కిరిబిక్కిరి చేసే వాళ్ళెవర్నూ లేరు నీ రాజ్యానికి నువ్వే రాణీ వన్నట్లు బతుకుతున్నావు. నువ్వు చెప్పినట్లు చెప్పలేదు కనుకనా! చెప్పవలసినన్నిసార్లు చెప్పాను. అమ్మ నిన్న సాయంత్రం నుండీ ఏకధారగా ఒకటే ఏడవడం—ఏమే ఇంత చెప్పినమాట వినకుండా తయారయ్యావూ? అని శోకాలు. పెద్దన్నయ్య గడ్డం పట్టుకుని, తండ్రిలేని పిల్లవని పువ్వుల్లోపెట్టి పెంచాము, నీ మంచి చెడ్డలు మాకు తెలీవా తల్లీ—మొండిపట్టు పట్టక అమ్మను సుఖపెట్టు అని గంట బతిమాలేశాడు. రెండో అన్నయ్య ఆడపిల్లలి తెగతిట్టేసి, అందుకే దీనికి చదువు చెప్పించవద్దన్నాను, సరదాకి అంటూ బి.ఏ.దాకా చదువు వెలిగించారు. ఏం! కుంటివాడినో గుడ్డివాడినో పెళ్ళాడమనలేదే—రెండో పెళ్ళివాడిని పెళ్ళాడమనలేదే—లక్షణమైన సంబంధం తీసికొస్తే చేదా! పాతికేళ్ళు దాటిపోయిన చెల్లెలికి పెళ్ళి చేయకుండా ఇంట్లో ఉంచి మేమేమని ఇంటివాళ్ళమవుతాం అనేగదూ, ఎన్ని మంచి సంబంధాలొచ్చినా ఇలా ఉండిపోయాం! చదువుకోగానే సరా! ఇంగితజ్ఞానం ఉండొద్దూ! అని చెడామడా తిట్టిపోశాడు."

వైదేహి అంత సీరియస్‌గా చెప్పుకుపోతూంటే ఆమె చివరిమాటలు విని పకాలున నవ్వి ఇందిర "పాపం, అతనిబాధ అతనిది కాబోలు. పాతికేళ్ళ దాకా ఎందుకుంచేదూ?

నీకు పదేళ్ళప్పుడే ముడిపెట్టేస్తే ఈ పాటికి మీ అన్నయ్యలందరూ గృహస్థాశ్రమంలో నడుం వంచేసుకుని ఉండేవారు" అంది

"అదే ఇందిరా! ఎంతసేపూ నా బాగూ భవిష్యత్తూ అని అరుస్తారు కాని అసలు వాళ్ళ బాధ అదే! అదీ చెప్పాను నాకోసం అలా బ్రహ్మచారులై ఉండిపోనక్కరలేదు బాబూ! మీరు సుఖపడండి అని – అలా వీల్లేదట. నాకో ఇల్లంటూ చూపించకుండా వాళ్ళు బ్రహ్మచర్యం వదలరట ఈ రభస యిప్పటిదనా నీ ఉద్దేశ్యం? నాకు పన్నెండేళ్ళప్పటినుండీ ఇంటిల్లిపాదికీ నా పెళ్ళి సమస్యే నువ్వన్నట్లు అప్పుడు చేసేస్తే ఏ బాధా లేకపోను. అప్పట్లో బతికున్న మా నాయనమ్మ పిల్ల ఎదగకుండా పెళ్ళి చేసేయండర్రా అని గోల పెడితే అప్పుడు మా అమ్మే అడ్డుపడింది. ఏమీ తెలియని అర్భకురాలు, దానికిప్పుడే పెళ్ళేమిటి? నా కూతుర్ని బి. ఏ. దాకా చదివిస్తానని అలా అవి చదువుకునే రోజుల్లోనైనా ఊరుకున్నారా! ప్రతి ఏడాదీ ఒక గండమే. ఎప్పటి కప్పుడో సంబంధం చూసి, సంబంధం చూశామనడం, నేను వద్దుబాబో అని మొత్తుకుంటే అప్పటి కూరుకోవడం, ప్రాణం విసిగిపోయిందనుకో" అంది వైదేహి.

"సరే, అంతా బాగుందికాని ఇలా కాదు వైదేహీ, నువ్వు చెయ్యాల్సిన పని. ఇలా పారిపోయి వచ్చి దాగుకుని ఏం చెయ్యగలవు? మీ అన్నయ్యొచ్చాడిందాకా!"

"అంతా విన్నానులే" అంది వైదేహి.

"ఇదేం లాభంలేదు...ఇవ్వాలిటికి ఇక్కడేవుండు.. రేపు పొద్దున్నే నేనుకూడా నీతో వస్తాను. మళ్ళీ నీ పెళ్ళి ఊసెత్తకుండా ఉండేలా మీ వాళ్ళకి బుద్ధిచెప్పి నిన్నప్పజెప్పి వస్తాను పిరికితనంవల్ల ఏమీ సాధించలేవు" అంది

"అయితే ఆ యింట్లో అందరిమధ్యా నలిగిపోతూ బతకడం తప్ప మరో మార్గం లేదంటావా?" అంది వైదేహి దిగాలుగా ముఖం పెట్టి

"ఆ యింట్లోవాళ్ళనే ఎదిరించలేనిదానివి, అక్కడే బతకలేనిదానివి, మరొకచోట హాయిగా బతికేస్తాననుకుంటున్నావా! ధైర్యం ఉండాలమ్మాయి దేనికైనా! అంతే! మనుష్యు లెక్కడయినా ఒకటే? కాస్సేపు పడుకో. క్యారియర్ వచ్చాక పిలుస్తాను" అని కిందకు దిగి వెళ్ళింది ఇందిర

ఆమె చెప్పినదాంట్లో అసత్యం లేదనిపించింది వైదేహికి. ఆఫీసులో చూడటం తప్ప ఆమె గురించి వైదేహికేమీ తెలియదు ఇందిరలా తానుండలేదు కాని మనుష్యులంటే అలాగే ఉండాలి అని మెచ్చుకుంటూంది మనసులో. నిజమే! తను పుట్టి పెరిగిన వాతావరణంలోనే ఇదీ నాకు కావలసింది అని గట్టిగా చెప్పి సంపాయించుకోలేని తను బయటి ప్రపంచంలో ఏం సాధించగలదు?

"భోజనం చేసేద్దామా నాన్నా?" అంది ఇందిర పేపరు తిరగవేయడం పూర్తిచేసి "దాని కభ్యంతరమా!" అన్నా డానందరావు.

"ఆ అమ్మాయిని పిల్చుకురానా?" అంది.

"పిల్చుకురా! నేను కంచాలు వేస్తానీలోపల" అని వాలుకుర్చీలోంచి లేచా డానందరావు. మెట్లెక్కబోతూంటే వీధిలో రిక్షా ఆగింది. ఎవరా అని తొంగి చూసింది మెట్లమొగదలలో నిలబడి. రిక్షాలోంచి ప్రకాశం దిగాడు. రిక్షావాడి చేతిలో డబ్బులు పడేసి సామానేమీలేకుండా చేతు లూపుకుంటూ నడవలోకొచ్చి అటూ

యిటూ చూశాడు. అకస్మాత్తుగా అతనలా రావడం చూసి బిత్తరపోయిన ఇందిర మెట్లచాటు క్రీనీడలోంచి వెలుగులోకి వచ్చి "ఇదేమిటి ఇలా ఊడిపడ్డావు? పెళ్ళికి పిలవడానికొచ్చావా!" అంది. ఆ పలకరింపులోని క్రౌర్యమూ వెగటూ వెటకారమూ ప్రకాశానికి బాగా అర్థమయాయి.

"జరిగిన దానికి క్షమించు ఇందిరా! పరిస్థితులన్నీ అలా వచ్చేయి, నేను భయపడినంతా జరిగి తీరుతుందనుకున్నాను. అందుకే నీకలా వ్రాశాను, కాని ఎలాగో తప్పించుకు వచ్చేశాను"అన్నాడు.

ఆమె కొంచెం సావధానంగా "అంటే?" అంది

"పైకి వెళదాం పద, చెబుతాను" అని మెట్లెక్కి తన రూంవేపు దారితీశాడు ఆమె అతని వెనకాతలే వెళ్ళి, అక్కడ నిద్రపోతూన్న వైదేహిని లేపి "క్రిందకు పద వైదేహీ! మొహం కడుక్కో, వస్తాను నేను" అని పంపించింది

"ఆవి డెవరు?" అన్నాడు ప్రశ్నార్థకంగా ప్రకాశం

"ఎవరోలే నీలాంటి సుబుద్ధి ఇంతకీ నువ్వు చేసొచ్చిన అడ్వెంచర్ ఏమిటో చెప్పు" అంది మంచంమీద కూర్చుని

ప్రకాశం కుర్చీలో కూర్చుని జోడువిప్పి అవతలకు తోసేసి "ఆ అమ్మాయినెవర్నో చూదాం రమ్మని రాజమండ్రి లాక్కెళ్ళాడు మా మామయ్య నా యిష్టాయిష్టాలతో పనిలేకుండానే అన్ని మాటలూ జరిపించేశాడు ఇవ్వాళ ప్రొద్దుటే అమలాపురంలో ఎవరితోనో కొంచెం పనుంది సాయంత్రాని కొచ్చేస్తాను, అప్పుడిద్దరం కలసి ఇంటికి వెళ్ళిపోవచ్చు అని వెళ్ళాడు. ఇదే సమయమనుకుని మేం బసచేసిన బంధువులను పది రూపాయలడిగి పరిగెత్తుకు వచ్చేశాను" అన్నాడు

"ఎందు కొచ్చినట్టో!" అంది ఇందిర చిత్రంగా మూతి తిప్పి.

ప్రకాశం గతుక్కుమన్నాడు–"అదేమి టిందిరా! అలా అంటావు? ఎందుకొస్తాను? నీ కోసమే!" అన్నాడు.

"ఛీ! నీకు సిగ్గులేకపోతే నాకుంది. మామయ్య రమ్మనమంటే వెళ్ళిపోయి అతనెలా చెబితే అలా ఆడి అన్నిటికీ ఒప్పేసుకుని ఇప్పుడు నా కోసం వచ్చాడట, నా కోసం. దొంగతనంగా పారిపోయిరావడం ఒక ప్రతిభ అనుకున్నావు కాబోలు ఇంత ఘనకార్యం చేసిన మేటివీరుడని నెత్తికెక్కించుకుంటాననుకున్నావు కాబోలు. ఇదిగో ప్రకాశం! ఇంక నీకూ నాకూ సరి, నాతో బేరాలేం పెట్టకు" అంది ఆమె. గీతవేసి తుడిచేసినంత సులువుగా అనేసింది ఆ మాటల్ని.

ప్రకాశం నిర్ఘాంతపోయాడు అతనికి కరచరణా లాడలేదు. ఆమేనా ఇలా మాట్లాడుతుంది అనుకున్నా డొకసారి. కష్టంమీద నోరు పెగల్చుకుని "అంతేనా ఇందిరా! నీ కోసం కాకపోతే ఇలా కట్టుగుడ్డలతో ఎందుకొస్తాను? అలా అన కిందిరా! చెప్పు, నువ్వేం చెయ్యమంటే అది చేస్తాను" అన్నాడు ప్రాధేయపడుతూ.

"అలా ప్రాధేయపడి నా జాలిని రెచ్చగొట్టి నువ్వేమీ సంపాయించలేవు ప్రకాశం! నీ మీద జాలిచేత నిన్నంటగట్టుకుని నే నెక్కడ కెళతాను? నా కోసం నువ్వు వచ్చావు కాని నీ కోసం నేను కాచుకు కూచోలేదు. అన్ని హక్కులూ ఉండి మేనమామ నెదిరించలేని పిరికివాడివి, నువ్వు నాకేం చేయలేవని ఆ నాడే తెలిసిపోయింది.

నీకూ నాకూ కుదరదు. వెళ్ళి ఆ అమ్మాయినే చేసుకో నీకు తగిన సంబంధమే చూశాడు మీ మామ ఇంక నన్ను విసిగించకు" అని తటాలున లేచి కిందకు దిగి వెళ్ళిపోయింది ఇందిర.

# 14

వంటింట్లో కంచాలు వేస్తున్న ఆనందరావు ప్రకాశంరాక గమనించలేదు, మొహం కడుక్కోడానికి లోపలకు వచ్చిన వైదేహిని చూసి, "ఏవమ్మా, ఒక్కర్తెవూ మేడమీద కూర్చుంటే మరీ విచారంగా ఉంది కదూ? పద, మొహం కడుక్కో, భోజనాలు చేద్దాం చలికాలం రాత్రి ఎనిమిదేనా అవలేదు అప్పుడే ఎంత చీకటిపడిపోయిందో చూశావా!" అన్నాడు బాతాఖానీ ధోరణిలో "ఎవరో వచ్చారండీ! ఇందిరా అతనూ మేడగదిలో మాటాడుకుంటున్నారు" అంది వైదేహి జంకుగా, ఏదో బిడియపడుతూ,

"అతనూ-? ఎవరా అతను?" ఆశ్చర్యంగా అన్నాడు ఆనందరావు వైదేహి ఇంకా బిడియపడుతూ, "నాకు తెలీదండీ!" అంది

"ఓహో!" అనేసి ఆనందరావు పనిలో నిమగ్నుడయాడు అన్నీ అమర్చి మెట్లగదిలోకి వచ్చేసరికి అతనికి మెట్లు దిగుతున్న ఇందిర కనబడింది, "ఎవరిందిరా, వచ్చారట?" అన్నాడు. ఇందిర జవాబు చెప్పలేదు. ఆమెమొహం ధుమధుమ లాడుతోంది.

"ఇంటివాడి గుమాస్తానా?" అన్నాడు

అసలే పట్టలేని ఉద్రేకంతో ఉందేమో, ఆ ప్రశ్న వినేసరికి ఆమెకి మరింత తిక్కరేగింది. "నీ మొహం నాన్నా! రాత్రి ఎనిమిదింటికి ఇంటివాడి గుమస్తాను తీసుకుని మేడరూంలో కూర్చుంటానా? ప్రకాశం ఊడిపడ్డాడు-నాట్ పెయిడ్ ఉత్తరంలాగ!-నన్ను ఉద్ధరించడానికి వచ్చాడట! అంతా నన్నుద్ధరించేవాళ్ళే!" అంటూ అరిచింది.

ఆనందరావు నిదానంగా "అదేమిటి? మధ్యాహ్నమే కదూ లెటర్ ఒచ్చిందన్నావు?" అన్నాడు

"అవునూ! ఇప్పుడు మనిషే వూడిపడ్డాడూ!" అని విసురుగా వెళ్ళి వాలు కుర్చీలో వాలిపోయి చేతులు రెండూ వెనక్కి అన్చి "మరో కంచం కూడా వెయ్యి హీరోకి భోజనం పెడదాం పాపం, రైలు ప్రయాణం చేసి అలసిపోయుంటాడు" అంది ఇంతలో వైదేహివచ్చి బిత్తుగ్గా గోడకి చేరబడి నిలుచుంది ఇందిర దృష్టి ఆమె మీద పడింది. "అదేమిటి వైదేహీ! అలా నిలుచుండిపోయావేమిటి? ఇలా రా! కుర్చీలో కూర్చో!" అంటూ పక్కనేవున్న క్రకుర్చీని తనదగ్గరగా జరిపింది వైదేహి మాటాడకుండా వెళ్ళి అందులో కూర్చుంది వైదేహి చేతుల్ని తన ఒళ్ళోకి తీసుకుని "మా వైదేహి మాం-ఛి-పిల్ల ముద్దొచ్చే కుందేలుపిల్ల- ఏం?" అంది గోముగా

ఆనందరావుకు ఆమె ధోరణి ఆ క్షణంలో అర్థం కాలేదు ప్రకాశం రాకకు ఆ అమ్మాయి సంతోషిస్తున్నట్లా, కోపం తెచ్చుకున్నట్లా! ప్రకాశం ఉత్తరాన్ని ఇందాకనే చదివాడు తను ఆమె మేడమీద వైదేహితో మాటలాడుతున్నపుడే చదివాడు;

సంగతులు గ్రహించాడు. తన పెళ్ళికి బలవంతంగా అన్ని ఏర్పాట్లూ జరిగిపోయాయని రాశాడు. జరిగినదానికి క్షమించి తనను మరచిపొమ్మన్నాడు అలా రాసిన మర్నాడే ఉండబట్టలేక రైలెక్కి వచ్చేశాడన్నమాట అనుకున్నాడు ఆనందరావు. ఆ క్షణంలో మెరుపువలె అతని బుర్రలో భయం మెరిసింది–ఇదీ అని చెప్పలేని ఒకానొక అనిర్వచనీయమైన భయం కొంపతీసి యీ అనుబంధం స్థిరపడిపోతుందా?

"బాగుంది. అక్కడికి యిద్దరయ్యారన్నమాట–జైలునుంచి తప్పించుకున్న మనుష్యులు" అంటూ ఇందిర మొహం చూసి చిరునవ్వు నవ్వాడు ఆ మాట విని వైదేహి ఉలిక్కిపడింది. పాలిపోయిన ఆమె మొహం దీపకాంతిలో మరింత వివర్ణంగా కనబడింది.

ఇందిర తండ్రి మొహంలోకి తీక్షణంగా చూసి, "నీకాభయం అక్కరలేదులే. మళ్ళీ ఎవళ్ళ జైల్లోకి వాళ్ళు తెల్లారేసరికి వెళ్ళిపోతారు మిగిలిపోయేది మనమిద్దరమే మనల్ని జైల్లో పెట్టే దమ్ములెవరికీ లేవు కనక నువ్వు నిర్భయంగా ఉండొచ్చు" అంది. ఆ కంఠంలో మామూలు వ్యంగ్యంకంటె ఎక్కువ ఎత్తిపొడుపు వినిపించింది ఆనందరావుకి.

"కంచాలు పెట్టేశాను, ఆ ప్రోగ్రాం కాస్తా పూర్తి చేసేద్దాం పోనీ!" అన్నాడు ఆనందరావు లేని చిరునవ్వు పెదవులమీద వెలిగిస్తూ

ఇందిర దిగ్గునలేచి మేడమీదకు వెళ్ళింది. రూము చీకటిగా వుంది స్విచ్చివేసి లైటు వేసింది మంచంమీద దుప్పటి ముసుగుదన్ని పడుకున్నాడు ప్రకాశం "భోజనానికి పదా ప్రకాశం!" అంది ఇందిర, ముసుగు ఊడదీసి ప్రకాశం లేచి కూర్చున్నాడు

"నాకు ఆకలి లేదు ఇందిరా! మీరంతా తినండి."

"ఏడిసినట్లుంది పగలల్లా రైలుప్రయాణం చేసినవాడివి ఆకలి లేకపోవడమేమిటి? వెర్రివేషాలెయ్యక పద! ఉన్న క్యారియరే నలుగురం సర్దుకుంటున్నాం" అంది

ప్రకాశం నెమ్మదిగా లేచి ఆమె దగ్గరగా నిలబడ్డాడు. చేతులు ఆమె బుజాలమీద వేసి "కొండంత ఆశతో అన్నింటికీ తెగించి వచ్చాను. సంతోషించడానికి బదులు కోపం తెచ్చుకున్నావు నాకెంత బాధగా వుంటుంది చెప్పు కోపం తగ్గిందను అంటేనేకాని భోజనానికి రాను" అన్నాడు ప్రాధేయపడుతూ

అతని చేతుల్ని నెమ్మదిగా విడిపించుకుని ఇందిర, "నాకు నీమీద కోపంలేదు ప్రకాశం! నిన్ను చూస్తూంటే జాలి వేస్తూంది, అంతే అవన్నీ తరువాత మాటాడుకుందాం గాని ముందు అన్నానికి పద" అంది

ప్రకాశానికి కొండంత బలం వచ్చింది. ఇంక కోపం పోయి ఎప్పటి ఇందిరే, తన ఇందిరే అయిపోయిందనిపించింది. "పద!" అన్నాడు ఇద్దరూ మెట్లు దిగుతూంటే, "ఆ అమ్మాయి ఎవరూ?" అన్నాడు

"వైదేహి అని–నా కొలీగ్ నీలాగే యింట్లోంచి పారిపోయి యీ రాత్రికిక్కడ తలదాచుకుంటోంది."

"ఏం?"

"మామూలు కారణాలే. ఇష్టంలేని పెళ్ళి సంబంధం ఆ అమ్మాయి నేమీ ప్రశ్నలు వెయ్యకు సుమా!" అంది.

"అబ్బే! నాకెందుకూ లేనిపోని గొడవా?" అన్నాడు ప్రకాశం

ఇద్దరూ కిందకు దిగాక "ఏం ప్రకాశం! అనుకోకుండా, వార్నింగివ్వకుండా వచ్చేసావే?" అన్నాడు ఆనందరావు.

"అవునండీ! బుద్ధిపుట్టిందీ, వచ్చేశాను. అంతా సజావుగానే సాగిపోతోందా?" అంటూ కుశలప్రశ్న వేశాడు ప్రకాశం

"ఆహా! అంతా దేవేంద్ర భోగంగా సాగిపోతోందనుకో భావన్నారాయణ షష్టిపూర్తి ఉత్సవం చేయిస్తానంటున్నాడు, ఆ సందర్భంలో ఓ అరవై వేలు వసూలు చేస్తానంటున్నాడు."

"మీరేమన్నారు?"

"ఆ– అప్పుడే నాకు షష్టిపూర్తేమిటోయ్, కుర్రాడినీ!"

"నిజమేలెండి."

ఇందిర ఎంచేతో ఆ సంభాషణలో కలగచేసుకోలేదు వైదేహికి ఆ వాతావరణమే కొత్తగా, వింతగా కనబడింది నలుగురూ కూర్చుని ఇంచుమించు మౌనంగానే అన్నాలు ముగించారు. ఆనందరావు రెండు మూడు ఛలోక్తులు విసిరి ఏవో కథలు చెప్పడానికి ప్రయత్నించాడుగాని, ఎవళ్ళూ వినిపించుకోలేదు భోజనాలయినాక కంచాలు తీయడానికి ప్రయత్నిస్తే "నీకెందుకాగొడవ వైదేహీ! అలాగే ఉంచెయ్. మాకదే అలవాటు. పొద్దున్న పనిమనిషి తీస్తుంది" అని వైదేహిని రెక్కపుచ్చుకు ముందు గదిలోకి లాక్కొచ్చేసింది ఇందిర

కాస్సేపందరూ పేపర్లూ, పత్రికలూ తిరగేశారు కొంతసేపయాక ఇందిరే నిశ్శబ్దాన్ని భంగం చేస్తూ, "వైదేహీ, నిద్దరొస్తూందా? పద, మనిద్దరం పోయి మేడమీద పడుకుందాం వీళ్ళు కింద పడుకుంటారు" అంది.

వైదేహికి నిద్రరావడంలేదు గాని, ఆమెతో కాసేపు ప్రత్యేకంగా మాటాడాలని, "పద పోదాం" అంది

"నాన్నా! నీ మంచం ప్రకాశానికిచ్చి పరుపు నువ్వేసుకో పెట్లోది చాకింటి దుప్పటి ఒకటి తీసి అతనికిస్తే పడుకుంటాడు ఎలాగో యిద్దరూ సర్దుకోండి" అంది ఇందిర.

ఆనందరావు ఏమనుకున్నాడో ఏమో, చివాలున లేచి, "అలాగే చేద్దాం, దానికేముందీ! కాని నేను కాస్సేపలా తిరిగివస్తాను యింకా తొమ్మిదికూడా కాలేదు. కొంచెం ఆలస్యమైనా కంగారుపడకు బుద్ధిపుడితే రెండో ఆట సినిమా చూసివస్తాను" అన్నాడు

"అదేం అలా బుద్ధి పుట్టిందివాళ? తొమ్మిదైతే నిద్రకాగలేనివాడివి, యివాళ షికారు కావలసి వచ్చిందా నీకు?" అందామె

"ఇవాళ నిద్రరావడం లేదు మరి. ఏం చెయ్యమంటావు?"

"సరేలే వెళ్ళు రెండో ఆటేం ఖర్మ మూడో ఆటకూడా చూసి, ఆ తరువాత భావన్నారాయణతో కబుర్లు చెప్పి, తెల్లారేక రా! ధనుర్మాసం గనక కాస్త పుణ్యం సంపాదించుకో. డబ్బులు కావలిస్తే నా బ్యాగ్‌లో ఉన్నాయి తీసుకో" అందామె వాళ్ళిద్దరి సంభాషణలోనూ ఉన్న ధ్వని వాళ్ళిద్దరికే అర్థమైందిగాని, ప్రకాశానికీ వైదేహికీ

అర్థం కాలేదు తండ్రీ కూతురూ అలా మాటాడుకోవడం ప్రకాశం యిదివరకు ఎన్నడూ వినలేదు

ఆనందరావు లాల్చీ వేసుకుని డబ్బులు తీసుకుని వెళ్ళిపోయాడు అతను వెళ్ళిపోయిన గుమ్మంవైపు పస్తాయించి అలా చూసి ఇందిర వైదేహివేపు తిరిగి "వైదేహీ! పోయి పడుకుందాం" అంది ఇద్దరూ మౌనంగా మేడ ఎక్కేశారు మంచం ఓ మూలకు నెట్టి కిందనే చాపలు వేసి యిద్దరికీ పక్కలు ఏర్పాటు చేసిందామె

పక్కమీద ఓరగా కూర్చుంటూ, "నీకు త్వరగా పడుకోవడమే అలవాటా ఇందిరా?" అంది వైదేహి.

"లేదు వైదేహీ ! నాకో పద్ధతంటూ లేదు ఒక్కొక్కరోజు తెల్లవార్లూ మేలుకుంటాను హాయిగా ఒక్కొక్కరోజు దీపాలవేళ భోంచేసి పడుకుని, మర్నాడు తొమ్మిదింటిదాకా లేవను."

వైదేహికి ఆశ్చర్యం వేసింది. "అదృష్టవంతురాలివి మా యింట్లో పొద్దున్నే లేచిపోవాలి, ఎంత రాత్రిదాకా మేలుకున్నాసరే లేకపోతే మా చిన్నన్నయ్యకి కోపం వస్తుంది. వాడు పడుకోడు, ఇంకోళ్ళను పడుకోనివ్వడు" అంది

"కొంతమంది అంతేలే. వాళ్ళు సుఖపడరు; ఎదుటివాళ్ళను సుఖపడనివ్వరు పోనీలే ఆ గొడవ దేనికిగాని–ఏమిటి నీ ప్రోగ్రాం? తెల్లారాక ఏం చెయ్యదలుచుకున్నావు?" అంది ఇందిర.

వైదేహికేం తోచలేదు 'తెల్లారాక ఏం చెయ్యడం? అసలు యింక తెల్లారకుండా, యీ రాత్రి యిలాగే నిలిచిపోతే ఎంత బాగుండును!' అనుకుంది తిరిగి ఆ కొంపకు వెళ్ళాలనిలేదు. వెళ్ళక ఏం చెయ్యడం? "నువ్వే ఏదైనా సలహా చెప్పు ఇందిరా! ప్రవాహంలో పడి కొట్టుకుపోతున్నాను" అంది

ఇందిరకు నవ్వొచ్చింది "నీ మొహం ప్రవాహం నీకేం వొచ్చిందిప్పుడు? పొద్దున్న మీ యింటికి నేనే వచ్చి దిగబెడతాను మరేం భయపడకు ఎవరూ తలకొట్టి మొలెయ్యరు. భయపడుతూంటే మరింత డబాయిస్తారు ఎదురు తిరిగితే నోరు మూసుకుంటారు పోనీగాని వైదేహీ! ఈ సంబంధం ఎందుకొద్దంటున్నావ్?"

"చెప్పానుగా, సంతలో పశువులబేరంగా ఇలా అందరికీ నన్ను చేసుకోమని బేరం పెట్టడం నా కసహ్యంగా ఉంది ఇందిరా!"

"నిజమేననుకో. అసహ్యంగానే ఉంటుంది కాని గత్యంతరం ఏమిటి? ఈ పశువు కాకపోతే మరో నందికేశుడు! ఎవడో ఒకడు అసలు ఈ కాలంలో జీవితమే పెద్ద పశువుల సంతలా తయారైంది అమాయకంగా సుమతీశతకం నీతులన్నీ నిజమేనని నమ్మి ఆచరణలో పెడితే అందరూ తలో చెయ్యీ వేసి మనల్ని వెనక్కు నెట్టేస్తారు మన తరం వాళ్ళవి కొత్తరకం సమస్యలు వీటిని తీర్చే నాధుడటుంచి అర్థం చేసుకొనేవాడు కూడా లేడు అంచేత ఎలాగో ఒకలాగ తీర్థంలో జనాన్ని మోచేతులతో నెట్టుకుంటూ ముందుకెళ్ళడమే ఇంతకూ అసలు సంగతి చెప్పావుకావు ఎవడైనా స్వప్నసుందరుడు ఉన్నాడా ఏమిటి కొంపతీసి?"

వైదేహి చిరునవ్వుతూ, "అబ్బే, అలాంటిదేం లేదు ఇందిరా! అంత అదృష్టమా?" అంది.

"అబద్ధం! నా దగ్గిర ఏదో దాస్తున్నావు" అంది ఇందిర,

"నిజం నువ్వు నమ్మకపోతే ఏం చెయ్యను? నాకలాంటి ఆశలూ లేవు, ఉన్నా అవి జరగనూ జరగవు"

ఇందిర నవ్వుతూ, "ఆఁ అలా రా దారికి. ఎందుకు జరగవు? ఎవరేమిటి అవతల మనిషి?" అంది.

"ఎవరైతేనేం, అతనికి ఇదివరకే ఎప్పుడో పెళ్ళయిపోయింది అంచేత అవన్నీ మరచిపోయాను పూర్తిగా. ఇప్పుడు నేను సుమారయిన ఏ మొగాడితోనైనా సుఖపడగలను. కాని మా వాళ్ళు తీసుకొచ్చే బృహస్పతులందరూ చెల్లని కానీల్లాంటివాళ్ళు మా అన్నయ్యల మనస్తత్వంతో వెతికితే అలాంటివాళ్ళే దొరుకుతారు మరి అందుకే నాకు బాధ."

అంతా విని ఇందిర, "అంతా బాగానేవుంది గాని, హాయిగా నిద్రపో ఇంకెప్పుడూ ఇంట్లోంచి పారిపోకు. మీవాళ్ళకు నేను బుద్ధి చెప్తాలే నే నొకసారి కిందకు వెళ్ళిరానా?" అంది.

"వెళ్ళిరా, నిద్రపోతాను అవునుగాని-ఏమీ అనుకోవుగదా?-ఎవరాయన? మీ చుట్టాలా?" అంది వైదేహి. అంత సొంతబాధలోనూ ఆ కుర్రాడెవరో తెలుసుకోవాలని యిందాకటినుండీ మధనపడుతోంది.

"చుట్టాలూ కాదు సిగరెట్లూ కాదు ప్రకాశం అనీ, యీ తాజ్‌మహల్‌లో మా కో-టెనెంట్. నువ్విప్పుడు పడుకున్న గది ఆయనదే మెడిసిన్ చదువుతున్నాడు నీకింకా వివరంగా చెప్పాలంటే మేమిద్దరం మాజీ ప్రేమికులం. రేపో మాపో అతను రాజమండ్రిలో వేరే పిల్లను పెళ్ళి చేసుకోబోతున్నాడు ఆ దుఃఖంతో వున్నాడు గనక కొంచెం ఓదార్చి వస్తాను" అందామె

వైదేహి షాక్ తిన్నట్లయింది ఇందిర ధోరణంటే ఆమెకెప్పుడూ ఆశ్చర్యమే "నీకెప్పుడూ వేళాకోళమే. నేను మరో ఉద్దేశంతో అడగలేదు ఇందిరా! ఊరికే-" మధ్యలో ఇందిర అడ్డొచ్చి, "నువ్వు ఎలా అడిగినా నేను సీరియస్‌గానే చెప్పానుగాని వేళాకోళంగా కాదు" అంది.

"ఈ మొగాళ్ళంతా ఇంతేకాబోలు!" అంది వైదేహి

"మొగేమిటి ఆడేమిటి నా తలకాయ. మనుష్యులే అంత. లేకపోతే బతకడం కష్టం. నేను వెళ్ళిరానా మరి? హాయిగా పడుకో తరవాత వస్తాను" అనేసి మెట్లుదిగి తుర్రున పారిపోయింది.

ప్రకాశం వాలుకుర్చీలో కూర్చుని సమాధిలోకి వెళ్ళిపోయాడు ఇందిర అతని భుజంమీద చెయ్యివేసి "హల్లో ప్రకాశం! ఏమిటాలోచిస్తున్నావ్? కొత్త పెళ్ళికూతురు గురించి కలలు గంటున్నావా? ఆ అమ్మాయిని కాస్త వర్ణించుదూ! ఊహించుకోలేక ఛస్తున్నానూ! యింతకూ ఎన్నేళ్ళు ఆ అమ్మాయికి? పన్నెండా, పదమూడా?" అంటూ పక్కకుర్చీలో చతికిలపడింది.

ప్రకాశానికి ఏడుపొచ్చినంత పనైంది ఆమెను దగ్గిరగా తీసుకోబోయాడు ఆమె అడ్డుపెట్టలేదుగాని నిర్లిప్తంగా, "లాభంలేదు ప్రకాశం! మనం ఒకళ్ళ నొకళ్ళం దగా చేసుకుని ప్రయోజనం లేదు" అంది

"ఎందుకు ఇందిరా, అలా అంటావు? నీకోసం అన్నీ వదులుకుని వస్తే–యిదా నువ్వనేమాట? జరిగినదంతా మరచిపోయావా?" అంటూ ఆమెను మరింత దగ్గరగా తీసుకున్నాడు. ఆమె చివాలున లేచి అతని కెదురుగా కుర్చీలాగి కూర్చుంది

"ఇలా చూడు ప్రకాశం! తెల్లారకట్ల పాసింజరెక్కి నువ్వు మళ్ళీ రాజమండ్రి వెళ్ళిపో, అన్నట్లు టికెట్‌కు డబ్బుల్లేవు కాబోలు సారీ ప్రకాశం! నెలాఖరు, నా దగ్గిరా ఏంలేవు. మధ్యాహ్నమే 10 రూపాయలు బాస్ దగ్గిర అప్పుచేశాను. అందులో కొంత సినీమాకని నాన్న కొట్టేశాడు, మిగిలింది కావలిస్తే తీసుకో. అదీ చాలకపోతే పొద్దున్నే వెళ్ళి ఏ కృష్ణమూర్తి జేబులో తడిమి 10 గంటల మెయిలెక్కెయ్!" అంది

ఆ మాటలు ప్రకాశాన్ని ఎక్కడో గుచ్చాయి "థ్యాంక్స్ ఇందిరా! నీ ఔదార్యానికి చాలా సంతోషం రైలు టికెట్‌కు నీ సహాయం అక్కరలేదు" అన్నాడు.

"అయితే మరీ మంచిది, డబ్బులు మిగులు"

ప్రకాశానికి కోపం, ఉక్రోషం, కసి... యివన్నీ కలిపిన ఒకానొక ఉద్వేగం అవహించి, కొంచెం హెచ్చించిన కంఠంతో "ఎంతగా మారిపోయావు ఇందిరా నువ్వు! జరిగినదంతా నీకో వేడుకగా, తమాషాగా అనిపిస్తోంది కాబోలు! సర్వస్వమూ నీ కోసం ఒదులుకున్నాను నిన్ను నమ్ముకుని కల్యాణిని అన్యాయంగా దూరం చేశాను. వీటన్నిటి ఫలితమా యిది? ఆఖరికి నన్ను అన్నింటికీ చెడినవాడుగా చేస్తావా? ఇంతకూ నేను చేసిన ఘోరమైన అపచారం ఏమిటి?" అన్నాడు

ఆ వాక్ప్రవాహానికి ఆమె కిలకిలా నవ్వింది మళ్ళీ అంతలోనే ఆమె మొహంలో విషాదచ్ఛాయ ఆవరించింది కొంచెం జీరపోయిన గొంతుకతో మొదలుపెట్టింది. "ఇలా చూడు ప్రకాశం! అనవసరంగా ఉద్రేకం తెచ్చుకోకు నాటకంలో పాత్రలలాగ మనం ఎంత మాటాడినా యిక లాభం లేదు–"

"నా మాటలు నీకు అలా వినిపిస్తున్నాయా?"

"అవును, అచ్చంగా చింతామణిలో భవానీశంకరుడిలా మాటాడుతున్నావు. నా కోసం ఏదో చేశానంటావేమిటి? ఈ ప్రపంచంలో ఒకరి కోసం ఒకరు ఏదీ చెయ్యరు ఎవళ్ళకోసం వాళ్ళే చేసుకుంటారు కొందరికది చాతనవుతుంది, కొందరికి అదీ రాదు అంతే తేడా. నువ్వు రెండో రకంలోకి వస్తావు. ఇదుగో, ఇలా అడ్డురాకు. ముందు నేను చెప్పేదేదో సాంతం విను నువ్వేదో ఘోరమైన అపచారం చేశావనలేదు నేను. అంత శక్తి నీకు లేదు. ఔను, మొదట్లో నీ మీద చాలా మమకారం పెంచుకున్నాను ఎన్నో ఆశలు పెట్టుకున్నాను మొన్న మొన్నటిదాకా నువ్వో వెన్నెముకలేని మనిషివని మొదటినుండీ తెలుసు. ఐనా, తోమగా తోమగా కొంత గట్టిపడతా వనుకున్నాను కొన్ని అనుభవాలు కలిగిన తర్వాతనైనా ఒక మనిషిలా ప్రవర్తిస్తావనుకున్నాను, అవీ యిచ్చాను. ఏం లాభం? నువ్వసలు పుట్టుకతోనే సగం మనిషివి మొదటినుండీ బీటలు వేసిన వ్యక్తిత్వమే నీది. ప్రయత్నించానుగాని బాగుచెయ్యడం నా తరం కాలేదు" అంటూ మధ్యలో ఆగింది.

"అంటే ఏమిటి ఇందిరా? నీ మాటలు నా కయోమయంగా ఉన్నాయి" అన్నాడు ప్రకాశం.

"అంటే మరేం లేదు ప్రకాశం! నిన్ను నమ్ముకున్న ఆడది నట్టేట్లో నడమంత్రంగా మునిగిపోతుంది. ఆరంభంలోనే హంసపాదన్నట్లు మొదట్లోనే మొదటి పరీక్షలోనే తల వంచేసి లొంగిపోయినవాడివి ముందు ముందు నన్నెలా ఆదుకుంటావు?. "

".. లొంగిపోయానా? అయితే అన్నీ వదులుకుని వచ్చింది దేనికిప్పుడు?"

"ఆహా వచ్చావు. రాకేం? జైలు తలుపులు తెరిచి ఉన్నాయేమో, తాత్కాలికమైన కోరికతో వచ్చేశావు. మళ్ళీ మావయ్యొచ్చి జైల్లో పెట్టేస్తే వెళ్ళిపోతావు ఏదో ఒక నిశ్చయాని కొచ్చి, ఆ నిశ్చయాన్ని అమలులో పెట్టే ధైర్యం ఉండాలిగాని, ఎవరెటు లాగితే అటు జోగిపోతే ఏం లాభం చెప్పు? మీ మావయ్యతో యుద్ధం చేసి నిన్ను గెలుచుకోనా? ఒకవేళ నేను గెలిచినా, జీవితాంతం నిన్ను కాపాడుతూనే వుండాలి, రక్షించుకుంటూనే ఉండాలి దీనికి అంతం ఎక్కడ? బతికున్నన్నాళ్ళు నీకు గార్డియన్‌గా నేనెలా చచ్చేది? ఏమిటో ప్రకాశం! ఎంత పోట్లాడినా జీవితం నాకింతకంటే ఎక్కువిచ్చేటట్లు కనిపించడం లేదు నా విషయంలో ప్రతిదీ తలక్రిందులుగానే నడుస్తోంది సాధారణంగా పిల్లలకి తండ్రులు గార్డియన్‌గా ఉంటారు ఇది లోకం తీరు. నా దగ్గరికి వచ్చేసరికి తలక్రిందులై నేనే నాన్నకి గార్డియన్ కావలసి వచ్చింది. ఆ బరువుతోనే చస్తున్నాను ఆడదాని మనస్సు నీకు తెలీదు ప్రకాశం! బతుకులో నాకు కావలసినదొకటి. దొరుకుతున్న దింకొకటీ అంచేత కసికొద్దీ లోకాన్ని ధిక్కరిస్తున్నాను. నాకూ ఓ యిల్లూ, సంసారం, నాదీ అనిపించుకునే భర్తా పిల్లలూ.. అవేవీ అక్కర్లేదనుకోకు, కాని. లాటరీలో నాకు వచ్చినవి ఫైళ్ళూ, ఆఫీసూ, నామీద ఒరిగిపోయి బతికేసే నాన్న ఇల్లు చూస్తే యిది ఓ బోర్డింగ్ అండ్ లాడ్జింగ్‌హౌస్. అంతేకాని యిల్లుకాదు ఎప్పటికైనా దొరికితే నాకు అన్ని విధాలా బలవంతుడైన ఓ మొగాడు, "నే నున్నానులే, నీకేం భయంలేదు నీ సమస్యలూ బరువులూ అన్నీ నామీద పడేయ్." అనగలిగే పెద్ద ఛాతీ మొగాడు. అవసరమైతే నాకోసం సమస్తమూ ఒదులుకోగిలిగే మొగాడు. వెనకటికి ఎవడో అన్నట్లు ప్రేమకోరిన త్యాగం చెయ్యలేనివాళ్ళు ప్రేమకి అనర్హులు. అలాంటి మొగాడు దొరుకుతాడా పోయి లేదూ, అంతకన్న పోయి. పైపై తళుకులకు ఆశించి చిన్నచిన్న సుఖాలు అందించే మొగాళ్ళు నా చుట్టూరా కోకొల్లలు నాకు కావలసిన మొగాడివి నువ్వు ఎలాగూ కావు. కాలేవు కూడా. తీరి కూర్చుని యింకో బరువు నెత్తికెత్తుకోవడం దేనికి? వున్న బరువు చాలు – ఏమో, నువ్వు మావయ్యను ధిక్కరించి, మీ అమ్మను ధైర్యంగా తీసుకొచ్చేస్తే ఏమయుండేదో అప్పుడు 'నా ప్రకాశం' అని సంతోషంగా నీ పాదాల దగ్గర వాలిపోయి వుండేదాన్ని. కాని.. మెతుకు పట్టిచూస్తే తెలిసిపోయింది ఇంక లాభంలేదు ప్రకాశం! అంతా టూ లేట్, నీకూ నాకూ గుడ్‌బై కావలిస్తే నీ గదిలో నువ్వుండొచ్చు– ఆ గది నీది కాబట్టి లేదా రాజమండ్రి వెళ్ళి, హాయిగా పదమూడేళ్ళ పడుచును పెళ్ళిచేసుకొని, తిరిగివచ్చి వేరింటికాపురం పెట్టుకోవచ్చు అంతా నీ యిష్టం..." అని కాస్సేపు ఆగి ప్రకాశం మొహంలోకి చూసి, "అంతే, ఇంక నే చెప్పవలసింది ఏం లేదు, పోయి పడుకుంటాను" అనేసి దిగ్గున లేచి వెళ్ళిపోయింది.

ప్రకాశం వాలుకుర్చీలో అలాగే కొయ్యబారిపోయాడు. తల దిమ్మెక్కిపోయింది మెదడులో ఏదో వెయ్యి తేళ్ళు కుట్టిన బాధ. నరనరాలూ నీరసంతో మూలిగాయి. అతని శరీరంలో అప్పుడావరించిన వేదన ఏ రకానిదో అతను చదువుకున్న వైద్యశాస్త్రంలో ఎక్కడా లేదు ఏం జరిగింది తనకు?

ప్రకాశం రకరకాలుగా పేకమేడలు కట్టుకున్నాడు. క్షణంలో అవన్నీ కూలిపోయాయి మేనమామ తనను తీసుకువెళ్ళినప్పుడు యింక జీవితంలో తాను ఏ ఆశలు పెట్టుకోకూడదని నిస్పృహ చెందాడు. పెద్ద పులివంటి మేనమామ పంజాలోంచి విడిపించుకునే శక్తి తనకు లేదనుకున్నాడు. అత నెలా ఈడ్చుకెడితే అలాగే వెళ్ళాడు కాని ఆ నిస్పృహలోంచి, తనచుట్టూ ఆవరించిన ముళ్ళకంచెల ప్రహరీలలోంచి ఒక సన్నని మార్గం . ఒక చిన్న వెలుగు. కనిపించిందతనికి పారిపోయాడు తన సాహసానికి ఇందిర హర్షిస్తుందనుకున్నాడు "నే నున్నాను, నీకేం భయం" అని అభయమిస్తుందనుకున్నాడు అలా జరగలేదు ఆమె తన పిరికితనాన్ని అసహ్యించుకుంది తన అవివేకంవల్ల దేన్నయితే ఇన్నాళ్ళూ విడివడని బంధం అనుకున్నాడో దాన్నే త్రుటిలో తెంచేసింది

అతని గుండెల్లో రకరకాల స్వప్నాల రైలుబళ్ళు పట్టాలు తప్పి పడిపోయాయి కోరికల ట్రంకుపెట్టెలన్నీ విరిగిపోయి చెల్లాచెదరైపోయాయి ఒక్క ఆడదాని తిరస్కారం ఇంత బాధ కలిగిస్తుందా? హఠాత్తుగా అతనికి కల్యాణి స్ఫురణకొచ్చింది తను కల్యాణిని ఏం చేశాడు? ఇంతకన్న ఘోరంగా తిరస్కరించాడు ఆ పాపానికి తానిపుడు శిక్ష అనుభవిస్తున్నాడా? తలచుకుంటేనే భయంగా వుంది అతని వేదనంతా ఆమెమీద ద్వేషంగా ఘనీభవించింది ఛీ! ఎంత ధూర్తురాలు! ఎంత మోసకత్తె! నీతి నియమాలులేని పిల్ల అంతకంటె ఏం చేస్తుంది? తనకే వివేకం లేకపోయింది వ్యామోహంలోపడి కొట్టుకుపోయాడు ఆమెతో గడిపిన అనేక మధుర ఘట్టా లతని మనస్సులో గిరగిరా తిరిగాయి మళ్ళీ శరీరంలో అణువణువూ కోరికతో మూలిగింది తనను స్వర్గలోకపు అంచులలో విహరింపచేసిన మొదటి యువతి ఇందిర ఆమె తిరస్కరిస్తే తను బతకడం ఎలాగ? మళ్ళీ గుండెల్లో బల్లెంలా దూసుకుపోయిన ఇంకో ఆలోచన అవలీలగా అన్నీ అతిక్రమించగల ఆమె ప్రవర్తనకు సరిహద్దు లెక్కడ? అటువంటి ఇందిరను తనదిగా చేసుకుని జీవితంలో ఏ విశ్వాసంతో బతగ్గలడు?

వైతరణీ నదిలో కొట్టుకుపోతున్న అతనికి ఆ ఆలోచనతో ఓ పట్టు గొమ్మ దొరికింది. అదీ సంగతి తనకు జరిగింది మేలేకాని కీడుగాదు. దైవికంగా ప్రమాదంనుండి బయటపడ్డాడు ఆమె వ్యామోహంలో పడి ఆ సీతాకోకచిలుకనే తనదిగా చేసుకుంటే తను సర్వనాశనమయేవాడు ఇందిరా, కల్యాణీ..ఎవరు వీళ్ళంతా? వాళ్ళకు పనికివచ్చే మగాడికి ఉచ్చులు పన్నేరకం కని పెంచిన అమ్మ, తనకోసం సర్వమూ త్యాగం చేసిన అమ్మ కొన్ని లోపాలు వున్నా మొత్తంమీద తనను కాపాడి ఆదుకున్న మేనమామ ఎప్పటికైనా వాళ్ళే తనవాళ్ళు కాని, యీ వన్నెల విసనకర్ర తన కష్టసుఖాల్లో భాగం పంచుకుంటుందా? కలలో మాట తనను పీల్చి పిప్పి చేస్తుంది, అంతే. రాజమండ్రి పిల్లను చేసేసుకోవడమే మంచిది హాయిగా పచ్చని కాపురం, అత్తా, మామా, మరదళ్ళూ, ఆదరణా ఎప్పటికైనా

సంప్రదాయంలో యిమిడి జీవించడంలోనే సుఖముందిగాని.. నా అన్నవాళ్ళందరినీ దూరం చేసుకోవడంలో అర్థంలేదు. ఆ పిల్లను తాను చూశాడు. అమాయకురాలు. తనకు కావలసినట్లు తీర్చిదిద్దుకోవచ్చు అలాంటి జీవితమే సుఖం

సంక్షోభితమైన అతని హృదయానికి ఆ ఆలోచనతో ప్రశాంతత వచ్చింది. అతడిప్పుడు నిర్మోహంలోని పరితృప్తి అనుభవించాడు ఆమె తిరస్కారంలో అతనికి మేలే కనిపించింది. అదే మంచిది పీడ వదలిపోయింది. జ్వరం తగ్గిపోయినట్లు హాయిగా ఉంది శరీరం మనసు అంతకంటే తేలిగ్గా ఉంది ఎప్పుడు తెల్లారుతుందా అని చూశాడు. తెల్లారకట్ల లేచి కృష్ణమూర్తి దగ్గరికెళ్ళి ఓ పది రూపాయిలు తీసుకుని వెంటనే రాజమండ్రి రైలెక్కాలనుకున్నాడు.

ఆ తరువాత ప్రకాశానికి హాయిగా నిద్ర పట్టేసింది

## 15

ఉదయం తొమ్మిది గంటలవేళ క్లినిక్‌లో కూర్చుని డా చక్రవర్తి ఏవో డబ్బు లెక్కలు చూసుకుంటున్నాడు ఆ రోజు ఒకటో తారీఖు జనవరి నెల నెలాఖరే కాక సంవత్సరాంతం కూడా. యింకొక క్యాలెండరు సంవత్సరం గడిచిపోయింది! కొందరికి ఆ రోజు సెలవురోజనుకున్నాడు చక్రవర్తి. మరికొందరికి పండుగరోజు ఆనందమయంగా గడచిన జనవరి ఒకట్లు ఒకనాడు తనకూ ఉండేవి మద్రాసులో బి.ఏ.చదువుకునే రోజుల్లో, తరువాత వైజాగ్‌లో మెడిసిన్ చదివేరోజుల్లో కాలం ఎంత హాయిగా గడిచిపోయేది! అపుడు జనవరి ఒకటి వేడుకతో వినోదాలతో ఎంత ఉల్లాసంగా గడిపేవాడో ఒక్కసారిగా జ్ఞాపకం వచ్చిందతనికి వాటి గురించి ఆలోచించడం యిష్టంలేక వెంటనే మనస్సు అదిమిపట్టి, చూస్తున్న లెక్కలవైపు కేంద్రీకరించాడు. జీవితంలో ఏ ఒక శోభా, మాధుర్యం శాశ్వతంగా అలా నిలిచిపోదు అని తనకు తానే సమాధానం చెప్పుకున్నాడు అన్నింటికీ అంతముంటుంది సౌఖ్యానుభూతి ఇంద్రధనుస్సు వంటిది ప్రకాశించినంతసేపు జీవితాకాశం దివ్యప్రభలతో వెలిగిపోతుంది తర్వాత అంతా మామూలే. మాయమైన ఇంద్రధనుస్సులను తల్చుకుంటూ బెంగపడి లాభంలేదు. వర్తమానం ముఖ్యం అందులో డబ్బుసమస్య మరీ ముఖ్యం. అత నలాగ జమాఖర్చులు లెక్క చూసుకుంటుంటే ఇంతలో కొందరు పేషంట్లు వచ్చారు. వాళ్ళందరినీ చూసి పంపించేసరికి పదిన్నర దాటింది ఇంక ఊళ్ళో విజిట్సుకి వెళ్ళాలని తయారవుతూంటే హాల్లోకి వసుంధర రావడం గమనించాడు కోటు తొడుక్కుంటూ హాల్లోకి వెళ్ళి "ఏమండీ, న్యూయియర్ గ్రీటింగ్సు తీసుకోడానికి వచ్చారా? సెలవురోజు హాయిగా తిరుగుతున్నారు!"

"భలేవారండీ! గ్రీటింగ్సు తీసుకోడానికి గాదు, ఇవ్వడానికే వచ్చాను" అంది వసుంధర

"అయితే ఉండండి, కోటు పూర్తిగా తొడుక్కోనివ్వండి, అందుకుంటాను" అంటూ కుర్చీలో మళ్ళీ చతికిలపడ్డాడు.

వసుంధర అస్థిమితంగా కుర్చీలో కూర్చుని "కూచుందుకు రాలేదండీ! చాలా చోట్లకి వెళ్ళాలి. మీతో ఆ విషయం చెప్పడానికి వచ్చాను. కల్యాణి ఒప్పుకోలేదు" అంది. డాక్టరు నిర్లిప్తంగా "ఏం? కారణం?" అన్నాడు.

"ఏమున్నాయి? మామూలు కారణాలే అవిడ మనతో చెపుతూ వస్తున్నవే సరేలెండి. మనం చెప్పవలసిందేదో చెప్పేము. ఆపైన అవిడ యిష్టం. ఏ సంగతీ ఇవాళ చెప్పమన్నారు కృష్ణమూర్తిగారు. ఆయన మీకు కనబడితే-"

"మధ్యాహ్నం వస్తానన్నాడు నే చెపుతాలెండి" అన్నాడు డాక్టరు.

వసుంధర లేచి నిలబడి "నేను వెళ్ళిరానాండి మరి?" అంది

"ఎక్కడిదాకా వెడుతున్నారు?"

"లేడీస్ హాస్టల్ దాకా."

"పదండి మిమ్మల్నక్కడ డ్రాప్ చేసి వెడతాను నాకూ ఊళ్ళో విజిట్సు ఉన్నాయి" అంటూ బయటకు నడిచాడు చక్రవర్తి 'థాంక్సు' అని వసుంధర అతనిననుసరించింది. దారిలో వాళ్ళు అట్టే మాటాడుకోలేదు ఇద్దరి మనస్సుల్లోనూ అప్పుడు మెదులుతున్నవి కల్యాణిని గురించిన భావాలే కాని అవి ఒకరితో ఒకరు చెప్పుకోగలిగేవి కావు అందుచేత కొత్త సంవత్సరం, సినిమాలు, చదువులూ, పరీక్షలూ అలాంటివేవో తప్ప కల్యాణి విషయం సంభాషణలోకి రాకుండా జాగ్రత్త పడ్డారు లేడీస్ హాస్టలుముందు కారు ఆపి తలుపు తీశాడు చక్రవర్తి వసుంధర దిగిపోతూ "థాంక్సు! మీ దయవల్ల రిక్షాబాధ తప్పింది. మళ్ళీ ఎప్పుడు కన్పిస్తారు?" అంది చక్రవర్తి నవ్వేసి, "ఎప్పుడంటే అప్పుడే! వస్తే సాయంకాలం అలా వస్తాను-ఇంట్లోనే వుంటారా?" అన్నాడు

"ఓ, ఎక్కడికీ వెళ్ళం తప్పకుండా రండి" అనేసి వసుంధర హాస్టల్లోకి సాగిపోయింది

హాస్టలునుండి మళ్ళించి బీచిరోడ్డులో కారు మెల్లగా నడుపుకుంటూ ఆలోచనలో పడ్డాడు డాక్టరు చక్రవర్తి- అయితే కల్యాణి ఒప్పుకోలేదన్నమాట అనుకున్నాడు నిజమే ఒప్పుకుంటుందని తను మొదట్లోనూ అనుకోలేదు. కృష్ణమూర్తి సూచనమీద ఆమెకు తను నచ్చచెప్పడానికి ప్రయత్నించాడు, తనలో తనకే నమ్మకం లేకుండా కృష్ణమూర్తి వెర్రివాడు. అతనికొక ఊహ తోచింది ఇక సూచించడమే తరువాయి కల్యాణి గంతువేసి ఒప్పుకుంటుందనుకున్నాడు తీరా ఆ సూచన విన్నాక కల్యాణి అతనాశించినదానికి పూర్తిగా వ్యతిరేకంగా ప్రవర్తించింది. కృష్ణమూర్తి అహం దెబ్బతింది. తన నర్థం చేసుకోదేమిటి ఆ అమ్మాయి? తనేమీ అఘాయిత్యం తలపెట్టలేదే-అన్నీ కాదని ఏం చేస్తుంది ఎలా బ్రతుకుతుందసలు? అదీ అతని వాదన. అంతకుమించి ఆలోచించడు ఒప్పించమని తనను వేధించుకుతిన్నాడు అవన్నీ తల్చుకుంటూంటే డాక్టరుకి నవ్వొచ్చింది ఇదో వింత ప్రపంచం. కావాలని బాధపడేవాళ్ళకేవీ దొరకవు. దొరికే అవకాశమున్నా కొందరు తీసుకోరు. మొదటిది ఎంత విచారకరమో రెండోదీ అంతే-ఈ ఆలోచనలతోనే డాక్టరు రౌండ్సు ముగించి మధ్యాహ్నం ఒంటిగంట కిల్లుచేరి రెండు మెతుకులు తిని నడుం వాల్చాడు

డాక్టరు చక్రవర్తికీ కృష్ణమూర్తికీ ఉన్న స్నేహం విచిత్రమైనది. అది మామూలు హేతువాదం సహాయంతో అర్థం చేసుకోడానికి ప్రయత్నిస్తే అంత అసంభవం మరొకటి

ఉండదనిపిస్తుంది. వాళ్లు క్లాసుమేట్సు కారు. కాలేజీ మేట్సు అంతకంటే కాదు. ఇద్దరిదీ ఒక ఊరు కాదు. అభిరుచులలో ఒకరు దక్షిణధృవం, యింకొకరు ఉత్తరధ్రువం కృష్ణమూర్తి చేసే ఏ ఒక్కపనినీ డాక్టరు హర్షించలేదు కాని అతనంటే ఎందుకో ఒకరకమైన అభిమానం. అతనికి డాక్టరన్నా అంతే. ఒకరి అభిప్రాయాలింకొకరికి కిట్టవు అయినా ఒకళ్ళకొకళ్ళు అవసరం వచ్చినపుడు తోడునీడగా ఉంటారు.

డాక్టరు చక్రవర్తి మొదటిసారి వసుంధర యింటికి వెళ్ళింది పేషెంటు రామినాయుడుని చూడడంకోసం అక్కడతనికి కల్యాణి కనబడింది ఎందుకో అతనికి కల్యాణిని చూడగానే ఆశ్చర్యంతో కూడిన ఒక అనురాగం ఏర్పడింది కొత్త అనిపించలేదు సరికదా చాలా దగ్గిర స్నేహితురాలివలె కనబడింది–ఎందుకు అనే ప్రశ్నకు జవాబతనికే తెలియదు వృత్తిధర్మంలో రోజూ రకరకాల మనుష్యులను చూస్తాడు, అల్పులు–నీచులు–ఉదారులు–ఉన్నతులు, కాస్తబాధకి ఏడ్చేసేవాళ్ళు–కొండంత బాధను కూడా మింగేసి ఏమీ లేనట్లు ఉండేవాళ్ళు–మానవ మనస్తత్వాలలోని వైవిధ్యం అతనికలవాటే డాక్టరుగా ఎందరో రోగార్తుల మంచం పక్కన నిల్చున్నాడు రామినాయుడు వలె అందులో కొందరు కన్నుమూశారు శరీరయాతన, బాధ, దుఃఖం–ఇవన్నీ పరిపాటే కనక అతనికి చాలా విషయాల్లో విశ్వాసం పోయింది కాని రోగుల పక్కన నిలబడి సేవచేసే ఆడవాళ్ళలో అతనికిద్దరే యిద్దరు విలక్షణమైనవాళ్ళు కన్పడ్డారు. మూడేళ్ళక్రితం తను సర్వీసులో ఉన్నప్పుడు ఒక జడ్జీగారు రెండుమాసాలు మంచాన పడి తీసుకున్నాడు. ఆ రెండుమాసాలూ జడ్జీగారి భార్య ప్రవర్తనలో చూపిన గాంభీర్యం, సంస్కారం జన్మలో అతను మరచిపోలేడు అతని స్మృతిపథంలో ఆ యిల్లాలు శాశ్వతంగా అతుక్కుపోయింది ఆమె ప్రత్యేకత ఊరికే సేవ చేయడం కాదు. ఆ పని చాలామంది చేయగలరు కష్టసమయాల్లో ధైర్యంగా ఉండడం కాదు చాలామంది మొండివాళ్ళకది పరిపాటే సేవలో ఒక లాలిత్యం, రానున్న అపద పట్ల నిబ్బరం, తాను చెయ్యవలసింది చేస్తూ ఫలితం ఏదైనా స్వీకరించగలననే ఒక హామీ– ఇవన్నీ కలిసిన ఒకానొక అనిర్వచనీయమైన ప్రవర్తన అనాడు ఆ జడ్జీగారి ఇల్లాలులో చూశాడు–మొన్న మళ్ళీ కల్యాణిలో చూశాడు. అందుకే అతనికి కల్యాణి గురించి ఇంకా తెలుసుకోవాలనే తహతహ ఎక్కువయింది చూచాయగా కృష్ణమూర్తి కొంత చెప్పాడు మొదట్లో

రామినాయుడు పోయినతరువాత కల్యాణినీ వసుంధరనీ సినిమాకు తీసుకెళ్ళడం ఆమెనొక రకంగా పరీక్షిద్దామనే చేశాడు తను. అమితమైన దుఃఖం కన్నీళ్ళకతీతమైనది ఆ స్థాయిలో కొందరు దుఃఖాన్నమితంగా ద్వేషిస్తారు అందులోంచి తప్పించుకోడానికి శాయశక్తులా కృషిచేస్తారు–"నీ దుఃఖాన్ని నువ్వే దాచుకొని, నీ ఆనందాన్ని నల్గురికీ పంచి పెట్టాలి" అనే చైనా సూక్తి అతనికెంతో యిష్టం కల్యాణిని చూస్తే అతనికెందుకో ఆమె దుఃఖం కోసం దుఃఖాన్ని ప్రేమిస్తున్నదా అనిపించింది తీరా సినిమాకి సిద్ధపడేసరికి అభిప్రాయం మార్చుకున్నాడు ఆ అమ్మాయిలో ఒక గట్టితనం ఉన్నదిగాని దానిని ఎలా సద్వినియోగం చేసుకోవాలో ఆమెకింకా తెలియడంలేదు తను దేనికోసం బతకాలో చూచాయగానైనా ఆమెకు తెలిస్తే ఎలా బతకాలో నిర్ణయించుకునే వివేకం ఆమెలో ఉందిగాని అడుగడుగునా అవరోధాలు రావడంతో

అన్నిటిమీదా ఆమెకు విశ్వాసం పోయింది అందుకే కృష్ణమూర్తి అయాచితంగా సహాయం చెయ్యబోతే నిరాకరిస్తోంది. కాని-ఆమెకు ఒక్కటి తెలియడం లేదు-ఏదో ఒక విశ్వాసం, ఒక నమ్మకం లేనిదే మనిషి బతకలేడు దేనిమీద నమ్మకం పెట్టుకున్నా చివరికది చెదరిపోవచ్చు, దానివల్లే గాయపడవచ్చు ఐనా గత్యంతరంలేదు-మరేదో నమ్మకాన్ని వెతుక్కొని దాని ఆసరాతో బతకవలసిందే మనిషి జీవించడానికి మరో పద్ధతి లేదు

డాక్టర్ చక్రవర్తికి ఆ సత్యం అనుభవపూర్వకంగా తెలిసి చాలా కాలమైంది మొదటినుండీ కుటుంబానికీ దూరంగా ఉంటూనే పెరిగాడు పరిస్థితులవల్ల డబ్బుకి ఆశపడి తల్లిదండ్రులు అతన్ని చిన్నప్పుడే పెంపకానికి ఇచ్చారు. ఆ పెంచుకున్న ఆవిడ తన జ్ఞాతివర్గంలో ఓ వితంతువు ఆవిడది జలగప్రేమ ఎక్కడికీ కదలనివ్వకుండా కరిచిపట్టుకు కూర్చుంటేనే అభిమానమని ఆవిడ నమ్మకం స్కూల్ ఫైనల్ ప్యాసయ్యాక ఇంక పై చదువులకి పోనక్కరలేదని అడ్డుపడింది ఉన్న ఊళ్ళోనే చిన్న స్కూలు మేష్టరీ చేస్తూ కడుపులో చల్ల కదలకుండా కూర్చోవాలని ఆవిడ పట్టుదల తను మొరాయించి హోరాహోరీ పోట్లాడాడు. పెంపుడు కొడుకుతో ఆవిడ శత్రుత్వం వహించడానికి అది మొదటిమెట్టు. బంధువర్గంలో అదొక పెద్ద సమస్యగా తయారైంది వాళ్ళ మనస్తత్వాలూ, అల్పత్వాలూ, స్వార్థబుద్ధీ చూస్తూంటే ఆ చిన్నతనంలోనే అతనికి డోకు వచ్చి, వాళ్ళ దగ్గర్నుంచి దూరంగా పారిపోవాలనుకున్నాడు ఎవరికీ చెప్పకుండా మద్రాసు పారిపోయి అక్కడనుండి పెంపుడు తల్లికి ఖచ్చితంగా ఉత్తరం రాశాడు. అప్పటికావిడ లొంగుబాటుకి వచ్చింది. కాని ఎదురుదెబ్బ కొట్టి ఇంకోరకంగా లొంగదీయడానికి అతను ఇంటరు చదువుతూండగానే పన్నెండేళ్ళ పిల్లను బేరంచేసి పెళ్ళికి సిద్ధంచేసింది చదువుకోసం ఒక మహాయుద్ధం జరిగాక, మళ్ళీ యింకో ఘోర యుద్ధం ఆవిడ బలగంతో చేయడానికి చక్రవర్తికి శక్తిగాని, ఆసక్తిగాని లేకపోయాయి చదువు పూర్తయేవరకైనా పెంపుడు తల్లితో యుద్ధవిరమణ ఒడంబడిక ఉండాలి. ఈ పెళ్ళికి ఒప్పుకుంటే, ఒడంబడికమీద ఆవిడచేత "సంతకం" పెట్టించవచ్చుననుకొని, ఆ షరతుమీద పెళ్ళికి ఒప్పుకున్నాడు. అప్పట్లో అతన్ని అమితంగా ఆకర్షించింది చదువు; వివాహం అంటే ఏమిటో అర్థం చేసుకోగలిగే వయస్సు కాదది కాలక్రమాన అదేమిటో అర్థమయేసరికి చెయ్యగలిగింది ఏమీ లేకపోయింది పెంపుడు కొడుకుమీద ఏమాత్రం తన ప్రభావం ప్రసరించక, అతనికొక వ్యక్తిత్వమూ, స్వతంత్రమైన ఒక జీవితాధారం-ఏర్పడేసరికి పెంపుడుతల్లికి నిస్పృహ కలిగి, ఆ నిస్పృహలో కోడలు ఒక ఊతగా, అయుధంగా కనబడింది. ఆ "కోడలు" ఒక నిర్మలమైన మూర్ఖురాలు. అత్తగారి అభిమానానికి కృతజ్ఞురాలై, అత్తగారి కళ్ళద్వారా భర్తను చూసేసరికి అతనిమీద ఎక్కడలేని యీర్ష్య పెంచుకుంది భర్త నర్సులతో, తోడి లేడీ డాక్టర్లతో స్నేహం చేస్తాడు. తననొక మనిషిగానైనా చూడడు అతన్ని లొంగదీయడానికి ఆమె కొకటే మార్గం కనబడింది అతనికి గృహజీవితం వీలయినంత నరకంచేసి పెట్టడం తనొక నిరాదరించబడే భార్యనని పూర్తిగా నమ్మింది ఆ నమ్మకంలోనే బతికి, ఆ నమ్మకంతోనే బెంగపెట్టుకుని, కావాలని ఆరోగ్యాన్ని చెడగొట్టుకుని, అత్తగారు తన ప్రవర్తనను ఎగసన తోస్తూంటే చివరకి మంచమెక్కింది రానురాను- అది క్షయగా పరిణమించి, చివరకు ఆ జబ్బులోనే కన్నుమూసింది ఆఖరి

క్షణాల్లోకూడా ఆమె భర్తను క్షమించలేదు దేనికి క్షమించకూడదో ఆమెకే సరిగా అర్థం కాలేదుగాని మొత్తంమీద బతికినన్నాళ్ళు ద్వేషంతోనే బతికి తరలిపోయింది అలా జరగడం చక్రవర్తి పెంపుడుతల్లికి ఎంతో సంతోషాన్నిచ్చింది. అటువంటి కొడుకుతో వుండటం యిష్టం లేక స్వగ్రామం వెళ్ళిపోయింది. ఐదేళ్ళ వైవాహిక జీవితం చక్రవర్తికి అసలు బతుకంటేనే వెగటు కలిగేటట్లు చేసింది సర్వీస్‌కి స్వస్తి చెప్పి, వైజాగ్‌లో ప్రాక్టీసు పెట్టుకున్నాడు ఆరు సంవత్సరాలపాటు తనను ఆదరించిన మెడికల్ కాలేజీ, ఆసుపత్రి—అవే అతనికి ఆత్మీయులువలె కనబడ్డాయి సంసారం, భార్యా, పెంపుడుతల్లీ, తను బాగుపడిపోతున్నాడనుకొని అడుగడుగునా దెప్పిపొడిచే బంధువర్గం, డబ్బు పంపించమంటూ అనునిత్యం లెటర్స్ రాయడం తప్ప యింకే విధమైన అభిమానమూ లేని కన్నతండ్రీ—యీ స్మృతులన్నీ అతనికి పీడకలలుగా మాత్రమే నిలిచిపోయాయి తనూ, మలయాళీ వంటకుర్రాడూ, తన డిస్పెన్సరీ—అవి ఉంటే చాలుననుకున్నాడు వీటితోపాటు కృష్ణమూర్తి స్నేహం అతనికి కొంత ఊరట కలిగించింది నిర్లక్ష్యంగా ఏ విలువలనూ లెక్క చేయకుండా, ఏ సమస్యలూ లేకుండా నీతి అవినీతులకు అతీతంగా బతికేసే అతనిని చూస్తే చక్రవర్తికి ఎందుకో సంతోషం మధ్య తరగతి సంస్కారంలోని కుళ్ళుకీ, మూర్ఖత్వానికీ అతని ప్రవర్తన ఒక దివ్యమైన విరుగుడు అనుకునేవాడు.

ఆ కృష్ణమూర్తి యిటీవల తమ జీవితాల మధ్యలోకి కల్యాణిని లాక్కొచ్చాడు ఉత్తపుణ్యాన ఆ సమస్య పరిష్కారానికి పూనుకున్నాడు అతనికి ఇందిరమీద కార్పణ్యం, ప్రకాశం బలహీనతమీద అసహ్యం కలిసి కల్యాణిమీద అభిమానంగా మారాయో, లేక వీటితో నిమిత్తంలేని ఒక అనురాగం ఆ అమ్మాయిమీద పెంచుకున్నాడో, డాక్టరుకు అర్థం కాలేదు ఏమైనా, అది తేలికరకం అనుభూతి మట్టుకు కాదు, ఆ అమ్మాయిలో ఏదో అతన్ని ఆకర్షించింది కల్యాణికోసం ఏదైనా చెయ్యడానికి కృష్ణమూర్తి సిద్ధంగా ఉన్నాడు. ప్రతిఫలంగా ఆమెనుండి ఏమి కోరుతున్నాడనేది చక్రవర్తికి అంతు చిక్కలేదు. మళ్ళీ కాలేజీలో చేర్పిస్తానంటున్నాడు పూర్తి ఖర్చు భరిస్తానంటున్నాడు. "ఇంటినుంచి డబ్బు ఎలా తెప్పిస్తావు?" అని అడిగితే—"ఎలాగో తెప్పిస్తాను! అదంతా మీకెందుకు? నాన్న యివ్వకపోతే అమ్మ యిస్తుంది—అదీ కుదరకపోతే ప్రోనోట్లు రాస్తాను అలా నేను ముగ్గులోకి దిగితే, నేను పూర్తిగా చెడిపోయి ఫకీరయి పోయేవరకూ సాయం చేసే పెద్దమనుషులు మా గ్రామంలోనే చాలా మంది ఉన్నారు. వెధవ డబ్బు! ఇంతవరకూ పనికివచ్చే ఖర్చు ఒక్కటీ చెయ్యకుండా జాగ్రత్తపడ్డాను నేను మా నాన్నా అంతే. వడ్డీకాశించి అడ్డమైనవాళ్ళకీ అప్పులిచ్చి వేలకువేలు పోగొట్టుకుంటాడు గాని, పిల్లికి బిచ్చం పెట్టడు. అంచేత అడ్డదారిని సంపాదిస్తాను! మీ కెందుకూ?" అంటాడు. అటువంటి మనిషితో సవ్యంగా ఎలా మాటాడడం? "ఇన్నాళ్ళు కాలేజీ మానేసినందుకు నువ్వు ఓ మెడికల్ సర్టిఫికెటు బనాయించి పారేయ్ డాక్టరూ! ఆ ప్రిన్సిపాల్ మొహాన్నకొట్టి ఫీజులన్నీ కట్టేసి మళ్ళీ కాలేజీకి పంపించేద్దాం!" అంటాడు

వసుంధరకి కృష్ణమూర్తి సలహా ఎంతో నచ్చింది. అంత మంచి అవకాశాన్ని జారవిడుచుకోకూడదని కల్యాణికి నచ్చజెప్పడానికి ఎంతో ప్రయత్నించింది ఎక్కడా

ఏ ఆశ్రయమూ లేని కల్యాణి ఏం చేస్తుంది? తన యింట్లో కొన్నాళ్ళపాటు ఉంచుకోవడానికి ఆమె కేమీ అభ్యంతరం లేదు, కాని ఎన్నాళ్ళని? పైకి ఏమీ అనడం లేదుగాని, పిన్నికి లోలోపల కొంచెం అసంతృప్తిగానే ఉంది. పెద్దన్నయ్యకు పిన్ని లెటర్ రాస్తూ ఏం రాసిందో ఏమోగాని, అన్నయ్య తనకి ఓ లెటర్ రాశాడు–సున్నితంగా మందలిస్తూ ఉపకారబుద్ధి మంచిదేకాని, దానివలన లేనిపోని సమస్యలు తెచ్చిపెట్టుకోవడం భావ్యం కాదన్నాడు ఉత్తరం చదివి వసుంధర మనస్సు కొంచెం నొచ్చుకుంది. వివరంగా ఉత్తరం రాసి అన్నయ్యకు నచ్చచెబితే, తనమీద అభిమానంకొద్దీ అన్నయ్య కాదనకపోనచ్చుగాని పూర్తిగా హర్షించడు. అన్నయ్యను కాదని తను ఏదీ చెయ్యలేదు. అంతవరకూ కుటుంబంలో అలాంటివి జరగలేదు పరాయివాళ్ళకోసం యింట్లో ఒకరి మనస్సు నింకొకరు నొప్పించడం ఎరుగరు ఆ కుటుంబంలోని ఐకమత్యం అటువంటిది ఇలాంటి అనుభవం వసుంధరకు ఇదివరలో రాలేదు ఒకరు కష్టదశలో ఉన్నారు వాళ్ళకి మన సహాయం కావాలి; ఇచ్చినందువలన మనమేమీ నష్టపోము; ఇవ్వాలని సంకల్పంకూడా వుంది ఐనా అది ఎంత కష్టంతో కూడిన పనో ఇప్పుడిప్పుడు వసుంధరకు అర్ధమౌతుంది. అదొక తప్పుడు పని అయినట్లు ఆత్మీయులు హెచ్చరిస్తారు; అదొక నేరమైనట్లు సంఘం మొహంపెట్టి గుడ్లురిమి చూస్తుంది. ఆ దెబ్బతో మనలో ఉన్న మానవత్వం కాస్తా భయపడి మరింత ముడుచుకుపోయి స్వార్థమే హాయి అనిపింపచేస్తుంది. ఇలాంటి ఆలోచనలు ఎన్నో వసుంధరను కలతపెట్టాయి. కల్యాణిని తక్షణం తనింట్లోంచి వెళ్ళిపొమనే అవసరం లేదుగాని, ఆ అమ్మాయి జీవిత సమస్యకొక పరిష్కారమార్గం చూపే బాధ్యత తనకు తలకు మించిన పని. ఎన్నాళ్ళని తన ఇంట్లో ఉంటుంది? ఉండి ఏం చేస్తుంది? ఈ ఆలోచనలతో వేగిపోతున్న సమయంలోనే కృష్ణమూర్తి ఉదారంగా ముందుకొచ్చాడు. వసుంధర హృదయం వెర్రి సంతోషంతో ఎగిరి గంతువేసింది

మధ్యాహ్నం మూడు గంటలకు చక్రవర్తి ఇంట్లోకి తుఫానులా వచ్చిపడ్డాడు కృష్ణమూర్తి. చక్రవర్తిని బలవంతంగా నిద్రలేపాడు. నాయర్ కుర్రాడిని "టీ" పెట్టమన్నాడు చక్రవర్తి బద్ధకంగా లేచి మంచం మీదే కూర్చుని "ఏమిటీ యీ హడావిడంతా!" అన్నాడు.

కృష్ణమూర్తి అతని కెదురుగా వాలు కుర్చీలో కూర్చుని తాపీగా పకోడీల పొట్లాం విప్పుతూ, "సెలిబ్రేషన్. ఇవాళ న్యూ ఇయర్ కాదుటయ్యా డాక్టరూ!" అన్నాడు.

"నీ మొహం సెలిబ్రేషన్, మనకి న్యూ ఇయరేమిటీ? ఇలాంటివి మనం గుర్తించకూడదు. మన ఉగాది మార్చిలో."

"నాన్సెన్స్. నే నొప్పుకోను ప్రపంచంలో అందరి ఉగాదులు మనవే "నా కుగాదులు లేవు" అంటూ రాసిన కవి శుద్ధ తెలివితక్కువ వాడంటాను. అతను సరిగా క్యాలెండరు చూడలేదుగాని నెలనెలా ఓ ఉగాది ఉండనే ఉంటుంది అది ఎవరిదో అనుకోవడం ఏం ఖర్మ? మనదే అనుకుందాం!" అంటూ రెండు పకోడీలు తీసి చక్రవర్తి చేతిలో పెట్టాడు కృష్ణమూర్తి వాటినందుకుంటూ, "పోనీ

అలాగే అనుకుందాం. సెలిబ్రేషనంటే బేడపెట్టి పకోడీలు తింటూ మంచినీళ్ళు తాగేయడమా? అంతే?" అన్నాడు డాక్టరు.

"అంతే అని ఎవడన్నాడు? కోరుకో. నీకేం కావలిస్తే అది మంజూర్. త్వరగా లేచి బట్టలు మార్చుకో! వసుంధరగారింటికి వెడదాం. అక్కడినుంచి సాయంత్రం ఏ సినిమాకో పోదాం. దారిలో నీకు రవ్వ లడ్డూలూ, జిలేబీ- ఏవి కావాలంటే అవి కొనిస్తాను"అన్నాడు కృష్ణమూర్తి పెద్దహీరోలాగ మొహం పెట్టి.

డాక్టరు నెమ్మదిగా పక్కమీంచి లేచి, "వెళదామంటే వెళదాం నా కభ్యంతరం లేదు. దారిలో రెండు అర్జంటు కేసులున్నాయి. ఒకసారి చూసేస్తే, తరవాత ఎక్కడకైనా వెళ్ళొచ్చు. కాని నువ్వేదో గాలిమేడలు కట్టుకొంటున్నావ్ కృష్ణమూర్తీ! పొద్దున్న ఇక్కడికి వసుంధర వచ్చింది. నీతో ఓ సంగతి చెప్పమంది" అన్నాడు.

"ఏమిటది?"

"మరేం లేదు, నీ సహాయం అక్కర్లేదు పొమ్మందట కల్యాణి"

"పొమ్మనీ?.. ఆ తరవాత ఏమిటట?"

"అదేమో. వసుంధర అదేం చెప్పలేదు." కృష్ణమూర్తికి కొంచెం కోపం వచ్చింది "అంతేనన్నమాట నువ్వు చెప్పగలిగేది? అంతకంటే నీకు ఎక్కువ పట్టలేదన్నమాట? పోనీ, అందరం కలసి ఆ అమ్మాయిని వీధిలోకి గెంటేద్దామా? ఏదో ఒకటి తేల్చు!" అన్నాడు.

డాక్టరుకు నవ్వొచ్చింది. "ఇందులో నాదేముంది మధ్య? మీరూ మీరూ ఆలోచించుకుని మీ యిష్టం వచ్చినట్లు చేయండి ఊళ్ళోవాళ్ళ గొడవలు నా కెందుకు?"

కృష్ణమూర్తి ఆవేశపరుడయ్యాడు. "ఓహో! అంతవరకూ వచ్చిందీ. ఐతే సరే. అలాంటివాడివి నిన్నటిదాకా కల్యాణిని ఓదార్చడానికి అంత బాధ పడ్డావెందుకూ? గంటలకొద్దీ ఆవిడతో కబుర్లుచెప్పీ, సినిమాకు తీసికెళ్ళీ ఎక్కడలేని అభిమానమూ చూపించావేం?" అంటూ డాక్టరుమీద విరుచుకుపడ్డాడు

చక్రవర్తి గతుక్కుమన్నాడు. "ఇదిగో కృష్ణమూర్తీ! అనవసరంగా లేనిపోనివి ఊహించుకుని వేడెక్కిపోకు. నువ్వు ఆ ఇంటికి నన్ను మొట్టమొదట డాక్టరుగా లాక్కెళ్ళావు. ముసలాడు కాస్తా హరీమన్నాడు నేను చెయ్యివేసిన పేషెంటు గుటుక్కుమంటే మనసులో చాలా బాధపడతాను డాక్టరుకు ఆ దౌర్బల్యం ఉండకూడదు కాని, నాకుంది మరి. ఆ ముసలాడి విషయంలోనే కాదు- యిలాంటి కేసులు ఎప్పుడొచ్చినా ఆపాటి సహాయం చేస్తేనేగాని నాకు శాంతి వుండదు. ఇక ఆ అమ్మాయిని ఓదార్చడం అంటావా, ఆవిడమీద నీకున్న ఇంటరెస్టునిబట్టి నీ స్నేహితుడిగా ప్రవర్తించానుగాని, వేరే ఉద్దేశాలేవీ నాకు కలలోగూడా లేవు. నా చనువుని నువ్వు కూడా తప్పర్థం చేసుకుంటే అది నీ ఖర్మ నా ఖర్మాను నేనేం చేసినా నీ కోసం చేశాననుకున్నాను. ఆ పైన నీ యిష్టం వొచ్చింది అనుకో!" అని కొంచెం ఉద్రేకంగా అని మళ్ళీ మంచం మీద చతికిలబడి ఇంకేదో అనబోయేసరికి నాయరు కుర్రాడు టీ తీసుకురావడం చూసి ఆగిపోయాడు.

ఇద్దరూ మౌనంగా టీ తాగారు. ఇద్దరి ఉద్రేకాలూ కొంచెం చల్లారాక కృష్ణమూర్తి, "నువ్వు అర్థంచేసుకుంది డబుల్ తప్పు డాక్టరూ! నా కావిడ మీదున్న ఇంటరెస్టు నువ్వనుకునే రకానిది కాదు నీకుందనీ అంటగట్టడం లేదు నేను. కల్యాణి అంటే నాకో విధమైన అభిమానం ఏర్పడింది కారణం అడిగితే చెప్పలేను ఆవిడకో బతుకుతెరువు కల్పిద్దామని తప్పిస్తే ఇంకో ఉద్దేశం నాకేం లేదు అంత హీరోని కాను నేను" అన్నాడు.

"లే, కల్పించూ! ఎవరొద్దన్నారూ? మే మెవరం నీకు అడ్డు రాలేదు అడ్డొస్తూంది ఆ అమ్మాయే!"

"ఆ సంగతే వెళ్ళి కనుక్కుందాం పద"

"ఇవాళకి నన్నొదిలెయ్, నాకెందుకో చీదరగా ఉంది, నువ్వెళ్ళు" అన్నాడు డాక్టరు.

"ఇంతలోకే మనస్సు మార్చేసుకున్నావేమిటి? ఇప్పుడే కదూ వస్తానన్నావు?"

"నన్ను చంపకు కృష్ణమూర్తీ! ఇవాల్టికి నువ్వొక్కడివే వెళ్ళిరా"

అతనికి ఏం ఆలోచన కట్టిందో ఏమో, "సరే! నేనే వెళ్ళొస్తాను సాయంత్రం ఏడింటికి వస్తాను. వీలయితే ఇంట్లో ఉండు" అనేసి గిరుక్కున తిరిగి ఇంట్లోంచి పోయి రోడ్డుమీదకు వచ్చాడు

చక్రవర్తి బదులు చెప్పలేదు ఆలోచిస్తూ అలాగే వాలుకుర్చీలో పడుకుండిపోయాడు అతనితో తను చెప్పింది నిజమేనా? సాధారణమైన సానుభూతి తప్ప ఇంకేవిధమైన "ఇంటరెస్టూ" తనకు కల్యాణిమీద లేదా? ఎంత ఆలోచించినా తనకు తనకే ఆనందకరమైన జవాబు దొరకలేదు. కల్యాణిని ఎక్కడో చూసినట్టు తనకెప్పుడూ అనిపిస్తూంటుంది– ఎంచేత? చాలాకాలం క్రితం సగం చదివాక ఎక్కడో పోగొట్టుకున్న పుస్తకం మళ్ళీ హఠాత్తుగా అనుకోకుండా చేతిలో పడితే కలిగే ఒక పరిచితమైన స్ఫురణ తనకు కల్యాణిని చూస్తే కలుగుతున్నది. లేక...తన అవకాశవాదానికి రంగుపూసి తనను తనే వంచించుకుంటున్నాడా? తనదీ కృష్ణమూర్తిదీ స్వార్థమే ఎందుకు కాకూడదు? నిస్సహాయంగా ఉన్న ఆడపిల్లను చూస్తే సాయం చేయడానికి ప్రతివాడు ముందుకొచ్చేవాడే కల్యాణి వయసులో ఉన్న అమ్మాయి తల్లీ తోడూ ఎవరూ లేరు కాబట్టి అదుపాజ్ఞలలో పెట్టేవాళ్ళు లేరు. ఆమెకూ ఒక నిండైన యిల్లుండి, అమ్మా నాన్నా ఉంటే, తమతో ఇలా గంటలకొద్దీ మాటాడనిచ్చేవారా? సినిమాలకూ షికార్లకూ రానిచ్చేవారా? ఆవిడ గురించి అంతగా ఆలోచించడానికి తనకేం అధికారం ఉంది? జాలీ, సానుభూతీ అనే ముసుగుకింద తను చేస్తున్నది సవ్యమైన పనేనా?...ఆత్మశోధనలో పడ్డాడు డాక్టరు. తనమీద తనకే అసహ్యం వేసింది ఇక కల్యాణితో ఏ ప్రమేయమూ పెట్టుకోకూడదు. దిక్కులేని ఆడపిల్లల్ని వంచించడం నీచం

అప్రయత్నంగా వాచీ చూసుకునేసరికి ఐదయింది. తేలుకుట్టినవాడిలాగ రక్కున లేచి బట్టలు మార్చుకున్నాడు రెండు మూడు సీరియస్ కేసు లున్నాయి వాటిని వెళ్ళి చూస్తేనేగాని మనస్సు పీకుతూంది. నాయర్నడిగి మరో కప్పు టీ చేయించుకుని కారు తీసుకుని బయలుదేరాడు జనవరి ఒకటో తారీఖు– కొంతమంది కది పండుగ రోజు. కాని తనకూ, రోగులకూ అలాంటివిలేవు తమకు మాత్రం

కాలచక్రం చాలా బరువుగా, కటకటమని తిరుగుతోంది. . ఆ చక్రానికి స్నేహం అనే చమురు లోపించింది. ఇతరేతర ప్రలోభమేదీ లేని ఆ ఆర్ద్రమైన స్నేహం ఎక్కడ దొరుకుతుంది? స్టీరింగ్ చక్రం ముందు కూర్చున్న చక్రవర్తి ఆలోచనలు పేషెంటు ఇంటిముందు అప్రయత్నంగా ఆగేవరకూ ఆగలేదు

## 16

తెల్లవారితే సంక్రాంతి అనగా ఆ రాత్రి చాలా సేపటివరకూ మేలుకుని ఉంది వసుంధర. వారం రోజులనుండీ ఆమె నొక భయం పీడిస్తోంది ఈ మధ్య బొత్తిగా చదువు నిర్లక్ష్యం చేయడంతో, తను ఏ పనిమీద విశాఖపట్నం వచ్చిందో, దానినే విస్మరిస్తున్నానే అని అంతరాత్మ పీడించింది. చదువులో వెనకబడితే ఎలాగ? అన్నయ్య లేమనుకుంటారు? తన తల్లి సంతానంలో చదువులో మందకొడిగా ఉన్నవాళ్ళెవరూ లేరు. అందరూ ఫస్టుక్లాసు తెచ్చుకున్నవాళ్ళే. "ఇంటరులో ఫస్టుక్లాసు రాగానే చాలదు వసూ! అనర్సులో క్లాస్ వస్తేగాని లాభంలేదు. అందులోకూడా ఫస్టుక్లాస్ తెచ్చుకుని మన కుటుంబం పేరు నిలబెట్టాలి" అంటూంటాడు పెద్దన్నయ్య ఎప్పుడూ. ఆ ఆలోచనలన్నీ ఒక్కసారి ప్రకోపించి, వారంరోజులనుండీ ఆమె రాత్రిళ్ళు ఒంటిగంటదాకా మేలుకుని చదవడం మొదలుపెట్టింది క్రితంరాత్రి అలాగే చదివి, సంక్రాంతి ఉదయం తొమ్మిదైనా నిద్ర లేవలేదు "తొమ్మిదైంది వసుంధరా! పండగపూటా ఆ పడకేమిటి? లే! లేచి స్నానం అదీచేసి కొత్తచీర కట్టుకో" అంటూ పిన్ని మేలుకొలుపు పాడేసరికి బద్ధకంగా లేచి మొహం కడుక్కుని కాఫీతాగి వీధరుగుమీద కుర్చీలో మళ్ళీ చతికిలబడింది

"అంత బద్ధకమేమిటమ్మాయ్! త్వరగా తెమలవే! తెమిలి కాస్త రిక్షా చేయించుకుని వెళ్ళి ఇవాళయినా కల్యాణి సంగతి చూస్తావా, లేక నిన్నటిలాగే చేస్తావా?" అంటూ పిన్న మళ్ళీ ప్రారంభించింది

"బాగుంది పిన్నీ! ఆ పిల్ల రానంటూంటే నేనేం చెయ్యను? తీసుకు రావాలని నాకు మాత్రం లేదంటావా?"

"అలాగంటే ఎలాగే? నిన్నటికి నిన్నా అలాగే చేశావు భోగి పండుగపూటా పాపం-ఆ అమ్మాయి తలంటైనా లేకుండా ఎక్కడో ఆ దిక్కుమాలిన గదిలో పడుందంటే ప్రాణం ఉసూరుమంది ఆపదలో ఉన్న ఆడపిల్ల, అలా వదిలేస్తామా? ఇవాళ ఎలాగైనా తీసుకురా వెళ్ళి. లేకపోతే పండగపూటా అఘాయిత్యం సుమా! మనతోపాటు నట్టింట్లో పట్టెడన్నం తిని కొత్తచీర కట్టుకుంటుంది. ఆ పిల్ల రాననడమూ బాగుంది, నువ్వు ఊరుకోవడమూ బాగుంది! ఏమిటో, మీ కుర్రతనం ధోరణులు నాకేం అర్థం కావడంలేదు సుమా!" అంది పిన్ని

వసుంధరకు లోలోపల నవ్వొచ్చింది "నీ ధోరణి నాకు అర్థం కావడంలేదు పిన్నీ!" అనబోయి, మళ్ళీ ధైర్యం చాలక ఊరుకుంది "అలాగేలే! స్నానంచేసి వెళతాను, వీలయినంతవరకూ చెప్పిచూస్తానుగాని, రెక్కపుచ్చుకుని లాక్కురాలేను గదా!" అంది.

"తీసుకురాకపోతే బాగుండదు వసుంధరా!" అని ఆఖరి మాటగా చెప్పేసి పిన్ని వంటింట్లోకి చక్కాబోయింది

"నా మనుష్యులనుకున్నవాళ్ళే నాకు అర్ధంకాకుండా పోతున్నారు. ఇదో వింత ప్రపంచం. తీరా పరీక్షకు పెట్టేసరికి నా అన్న వాళ్ళెవరూ మిగలరేమో, లేకపోతే చేసిందంతా చేసి. యిప్పుడిలా నాలిక్కి తేనెపూసుకు మాటాడుతుందేమిటి పిన్ని? కల్యాణంటే యిప్పుడు ఎక్కడలేని అభిమానమూ పొడుచుకొచ్చింది కాబోలు! అంతా ఉత్తది నేనేమైనా అనుకుంటానని తాపత్రయపడుతోంది" అనుకుంది వసుంధర ఆవిడకి పిన్నిమీద విశ్వాసం సడలిపోయింది. అంటే, పిన్నిమీద అభిమానం సడలిపోయిందనికాదు. కొన్ని ఋణానుబంధాలు వదలించుకుందామన్నా జన్మలో వదలవు. వాటిని అలా మోసుకుంటూ జీవితం గడపవలసిందేకాని "యీ పిన్ని నా మనిషి, నా మనస్సును అర్ధంచేసుకుని, అభిమానంగా నా పక్కన అన్నివేళలా నిలబడి అండగా ఉంటుంది" అనే నమ్మకం శాశ్వతంగా చెదిరిపోయింది వసుంధరకు.

కల్యాణి తన ఆశ్రయం వదలిపెట్టి వెళ్ళిపోయింది–వారంరోజుల క్రితం ఎవరికీ తెలియకుండా ఎలా ప్రయత్నించిందో, చెంగల్రావుపేటలో ఎవరో బంధువుల యింటిలో అద్దెగది చూసుకుని అక్కడికి మారిపోయింది అంతా సిద్ధంచేసుకున్నాక ఒకరోజు ఉదయం తనతో చెప్పింది– "ఇన్నాళ్ళూ కాపాడినందుకు చాలా కృతజ్ఞురాలిని వసుంధరా! ఇంక వెళతాను, నువ్వు మరోలా అనుకోకు. అనుకుంటే నేను చాలా బాధపడి గిజగిజలాడిపోతాను బతుకులో నాకు మిగిలిన ఆత్మీయురాలివి నువ్వొక్కర్తివే. పది కాలాలపాటు నీ స్నేహాన్ని నిలబెట్టుకొనేందుకే ప్రయత్నిస్తాను" అని జవాబుగా ఏం చెప్పడానికీ తనకు తోచలేదు. ఆనాడు రైలు పెట్టెలో కల్యాణి నిస్సహాయతను గ్రహించిన తను ఓపినంతవరకూ సాయం చెయడానికి తహతహలాడింది. ఇంట్లో తెచ్చిపెట్టుకుంది, పిన్ని ఏమీ అనలేదు. అలాగే రోజులు గడిస్తే పిన్ని ఏమీ అనకపోనేమో అనుకోకుండా నాయుడు చనిపోవడం, దానిమీద వచ్చిన గొడవలు, కృష్ణమూర్తీ డాక్టరు చక్రవర్తీ ఒకసారికి పదిసార్లు తనింటికి రావడం– యివన్నీ చూశాక పిన్ని వైఖరిలో మార్పు వచ్చింది ఏమిటి ఈ వింత స్నేహాలు? ఎక్కడికి దారి తీస్తాయివి? అవీ ఆమె అనుమానాలు తను లేనిపోని చిక్కులేవో తెచ్చిపెట్టుకుంటూoదనీ, కల్యాణిని యింట్లోనే ఉంచుకోవడం కంటె దూరంగానే ఉంచి చేతనైన సహాయం చేయడం మంచిదనీ, పిన్ని ఒక అభిప్రాయానికి వచ్చి, అన్యాపదేశంగా యింకో మాటల్లో ధ్వనింపచేసేది. అన్నయ్యచేత కూడా అలాంటి హితబోధనే ఉత్తరాలద్వారా చేయించింది. చివరి చివరి రోజులలో కల్యాణిని యింట్లో ఆదరించే పద్ధతిలో కూడా కొంచెం ముభావం ప్రదర్శించింది ఇంత జరిగాక తను కల్యాణిని బలవంతం చేసి ఎలా ఉంచగలదు? వెళ్ళిపోతానంటే వొద్దని గట్టిగా ఎలా చెప్పగలదు? స్నేహితురాలిని ఆపాటి ఆదుకునే స్వాతంత్ర్యం కూడా తనకు లేకపోయాక–జీవితంలో ఎన్ని హంగులుంటేనేం? కల్యాణికి సాయపడ్డం తనకెంత అవసరమో పిన్ని గుర్తించలేదు. అంతేగాక, డాక్టరుతోనూ కృష్ణమూర్తి తోనూ తను అంత చనువుగా వుండడం మంచిది కాదన్నట్లు పిన్ని ప్రవర్తనలో స్ఫురింపచేయడం తనకు మరింత బాధ కలిగించింది తన బతుకుమీద తనకున్న

అధికారం అంతేనన్నమాట? ఎవళ్ళయినా అంతే అర్థం చేసుకుంటారు కాబోలు! రేపు ఉత్తరోత్రా ఎవడో ఓ బుద్ధిమంతుడు తన మెడకి ఓ తాడు కట్టేసరికి వాడూ అలాగే తయారవుతాడు కాబోలు! ఆ అజ్ఞాత వ్యక్తిమీద వసుంధరకి కోపం వచ్చింది

ఆలోచన మళ్ళీ పిన్ని మీదకు మళ్ళింది బైటికి పంపించేశాక పిన్నికి కల్యాణిమీద ఎక్కడలేని జాలీ పుట్టుకొచ్చింది. పిన్నిగారు మంచిదని కల్యాణిచేత అనిపించుకోవాలి. అంచేత కల్యాణిని పండగపూటా యింటికి తీసికొచ్చి భోజనం పెట్టి కొత్తచీర కట్టబెట్టాలి. అలాంటి ఆత్మవంచన తనకు చేతకాదు కాని పిన్ని పోరుపడలేక నిన్న వెళ్ళింది కల్యాణిని పిలవడానికి. తన పరిస్థితి కల్యాణికి తెలియకపోలేదు అంచేత "ఎందుకులెస్తూ! మనకీ మనకీ మధ్య యీ పండగ పిలుపులేమిటి? ఎప్పుడు పడితే అప్పుడే వస్తుంటాను గదా!" అనేసింది బలవంతం చేసి తీసుకురాగల్గే నైతికబలం తను కోల్పోయింది. కల్యాణి ఎందుకు రాలేదో తనకు తెలుసు; తాను గట్టిగా ఎందుకు పట్టు పట్టలేదో కల్యాణికి తెలుసు భోగిపండగ అలా గడిచిపోయింది. ఇవాళ సంక్రాంతి. తిరిగి కల్యాణి దగ్గరకు వెళ్ళి లాంఛనంగా పిలవాలన్నమాట! లేకపోతే పిన్నికి కోపం వస్తుంది. ఉదారహృదయం చూపించుకుందుకు పిన్నికి "ఛాన్సు" పోతుంది. వెగటుగా తనలో తనే నవ్వుకుంది వసుంధర

స్నానాదులు ముగించి కల్యాణికోసం బయలుదేరి అరుగుమెట్లు దిగబోతుంటే గేటుదగ్గిర ప్రత్యక్షమయాడు కృష్ణమూర్తి "నమస్కారం వసుంధరగారూ!" అంటూ. "నమస్కారం, రండి రండి!" అంటూ అరుగుమీదకి వచ్చేసింది ఇద్దరూ కుర్చీలో చతికిలబడ్డారు. "ఎక్కడికో బయలుదేరుతున్నట్లుందే! తరవాతొస్తాను పోనీ! ఏనేంలేదు పండగపూటా ఓసారి చూసిపోదామని వచ్చాను" అన్నాడు అతను.

"బయలుదేరినమాట నిజమే కాని–మరేం ఫరవాలేదు కూర్చోండి. కాస్సేపుండి ఇద్దరం కలిసే వెళదాం. ఏమిటి కబుర్లు–ఎలాగున్నారు?" అంటూ కుర్చీలో కూర్చునే "పిన్నీ" అని గట్టిగా కేకేసింది. పిన్ని వచ్చి "ఏం" అంది

"కృష్ణమూర్తిగారు వచ్చారు పిన్నీ, కాఫీ టిఫిన్లూ యివ్వు"

వంటింటిలోకి వెళ్ళిన పిన్ని అక్కణ్ణించి "అమ్మాయ్!" అని పిలిచింది. కొంచెం విసుగుమొహం పెట్టి లోపలకు వెళ్ళి వసుంధర "ఏం పిన్నీ ఎందుకూ?" అంది

"ఏం లేదమ్మాయ్! టిఫిన్లూ అవీ అని బాతాఖానీ వేసుకు కూర్చోక త్వరగా వెళ్ళు కల్యాణి దగ్గరకి. మరీ ఆలస్యమైతే అమ్మాయి ఎక్కడికైనా వెళ్ళిపోతుంది."

"తొందరేంలేదు పిన్నీ, కల్యాణి ఎక్కడికీ వెళ్ళదు. ఓ పావుగంటలో నేనూ ఆయన కలిసే వెళతాంలే!"

పిన్నికి ఏం తోచిందో ఏమో, "కలిసే వెళతారా? అలాగెందుకమ్మాయ్? అతన్ని పంపించేశాక నువ్వు ఒక్కత్తెవీ వెళ్ళకూడదా?" అంది. వసుంధరలోని ఓర్మికి ఆ ప్రశ్న ఆఖరు పరీక్షగా పరిణమించింది. ఓర్మి వోడిపోయింది. కొంచెం స్వరంలో కటువుతనంతో "కలిసి వెళితే మరేం ఫరవాలేదు పిన్నీ! నేను మరీ అంత చిన్నపిల్లను కానులే, ప్రమాదాలు జరుగుతాయని భయపడకు. జరిగినా మధ్య నీకు బెంగ అనవసరం ముందు టిఫిన్ ప్లేటు ఇలా పడేయ్" అనేసి ప్లేటు తీసుకొని వెళ్ళిపోయింది. ఆమె వేపే చూస్తూ పిన్ని అలా నిలుచున్నపాటునే కొయ్యబారిపోయింది

వసుంధర లోపలికి వెళ్ళేటప్పుడు విసుగుమొహంతో వెళ్ళడం, వచ్చేటప్పుడు యింకా మొహం మాడ్చుకుని రావడం కృష్ణమూర్తి గమనించాడు. "ఇప్పుడెందుకండీ యీ టిఫిన్లూ అవీనూ? మీకు అనవసరంగా శ్రమ" అంటూ ఏదో అనబోతూంటే వసుంధర అడ్డొచ్చి–

"తీసుకోండి, ఊరికే టెక్కు చెయ్యకా! శ్రమేమిటి నా తలకాయ? అనవసరంగా నాకు కోపం తెప్పించకండి. ఉండండి మంచినీళ్ళూ, కాఫీ తెస్తాను; బుద్ధిగా తింటూండండి!" అని లోపలికి వెళ్ళి క్షణంలో రెండు గ్లాసులతో తిరిగొచ్చింది "ఇప్పుడు చెప్పండి, ఏమిటి విశేషాలు! మీ ఇందిర ఎలా ఉంది?" అంటూ కుర్చీ అతనికి యింకొంచెం దగ్గరగా జరుపుకొని కూర్చుంది.

"మా ఇందిరేమిటండోయ్! ఆ అమ్మాయిని చూసి ఏళ్ళూ పూళ్ళూ అయింది. కిందటేడు చూశాను. ఇది కొత్త సంవత్సరంగా!" అన్నాడు నవ్వుతూ, కృష్ణమూర్తి

"పండుగ గదా...పాపం, ఓసారి వెళ్ళి చూసి రాకూడదూ?" కిలకిలా నవ్వింది మళ్ళీ. ఆ నవ్వు కృష్ణమూర్తి కోసం కాదు, లోపలున్న పిన్నికి వినబడాలని, కావాలని అంత గట్టిగా నవ్వింది.

"నాకేం అభ్యంతరం లేదు..వెళితే తిన్నగా మాటాడదేమోనని నా భయం, అంతే. నా కెవరితోనూ తగాయిదా లేదండోయ్! ఆ మాటకొస్తే యివాళ యీ సిటీలోని జనాభా అంతటినీ పలకరించేసి, "ఇవాళ పండగర్రోయ్!" అని భుజంతట్టి మిఠాయి పంచిపెట్టమన్నా తయార్! కావలసినంత డబ్బుంటే అంతపనీ చేద్దును!" అన్నాడు కృష్ణమూర్తి.

ఆ క్షణంలో అతని కళ్ళు ఒక వింతకాంతితో మెరవడం చూసింది వసుంధర 'ఈ అబ్బాయి ఎంత అమృత హృదయుడు!' అనుకుంది కల్యాణి మొదట్లో యితన్ని యెంత పొరపాటుగా అర్థం చేసుకుంది! కొంచెం రంగేళీరాయుడు అయితేంగాక, ఆడపిల్లలంటే సరదాపడితే పడుగాక, మనిషిలో ఎంత వెతికినా ఎక్కడా మాలిన్యం లేదు. అల్పత్వం, కార్పణ్యం అంతకన్నాలేవు. 'ఎంత ఉత్తముడు!'..అనుకుంది.

"అదేమిటి కృష్ణమూర్తిగారూ! అంత బొత్తిగా లోకాన్ని ప్రేమించేస్తే ఎలాగ? అంత ధారాళం పనికిరాదు సుమండీ! అనక చిక్కుల్లో పడతారు!"

"పోనిస్తురూ వెధవ చిక్కులూ! అడుగడుగునా అన్నీ లెక్కవేసుకుంటూ బతకడం నాకు చేతకాదు సుమండీ! బతికే మూడు రోజులూ హాయిగా బతకాలి. అసలు నన్నడిగితే దేశంలో ఉన్న దరిద్రంలో సగం మనుషుల మనసులలో ఉంది ఇవ్వడానికి చేతిలో దమ్మిడీ లేకపోవచ్చు. కాని మనస్సు యివ్వడానికేం ఖర్మ? కాని ఇవ్వరు నాలిక పీక్కున్నా యివ్వరు. ఇవ్వడంలో హాయి ఉందర్రా అంటే అర్థం చేసుకోరు బతికే నాలుగురోజులూ పిక్నిక్‌లో వున్నట్టు బతకండిరా అంటే..అబ్బెబ్బే యిది పిక్నిక్ కాదు, యిదో సంత, ఎవడి లాభసాటి బేరం వాడు చూసుకోవలసిందే నంటారు. వాళ్ళని మార్చడం నా తరం కాదు, నన్ను మార్చడం వాళ్ళ తరమూగాదు. అంచేత యీ ఘటం యిలా

"అలాగైతే ఎలా బాగుపడతారు మీరు?"

"ఎవడన్నాడు బాగుపడతానని? బాగుపడ్డం అంటే ఏమిటి అసలు? నాకేదో

ఉద్యోగాలుచేసి ఊళ్ళేలాలని, వ్యాపారంచేసి లక్షలార్జించాలని .అలాంటి కోరికలేం లేవు. ఆ రెండింటికీ నేను అన్‌ఫిట్. చదువా, అసలే ఒంటబట్టడంలేదు పెద్దలు కూడబెట్టినది ఏదో కొంచెం ఉందిగనక దాన్ని కరిగిస్తూ ఏదో కాలక్షేపం చేస్తాను"

అలాంటి మొండిమనిషిని ఏమని అర్థం చేసుకోవడం? అతనిమీద ఎలా కోపం తెచ్చుకోవడం?

"పోనీలెండి. ఇలాగే ఉండండి హాయిగా. కాని టిఫిన్ తినేయండి త్వరగా, నాతో వద్దురుగాని" అంది వసుంధర

"ఎక్కడికి?"

"కల్యాణి దగ్గరికి. ఇవాళ మా యింటికి భోజనానికి తీసుకువస్తున్నాను. అన్నట్టు మీరూ డాక్టరుగారూ కూడా రాకూడదూ, సరదాగా అందరం కలిసి భోంచేద్దాం."

"సంతోషంగా వద్దుంకాని, ముందే వేరే ఎంగేజిమెంటు పెట్టుకున్నామే! ఎలాగ మరి?"

"ఏవిటా ఎంగేజిమెంటు?"

"కోమల విలాస్‌లో స్పెషల్ భోజనం చేసేసి..సింహాచలం కొండదగ్గరికి కారులో వెళ్ళడం"

"అంతేగద! ఏమిటో అనుకున్నాను. ఆ తినేదేదో యిక్కడే తినేసి తరువాతే వెళ్ళండి!"

"ఆల్ రైట్. ముందు కల్యాణి సంగతి కనుక్కుందాం పదండి" అంటూ కాఫీగ్లాసు ఖాళీచేసి సిగరెట్టు వెలిగించాడు

"పిన్నీ! తలుపువేసుకో, నేను బయటకు వెళుతున్నాను" లోపలకు వినబడేటట్లు కేకేసి "పదండి పోదాం" అంటూ దారితీసింది వసుంధర. "ఉండండి రిక్షాలు తెస్తాను" అన్నాడు కృష్ణమూర్తి

వసుంధర గబగబా అడుగులువేస్తూ "రిక్షాలూ వద్దూ టాక్సీలు వద్దు, నడవండీ హాయిగా నడిచిపోదాం!" అంది ఆజ్ఞాపిస్తున్నట్టు.

దారిలో హాయిగా కబుర్లుచెప్పుకుంటూ ఇద్దరూ నడిచి కల్యాణి యిల్లు చేరుకునే సరికి పదకొండయింది. కల్యాణి యింట్లోనే ఉంది, గదిలో కూర్చుని పుస్తకం చదువుకుంటూంది. "రండి! రండి!" అంటూ యిద్దరినీ ఆహ్వానించి కూర్చోబెట్టి చాపవేసింది. ఒక్కసారి గదంతా కలయచూశాడు కృష్ణమూర్తి. అతనక్కడికి రావడం అదే మొదటిసారి. గది బోడిగా ఉంది పెట్టే, బెడ్డింగూ, రెండు చాపలూ, ఓ వాలుకుర్చీ ఉన్నాయి. గోడకు ఒక మూలగా క్యారియరూ, నీళ్ళకూజా, రెండుగ్లాసులూ ఉన్నాయి.

కృష్ణమూర్తి, వసుంధరా చాపమీద చతికిలపడ్డారు. "వంట మీరే చేసుకుంటు న్నారా?" అడిగాడు కృష్ణమూర్తి.

కల్యాణి నవ్వుతూ "లేదండీ! ప్రస్తుతానికి హోటలునుంచే తెప్పించుకుంటున్నాను. వంట సామాన్లు లేవుగదా? ఆచార్లుగారికి ఉత్తరం రాశాను మా పాత్రసామాను ఆయనింట్లో జాగ్రత్త చేశాంగదూ, వీలయితే పంపించమని. ఆయనకి వీల్లేకపోతే నేనే వెళ్ళి తెచ్చుకోవాలి మరి. అందాకా యిదే అవస్థ" అనేసింది

వసుంధరకు ఏమిటేమిటో జ్ఞాపకం వచ్చాయి కల్యాణి తన యిల్లు విడిచి వెళ్ళేటప్పటికి ఆమె దగ్గరవున్న డబ్బంతా కలిపి అమాంబాపతు యాభయి రూపాయలు. ఎన్నాళ్ళు వస్తుంది ఆ డబ్బు? ఆ తరవాత యీ పిల్ల ఏం చేస్తుంది? చేతికి ఒక జత గాజులున్నాయి, రిస్టువాచీ ఉంది అవి అమ్ముకుని తింటేమాత్రం ఎంతకాలం వస్తాయి?

"సరేగాని కల్యాణి, నిన్న రమ్మంటే ఏదో సాకు చెప్పి తప్పించుకున్నావు. ఇవాళ అలా చెయ్యడానికి వీలులేదు. మా యింటికి రావలసిందే పండగపూటా నా మాట వినాలి నువ్వు. పిన్ని మరీ మరీ చెప్పింది." ప్రాధేయపడుతున్నట్లడిగింది వసుంధర

కల్యాణి కృష్ణమూర్తి వేపు తిరిగి "చూడండి కృష్ణమూర్తి గారూ! మా వసుంధర ఎలా అడుగుతోందో? వాళ్ళ యింటికి వెళ్ళడానికి నాకో ఆహ్వానం కావాలా? ఎప్పుడు పడితే అపుడే వెళతాను గదా!" అంది పిర్యాదు చేస్తున్నట్లు. కృష్ణమూర్తికి అదేమిటో అర్థంగాక "ఇవాళ మీరు తప్పకుండా రావాలి మీరొస్తే నేనూ డాక్టరూ కూడా వస్తాం. అందరం కలిసి పండుగ హాయిగ గడుపుదాం" అన్నాడు.

"అయ్యో ! అలా అయితే తప్పకుండా వద్దును వసుంధరా! కాని ఇంటివాళ్ళు ముందే మాట తీసుకున్నారు ఇవాళా రేపూ వాళ్ళింట్లో భోంచెయ్యాలట నీతో అయితే చనువుగా రానని చెప్పగలను, అర్ధరాత్రయినా వచ్చి దండించి మరీ తినగలను, ఏదైనా చెయ్యగలను, వీళ్ళతో ఎలా చెప్పూ? ఈ రెండు రోజులూ నన్ను క్షమించేస్తావా, అనక నువ్వెలా చెపితే అలా వింటాను" అంది కల్యాణి.

వసుంధరకి ఒక్కసారి ఉప్పెనలా కోపం వచ్చింది "అంతేనా కల్యాణి? నాకంటే యింటివాళ్ళే దగ్గిరైపోయారా" అంది ఆ మాట కల్యాణి మనసును శూలంవలె గుచ్చింది. అప్రయత్నంగా కన్నీళ్ళు గిర్రున తిరిగిపోయాయి. "నువ్వు అలాగంటే నేనేం చెయ్యగలను వసుంధరా? దయచేసి ఇంకెప్పుడూ అలా అనకు. నాకీ జన్మలో దగ్గిరవాళ్ళంటూ ఎవరైనా ఉంటే–నువ్వే. ఆ సంగతి రుజువు చేసింది నేను కాదు, నువ్వే–"అని కన్నీళ్ళు తుడుచుకుంది.

వసుంధర తొందరపడ్డానని బాధపడింది. "ఛా! అదేమిటె కల్యాణీ! ఊరికే హాస్యానికి అన్నాను. అంత సీరియస్‌గా తీసుకుంటావనుకోలేదు. ఎలాగోలా నువ్వొస్తే చాలునని చనువుకొద్దీ అన్నాను కల్యాణీ!" అంది.

"ఎందుకురాను వసుంధరా! నువ్వంతగా పిలవాలా? ఉన్నపరిస్థితి చెప్పాను, అంతే. నీకూ అన్నీ తెలుసు. దూరపు బంధుత్వాన్ని కలుపుకొని వీళ్లని గది అడిగాను. సంశయించకుండా యిచ్చి సాయంచేశారు. నాలుగు రోజులపాటు యిక్కడ ఉండదల్చుకొన్నదాన్ని వాళ్ళ మనస్సు నొప్పించకుండా ఉండాలి గద! ఇంట్లోనే తెల్లారిలేస్తే ఉండేదాన్ని; భోజనాలగొడవ పెట్టుకోవద్దని అప్పటికీ చెప్పిచూశాను. వాళ్లు వినలేదు. ఏదో సరదా పడుతున్నారు. ఆలోచించి, ఏం చెయ్యమంటావో చెప్పు. అలాగే చేస్తాను. రానని వాళ్ళతో చెప్పేసి నీ కూడా వచ్చేయమంటావా, నించున్నపాట్టున వచ్చేస్తాను."

కల్యాణి పలికిన ప్రతి అక్షరంలోనూ ఖంగుమని నిజం ధ్వనించింది. ఆమె చేతుల్ని తనే చేతుల్లోకి తీసుకుంటూ వసుంధర, "నిజమే కల్యాణీ! వాళ్లపరంగా కూడా ఆలోచించాలి. తప్పకుండా యీ రెండు రోజులూ వాళ్లింట్లోనే ఉండు, మనం

ఎప్పుడుపడితే అప్పుడు కలుసుకోగలం. ఇంకోనాడు అందరం కలిసి మంచిప్రోగ్రాం ఏర్పాటు చేసుకుందాం" అని సానునయంగా సర్దిచెప్పడానికి ప్రయత్నిస్తూ కృష్ణమూర్తివేపు తిరిగి "ఏమండీ! మీరేమంటారు?" అంది.

అంతవరకూ నిశ్చేష్టుడై కూర్చున్న కృష్ణమూర్తి "అలాగే చేద్దామండీ, దానికేం– అనవసరంగా ఇంటివాళ్లను డిసపాయింట్ చేయడం దేనికి? మనం మనం ఎలాగైనా సర్దుకోవచ్చు" అన్నాడు

కొంచెం సేపు ముగ్గురూ మౌనంగా వుండిపోయారు సంభాషణ ఎలా కొనసాగించాలో ఎవరికీ తెలియలేదు, అందులోంచి తేరుకుని కృష్ణమూర్తి, "ఇంక వెళదామా, వసుంధరగారూ! డాక్టరు నాకోసం చూస్తూంటాడు, మళ్ళీ ఇంకోసారి కలుసుకుందాం కల్యాణిగారూ! మీతో చాలా విషయాలు మాటాడాలి" అన్నాడు.

"మీ యిష్టం, ఎప్పుడైనా సరే."

"ఎప్పుడైనా నే నొక్కణ్ణీ మీ యింటికొచ్చి మీతో మాటాడితే మీకేమైనా అభ్యంతరమా?"

"అదేమిటండి! అంతా కొత్తగా మాటాడుతున్నారు? ఇన్నాళ్ళూ లేని అభ్యంతరం యిప్పుడేందుకుంటుంది?"

"కొత్త యిల్లు చూడండీ!"

"పాత మనిషినేగా?"

వసుంధరకి నవ్వొచ్చింది "బాగుంది మీ సంభాషణ, లెండి పోదాం కృష్ణమూర్తిగారూ! వెళ్ళొస్తాం కల్యాణీ! వచ్చినపని అయిపోయిందిగా!"

ఇద్దర్ని వీధి గుమ్మందాకా సాగనంపింది కల్యాణి. దారిలో కృష్ణమూర్తి అన్నాడు, "ఏమిటోండీ, సరదాగా వెళ్ళి గంపెడు నిరుత్సాహంతో తిరిగివచ్చాము. అనుకోకుండానే సంభాషణ మడతలు పడిపోయింది. ఆవిడను సంతోషపెట్టేపద్ధతే మనకి తెలియడంలేదు, ఏం దారి?" దానికి ఏం సంజాయిషీ ఏం చెప్పాలో వసుంధరకి తోచలేదు. అతను చెప్పింది నిజమే. మనస్సులు పాడైపోయినాయితప్ప జరిగిందేమీలేదు అనుకుంది. పిన్నికి ఏం జవాబు చెప్పడం? ఆమె నిరాశ ముందు తమ నిరాశ ఏపాటిది! బరువు గుండెలతో యిద్దరూ తిరుగుదారి పట్టారు వసుంధరను ఆమె యింటి దగ్గర దిగబెట్టి కృష్ణమూర్తి డాక్టరును కలుసుకునేందుకు బయలుదేరాడు

☆ ☆ ☆

పండగ వచ్చింది– వెళ్ళిపోయింది. కాలంలో మార్పు అంటారుగాని, భూత భవిష్య ద్వర్తమానాలుగా మానవుడి అవగాహన సదుపాయంకోసం విభజింపబడిన అనంతకాలం నిశ్చలమైనది. దాని గర్భంలోని పరిణామ సంతతులు మాత్రం వేనవేలు. ఋతుగమనాన్ని అనుసరించి వచ్చే పండుగలు మానవుని దుర్బలత్వాన్ని ప్రస్ఫుటీకరణ చేయడానికే అప్పుడప్పుడు ఉపయోగిస్తుంటాయి. కల్యాణి విషయంలో అంతే జరిగింది. ఆమె ఒంటరితనం, నిస్సహాయత, ఎవరికీ దేనికీ చెందని ఒక అనాసక్తజీవితం–వీటినే ఆమెకు సంక్రాంతి పండుగ జ్ఞాపకం చేసింది. సాంఘిక జీవితంలోని మాధుర్యానికి అదొక చిహ్నం అని అనుకోలేకపోయింది అందుకే

పండుగ మూడు రోజులూ ఎక్కడికీ కదలకుండా లోకం వెలుతురు చూడకుండా, మరింత లోలోపలికి ముడుచుకుపోయింది పండుగ మూడురోజులూ గడిచిపోయాక "హమ్మయ్య!" అనుకుంది.

జనవరి పదిహేడవ తారీకు. ఆ రోజు ఆమె పుట్టినదినం తెల్లారకట్టే మెలుకువ వచ్చింది. అదే చీకటిగది, తన లోలోపలి శూన్యత్వాన్ని బయట ప్రతిబింబింపచేసే శూన్యమైన గది...ట్రంకు, పరుపు.. అన్నీ ఆమెకు జాలికరంగా కనబడ్డాయి "నేటితో యిరవై సంవత్సరాలు నిండుతాయి. జీవితంలో ఏమి సాధించినట్లు?" అని ప్రశ్న వేసుకుంటే ఆమెకు జవాబు రాలేదు. భర్తృహరి చెప్పినట్లు శూన్యగృహంలో దీపం వలే గడిచిపోయింది బతుకు. అదీ వెగలిగించిన దీపంకూడా కాదు అనుకుంది ఛా... యీ నిస్పృహ పనికిరాదు. గడచిపోయిన పీడకలల్ని మరచిపోయి కన్నీటి చాటికలను తుడిచేసుకుని లేచి నిలబడాలి. ఆ సంకల్పం ఆమెకు లీలగా పదిరోజుల క్రితమే వచ్చింది. తను చదువుకునేందుకు కృష్ణమూర్తి డబ్బు యిస్తానని అన్నప్పుడే ఆమె అంతరాలలో ఏదో రసాయనికమైన పరిణామం వచ్చింది ఇంతమంది స్నేహితులకు తను సమస్యగా ఎందుకు తయారవాలి? తస బాధ్యత యింతమంది మీద పడేసి ప్రవాహం ఎటు తీసుకెళితే అటే వెళ్ళిపోవడం ఆమెకు అసహ్యమనిపించింది. బతకగలననే ధైర్యం, బతకాలనే సంకల్పం— ఒక్కసారిగా అకస్మాత్తుగా కలిగాయి. ఏదయినా ఊహించుకున్నకొద్దీ భయం వేస్తుంది; ఎదుర్కొన్నకొద్దీ ధైర్యం వస్తుంది నిజానికి తనకొకరి సహాయం దేనికి? డిగ్రీలు లేవు కాని ఇంటర్మీడియట్ ప్యాసయింది తనకూ ఇందిరకూ ఏమిటి తేడా? కొంచెం కష్టపడితే టైపూ షార్టుహాండూ నేర్చుకోవచ్చు. ఏ చిన్న ఉద్యోగం దొరికినా హాయిగా కాలక్షేపం చెయ్యవచ్చు. తనను పోషించేవాళ్ళు ఎవరూ లేరు తను పోషించవలసినవాళ్ళూ ఎవరూ లేరు అదెంత సుఖం! హఠాత్తుగా ఆమె మనస్సులో ఒక ఆశాభావం ఒక అందమైన లేడిపిల్లవలె ఆ మూలనుండి యీ మూలకు చిలిపిగా పరుగెత్తింది. తను ట్యూషన్లు చెప్పి డబ్బు సంపాదిస్తేనేం? అలా కొంతకాలం కాలక్షేపం చేసి టైపూ షార్టుహాండూ నేర్చుకుని ఏదయినా ఉద్యోగానికి ప్రయత్నిస్తేనేం?

నీటి అడుగున మంచినీటి చేపలవలె యిలాంటి ఆశారేఖలు ఆమె హృదయాన్ని ఒక్కసారి కాంతివంతం చేసి వెలిగించాయి. ఏదో నిగూఢసత్యం కనుక్కున్న తపస్వివలె ఆమెకు జ్ఞానోదయం కలిగింది తను స్వేచ్ఛాజీవి! తను బతకగలదు అంతే, కొన్ని నిశ్చయాలకు వచ్చేసింది ముమ్ముందు తను పరాయి పంచనుండి మారిపోయి స్వంతంగా తన గూటిక్రింద తను బతకాలి. ఉదయంనుండీ సాయంత్రందాకా ఒక వ్యాపకం కల్పించుకుని, తద్వారా బతుకుకు కావలసినంత సంపాదించగల్గితే తనకు సమస్యలేమున్నాయి? ప్రేమలూ ప్రణయాలూ గడిచిపోయాయి. వేదనలూ కన్నీళ్ళూ అయిపోయాయి అవేవి తన నింక బాధించకూడదు. లేచి ఏదయినా ఒక బతుకు పందిరి కట్టుకోవాలి. తనకు యిల్లెక్కడ దొరుకుతుంది? అద్దె ఎలా యిచ్చుకోగలదు? ఒంటరిగా గది తీసుకుని వుంటే పరువుగా బతకడానికి వీలవుతుందా? ఆలోచించగా చెంగల్రావుపేటలో దూరపు బంధువు ఒకాయన జ్ఞాపకం వచ్చాడు. జ్ఞాతులేగాని అంత దగ్గిర చుట్టరికం లేదు. ఆయన సబ్-రిజిస్ట్రార్ చేసి రెండు చేతులా అర్జించి రిటైరయినాడు. చెంగల్రావుపేటలో స్వంత యిల్లు

కట్టుకున్నాడు. కొడుకులూ కోడళ్ళూ అంతా పెద్దకుటుంబం తానయితే వాళ్ళను ఎప్పుడూ ఎరగదు గాని నాన్న అప్పుడప్పుడు చెపుతూండేవాడు ఆ వీధిలోంచి రిక్షాలో తనూ నాన్నా వెళుతూంటే ఓసారి ఆ యిల్లు చూపించాడు. వెళ్ళి ఆయనను ఒక గది ఇమ్మని అడిగితే?

సాహసించి ఒకరోజు వెళ్ళింది కల్యాణి. రిజిస్ట్రారుగారి భార్యతో తను ఎవరో చెప్పి పరిచయం చేసుకొని బంధుత్వాన్ని తెలియజేసింది ఆ ఇంటివాళ్ళెప్పుడూ కల్యాణిని చూడకపోయినా, ఆప్యాయంగానే మాటాడారు వెతకబోయిన తీగ కాలికి తగిలించుకున్నట్లు.. వాళ్ళూ సరిగా అటువంటి అమ్మాయికోసమే వెతుకుతున్నారు మనమరాళ్ళకి సరిగా చదువు అబ్బడంలేదు. పెద్దమ్మాయికి పదమూడేళ్ళు వచ్చినా యింకా ఫస్టుఫారం దాటలేదు. అంచేత ప్రయివేటుగా మనమరాళ్ళ కిద్దరికీ చదువులు చెప్పించి ఒక దారికి తీసుకురావాలనే ప్రయత్నంలో ఉంటూండే సమయంలో కల్యాణి వాళ్ళింటికి వెళ్ళడం తటస్థించింది. ముసలాయన కథంతా విని భార్యతో సంప్రదించి కల్యాణికి ఒక ప్రతిపాదన చేశాడు వాళ్ళింట్లో ఒక గదీ చిన్నవసారా కల్యాణికి అద్దెకిస్తారు తను మనమరాళ్ళ కిద్దరికీ పొద్దున్నా సాయంత్రం కల్యాణి ట్యూషను చెప్పి, మెట్రిక్యులేషన్‌కి తయారుచెయ్యాలి అద్దెపోగా నెలకి పదిరూపాయలు ఆమెకు ముట్టచెపుతారు. స్నేహితులకు సిఫార్సుచేసి కనీసం యింకో ఇరవై రూపాయల ట్యూషన్సు కుదిర్చిపెడతారు.

నిలుచున్నపాటున కల్యాణి అన్నింటికీ ఒప్పేసుకుని. మర్నాడే మంచి ముహూర్తం చూసుకుని తన "వాటా" లోకి ప్రవేశించింది.

జనవరి పదిహేడవ తారీకున ఆమె తను స్వయంగా ఆర్జించుకొని అద్దె యిచ్చుకుంటున్న వాటాలో నిద్రలేచింది వేకువనే కాలకృత్యాలు తీర్చుకొని, అద్దంలో ముఖం చూసుకుని బొట్టుపెట్టుకుంటూ, "ఇవాళతో నీకు ఇరవై యేళ్ళు నిండాయి కల్యాణీ! స్వతంత్రంగా జీవితంకూడా ప్రారంభించావు. మరేం చేస్తావో!" అని అద్దంలో నీడను సవాల్ చేసింది. హృదయం ఎందుకో తేలికపడింది శరీరంలోకి కొత్తరక్తం వచ్చినట్లనిపించింది. తాగిన కాఫీ యింకొంచెం రుచికరంగా, కిటికీలోంచి వీచే చల్లగాలి ఇంకొంచెం మధురంగా, ఆఖరికి తను కట్టుకున్న మిల్లు చీరా జాకెట్టూ ఇంకొంచెం అందంగా అనిపించాయి "ఫరవాలేదు కల్యాణీ! ధైర్యం ఉండాలిగాని–ఎందుకు బతకలేం మనం?" అని గోముగా తనకు తనే చెప్పుకుంది "నువ్వు వసుంధర పంచలో తల దాచుకోలేదు, నువ్వు పరాన్నభుక్కురాలివి కావు కృష్ణమూర్తి నిన్ను చదివించనక్కరలేదు; నీకు భయందేనికి కల్యాణీ!" అనుకుంది. ఆ చలికాలపు ప్రభాతాన ఆ మారుమూల పేటలోని గదిలో కల్యాణి ఆత్మపద్మంలో కొత్తరేకలు వికసించాయి; నిస్సహాయా, నిరాశ్రయా అయిన కల్యాణి పునర్జన్మ పొందింది

ఇంటివాళ్ళ మనవరాళ్ళకి ఆనాడు కల్యాణి మేష్టారి గొంతుకలో కొత్తశక్తీ, కళ్ళలో కొత్త ఉత్సాహం... కనిపించాయి. "ఇవాళ మీరు ఇంచక్కా ఉన్నారు మేష్టారు!" అంది రెండోపిల్ల. అది శుద్ధ గడుగ్గాయి. "మరేమిటనుకున్నావు–ఇవాళ నా పుట్టినరోజు!" అంది కల్యాణి. ఆ అమ్మాయి తుర్రున తూనీగలాగ ఇంట్లోకి పారిపోయి "నాయనమ్మా నాయనమ్మా! ఇవాళ కల్యాణి మేష్టారి పుట్టినరోజుటే!"

అని యాటంబాంబులా అరిచింది "చెప్పేవు కాదేం అమ్మాయ్!" అంటూ ముసలావిడ సాగదీసి, సాయంత్రానికల్లా చీరా జాకెట్టూ కొడుకుచేత తెప్పించి కట్టుకోమని బలవంతం చేసింది.

సాయంత్రం ఆరుగంటలకి ఉన్న రెండు మూడు ప్రైవేట్లూ ముగించుకుని .కొత్త చీర కట్టుకుని .ఆ తరువాత ఏం చేద్దామా అనుకొంది కల్యాణి వసుంధరను చూడాలనిపించింది. "ఇప్పుడు స్వతంత్రంగా ఆవిడింటికి వెళ్ళగలను ఆవిడ పిన్నిగారి ముఖం ధైర్యంగా చూడగలను" అనుకుంది. వెంటనే ఇంటావిడ దగ్గరకు వెళ్ళి..."పిన్నిగారూ... నేను మా స్నేహితురాలు వసుంధర ఇంటికి వెళుతున్నాను. వచ్చేటప్పుడు మరీ చీకటయితే అక్కడే ఉండిపోతాను ఏమీ అనుకోకండేం? మీరు పర్మిషను యిస్తేనే వెళతాను సుమండీ!" అంది నవ్వుతూ. ముసలావిడ చంటి మనుమరాలి గౌనుకి లేసు కుడుతూ, "దానికేం అమ్మాయ్! వెళ్ళిరా! కష్టసమయంలో తల్లి తోడుగా నిన్ను కడుపులో పెట్టుకు కాపాడింది .అక్కడ రాత్రి ఉండిపోవడానికేం! నిరభ్యంతరంగా ఉండిపోవచ్చు బాబయ్యగారితో నేను చెపుతాలే- నువ్వు వెళ్ళిరా, పొద్దునే వచ్చేయ్ సుమా!" అంది

కల్యాణి ఇప్పుడు రిక్షాలెక్కడం పూర్తిగా మానేసింది వసుంధర యింటికి నడిచి బయలుదేరింది. సాయంత్రం ఆరున్నర దాటింది షాపులలో అప్పుడే దీపాలు వెలుగుతున్నాయి. రిక్షాలకు దీపాలు వెలిగించమని పోలీసులు రిక్షావాళ్ళను కసురుతున్నారు మెయిన్‌రోడ్డు దాటి టర్నర్ సత్రం దగ్గర మళ్ళి, రోడ్డువారగా తలవంచుకు నడుస్తున్న కల్యాణికి వెనకనుండి కారు హారన్ వినబడింది పక్కకు తప్పుకొని మరింత వారగా వెళుతూంటే తన వెనకాలే హారన్ మోగుతూన్నట్లనిపించింది ఇంకా ఎంత తప్పుకోవడం? వెనక్కి చూసేసరికి రక్కున కారు ఆగిపోయింది ముందు సీట్లోంచి డాక్టరు చక్రవర్తి నవ్వుతూ దిగి, "ఏమండీ కల్యాణిగారూ! మరి ఇంత చెవుడైతే ఎలాగండీ?" అన్నాడు.

పరాకుగా నడుస్తుందేమో మొదట్లో ఉలిక్కిపడి తరవాత తేరుకుని, "మీరా? హడలిపోయాను డాక్టరుగారూ!" అంది

"చాలా కాలానికి కనబడ్డారు ఇలా ఎక్కడికి వెళుతున్నారు? అడగొచ్చా?"

"అదేమిటి? అడక్కూడదని అన్నానా? వసుంధరగారి యింటికి వెళుతున్నాను, మీరు?"

"నేను మా యింటికి వసుంధర యింటిదగ్గర డ్రాప్ చెయ్యమంటారా?"

"నో, థాంక్స్ నా దారిని నేను వెళతాలెండి"

"ఏం? అంత దుర్మార్గుణ్ణా నేను? నా కారులో కూర్చుంటేనే మీ మర్యాదకి భంగమా?"

ఆ ప్రశ్నకి ఆశ్చర్యపోయింది "ఛా—అదేంమాట డాక్టరుగారూ! మీకు శ్రమదేనికనే ఉద్దేశంతో అన్నాను. మీకు యింకోలా అర్థమైతే క్షమించండి పదండి వస్తాను" అంది, నొచ్చుకుంటూ. తనే వెళ్ళి ముందు సీటులో కూర్చుంది. కారు పదిగజాలు కదిలాక డాక్టరు, "మీ కొత్త జీవితం గురించి విన్నాను. మొన్ననే కృష్ణమూర్తి చెప్పాడు" అన్నాడు.

కల్యాణికి ఆ రోజు ఒక కొత్త ఆవేశం పట్టుకుంది ఆ రోజు తన పుట్టినరోజు అనే వార్తను అందరితో చెప్పకుండా దాచుకోలేకపోయింది

"అవునండీ! మంచికో చెడ్డకో ఒక నిశ్చయానికొచ్చేశాను ఏం జరిగినా యింక రథం వెనక్కి వెళ్ళదు. మీరన్నట్లు సరికొత్త జీవితమే ఇవాళ నా పుట్టినరోజు కూడా" అంది.

అప్రయత్నంగా కారు బ్రేకు వేసి ఆపేశాడు డాక్టరు "ఏమిటీ ఇవాళ మీ పుట్టినరోజా! చెప్పారు కాదేం? అయితే, యిలా ఊరుకోకూడదు" అని కారు రివర్స్ చేసి వెనక్కి తిప్పి మెయిన్ రోడ్డు పట్టించాడు

కల్యాణి కొంచెం అనుమానంతో "ఎక్కడికి డాక్టరుగారూ! ఆపండి ఆపండి నన్నెక్కడికీ తీసికెళ్ళొద్దు. వసుంధర యింటిదగ్గర దింపగల్గితే దింపండి; లేదా ఆపెయ్యండి యిక్కడే దిగిపోతాను" అంది కంగారుగా

డాక్టరు నిబ్బరంగా కారు ముందుకే పోనిస్తూ "కంగారు పడకండి మిమ్మల్ని భద్రంగా, మర్యాదగా వసుంధర యింట్లోనే దిగబెడతాను ఎటొచ్చి ఓ పావుగంట లేటయితే వచ్చే ప్రమాదం ఏంలేదు" అన్నాడు

"నాకు తెలుసు మీరు ఎక్కడికి తీసికెళుతున్నారో. పుట్టినరోజుకి ప్రెజెంటు కొనిపెడతారు మీకు డబ్బుంది గనక ఆ విధంగా నన్ను అవమానించగలరు దయచేసి కారు వెనక్కి తిప్పండి"

"తిప్పమంటే తిప్పుతాను. కాని–వసుంధర యింట్లో వుండదు"

"ఏం?"

"ఆవిడా కృష్ణమూర్తీ కలిసి సినిమాకి వెళ్ళడానికి ప్రోగ్రాం వేసుకున్నారు"

"ఉత్తది! మీరు తమాషాకు అంటున్నారు"

"నిజంగానే చెపుతున్నాను మధ్యాహ్నం కృష్ణమూర్తి చెప్పాడు, అంచేత వసుంధర యింట్లో వుండదు చెప్పండి, నా కారులో కూర్చోవడమే మీకు కష్టంగా వుంటే యిక్కడే దిగిపోండి"

"నేను అలాగనలేదు డాక్టరుగారూ! పుట్టినరోజని నేరకపోయిచెప్పాను ఏమీ కొనిపెట్టడానికి వీల్లేదన్నాను అంతేగాని–మీతో రావడానికి నాకేం అభ్యంతరం లేదు"

"నిజం? ఊరికే చెప్పకండి. మా యింటికి తీసికెళితే వస్తారా?"

"సంతోషంగా వస్తాను. అదేమిటండీ అలాగంటారూ?"

"చీకటి పడిందిగదా–అందుకనీ–మా యింట్లో ఆడవాళ్ళు లేరు. అలాంటి అభ్యంతరాలు మీకెన్నో ఉండవచ్చు."

"బాగుందండీ! నేను మీ దృష్టికి అంత అసందర్భంగా కనబడుతున్నానా? నేను మీ యింటికి పేరంటానికి రావడం లేదే? మీ కోసం వస్తున్నాను పదండి, వొచ్చి మీ యిల్లు చూస్తాను."

"ఉండండి, దారిలో కొంచెం పనుంది మీకేం కొననులెండి నేనే ఏవో కొనుక్కోవాలి" అని డాక్టరు చక్రవర్తి ఓ బట్టలషాపు దగ్గర కారు ఆపాడు. కల్యాణిని కూడా లోపలకు రమ్మని బలవంతం చేసి, యాభై రూపాయలు పెట్టి క్రేప్‌చీర ఒకటి కొన్నాడు. కల్యాణికి అతనిమీద నిజంగానే కోపం వచ్చింది అది చోటుకాదని

ఊరుకుంది తరవాత ఫాన్సీ షాపుకు వెళ్ళి టాయిలెట్ కేస్ కొన్నాడు తరవాత తిన్నగా కారు యింటిమొహం పట్టించాడు

కారు ఆగడం చూసి నౌకరుకుర్రాడు హాలు తలుపు తీశాడు హాలుకు ఎడంపక్కగా అతని క్లినిక్ ఉంది అందులో దీపం వెలుగుతూంది పంకా తిరుగుతూంది "రండి!" అని హాల్లో కల్యాణిని కూర్చోబెట్టి సరాసరి క్లినిక్‌లోకి వెళ్ళాడు అక్కడ నర్సూ కంపౌండరూ కూర్చుని ఏవో డిటెక్టివ్ పుస్తకాలు చదువుకుంటున్నారు వాళ్ళని మామూలు ప్రశ్నలేవో వేసి–ఆ రోజుకి యింటికి పొమ్మన్నాడు. తరవాత నౌకరుకుర్రాడు క్లినిక్ తలుపులు వేసేసి తాళాలు డాక్టరు చేతికిచ్చేశాడు

"సారీ కల్యాణిగారూ! ఇవాళ్టికి క్లినిక్ మూసేశాను ఇంకెవరూ యీ రాత్రికి పిలవకుండా ఉంటే అంతేచాలు" అని ఎదురు కుర్చీలో చతికిలబడ్డాడు

నౌకరుకుర్రాడు నిశ్శబ్దంగా వచ్చి యిద్దరి కుర్చీలదగ్గిరా టీపాయలు అమర్చి కాఫీ, బిస్కట్లు పెట్టాడు "థ్యాంక్స్ కల్యాణిగారూ! అనుకోకుండా నా యింటికొచ్చారు అందులోనూ మీ పుట్టినరోజున వచ్చారు, నా ఆతిథ్యం స్వీకరించి కాస్త కాఫీ తీసుకోండి."

"మీరిలా అంటూంటే నాకు చాలా బాధాకరంగా ఉంది నా తహతుకు మించిన గౌరవం యిస్తున్నారు మీరు ఎలా ఉంటుంది చెప్పండి! నేనేదో ట్యూషన్లు చెప్పుకుని బతికే బీదపిల్లని. ఆ స్థాయిమీదనే నన్నుంచి మాటాడండి చాలు!" అంది కల్యాణి, కుషన్ కుర్చీలో బెరుకు బెరుకుగా కూర్చుంటూ

"నిజమే, ఆ తాహతుకు మించి మిమ్మల్ని చూడడంలేదు. మా కన్నతండ్రి సాక్షాత్తూ బడిపంతులు. ట్యూషన్లు చెప్పడం అతనికి మీలాగే ఎంతో అవసరం నేను బడిపంతులు కొడుకుని అంచేత నా స్టేటస్ మీ స్టేటస్ కంటే చాలా పెద్దది మరి ఒక స్నేహితుడి సహాయాన్ని కూడా వద్దనేసి చదువైనా మానుకున్నారు మీరు ఒక వితంతువు ఆస్తి సహాయంతో చదువుకుని, ఆ ఒక్క చదువుకోసం ఎన్నెన్నో పౌరుషాలు తాకట్టు పెట్టేసుకుని కాలం గడిపాను నేను నిజమే కల్యాణిగారూ? మన తాహతులు కొలవడానికి కొత్తమీటరు ఏదయినా కొనుక్కొస్తానుండండి!" అన్నాడతను

కాఫీ చప్పరిస్తూ అలా నిశ్శబ్దంగా కూర్చుండిపోయింది కల్యాణి డాక్టరు గబగబా కాఫీతాగేసి, చీరె పార్శెలూ, టాయిలెట్ సెట్టూ ఆవిడ పక్కగా పెట్టి "నా మీద మీకేమైనా గౌరవం ఉంటే–రెండూ మీరు తీసుకుని తీరాలి" అన్నాడు.

కల్యాణి "అవి తీసుకుంటే గౌరవం ఉన్నట్లూ లేకుంటే లేనట్లూనా?" అంది

"అంతే."

"అయితే – మనుషులకు విషమపరీక్షలు పెట్టడం మీకలవాటన్నమాట!"

"అలాగే అనుకోండి పోనీ"

"వీల్లేదు డాక్టరుగారూ! మీ పట్ల నా గౌరవాన్ని రుజువు చెయ్యడానికి యింకేదైనా మార్గం చెప్పండి, అంతేగాని, నన్ను యిలా యిబ్బంది పెట్టకండి"

డాక్టరుకి నిజంగా చిరాకేసింది. "మీకింత మొండిపట్టుదల దేనికి?" అన్నాడు

"వినండి డాక్టరుగారూ! నన్ను కూడా కొంచెం అర్థం చేసుకోవడానికి ప్రయత్నించండి. మీరూ, కృష్ణమూర్తిగారూ, వసుంధరా – నాకు చాలా ఉదారంగా

సహాయం చేశారు. కృతజ్ఞత ఎప్పటికయినా ఆచరణలో చూపించుకుంటాను మీరు నిజంగా అమృతహృదయులు అది గ్రహించేపాటి సంస్కారం నాలో ఉంది కాని – నన్ను ఒక మనిషిగా చెయ్యండి మీరంతా కలిసి స్నేహం యివ్వండి, కాని జాలిపడకండి ఈ జీవితంలో ఏదీ ఉచితంగా రాదు ఎవరికీ అలా రావాలని కోరుకోవడం కూడా హీనం అలా ఉచితంగా ఏదీ తీసుకోకూడదని నిశ్చయించాను దయచేసి అర్థం చేసుకోండి."

డాక్టరు రిస్టువాచీ చూసుకున్నాడు దగ్గిరగా ఎనిమిదయింది "మీరు యింకో గంట కూర్చోడానికి అభ్యంతరమా?" అన్నాడు

"అవసరమా?"

"అవును, మీతో కొన్ని విషయాలు మాటాడాలి అవకాశం దొరికింది గనుక అడుగుతున్నాను."

"అయితే తప్పకుండా ఉంటాను తరువాత నన్ను వసుంధర యింటిదగ్గరమాత్రం దిగబెట్టెయ్యాలి."

"విధిగా దిగబెడతాను."

"అయితే మాటాడండి ఏం మాటాడినా వింటాను"

"ఉండండి, అలా కంగారు పెట్టేయకండి నిదానంగా నత్తివాడిలాగ భావాల నత్తితో చెపుతాను"

వినడం తన డ్యూటీ అన్నట్టుగా మొహంపెట్టి కూర్చుంది కల్యాణి డాక్టరు సిగరెట్ కాల్చుకుంటూ ఎటో చూస్తూ ఆలోచిస్తున్నాడు కొద్ది నిముషాలపాటు యిద్దరూ అలా మౌనంగా కూర్చున్నారు దూరంగా రోడ్డు మీద రిక్షా మువ్వల చప్పుడూ, కారు హారన్‌లూ గాలిలో తేలి వినవస్తున్నాయి హాలులో గడియారం టిక్కు టిక్కు మని శబ్దం చేస్తోంది ఆ శబ్దంవల్ల హాలులో నిశ్శబ్దం ద్విగుణీకృతం అయింది.

కల్యాణి డాక్టరు మొహంకేసి ఏకాగ్రతతో చూసింది 'ఏమిటి చెప్పబోతున్నాడు డాక్టరు?'

డాక్టరు మొదలు పెట్టాడు. "వెనుకటికి ఓ కవి పాడుపడ్డ గోడలమీద పాతకథలు వికసిస్తాయి అన్నాడు."

ఉలిక్కిపడి అతని వేపు విస్ఫారిత నేత్రాలతో చూసింది కల్యాణి

## 17

అదే సాయంత్రం మునిమాపు చీకటులు కమ్ముకుంటున్న వేళలో వసుంధర కృష్ణమూర్తితో కలిసి హెచ్. యమ్ యస్. బేకరీలో కూర్చుని టీ తాగుతున్నది కనీసం తాగడానికి ప్రయత్నం చేస్తోంది. యంత్రవత్‌గా పెదవుల దగ్గిర కప్పు పెట్టుకొని చప్పరిస్తున్నదే గాని, ఆమె ఆలోచనలు ఎక్కడో ఉన్నాయి. తాగుతున్న టీ వలెనే ఆ గడియలో ఆమెకు సమస్తమూ అరుచిగా అనిపించింది ఎందులోనూ సంతృప్తి లేదు. అకస్మాత్తుగా వసుంధరకు జీవితం వెగటుగా తోచింది. అంతవరకూ

నిగూఢంగా, ఆమెకే తెలియకుండా వ్యక్తిత్వంలో అట్టడుగున నిద్రాణంగా ఉన్న ఒకానొక నైజ గుణరేఖ ఏదో చైతన్యందాల్చి హృదయంలో విజృంభించి ప్రవర్తననే ఉద్వేగమయం చేసింది. తన రక్తంలో అటువంటి విద్యుదగ్నివంటిది ఏదో వెలిగించి వుందని తనకే తెలియదు పెద్దన్నయ్య వచ్చి మొన్న మొన్ననే మీట నొక్కి వెళ్ళాడు పండుగ వెళ్ళిన మర్నాడు చుక్క తెగిపడ్డట్లు ఊడిపడ్డాడు. అకస్మాత్తుగా ఆఫీసు పని ఏదో తగిలిందట. ఒచ్చినవాడు మధ్యాహ్నందాకా బాగానే ఉన్నాడు. అన్నయ్య రాకలోని సంతోషాన్ని అనుభవించింది తను భోజనాలైనాక రెండు గంటలసేపు హాయిగా మత్తుగా నిద్రపోయింది అప్పుడు పిన్నీ అన్నయ్యా ఏం మాటాడుకున్నారో ఏమో, కాఫీలయాకా పడక గదిలో కూర్చోబెట్టి తనతో ప్రత్యేకం బాతాఖానీకిదిగాడు అన్నయ్య. శుద్ధ లోకాభిరామాయణం కాని అందులో నాయిక తనే విషయం ఫలానా అని తేల్చకుండా అతి సున్నితంగా, – ఒక గౌరవ వంశానికి చెందిన విద్యావతి ఎలా నడుచుకోవాలో, తన తాహతుకి తగిన వరుడు ఎటువంటివాడై వుండాలో, ఉత్తరోత్రా అటువంటి హోదాలో జీవించవలసిన తను, ప్రస్తుతం అక్కరలేని, నిలువలేని స్నేహాలను ఎలా దూరంగా ఉంచాలో, చాలా హుందాగా వివరించాడు– అదీ మందలిస్తూ కాదు, మార్దవంగా

అన్నయ్య హృదయంలోని అభిప్రాయాలు అర్ధమయ్యాయి తనకు. జీవితంలో మొట్టమొదటిసారిగా అన్నయ్య మాటలకు బాధపడింది తను. బహుశా తనవల్ల అన్నయ్య కూడా అలాగే బాధపడి ఉండవచ్చు ననేది గ్రహించింది తనకు ఊహ తెలిసిననాటినుండీ అన్నయ్య తనను అతి ముద్దుగా చూశాడు ఆడింది ఆటగా పాడింది పాటగా అన్నీ అమర్చాడు. అంతవరకూ తన కుటుంబంలో ఒకరికొకరు హితబోధలు చేసుకోవలసిన అవసరం రాలేదు పెద్దలు చెయ్యలేదు చెయ్యవలసిన అవసరం పిన్నలు కలిగించలేదు తన అన్నయ్యలు వట్టిస్వార్ధపరులూ అల్పబుద్ధులా అంటే అదీకాదు. ఇంటా బయటా ఉదారంగానే బతుకుతారు అందరివీ అనుకూలదాంపత్యాలు వదినెలు కూడా అభిమానం, ఔదార్యం ఉన్నవాళ్ళేకాని చీలికలతో బాధపడే రకంగాదు నిజానికి తనకింతవరకూ జీవితంలో ఒకటే సమస్య, సమస్యలు లేకపోవడం. కొత్తగా యిప్పుడొక సమస్య అంకురిస్తున్నదా? అయితే దానిస్వరూపం ఎటువంటిది? కారకురాలు తనేనా? తనెలాగయింది? అన్నయ్యకు యిష్టంలేని పని తనింతవరకూ ఏదీ చెయ్యలేదు, బహుశా ఒక్కసారి తప్ప అదీ చాలా ఏళ్ళక్రితం అప్పుడు తనకి పధ్నాలుగేళ్ళు. కుటుంబం అంతా కలిసి ఒకసారి సినిమాకు వెళ్ళారు. రష్ ఎక్కువగా ఉండడం మూలాన రిజర్వ్డ్ టిక్కెట్లు తప్ప తక్కినవన్నీ అయిపోయాయి ఇంటికి పోదాం అన్నాడు పెద్దన్నయ్య వీల్లేదంది తను రిజర్వ్డ్ టిక్కెట్లు కొనవలసిందేనని పట్టు పట్టింది. "మనందరికీ కలిసి యిరవై రూపాయిలవుతుంది తెలుసా?" అన్నాడు అన్నయ్య. తను గభాలున అన్నయ్య జేబులోంచి పర్సు లాక్కొని, పరుగెత్తి వెళ్ళి టిక్కెట్లు కొనుక్కొచ్చింది అన్నయ్యకి కోపం వచ్చింది గాని పైకి ఏమీ అనలేదు. వదిన ఏమీ అననివ్వలేదు అంతా అయిపోయాక రాత్రి తనకే అన్నయ్యను చూస్తే బాధ కలిగింది. తిన్నగా వెళ్ళి మాటాడటానికి ధైర్యం లేక– "ఇంకెప్పుడూ చెయ్యను అన్నయ్యా క్షమించవూ?" అని చిన్న కాగితంముక్కమీద రాసి, అన్నయ్య చేతికిచ్చేసిపోయి గదిలో కూర్చుంది.

వెంటనే అన్నయ్య తన గదిలోకి వచ్చి, "పిచ్చిపిల్లా! నే నేమన్నాను నిన్నూ?" అని లాలనగా దగ్గరగా తీసుకొనేసరికి తన కెందుకో ఏడుపొచ్చేసింది అంతే. ఆ తరువాత అన్నయ్యకు యిష్టంలేని పని తను ఎన్నడూ చేయలేదు.

ఇప్పుడు మటుకు చేస్తోందా? కల్యాణికి సాయం చేయాలని తనకి ఎంత ఉన్నా, అన్నయ్య ఉత్తరం చూశాక ఆ ప్రయత్నమే విరమించుకుంది అన్నయ్యను కాదని తనిప్పుడేం చేసినట్లు? కృష్ణమూర్తితో కలిసి తిరగడాన్ని మనస్సులో పెట్టుకొని అన్నయ్య మాటాడాడు. పిన్ని చెప్పినదాన్నిబట్టి అలా మాటాడాడు. అప్పుడే, ఆ క్షణంలోనే, తన రక్తంలోని విద్యుదగ్ని ఏదో ఒక్కసారి చురుక్కుమని నవనాడుల్లోనూ ప్రసరించినది.

తనలోని స్త్రీత్వం మేలుకుంటున్నది! అడది గనుక చూచాయగా పిన్ని కనిపెట్టి ఉండాలి. అదన్నమాట సంగతి! తనకు తెలియకుండానే తనలోని స్త్రీత్వం మేలుకుంటున్నది. లేకపోతే యింతమంది తన పోకడలను ప్రతిఘటించడం దేనికి? తన కుటుంబంలో జనానా పద్ధతి ఎన్నడూ ఎరగరే? తెలిసిన వాళ్ళందరిలోనూ మొగా, ఆడా విచక్షణ లేకుండా, అందరూ అరమరికలు లేకుండా వ్యవహరిస్తారు ఇంతవరకూ తన విషయంలో కూడా అలాంటి అదుపాజ్ఞలు పెట్టలేదు. ఇప్పుడీ కొత్తపద్ధతికి అర్థం ఏమిటి? కృష్ణమూర్తిపట్ల తన ప్రవర్తనలో ఏదైనా ప్రత్యేకత ఉందా? ఒక వేళ మాట వరసకి ఉందని అనుకున్నా, వీళ్ళందరూ అంత విపరీతంగా చూసి, ఇంటి మీద నిప్పురవ్వ పడితే వెంటనే ఆర్పవలసినట్లుగా అంత ప్రమాదకరమైనదా? తనలోని స్త్రీత్వం మేలుకుంటే, ఆ బాధ్యతలూ మంచి చెడ్డలూ తనవి కావా? అయితే తనకింత వ్యక్తిత్వమనేది ఎక్కడుంది? పిన్నికి కోపం వస్తున్నకొద్దీ, అన్నయ్య అంత మార్దవంగా మందలించిన కారణంచేతనే, కృష్ణమూర్తి తనకు చాలా ముఖ్యుడుగా కనిపిస్తున్నాడెందుచేత? అంతవరకూ కృష్ణమూర్తి తనకు ఒక అలవాటైన స్నేహితుడుగానే తోచాడు గాని, వీళ్ళందరూ వెనక్కి లాగుతుండేసరికి, ఇంకొంచెం ముందుకెళ్ళి—అదేమిటో, అందరూ కూడదన్నంత అందులో ఏముందో చూడాలనిపిస్తోంది తనకు. అది కేవలం చాపల్యమా? పట్టుదలా? తనకే తెలియడంలేదు. ఒక్కటి మాత్రం నిజం; పిన్నీ, అన్నయ్యా కలిసి తనను రెచ్చగొడుతున్నారు. స్త్రీత్వంలోని సాఫల్యం అంటే ఏమిటో ఎన్నడూ ఎరగని పిన్ని అనవసరంగా తనలోని స్త్రీత్వాన్ని గడియ గడియకూ అనుమానిస్తోంది అలాంటి వెఖరి అంటేనే తనకి అసహ్యం. కృష్ణమూర్తి అంటే ఏమిటో తన యింట్లో వాళ్ళకి ఏం తెలుసు? అతను నిజంగా అమృత హృదయుడు, పిన్నికేం తెలుసు కృష్ణమూర్తి వ్యక్తిత్వం? పిల్లికి ప్రతి చిలకా కేవలం మాంసం ముద్దగానే కనిపిస్తుందంటారు అంతే పిన్నిగూడా లింగభేదం తప్ప తక్కిన విలువలు ఆమె లెక్కలోకిరావు. అకస్మాత్తుగా తనలో తనకే నవ్వొచ్చింది "పిన్నీ! నీ వయస్సులో లింగభేదం అనేది ఒక్క వ్యాకరణ సూత్రంగానే అర్థం చేసుకోవాలిగాని, తక్కిన గొడవలు నీ కెందుకమ్మా?" అనుకుంది.

అలా ధ్యానముద్రలో పడిపోయి టీ చప్పరిస్తూన్న వసుంధరను కృష్ణమూర్తి నిశ్శబ్దంగా పరికిస్తూ కూర్చున్నాడుగాని, మాటాడటానికి ప్రయత్నించలేదు ఆమె హృదయంలోని సంక్షోభం అతనికసలే తెలియదు. ఇటీవలె వసుంధర ప్రయత్నపూర్వకంగా తనకు

సన్నిహితంగా వస్తున్నట్లు కూడా అతనికి తెలియదు రోజులమీద నడిచిపోతున్న యీ పరిణామం పోల్చుకుందికి అతనికి వ్యవధిలేదు వసుంధర అంటే అమితమైన గౌరవం. వసుంధర గొప్పింటి అమ్మాయి సినిమా కథల్లో రాజకుమార్తె లాంటిది ఆమె సమక్షంలో పదిక్షణాలు గడప గల్గటమే మహాభాగ్యం పిన్నికి కోపం వస్తున్నకొద్దీ వసుంధర ఒక విధమైన పట్టుదలతో, తన వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకోవాలనే అంతర్లీన వాంఛతో, వీలయినంతకాలం తనతో గడపాలనే ప్రయత్నం చేస్తున్నదని కూడా కృష్ణమూర్తి గమనించలేదు. అన్నింటినీ మరపింపచేసే ఆనందం, హాయి, ఏదో ఆమె సమక్షంలో అనుభవిస్తున్నానని మాత్రం అతను పోల్చుకో గలిగాడు

వసుంధర పెదవులమీద నవ్వుచూసి, "ఏమిటాలోచిస్తున్నారు?" అన్నాడు.

ధ్యానముద్రలోంచి తేరుకున్న వసుంధర "అబ్బే! ఏంలేదు టైమెంత అయింది?" అని చేతివాచీ చూసుకుని, "అబ్బో! ఆరున్నరయిందే! సినిమాకి టైముందా?" అంది.

"త్వరగా వెళితే అందుకుంటాం. అంతగా అయితే న్యూస్‌రీళ్ళు మిస్సవుతాం లెండి పోదాం ఇంతకూ ఏ సినిమాకి? ఆ సంగతి చెప్పండి?"

"సినిమావద్దూ పాడూవద్దూ. పదండి బీచ్‌కి పోదాం. హాయిగా కాస్సేపు కబుర్లు చెప్పుకుందాం. ఎనిమిదింటిదాకా కూర్చుని తరువాత ఆలోచిద్దాం. అంతగా అయితే సెకండ్ షోకి వెళదాం లెండి" అంది వసుంధర

"ఈ చలిలో చీకట్లో బీచిలో కూర్చుందామా?"

"ఏం? మీకు బాధగా ఉంటుందా? ఇష్టంలేదా? భయమా? ఏమిటో చెప్పండి"

"అదేమిటండీ అలాగంటారు? అదేదీకాదు. మీకు యిబ్బందిగా ఉంటుందేమోనని, అంతే. మీరే ప్రొపోజ్ చేస్తున్నారు గనుక పదండి, మీతో నరకానికిరమ్మన్నా ఖుషీగా వస్తాను" అంటూ లేచాడు కృష్ణమూర్తి.

ఇద్దరూ రెండు రిక్షాలెక్కి బీచికి దారి తీశారు. దూరంగా యిసకలో వెళ్ళి కూర్చున్నారు.

సినిమా వద్దనేసి బీచికి ఎందుకు లాక్కెళ్ళిందో కృష్ణమూర్తికి తెలియదుగాని, వసుంధర ఆ క్షణంలో కోరింది ఏకాంతం మనుషులకి దూరంగా వెళ్ళి అక్కడ కృష్ణమూర్తితో కొంచెంసేపు గడపాలి; అదీ ఆమె అభిలాష సాహస కృత్యాలవైపు ఆమె హృదయం ఉరకలెత్తుత్తోంది. ఎందుకో ఆమెకే తెలియడంలేదు ఆమె నవనాడుల్లోనూ ఏదో విద్యుదగ్ని ప్రసరిస్తోంది. కులీనవంశంలోని యువతి, జీవితపు తుఫానులేవీ వినబడకుండా సుర్రక్షితంగా యింతవరకూ కోటలో పెరిగిన రాజకుమార్తె, ప్రశాంతంగా యూనివర్శిటీలో చదువుకుంటూ నియమ జీవితంలోని సుఖాన్ని భద్రతనూ సంతోషంగా స్వీకరించి స్వాస్థ్య చిత్తంతో సంతృప్తిగా జీవిస్తూన్న అమ్మాయి. ఆమె నుండి ఆత్మీయులు అంతకన్న ఎక్కువ కోరారు. నిరాక్షేపణీయంగా నెట్టుకుంటూ వస్తున్న ఆమెకు ఆక్షేపణీయాలేమిటో ఉత్తపుణ్యాన జ్ఞాపకం చేశారు. అంతవరకు ఆమెమీద ఆమెకే అపారమైన విశ్వాసమున్నది. దానిని కూడా వాళ్ళు గ్రహించక, ఆమె గౌరవిస్తున్న ఒకానొక అనుభూతిని అంత గౌరవంతోనూ 'చూడలేకపోయారు. కృష్ణమూర్తి కాదు అక్కడ ముఖ్యం, ఆ స్థానంలో యింకో విష్ణుమూర్తి ఎవడున్నా ఆమె

అలాగే ప్రవర్తించి ఉండును. తరుణ హృదయం తనను తనే ఎంత ప్రేమించుకుంటుందో అర్థం చేసుకోలేకపోయారు. ఆ హృదయాన్ని నమ్మిననాడు నీకు కావలసినట్లు అది నడుచుకుంటుంది; నీకంటే జాగ్రత్తగా మసులుకుంటూ భద్రంగా అడుగులు వేస్తుంది. పదునైన ఆ ఘడియల్లో నువ్వు అపనమ్మకాన్ని సూచించావా, స్వాభిమానం దెబ్బతిని, చేతకానిదైతే ఏడుస్తుంది, వ్యక్తిత్వమున్నదైతే నీ కెదురు తిరిగి, సరిగా నువ్వు భయపడిన అడుగు లేస్తుంది. ఆనాటి సాయంకాలం వసుంధర సరిగ్గా అలాంటి మానసిక స్థితిలోనే ఉంది. కృష్ణమూర్తికి ఎవరో–ఎవరో ఏమిటి, తనవాళ్ళే–అన్యాయం చేస్తున్నారు తను కాపాడాలని అనుకుంది. తనను కూడా కాపాడుకోవాలి; తన జీవితాన్ని తనే వికసింప చేసుకుని దాని అర్థం ఏమిటో తనే వెతుక్కోవాలిగాని–యితరులు–ఎంత ఆత్మీయులైతేనేంగాక–తాము బాగుందనుకున్న పరవడిలోకి ఎందుకు లాక్కుపోవాలి? కల్యాణిపాటి స్వాతంత్ర్యం లేదా తనకు? కల్యాణికి జీవితంలో భద్రత ఏమీలేదు తనకు కావలసినంత ఉంది. అయితే ఆ భద్రతే పెద్ద శిక్షగా పరిణమించాలా?

అవి ఆమె ఆలోచనలు. ఇసుకలో ఒరగా పడుకుని వేళ్ళతో యిసకలో బొమ్మలు వేస్తోంది. రెండు సిగరెట్లు కాల్చేసిన తరవాత కృష్ణమూర్తి "సరే, అనుకున్నట్లు బీచికి వచ్చాం. ఇప్పుడేంచేద్దాం? హాయిగా మాటాడుకుందాం అన్నారు? మొదలెట్టండి ఏదైనా" అన్నాడు.

"నాకేం తోచడం లేదు. మీరే ఏదైనా చెప్పండి, వింటాను"

"ఇవాళ మీ ధోరణంతా ఏదో వింతగా ఉంది. ఇవాళ సినిమా కెళదామని నిన్న సాయంత్రమే అన్నారు అప్పుడే ఆశ్చర్యం వేసింది, ఎన్నడూ లేనిది వసుంధరగారికి యింత అనుగ్రహం కలిగిందేమిటా అని. తీరా సినిమాకు సిద్ధమైతే ముందు కాఫీ తాగుదాం అన్నారు. అక్కడ మళ్ళీ మనస్సు మార్చేసుకుని బీచికన్నారు. ఇవాళ మీరు సరిగా లేరు. ఇదివరకెప్పుడూ, యిలా చూడలేదు మిమ్మల్ని. మీతో పరిచయం చాలా తక్కువే అనుకోండి– ఐనా ఏమిటో కొద్దిరోజుల్లోనే చాలా దగ్గిరవాళ్ళం అయిపోయాం అనిపిస్తుంది. కాని–"

"కాని– ఆగిపోయారేం చెప్పండి!" అంది వసుంధర ఆసక్తిగా.

"ఏం లేదు. ఎందుకో భయం వేస్తోంది. అంతే" అన్నాడు కృష్ణమూర్తి.

"భయమా? భయం దేనికి?"

"ఏమిటో వసుంధరగారూ? మీ లాంటి వాళ్ళతో వ్యవహరించడమెలాగో నాకు నిజంగా తెలీదు. మీరూ కల్యాణిగారూ– ఇద్దరికిద్దరే చనువుగానే ఉంటారుగాని మళ్ళీ చచ్చేటంత భయం. అంటే గౌరవం కాబట్టి భయం. మీ ముందు కూర్చునేసరికి చాలా అల్పుడిగా ఫీలవుతాను ఎందుకో. ఇందిర లాంటివాళ్ళయితే ఆ భయం లేదు ఇందిరను చూసి నేను భయపడవలసింది ఏమీలేదు"

ఆ మాట విని కిలకిలా నవ్వింది వసుంధర. "ఏం, ఎందుకు భయపడరూ? అంత స్నేహమా మీకు ఇందిరతో?" అంది

"ఆ స్నేహాలకేం లెండి! ఒకప్పుడు అదంతా, ఇప్పుడు అంతా మారిపోయింది."

"బాధ పడుతున్నారా? బాధపడేంత స్నేహముండేదా ఇందిరతో?"

"బాధపడే స్నేహాలు కావులెండి అవి. నడిచినన్నాళ్ళు హాయిగా నడుస్తుంది. ఆ తరువాత ఎవరితోవ వాళ్ళది."

"కృష్ణమూర్తిగారూ! నే నొకటడుగుతాను - దాచుకోకుండా చెప్తారా?"

"అడగండి. మీ దగ్గర నాకేం దాపరికంలేదు. అంత దాచుకోవలసినవీ నాకు ఏం లేవు కూడా– కాని, మీ మీద గౌరవం కొద్దీ కొన్ని విషయాలు మీకు చెప్పలేకపోవచ్చు అంతే. నా గురించి మీకు లేనిపోని అభిప్రాయాలేవో కలిగి, అందుమూలాన మీ స్నేహం పోగొట్టుకోవడం నా కిష్టం లేదు–"

అతని మాటలకు వసుంధర అడ్డొచ్చి "ఆ భయం మీకు ఎన్నడూ వద్దు కృష్ణమూర్తిగారూ! మీరు ఏం చేసినా, మిమ్మల్ని గురించి ఎవరెన్ని చెప్పినా నేను మారిపోయి మిమ్మల్ని దూరం చేసుకోను. నమ్మండి నా మాట సరేనా?" అంది

"థాంక్స్ వసుంధరగారూ! చాలా కృతజ్ఞుడిని."

"ఇప్పుడు చెప్తారా? అడగనా?"

"అడగండి"

"సరే అయితే. అడిగేస్తాను ఒకప్పుడు – మీకు ఇందిర దగ్గిర స్నేహితురాలా?"

కృష్ణమూర్తి జవాబు చెప్పలేదు. "చూశారా? తీరా అడిగితే చెప్పరుగదూ పోనీ లెండి, అలాంటి విషయాలు అడక్కూడదన్నమాట" అంది వసుంధర

కృష్ణమూర్తి కొంచెం బాధగా, "దయచేసి మీరలా అనుకోవద్దు. మీదగ్గర నాకేం దాపరికం లేదు ఇందిర గురించి నన్నేమీ ఎక్కువ అడక్కండి. అంతే ఇకముందు మీ గౌరవాన్ని నిలబెట్టే పద్ధతిలో ప్రవర్తిస్తాను" అన్నాడు.

వసుంధర కొంచెంసేపు మౌనంగా ఊరుకుంది. తరువాత నెమ్మదిగా, జీరవోయిన కంఠంతో, "అర్థమైంది కృష్ణమూర్తిగారూ! ఇంకెప్పుడూ అడగనులెండి. అలాగే మీరుకూడా యింకెప్పుడూ ఇందిరగురించి ఆలోచించకండి" అంది.

"జన్మలో ఆలోచించను. ఆ మాటకొస్తే యిదివరకుకూడా ఆవిడ గురించి సీరియస్‌గా ఆలోచించలేదు."

దూరాన గట్టుమీద దీపాలు వెలుగుతున్నాయి కాని, వాళ్ళిద్దరూ కూర్చున్న చోట చీకటి వలయం ఆక్రమించి ఉంది పొడలుదేరిన ఆ చీకటి పాయలలో ఒకరి కొకరు సరిగా కనబడడంలేదు. ఐనా కృష్ణమూర్తి వేపే చూస్తూ, "ఇత నెంత మంచివాడు! వెతికినా ఎక్కడా కల్మషంలేదు హంస లాంటివాడు. బురదను కెలికే అలవాటు లేకపోలేదుగాని అది యితన్నేమీ అంటుకోలేదు. ఆ సంగతి దాచుకోవాలనే తత్వంకూడా లేదు. ఇలాంటి మనిషికి దూరంగా ఉండాలని పిన్ని సలహా!" అనుకుంది అప్రయత్నంగా అతని చెయ్యి తన చేతుల్లోకి తీసికొని "కృష్ణమూర్తిగారూ!" అంది

కృష్ణమూర్తి ఉలిక్కిపడ్డాడు లిప్తపాటు భయంతో అతని శరీరం కంపించింది. ఎర్రగా కాల్చిన యినప కణికలు తన చేతిని నొక్కేస్తున్నట్లనిపించింది మరుక్షణంలో ఆ యినుప కణికలే మందార పుష్పదళాలవలె మృదువుగా, కోమలంగా స్పృశించి మధురానుభూతి నిచ్చాయి. ఇంతలోనే గుండెల్లో మెరుపు మెరిసింది. ఈ అమ్మాయి తనను పరీక్షిస్తోంది! పరీక్షలో తను నెగ్గాలి, తప్పదు ఓడిపోతే తనమీద తనకే అసహ్యం వేస్తుంది.

నెమ్మదిగా చెయ్యి వెనక్కి తీసుకొని, "ఏం వసుంధరగారూ!" అన్నాడు.

"ఏం లేదు. మీకు చలి వెయ్యడంలేదూ?"

"వేస్తోంది."

"నాకు వెయ్యడంలేదు సుమండీ! చాలా బాగుందిక్కడ. రాత్రంతా ఇక్కడే ఉండిపోతే బాగుండుననిపిస్తుంది కాని, అలా కుదరదు కాబట్టి పోదాం పదండి"

"లెండి, మరీ చీకటైపోయింది. ఇంకా లేటయితే మీ పిన్నిగారికి కోపం వస్తుంది"

"ఇప్పటికే వచ్చుంటుంది. రానివ్వండి, ఏం చేస్తాం? ఈమధ్య మరీ అధ్వాన్నంగా తయారైంది పిన్ని. ఇదివరకిలాలేదు సుమండీ! పోనీలెండిగాని-ఉత్తరోత్రా నాకేదైనా ఆపదొస్తే మీరు కాపాడతారా?" అంది చిలిపిగా వసుంధర.

"అలాంటి దురదృష్టం మీకు రాదులెండి."

"ఒకవేళ వస్తే?"

"నేను మనిషిని వసుంధరగారూ! మేకను కాను అది జ్ఞాపకం పెట్టుకోండి, వెధవ యూనివర్సిటీ పరీక్షలుతప్ప ఇంకే పరీక్షలైనా నాకు భయం లేదు" అన్నాడు కృష్ణమూర్తి.

"థాంక్స్! బతికినన్నాళ్ళు మనిషిలాగే బతకండి."

ఇద్దరూ గట్టుచేరారు. "రెండు రిక్షాలు మాటాడుతానుండండి. మిమ్మల్ని ఇంటిదాకా దిగబెట్టి, రిక్షాలోనే వెనక్కిపోతాను" అన్నాడు కృష్ణమూర్తి

"అలాగే చేద్దాం. అలా మీ డాక్టరుగారి ఇంటిమీదుగా వెళ్ళి ఆయన్నొకసారి పలకరించి వెళదాం."

"ఎందుకు లెద్దురూ! అప్పుడే తొమ్మిదిన్నర దాటింది. మీరు తిన్నగా ఇంటికి వెళ్ళండి."

వసుంధరకి చిరాకేసింది. "నాకులేని కంగారు మీకు దేనికండీ? ఇద్దరం కలిసి వెళితే మీ డాక్టరుగారేమైనా అనుకుంటారా? అలాగైతే చెప్పండి, పోతాను" అంది

"ఛాఛా! అలాంటి ఆలోచనలు పెద్దమనుషులకి వస్తాయిగాని, మా డాక్టరు కేమండి! అతనికి అలాంటి ఆలోచనలురావే? పెద్దమనిషి కాడుగా?" అన్నాడు కృష్ణమూర్తి.

"అయితే పదండి. ఓసారి పలకరించి వెళదాం."

కృష్ణమూర్తి మరి మాటాడలేదు ఇద్దరూ రిక్షాలెక్కి ఒకరి వెనుక ఒకరు సాగిపోయారు.

చక్రవర్తి ఇంటిదగ్గర రిక్షాలు ఆగేటప్పటికి వీధితలుపు వేసి వుంది. కృష్ణమూర్తి తలుపుతట్టిన కాస్సేపటికి డాక్టరు తలుపుతీసి, అతని వెనకాలే ఉన్న వసుంధరను చూసి, "ఓ ఇద్దరూ వచ్చారే! చాలా సంతోషం, రండి వసుంధరగారూ! లోపలికి రండి ఫరవాలేదు" అన్నాడు.

వసుంధర నవ్వుతూ, "నాకా హామీలేమీ అక్కర్లేదండీ! ఫరవాలేదు గనకనే వచ్చాను" అంటూ లోపలికి ప్రవేశించింది. అక్కడ సోఫాలో కూర్చున్న కల్యాణిని చూసి తన కళ్ళను తనే నమ్మలేనంత ఆశ్చర్యపడి, "అన్యాయం, అన్యాయం!" అని గట్టిగా అరిచింది.

డాక్టరు చిరునవ్వు నవ్వుతూ– "ఏమిటండీ అన్యాయం?" అన్నాడు.

"మా కల్యాణిని యిక్కడ దాచేసిన సంగతి చెప్పనైనా లేదు మీరు?" అంది.

కల్యాణి కొంచెం జంకుతోకూడిన ధైర్యంతో, "అయనేం దాచెయ్యలేదు నేనే వచ్చి దాక్కున్నాను" అంది.

డాక్టరు హడావిడిగా లోపలికెళ్ళి రెండు ప్లేట్లలో అరటిపండ్లు, బిస్కట్లు తీసికొచ్చి వసుంధరకూ కృష్ణమూర్తికి యిచ్చి "తీసికోండి" అని, వసుంధరవేపు తిరిగి "మీరు కృష్ణమూర్తిని చెడగొట్టేస్తున్నారు వసుంధరగారూ! వాడసలే చదువులో మొద్దవతారం ఇంక జన్మలో వాడు బియ్యే పాసవకుండా చేస్తున్నారు మీరు. మీకేం, మీమట్టుకు మీరు హాయిగా అన్ని పరీక్షలూ ప్యాసై–" అంటూండగానే వసుంధర అడ్డొచ్చి "చెడగొడితే చెడగొట్టానులెండి, వెధవ బియ్యే. అంతకన్న ముఖ్యమైన పరీక్షల్లో ఫస్టు మార్కులు తెచ్చుకున్నాడు. అతని సంగతికేంగాని, మీరు మా కల్యాణిని చెడగొట్టలేదూ?" అంది.

"డాక్టరుగారిని ఏం అనొద్దన్నానా!" అంది కల్యాణి.

"అనములేగాని, నువ్విక్కడ ఎలా తేలావో అది చెప్ప ముందర. రాత్రి పది గంటలకు ఇక్కడేం చేస్తున్నావు?" అంటూ వసుంధర కల్యాణి పక్కగా సోఫాలో కూర్చుని ఆమె రెండు చేతులూ తన వొళ్ళోకి తీసుకుంది.

డాక్టరు అడ్డొచ్చి, "నే చెపుతా వినండి! సాయంత్రం కల్యాణి మీ యింటికనే బయలుదేరితే నేనే అడ్డుపడి ఇక్కడికి తీసికొచ్చాను. మీ రెలాగూ ఇంట్లో ఉండరు ఇద్దరూ కలిసి సినిమాకు చెక్కేశారుగా! ఇంతకూ ఎలాగుంది సినిమా? ఏ పిక్చర్‌కి వెళ్ళారు?" అన్నాడు

వసుంధరా కృష్ణమూర్తి ఒకరి మొహంలోకి ఒకరు చూసుకుని నవ్వుకున్నారు

"ఇంగ్లీషు పిక్చరోయ్! చాలా బాగుందిలే!" అన్నాడు కృష్ణమూర్తి.

వసుంధర పకపక నవ్వేసి, "పిక్చరూలేదు నా తలకాయాలేదండీ! ఆ ప్రోగ్రాం కాన్సెల్. ఇద్దరం కలిసి బేకరీలో టీ తాగి అలా బీచిలో కూర్చుని కాస్సేపు కబుర్లు చెప్పకొని వచ్చాం" అంది.

"ఆ సంగతి తెలిస్తే మేమూ అక్కడికే వద్దుమే! ఇవాళ కల్యాణి పుట్టినరోజు తెలుసా?" అన్నాడు.

ఆ మాట విని చివాలున లేచి నుంచున్నాడు కృష్ణమూర్తి "నిజమే?" అన్నాడు.

"చెప్పావు కావేం కల్యాణీ? నాక్కూడా చెప్పకుండా డాక్టరుగారికి చెప్పావా? పోనీలే!" అంది వసుంధర.

కల్యాణి నవ్వుతూ, "సాంతం వినకుండా అలా అభాండాలు వేస్తే ఎలాగ వసుంధరా? మీ ఇంటికనే బయల్దేరాను. మధ్యలో డాక్టరుగారు తారసిల్లి, నువ్వు ఉండవని చెప్పి యిక్కడికి లాక్కొచ్చారు. సినిమా టైమయాక మీ ఇంటికి వద్దామనే కూర్చున్నాను, పోదాం పద" అని డాక్టరువేపు తిరిగి, "దిగబెడతానన్నారు డాక్టరుగారూ! మాట నిలబెట్టుకుంటారా?" అంది.

డాక్టరు లేచి, టేబులుపై కారుతాళాలు తీసికొంటూ, "పదండి ఇప్పటికే చాలా

రాత్రయింది. నువ్వు కూర్చో కృష్ణమూర్తీ. వీళ్ళిద్దర్నీ డ్రాప్‌చేసి ఇప్పుడే వచ్చేస్తాను?" అన్నాడు.

"నేనూ పోతానోయ్, రూమ్‌కి పోతాను. రేపు కలుసుకుందాంలే" అని అతనుకూడా వెళ్ళడానికి సిద్ధపడ్డాడు.

చీరా, టాయ్‌లెట్ కేసు పొట్లాలు తీసి చేతితో పట్టుకున్నాడు డాక్టరు. కల్యాణి ఆఖరిసారిగా అన్నట్లు "సారీ డాక్టరుగారూ! అవి ఇక్కడ ఉంచెయ్యాలి. నన్ను, నన్ను క్షమించండి" అంది

"ఏమిటవి కల్యాణీ?" అంది వసుంధర.

కల్యాణి, "మరేమున్నాయి. నా పుట్టినరోజుకి డాక్టరుగారిచ్చిన తృణమోపణమో కాన్కలు. ఓ డబ్బయి రూపాయలు ఖరీదు చేసేవి. అంతే."

డాక్టరు ఏమనుకున్నాడో ఏమో రెండూ తీసికెళ్ళి ఆల్మైరాలో దాచేసి, "వద్దులెండి, మీరవి తీసుకెళ్ళవద్దు, పదండి" అన్నాడు

అదంతా గమనిస్తున్న కృష్ణమూర్తి కిమ్మనలేదు.

కల్యాణీ వసుంధరా ఇంటికి చేరుకునేసరికి పదిన్నరయింది. పిన్ని విసుక్కుంటూ తలుపుతీసి కల్యాణిని చూసి, "మీరిద్దరూ ఎక్కడ కలిశారూ?" అంది.

"ముందు లోపలికి రానివ్వు, చెపుతాం" అంది వసుంధర విసుగ్గా

ఇద్దరినీ లోపలికి రానిచ్చి తలుపు గడియపెట్టేసింది పిన్ని. "భోంచేశారా?" అంది.

"లేదు, ఎక్కడ చేస్తాం? ఇవాళ కల్యాణి పుట్టినరోజు. ఇక్కడే భోంచేస్తుంది" అంది వసుంధర.

ఆ మాట వినిపించుకోకుండా పిన్ని, "అదేమో... అవన్నీ నాకేం తెలుసు? మొగరాయిళ్ళలా అర్ధరాత్రిదాకా షికార్లు తిరుగుతూంటే, ఏ హోటల్‌లోనైనా తినేసి వచ్చారనుకున్నాను. ఆ అమ్మాయిని పిలుస్తావని చెప్పనయినా లేదు నువ్వు. మళ్ళీ కుంపటి వెలిగించమంటావా?" అంది సాగదీస్తూ.

వసుంధరకి ఎంతైనా కోపంవచ్చింది కాని– అంతా మింగేసి, "అదేమిటి పిన్నీ! అలాగంటావ్! త్వరగా వెలిగించుమరి! ఎంతసేపు – అరగంటలో అయిపోతుంది. ఈ లోపుగా మేం అరుగుమీద కూర్చుని కబుర్లుచెప్పుకుంటాం" అంది. పిన్ని మారుమాటాడకుండా లోపలికి వెళ్ళిపోయింది. వసుంధర వీధితలుపు తీసేసి, లైటు స్విచ్చివేసి, "కాస్సేపు హాయిగా కుర్చీలో కూర్చొని పేపరు చూస్తూండు కల్యాణీ! అయిదు నిముషాల్లో వస్తాను... కాస్త మొహంకడుక్కుని బట్టలు మార్చుకుంటాను" అంది. "వెళ్ళిరా" అంది కల్యాణి.

అరుగుమీద కుర్చీలో కూర్చుంది కల్యాణి. సాయంకాలపురాత్రేమో అర్ధరాత్రి దాటినట్లుగా ఉంది. డాక్టరుతో సంభాషణ ఆమె చెవుల్లో ఇంకా రింగుమంటోంది. విచిత్రమైన మనిషి డాక్టరు. ఆ మనిషి బతుకులో అంత వెలితి ఉందని తన కిదివరకు తెలీదు. అంత ఎక్స్‌రేకళ్ళతో తనను పరిశీలిస్తున్నాడనీ తనకు తెలీదు. మళ్ళీ తను ఇంకో వ్యామోహంలో పడుతున్నదా? తిరిగి జీవితంలో ఇంకో అనుబంధం. ఇదికూడా గాయపరచదు గదా? తనకెందుకో అలా అనిపించడంలేదు. ఏమో... జీవితంలో దేన్ని నమ్ముకునీ లాభంలేదు. ఈ జీవితానికి చరమోత్కర్ష ఒక్కటే... డబ్బు దాన్ని

సంపాదించాలి ముందు. ఎక్కడైనా ఉద్యోగం దొరికితే బాగుండును. టెలిఫోన్ ఆపరేటర్ ఉద్యోగానికి అభ్యంతరం లేకపోతే ప్రయత్నిస్తానన్నాడు ఇల్లుగలాయన అభ్యంతరం అంటే తనకి నవ్వొచ్చింది. దొరకాలేగాని తనకేం అభ్యంతరం లేదు. మున్ముందు తనకి కావలసింది ఓ వ్యక్తిత్వం– ఓ గూడు. అప్పుడు తరువాత విషయా లాలోచించుకోవచ్చు. ఏనాడో విరిగిపోయిన తన స్వప్నాలను మళ్ళీ జ్ఞాపకం చేశాడు డాక్టరు. ఛా–జీవితంలో నిర్ణయాలు తీసికోవడం ఎంత కష్టం! హఠాత్తుగా ప్రకాశం జ్ఞాపకం వచ్చాడు కల్యాణికి ఇప్పుడెక్కడున్నాడో అనుకుంది అతన్ని తలచుకొంటే తనకిప్పుడు ఏ అనుభూతీ కలగడంలేదు. ఏ మనిషికోసం ఒకప్పుడు భోరున ఏడ్చిందో ఆ మనిషి తన కిప్పుడు ఏమీ కాడు. ఆనాడు తన గాథను ప్రకాశంతో చెప్పుకొంది; ఈనాడు డాక్టరు–ఆయన గాథ తనతో చెప్పుకొన్నాడు. తన సంగతే తనకు సరిగా తెలియడంలేదు.

"ఏం కల్యాణీ!"

ఉలిక్కిపడి వెనక్కి చూసింది, వసుంధరపిన్ని గుమ్మం దగ్గర నుంచుంది.

"కులాసాగా ఉన్నావా అమ్మాయ్!"

"ఏదో నడిచిపోతోంది పిన్నిగారూ!"

"నడవకేం! నీలాంటివాళ్ళకి బాగానే నడుస్తుందిలే అమ్మా!"

దెప్పిపొడుపు! ఊరుకుంది తను.

"పోనీలే.. పండగనాడు బొట్టుపెట్టి పిలిచినా రానిదానివి యివాళ నిశిరాత్రి షికార్లతరువాత ఊడిపడి వండించుకు మరీ తింటున్నావు– అదెంత కాదు!" అనేసి పిన్నిగారు విసురుగా లోపలికి వెళ్ళిపోయింది

కల్యాణికి కాళ్ళకింద భూమి కదిలినట్లైంది. పిన్నిగారి ఒక్కొక్క మాటే విషంపూసిన బాణంవలె ఆమె గుండెల్లో గుచ్చుకుపోయింది. పొద్దున్నుండి తను- ప్రయత్నిస్తున్నదాని కంతటికీ ఇదన్నమాట పర్యవసానం! ఇవాళ తన పుట్టిన రోజు. తనకి పునర్జన్మ వచ్చిన రోజనుకుంది. ఏ వాతావరణం నుండి తుదిసారిగా తప్పించుకోవాలనుకుందో, ఏ అభియోగాలను అబద్ధమని నిరూపించి బతకాలనుకుందో–అవే మళ్ళీ పిన్నిగారి రూపంలో వికటాట్టహాసం చేస్తున్నాయి! గుండె ఇనుపగుండులా బరువెక్కిపోయి నరనరాల్నీ గుంజేస్తూంది ఇక్కడింకొక్క క్షణం ఉండకూడదు. పారిపోవాలి–దూరంగా, చాలా దూరంగా పారిపోవాలి.

"వసుంధరా!" బిగ్గరగా అరిచింది.

"ఏం కల్యాణీ! వచ్చేస్తున్నా." గదిలో బట్టలు మార్చుకుంటూన్న వసుంధర కేక వేసింది.

"నే వెళుతున్నా, మరచిపోయాను. అర్జంటు పనుంది. క్షమించు. రేపు కలుసుకుందాంలే."

"అదేమిటి కల్యాణీ! వస్తున్నా నుండు."

"క్షమించు వసుంధరా! వెళ్ళిపోవాలి." గబగబా మెట్లుదిగి గేటు తలుపుతీసుకుని చీకటిలోకి వెళ్ళిపోయింది కల్యాణి

వసుంధర కంగారుగా గదితలుపుతీసి, చీరకుచ్చెళ్ళు సరిచేసుకుంటూ హాలులోంచి వీధి వరండాలోకి  వచ్చేసరికి ఆమె అక్కడలేదు. హడలిపోయి వసుంధర గేటు తెరుచుకుని వీధిలో పడింది. ఆమె అప్పుడే  చాలా దూరం నడిచింది. "కల్యాణీ" అని ఒక్క పొలికేక వేసింది.

ఆమె వెనక్కి తిరగలేదు.

"వెనక్కిరా కల్యాణీ! ఒక్కమాట."

"క్షమించు వసుంధరా! రేపు కలుసుకుందాం." దూరంనుండి అరిచింది కల్యాణి

"కల్యాణీ!" కంఠనరాలు తెగేటట్టు ఒక్కసారి అరిచి, నాలుగడుగులు ముందుకు వేసి ఆగిపోయింది  వసుంధర  వీధి నిర్మానుష్యంగా ఉంది. అక్కడా, అక్కడా వీధి దీపాలు కాంతి వలయాలు వేసినా, మొత్తంమీద చీకటిగానే ఉంది  ముందుకు అడుగు వెయ్యడానికి భయం. ఈ అర్ధరాత్రి ఎక్కడికి  వెళుతుంది కల్యాణి? ఏం జరిగిందసలు? భగవాన్! ఏమిటీ పరిస్థితి? ఏం చెయ్యాలి తనిప్పుడు? వసుంధరకి భయం వేసింది. తనే పిలిచి ఇంటికి తీసుకువచ్చింది. అభిమానంతో తనింటికి వచ్చింది పిలిస్తే. తను బట్టలు మార్చుకునేలోపున ఏం జరిగింది?

లోపలికి వచ్చి అరుగుమీద కుర్చీలో కూలబడింది వసుంధర. రెండు చేతులతోనూ మొహం కప్పేసుకుంది

"పిన్నీ!" గట్టిగా మూలిగింది, బాధతో దుఃఖంతో

"ఏం అమ్మాయ్?" అని బదులుపలికి గుమ్మందగ్గర కొచ్చింది పిన్ని

"కల్యాణిని ఏం చేశావ్ పిన్నీ నువ్వు?" దీనంగా మొహం పైకెత్తి అడిగింది బొంగురుపోయిన  గొంతుక, కళ్ళలో నీళ్ళు, ధన్ ధన్‌మని కొట్టుకునే గుండె, చెవుల్లో స్పష్టంగా, రోకటి పోటువలె  వినిపిస్తోంది.

"బాగుంది వరస! నేనేం చేశాను?"

"ఏదో చేశావు పిన్నీ! నిజం చెప్పు. అందుకే కల్యాణి పారిపోయింది"

"ఏమిటి వసుంధరా, నువ్వంటున్నదీ? ఎంత మారిపోయావమ్మాయ్! చివరకి చిన్నా పెద్దా విచక్షణకూడా  పోయిందా?"

లోపల పెల్లుబికిపోతున్న దుఃఖం కోపంగా మారిపోయింది  కుర్చీలోంచి లేచి నిలబడింది వసుంధర.

"విచక్షణ లేకపోయింది నీకా నాకా పిన్నీ? ఇంటికొచ్చిన స్నేహితురాల్ని అర్ధరాత్రి బయటికి గెంటావే..."

"నేనా గెంటాను? గెంటానా నేను? అమ్మయ్యో!"

"నువ్వే నువ్వే నువ్వే! ముమ్మాటికీ నువ్వే. ఏదో అనుంటావు, పోటుకుమాట. లేకపోతే ఆమె  నించున్నపాటున ఎందుకు పారిపోతుంది? అభిమానంగా వచ్చిందే, నాకోసం వచ్చిందే, ఎందుకెళ్ళిపోయింది? మొహం కడుక్కుందామని అలా వెళ్ళొచ్చేలోపల యీ ఉపద్రవ మేమిటి? ఏమన్నావు కల్యాణిని? ఛీ! నీలో ఇంత కుళ్ళుందనుకోలేదు నేను..."

"వసుంధరా!" పిన్నిగారు స్థాయి హెచ్చించింది "ఎవరితో మాటాడుతున్నావో తెలుసా? అంత  నెత్తికెక్కాయా కళ్ళు? ఈ యింట్లో యింకొక్క క్షణం ఉండను

నేను. ఇప్పుడే మీ అన్నయ్యను టెలిగ్రామిచ్చి పిలిపించి నీ సంగతేమిటో తేలుస్తాను. నువ్వూ—నీ మొగాళ్ళతో షికార్లూ—"

"నో—ర్మూ—య్!" గుండెలు దద్దరిల్లేటట్లు ఆ పెనుకేకకు ఆ రాత్రి నిశ్శబ్దమే వణికిపోయింది. గదిగోడలు గిరగిరా తిరిగిపోయాయ్. పిన్నిగారు హడలిపోయి నేలమీద కూర్చుండిపోయింది.

"మాటలు తిన్నగా రానీ పిన్నీ! నీ యిష్టం వచ్చినవాళ్ళకు టెలిగ్రామిచ్చి పిలిపించు. తక్షణమే మూటాముల్లె కట్టి నీ యిష్టమొచ్చిన చోటికి వెళ్ళు. ఈ క్షణం నుండీ నీకూ నాకూ సంబంధం లేదు. నోరెత్తవా—జాగ్రత్త!" వివరంగా అనేసింది వసుంధర, ఉన్మాదినివలె. ఉద్వేగం అవధులు దాటింది ఇల్లూ వాకిలీ— గతం వర్తమానం— అన్నయ్యలూ అధికారం—అన్నీ ఆమెలో ఆ క్షణంలో ప్రజ్వరిల్లిన క్రోధాగ్నిలో భస్మమైపోయాయి; పరాభవాగ్ని ఒక్కటే దేదీప్యమానంగా గుండెల్లో వెలిగిపోతున్నది. ఎక్కడికెళ్ళింది కల్యాణి యీ అర్ధరాత్రి చీకటిలో? సరిగ్గా యిల్లు చేరుకుంటుందా? ఏ అఘాయిత్యానికైనా తలపడుతుందా?—ఛా ఛా! అలాంటిపని చేయదు. రేపు కలుసుకుందాం అందిగా! నీటిలో మునిగిపోతోంది వసుంధర. అట్టడుక్కి మునిగిపోతోంది. నీళ్ళు తాగేసింది. రేపు కలుసుకుందాం – ఆ వాక్యమొక్కటే గెడ్డిపోచ. దాన్నే హృదయంలో గట్టిగా అదిమి పట్టుకుంది వసుంధర. కుర్చీలో అలాగే కూర్చుండిపోయింది. నిద్రకాదది. మెలకువా కాదు. శస్త్రకారుని కత్తికింద రోగివలె చైతన్యరహితంగా, వేదనతో అలా కళ్ళుమూసుకు కుర్చీలో ఉండిపోయింది. తరువాత పిన్నిగారే లేచి – గేటు తలుపులు తాళం వేసి గడపదగ్గర కొంగు వాల్చుకొని పడుకుంది.

విసురుగా నడుస్తూ సందు మలుపు తిరిగేసరికి కల్యాణికి రోడ్డుమీద మనుష్యుల అలికిడి కొంచెం ధైర్యం యిచ్చింది భయంలేదు, లోకం యింకా మేలుకొనే ఉంది ఈరోజు చివరికిలా ముగిసిందేమిటి? తన పుట్టినరోజు దినం; తను పునర్జన్మ పొందిన దినం! ఇలా పరాభవంతో ముగియవలసిందేనా? వీల్లేదు. ఎక్కడుంది. తనిప్పుడు? ఎక్కడికి పోవాలి? గదికి వెళ్ళాలా? ఆం డాక్టరుగారి యిల్లు పక్కవీధిలోనే. మెరుపులా ఆమెకొక ఆలోచన తట్టింది.

గదిలో వెచ్చగా రగ్గు కప్పుకుని పడుకుని పుస్తకం చదువుకుంటున్న డాక్టరుకు తలుపు చప్పుడైనట్లుగా వినిపించి, "ఎవరూ?" అని పక్కనుంచి లేవకుండానే అరిచాడు. అర్ధరాత్రి తలుపు కొట్టడాలు అతనికలవాటే. చెవి పోటు పెడుతోందని వచ్చేవాళ్ళనుండీ, ప్రాణంమీదకు వచ్చినవాళ్ళ తాలూకువాళ్ళదాకా, రకరకాల పేషెంట్లు అతన్ని రాత్రిళ్ళు సరిగా నిద్రపోనివ్వరు మళ్ళీ తలుపు చప్పుడు విని విసుక్కుంటూ వెళ్ళి లైటు స్విచ్ వేసి తలుపు తీశాడు

తన కళ్ళను తనే నమ్మలేకపోయాడు ఎదురుగా కల్యాణి!

"లోపలికి రావచ్చునా?" అంది భయపడుతూ. ఆ అమ్మాయి చెయ్యిపట్టుకుని ఆమె నొక్క గుంజు గుంజి లోపలకు తీసుకొచ్చి తలుపు వేసేశాడు డాక్టరు చక్రవర్తి

కల్యాణి అలాగే కొయ్యలా నిలుచుండిపోయింది.

"ఇదేమిటి కల్యాణిగారూ? ఏం జరిగింది?" అన్నాడు.

కల్యాణి గబగబా వెళ్ళి సోఫాలో కూలబడింది

ఆమె పక్కనే కూర్చుని "ఏమిటి జరిగింది కల్యాణిగారూ?" అన్నాడు కంగారుగా

కల్యాణికి ఒక్కపెట్టున దుఃఖం వచ్చేసింది. ఆమె భుజంమీద చెయ్యివేసి "ఛా! అదేమిటి? ఏం జరిగింది? ఎవరేం చేశారు మిమ్మల్ని? చెప్పండి, నేనున్నానుగా? మీకేం భయంలేదు" అన్నాడతను.

కల్యాణి అతని ముఖంలోకి ఒక్కసారి చూసింది. అకస్మాత్తుగా రెండుచేతులూ అతని భుజాలమీద వేసి "డాక్టరుగారూ!" అని అతని ఒళ్ళో వాలిపోయింది. అతను ఆమెనింకా దగ్గరకు తీసుకుంటూ, "మీకేం భయం లేదు. నేనున్నానుగా! ఛా! అలా కన్నీళ్ళు పెట్టుకోకూడదు" అన్నాడు

అతన్ని అలా పట్టుకుని, యింకా వెక్కి వెక్కి ఏడుస్తూ "పెట్టుకోను డాక్టరుగారూ! ఏడవను. ఏడవను డాక్టరుగారూ!" అని భోరున ఏడ్చేసింది.

అతను నెమ్మదిగా ఆమెను విడిపించుకుని, పక్కగా కూర్చుని, "కాస్సేపు అలా పడుకోండి, తరవాత మాటాడుదురుగాని" అన్నాడు.

## 18

డాక్టరు యిల్లు వదిలిపెట్టి చరచరా నడుచుకుంటూ మెయిన్‌రోడ్డు మీదకు వచ్చిన తరువాత హఠాత్తుగా కృష్ణమూర్తికి ఒకటి జ్ఞాపకం వచ్చింది–తనకి ఆకలి వేస్తున్నది! విపరీతమైన ఆకలి. ఎంచేత చెప్మా? అనుకున్నాడు సాయంత్రము వసుంధరతో కలిసి బేకరీకి వెళ్ళినప్పుడు అక్కడ కేకులూ అవీ తిన్నాడు; ఇప్పుడిప్పుడే డాక్టరింట్లో బిస్కట్లు తిన్నాడు. ఐనా రాక్షసి ఆకలి వేస్తోంది. కొంపతీసి యిదో జబ్బు కాదుకద? లేకపోతే ఎంత తిన్నా యింకా ఇదేమిటి? బుర్రలో ఏదో మెదిలి తనలో తనకే నవ్వొచ్చింది. కొన్ని కొన్ని సంతోష ఘడియల్లో ఆకలి వెయ్యదంటారు మరి? తను అలాంటివాడు కాదన్నమాట. అంత సున్నితత్వం తనలో లేదు. శుద్ధ మామూలు మనిషి సాయంత్రంనుండీ జరిగిన అనుభవాలన్నీ ఒక్కసారి బుర్రలో మెదిలాయి తలుచుకుంటే తనకే భయం వేస్తోంది. అవేవీ తన తత్వానికి సరిపడని సంగతులు వసుంధర విచిత్రమైన మనిషి. తనలో లేనిపోని విలువలేవో ఉన్నాయనుకుంటోంది అనుకొని గౌరవించుతోంది. తనేం చేయాలిప్పుడు? ఇలాంటి గొడవల్లో పడితే ఎక్కడికి తేలతాడు తను? మళ్ళీ మార్చి పరీక్షలకు డబ్బు కట్టాడు. అప్పుడప్పుడు ఆ విషయము జ్ఞాపకం వచ్చి కొంచెం బాధగానే ఉంటుంది గాని, ఏం చెయ్యడం?

ముందు కడుపులో యేదైనా పడాలి అనుకుని, ఏదైనా హోటల్ తెరిచి ఉందేమో చూడటానికి అలా నడుచుకుంటూ పోయాడు పదిన్నర అవడంతో కాస్త శుభ్రమైన హోటల్ దొరకదు. ఏదైనా సినిమా హాలు దగ్గరికి వెళితే కొంచెం మేత దొరుకుతుంది. దిక్కులు చూస్తూ నడుస్తూంటే – అతనికి రిక్షాల ప్రవాహం యెదురైంది. ఏదో సినిమా ఒదిలేశారు అనుకున్నాడు. ఎదురుగా వస్తున్న ఓ రిక్షా తనను చూసి ఆగినట్లుగా ఆగింది.

"హల్లో కృష్ణమూర్తీ!" అంటూ అందులోంచి ఛంగున ఉరికింది ఇందిర

అతను ఉలిక్కిపడ్డాడు ఇందిర! ఎంతకాలమైంది యీ అమ్మాయిని చూసి! ఎంత మామూలుగా పలకరించేస్తోంది!

"హల్లో ఇందిరా! ఎక్కణ్ణించి?" అన్నాడు

"మరెక్కడనుండీ! సినిమానుంచోయ్ వెఱ్ఱివాడా - సినిమానుండి పద్దెనిమిదివేల అడుగుల పటం! ఏమనుకున్నావో!"

"వెరీగుడ్. ఇంటికేనా?"

"దురదృష్టవశాత్తూ ఇంటికే, నువ్వూ?"

"డిటో."

"అంటే? - మా ఇంటికా?"

"భయపడకు. అంత ప్రమాదం లేదులే. మా ఇంటికే పోతున్నాను."

రిక్షావాడిని పిలిచి డబ్బులిచ్చేసింది ఇందిర. "ఇంకక్కరలేదబ్బాయ్. నువ్వు పో" అనేసింది అతనివేపు తిరిగి "ఆల్ రైట్ కృష్ణమూర్తీ! ఎవరిళ్ళకు వాళ్ళం పోదాంగాని మాజీ స్నేహితుడివి గదా - కాస్త మా ఇంటిదాకా నన్ను దిగబెట్టకూడదూ?- చాలాకాలమైందీ! ఇద్దరం కబుర్లు చెప్పుకుంటూ హాయిగా నడిచిపోదాం!" అంది

వీధి దీపం కాంతి ఆమెమీద పడుతోంది. ఆమె కట్టిన ఆకుపచ్చని నేత చీర, తెల్ల సిల్కు జాకెట్, నిర్లక్ష్యంగా వదిలేసినట్లు గమ్మత్తుగా దువ్విన జుత్తూ - చేతికి రిస్టువాచీ, బట్టమిల్లు కంపెనీవాళ్ళ ఎడ్వర్టైజ్మెంటులో అమ్మాయిలాగ ఠీవిగా నించున్న ఇందిరను చూసి ఎంత గడుసుదానవు ఇందిరా! అనుకున్నాడు మనసులో అతను.

"ఏవిఁటాలోచిస్తున్నావ్ - జవాబు చెప్పవేం?" అంది ఇందిర

"ఏమీ లేదు. హఠాత్తుగా మళ్ళీ యిలా ఎందుకు మారిపోయావని?"

"ఎవ్వరం మారలేదుగాని - టెక్కు చెయ్యక రావయ్యా!" అంటూ కృష్ణమూర్తి చెయ్యి పట్టుకుంది.

విడిపించుకునే శక్తి అతనిలో లేకపోయింది "చాలా రాత్రయిపోయింది ఇందిరా! రేపు ఎప్పుడైనా వస్తానులే. ఇంకా ఆలస్యమైతే క్యారేజీ మెతుకులు మరీ మేకుల్లా తయారై అంతా చల్లారిపోతుంది" అన్నాడు

"మరేం ఫరవాలేదు. క్యారేజీ మెతుకులు మనకి అలవాటేగా! . మా ఇంట్లో క్యారేజీ సర్దుకుందాం, పద" అంటూ ముందుకు దారితీసింది

నివారించలేకపోయాడు కృష్ణమూర్తి. అదీకాక అతడేదీ ఆలోచించే స్థితిలో ఆ క్షణాన లేడు. బుర్రంతా గందరగోళంగా ఉంది ఒక చెంప ఆకలి, ఇంకొక చెంప వసుంధర గురించి ఆలోచనలు, తన చదువు, తన ప్రవర్తన, కాలం వృధాచేసే బాధ్యతలేకుండా ప్రవర్తిస్తున్నాననే పశ్చాత్తాపం- యివన్నీ కలిపి అతడిని నీరసింపచేశాయి. పోనీ వెళదాం, నిండా మునిగిన వాడికి చలేమిటి అనుకున్నాడు.

"పద, నాకేం అభ్యంతరం లేదు. ఇంటిదాకా దిగబెడతాను ఇంట్లోకి మాత్రం రాను. అక్కడ మళ్ళీ బలవంతం చేసి లాభంలేదు" అన్నాడు.

"పోనీ అదెంత కాదు.. రా!" అంది ఇందిర

రోడ్డువారగా ఇద్దరూ నడక సాగించారు. ఇద్దరికీ ఏదో కొత్తగా ఉంది వెనకటి అప్యాయత అతనిలో చచ్చిపోయింది ఇంకేం మాటాడాలో తోచక – "సినిమా ఎలా ఉంది? ఒక్కదానివీ వెళ్ళావేం?" అన్నాడు

"సినిమాకేం, ఇంచక్కా వుంది. అన్ని వేల అడుగుల పటం గదా, బాగుండక ఏం చేస్తుంది? ఒక్కదానివే అంటావా – సాయంత్రం నుండి ఏమిటో చిరాకుగా ఉంది. ఒక్కదానినే కాస్సేపు గడుపుదామని బయల్దేరాను."

ఇద్దరికీ సంభాషణ నడవలేదు. ఏం మాటాడినా కుంటిగానే అనిపించింది. నెమ్మదిగా నడుచుకుంటూ ఇల్లుచేరుకున్నారు "నేను వెళతాను ఇందిరా!" అన్నాడు.

"ఉండు బాబూ! కొద్ది గుర్రం దిగి మాటాడు. తలుపు తాళం తియ్యనీ ముందు!" అంది

"అదేమిటి? తాళం వెయ్యడమేం? మీ నాన్నగారు ఏమయ్యారు? ఇంకేదైనా సినిమా కెళ్ళారా?"

"ఊళ్ళో లేరు." ముక్తసరిగా అనేసి తలుపు తాళం తీసి వీధిగది దీపం స్విచ్చి వేసింది ఇందిర.

"ఊళ్ళోలేరూ? అదేమిటి?" అన్నాడు అతను... అప్రయత్నంగా తనుగూడా లోపలికి ప్రవేశిస్తూ.

"అదంతేలే.. చెపుతాను కూర్చో" అంటూ ఇందిర లోపలిగదిలోకి పోయింది.

వాలుకుర్చీలో చతికిలబడ్డాడు తను ఎవరిని తలుచుకుని ఇంట్లోకి రావడానికి భయపడ్డాడో, ఆ ఆనందరావు ఇంట్లోలేడు. ఊరు వెళ్ళాడంటుందేమిటి? అతనేవూరు వెళతాడు? ఈ ప్రపంచంలో ఆనందరావుకున్న రాచకార్యాలేమిటి? హాయిగా ఊపిరి పీలుస్తూ బతికేయడం తప్ప – ఆనందరావు కింకే బాధ్యతలూ లేవే? నా అన్నవాళ్ళూ, నా అన్న వూరూ ఏమీలేని అదృష్టవంతుడు కూతురు పోషిస్తూంటే బతికేస్తున్నాడు. పోనీలే, ఎక్కడికో పోయాడు తనకెందుకనుకున్నాడు. మళ్ళీ భయం వేసింది. అంటే ఇందిర ఒంటరిగా ఇంట్లో వుందన్నమాట. ప్రకాశం ఏమైనాడు? అప్పుడెప్పుడో ఇరవై రోజులక్రితం కాబోలు, ఓ తెల్లారకట్ల తనను నిద్రలేపి ఇరవై రూపాయలు బదులడిగాడు ఏ సంగతీ చెప్పకుండా వూరు పోవాలన్నాడు అంతే; మరి కనబడలేదు. తరవాత ఏమైనాడు? ఇందిర నడగాలి

బట్టలు మార్చుకుని వచ్చింది ఇందిర. ఎదురుగా పేముకుర్చీలో కూర్చుంటూ, "హమ్మయ్య... అయ్యింది ఎడ్వంచర్. ఇప్పుడు చెప్పు కృష్ణమూర్తీ! ఏమిటి విశేషాలు?... పాపం, ఆకలి వేస్తోందన్నావు.. భోం చేసేద్దామా?" అంది

"చేద్దాం దానికేంగాని– ఇల్లేమిటో వెలితిగా వుంది ప్రకాశం మకాం ఎత్తేశాడా? ఏమయాడు? మీ నాన్నగారేరీ?"

"వూరు వెళ్ళారని చెప్పాను గదయ్యా!"

"అబ్సర్డ్, ఆయన వూరు వెళ్ళడమేమిటి?"

"అవసరమొచ్చింది వెళ్ళారు. మనుషులకి పనులుండవా?"

"చెబుదూ... వెధవ సస్పెన్సులో పెట్టి చంపక."

"నిజం చెప్పనా? ఆనక వేళాకోళం చెయ్యకేం?"

"ఛాఛా! ఎంత మాట!" అన్నాడు సీరియస్‌గా.

"ఐతే విను, పెళ్ళిసంబంధం వెతకడానికి వెళ్ళాడు."

అతనికి నవ్వొచ్చింది. "ఎవరికి? నీకా? ఆయనకా?" అన్నాడు.

"ముందు అర్జంటుగా నాకు పనిలో పని, మంచి సంబంధం ఏదైనా కుదిరితే ఆయనకి కూడాను. ఏం, తప్పా? దేశ్‌ముఖ్ కంటే మా నాన్న నాలుగేళ్ళు చిన్న; తెలుసా?"

"నిజమేలే. మరి నీ సంగతేమిటి? ఎవడా పెళ్ళికొడుకు? తాంబూలాలు పుచ్చుకుందికి వెళ్ళాడా మీ నాన్న?"

"ఆహా. అందులో కొంచెం కారామసాలా వేసి మరీ పుచ్చుకుంటాడు ఏమిటి నీ వుద్దేశ్యం కృష్ణమూర్తీ? ఎదిగిన పిల్ల ఇంట్లో వుంటే ఏ నాన్నకేనా ఆదుర్దాగా వుండదూ?" అంది ఇందిర.

"నిజమేలే అంచేత ఎదిగిన పిల్ల నొక్కర్తెనీ ఇంట్లో ఒదిలేసి.. సంచారం బయలుదేరాడు నాన్న, ఔనా?"

ఇందిర కుర్చీలోంచి లేచి, "నీలాంటి గార్డియన్ను వుండగా నాకేం భయం? ఆ వివరాలన్నీ తరువాత చెప్తుతాగాని.. ముందు భోంచేద్దాం రా. నాకేమంత ఆకలిగా లేదనుకో. కాని అన్నం తినడం అనేది ఓ డ్యూటీ. అంచేత పద" అంది.

"ఏం? ఆకలి ఎందుకు లేదూ?"

"ఇందాకటి సినిమాలో హీరోని చూశాక కడుపు నిండిపోయిందనుకో హీరో అంటే అలా ఉండాలి. అమాంతం వాడిని ప్రేమించేశాను ఆ విరహంలో ఆకలి చచ్చిపోయింది"

"అంటే, నీది సరిగ్గా నాకు వ్యతిరేక తత్వమన్నమాట. ప్రేమలో పడితే నాకు ఆకలి ఎక్కువవుతుంది" అంటూ తనూ లేచాడు

వంటింట్లో కంచాలు వేసి క్యారియర్ తెరుస్తూ, "అంటే, నీది పవిత్రప్రేమ కాదన్నమాట. నిజమైన ప్రేమికుడు తిండిమాటే తలపెట్టకూడదు తెలుసా?" అంది ఇందిర.

కృష్ణమూర్తి గబగబా అన్నం కలుపుకుంటూ "చచ్చాం పో! ఐతే నేను జన్మలో ప్రేమించను. కోటివిద్యలెల్ల కూటికొరకే అన్నట్లు తిండి తినొద్దనే ప్రేమ నాకొద్దు" అన్నాడు.

ఇందిర విలాసంగా అతని వేపు చూస్తూ, "నే నలాకాదు సుమా! అటువంటి ఘాటు ప్రేమలో పడ్డం అంటూ జరగాలేగాని.. ఆ తరువాత నే నసలు అన్నం ముట్టను" అంది.

"పూర్తిగా మానేస్తావా?"

"ఆహాఁ!"

"మానేసి?..."

"కేవలం పాలు, రొట్టె, పళ్ళరసం, మిఠాయి, బిస్కట్లు, చాకలెట్లు అవి మాత్రమే తిని బతుకుతాను"

"అమ్మయ్యో! అలా ఐతే చిక్కిపోవూ?"

"చిక్కిపోయినా... ఏమైపోయినా అంతే ప్రేమకోసం ఆ మాత్రం త్యాగం చెయ్యొద్దా?"

"అంత త్యాగం చెయ్యాలంటే చాలా డబ్బుండాలి ఇందిరా!" అన్నాడు.

"ఉండొద్దు మరీ! త్యాగమంటే మాటలా ఏమిటి?"

అలాగే మాటాడుకుంటూ అన్నం తిని హాలులో కొచ్చారు ఇందిర అందించిన వక్కపొడి అందుకుని, సిగరెట్టు వెలిగించాడు అతను "వచ్చినపని అయిపోయింది, ఇంటిదాకా నిన్ను దిగబెట్టాను, తీరా వచ్చాను గదా అని అన్నంకూడా తినేశాను ఇంక పోతాను మరీ అర్ధరాత్రిదాటితే లాడ్జివాళ్ళు తలుపులుకూడా తియ్యరు" అన్నాడు.

"నీ ఇష్టం, నీకెలా బాగుంటే అలా చెయ్యి మరీ అంత అర్ధరాత్రి లాడ్జికి వెళ్ళి తలుపులు కొట్టి అక్కడికే వెళ్ళాలంటే వెళ్ళు లేదా ప్రకాశం రూంలో రాత్రికి పడుకుని పొద్దున్నే లేచి వెళ్ళు."

"అమ్మయ్యో! ఇక్కడ పడుకుంటే ఇంకేమైనా ఉందా? ఇరుగు పొరుగువాళ్ళు ఏమనుకుంటారు?"

ఇందిరకి కొంచెం కోపం వచ్చింది. "అలాంటి నంగనాచి కబుర్లు చెప్పే యోగ్యత నీకూ నాకూ ఎప్పుడో పోయింది ఇరుగుపొరుగువాళ్ళు, అసలు ఎవళ్ళో నాకు తెలీదు. వాళ్ళ జోలికి నే నెప్పుడూ పోలేదు నా జోలికి వాళ్ళెప్పుడూ రాలేదు" అంది.

"అదికాదు, ఇందిరా! ఇంట్లో యింకెవరైనా ఉంటే పరవాలేకపోవును ఒంటరి ఆడపిల్లవి, పెళ్ళి కావలసినదానివి."

"నన్నాట్టే విసిగించకు కృష్ణమూర్తీ! ఏదో నాలుగు కులాసాకబుర్లు చెప్పి కాలక్షేపం చేస్తావుకదా అని తీసుకొస్తే – యీ పిచ్చివాగుడంతా ఏమిటి? వెళ్ళిపో బాబూ, వెళ్ళిపో – ఆ వెళ్ళేదేదో త్వరగా వెళ్ళితే తలుపులు వేసుకు పోయిగా పడుకుంటాను వెధవ సినిమాహాల్లో నాలుగు గంటలు కూర్చుని తలనొప్పి వచ్చేసింది"

"ఒక షరతు మీదయితే యిక్కడే ఉండిపోతాను."

"ఏమిటా షరతు?"

"చాలా రోజులకి మళ్ళీ కలుసుకున్నాం. నే నడిగిన ప్రశ్నల కన్నింటికీ దాపరికం లేకుండా జవాబులు చెప్తానంటేనే ఉంటాను"

"ఓ! నీ యిష్టం, ఏవడిగినా చెప్తాను"

"అయితే పద. మేడ గదిలోకి పోయి మాటాడుకుందాం"

వీధి తలుపులు గడియవేసి దీపాలు అన్నీ ఆర్పేసి మేడమీదకి దారి తీసింది ఇందిర. చాలా కాలానికి మళ్ళీ ప్రకాశం గదిలోకి ప్రవేశించాడు కృష్ణమూర్తి ఎన్నెన్నో పాత జ్ఞాపకాలు మనస్సులో మెదిలాయి.

"అమ్మయ్య, అలసిపోయాను బాబూ! కాస్సేపు మంచంమీద వాలితేగాని – నడుం లాక్కొస్తోంది. ఆ వాలుకుర్చీ యిలా దగ్గరగా లాక్కొని కూర్చో" అంటూ ఇందిర మంచంమీద పడుకుంది.

కుర్చీ దగ్గరగా లాక్కుంటూ కృష్ణమూర్తి "మొత్తంమీద నీలో ఒక విచిత్రమైన ఆకర్షణ ఏదో వుంది. జన్మలో యింక నీ గురించి ఆలోచించకూడదనుకున్నాను మీ గుమ్మంలో అడుగు పెట్టకూడదనుకున్నాను. నీ గురించి యింకెప్పుడూ ఆలోచించనని యిందాకనే ఒకరికి మాటయిచ్చాను కూడాను" అన్నాడు

"తెలుసు" అంది ఇందిర బద్ధకంగా. "ఎవరికి అలా మాట ఇచ్చావో తెలుసు. వసుంధర అని నీ కిప్పుడో కొత్త స్నేహితురాలు దొరికింది. ఆవిడకి మాట యిచ్చుంటావు" అంది.

కృష్ణమూర్తికి గుండె ఆగిపోయినంత పనైంది. ఏమిటీ అమ్మాయి? ఎలా పోల్చుకుంది? ఈ పిల్ల మనిషా, దెయ్యమా?

"..ఎవరు చెప్పారు నీకు?"

"ఎవరు చెప్పితేనేం గాని నిజమా, అబద్ధమా? అది చెప్పు ముందు."

"నాకేం అబద్ధం ఆడవలసిన అవసరంలేదు నువ్వనుకున్నది నిజమే. నీ కెలా తెలిసిందనేదే నాకు ఆశ్చర్యంగా వుంది"

"వెర్రివాడా! ఇందులో పెద్ద మిస్టరీ ఏంలేదు. సాయంత్రం మిమ్మల్నిద్దర్నీ చూశాను నేను – బీచికి వెళుతున్నారు ఆవిడ వసుంధర అని నాకు తెలుసు. కల్యాణి క్లాస్‌మేట్. ఒకసారి సినిమాహాల్లో కలుసుకున్నాం కూడా. మీ రిద్దరూ యీ మధ్య జోస్తీగా తిరుగుతున్నారనికూడా తెలుసు. జరుగుతున్న సంగతులన్నీ నా చెవిన పడుతున్నాయిలే. నీకా బెంగ అక్కర్లేదు"

"ఎలా తెలుసు? ఏమిటి తెలుసు?" అన్నాడు కృష్ణమూర్తి, కొంచెం కంగారుగా

"అన్నీ తెలుసు" అంది మళ్ళీ ఇందిర. అది శుద్ధ డబాయింపని కృష్ణమూర్తి గ్రహించలేకపోయాడు కృష్ణమూర్తినీ వసుంధరనూ సాయంత్రం బజారులో చూసినంతవరకూ నిజం. ఆ తరువాతది ఇందిర ఊహించుకుంది. అంతే, ఇందాకనే ఒకరికి మాట యిచ్చాడంటే ఇంకెవరికి యిచ్చుంటాడు? తనను గురించి ఆలోచించవద్దని సలహా చెప్పే అవసరం అతనితో బీచి షికార్లు తిరిగే అమ్మాయికి గాక యింకెవరికుంటుంది? అంచేత గట్టిగా డబాయించింది

ఇంకా ఏం చెబుతుందోనని కృష్ణమూర్తి భయపడిపోయాడు. "పోనీలే – నీ కన్నీ తెలుసు కాబట్టి నేనేం చెప్పనక్కరలేదు నాకేం తెలీదు కాబట్టి నువ్వు చాలా చెప్పాలి నాకు" అన్నాడు.

"అడుగు, చెప్తాను."

"ముందు ప్రకాశం సంగతి చెప్పు."

"ఏముందీ చెప్పడానికి? రాజమండ్రిలో ఓ సంబంధం ఖాయం చేసుకున్నాడు ఎనిమిదివేలు కట్నం. ముహూర్తం రేపు ఫిబ్రవరిలో. పండుగ మొన్ననే వెళ్ళిందిగదూ, యీ నెలాఖరులోగా అతనూ వాళ్ళమ్మా కలిసి యిక్కడ కాపురం పెడతారట అలాగని శేషగిరికి వుత్తరం రాశాట్ట. అతను మొన్నను పనిగట్టుకు నా దగ్గరికి వచ్చి అంతా చెప్పాడు. వుత్తరం కూడా చూపించాడు."

"ఎంత నిర్లిప్తంగా మాటాడుతోంది యీ అమ్మాయి!" అనుకున్నాడు కృష్ణమూర్తి "ఘటికురాలవేలే ఇందిరా! ఆ చెవుల వాజెమ్మని బుట్టలో వేసుకుందికి ఎన్నో విధాల

ప్రయత్నించావు. నీకంటే ముందునుంచీ నాకు ప్రకాశం తెలుసు ఆ సంగతి మరచిపోకు మొదటినుండీ నీ ప్రయత్నాలు గమనిస్తూనే వున్నాను. నీ దారికి అడ్డొచ్చిన కల్యాణిని దయాదాక్షిణ్యం లేకుండా బయటికి గెంటేశావు-"

"ఆదుకునే ధర్మాత్ముడివి నువ్వున్నావుగా?"

"లోకం ఇంకా అంత గొడ్డుపోలేదులే నేను కాకపోతే మరొకరు"

"మంచిదేలే, దానికేం?" అంది ఇందిర

"అంతేకాదు – తండ్రీ కూతురూ కలిసి నన్నుకూడా ఓ ఆట ఆడించారుగా! అవసరం వున్నన్నాళ్ళు వాడుకున్న మీ నాన్న, డబ్బు కావలసినప్పుడల్లా – భుజంతట్టే మీ నాన్న ఓసారి నేను యిదే యింటికొచ్చి నీతో మాటాడుదామంటే ఇంట్లో లేవు అన్నాడు జ్ఞాపకం ఉందా? ఎన్ని కక్కుర్తులు పడినా – నువ్వు వేసుకున్న ప్లాను కాస్తా తల్లకిందులయింది పులిమీద పుట్ర అన్నట్లు ప్రకాశం మేనమామ నిన్ను కాస్తా చిత్తుగా ఓడించాడు"

ఇందిర స్వాభిమానం కొంచెం దెబ్బతిన్నది మంచంమీద మరం వేసుకు కూర్చుని, "అగు, కృష్ణమూర్తీ, అగు ఇందిర నువ్వనుకున్నంత చేతకానిది కాదు నేనే గనక గట్టిగా తలచుకుంటే – ఆ మేనమామ కాదు, వాడితలలో జేజెమ్మకూడా చిత్తయిపోయేవాడు. మేనమామను విడిపించుకుని మళ్ళీ నా దగ్గరికి పరుగెత్తుకు వచ్చాడు ప్రకాశం. నీ కాసంగతి తెలీదేమో?"

"ఎప్పుడు?"

"ఆ రోజుల్లోనే. ఇరవై రోజుల క్రితం అనుకో పోనీ నేను ఓడిపోయాననుకోకు నాకే అసహ్యం వేసి పొమ్మన్నాను. అప్పుడే తలుచుకుంటే ప్రకాశాన్ని శాశ్వతంగా యిక్కడే ఉంచేదాన్ని. ఏమనుకున్నావో?"

నిజమే అనిపించింది కృష్ణమూర్తికి ఓ తెల్లారకట్ల తన దగ్గిరకి ప్రకాశం వచ్చాడు. అప్పుడే ఇందిరతో తెగతెంపులు చేసుకొని ఉండాలి "మరి ఎందుకా పని చెయ్యలేదు?" అన్నాడు.

మళ్ళీ పక్కమీద వాలిపోయింది ఇందిర "అలాంటి విషయాలు నీకు చెప్పినా అర్థంకావు కృష్ణమూర్తీ. కాబట్టి వాటిని వదిలేద్దాం. ఈ రాత్రి యింతకంటే మాటాడుకుందికి మంచి విషయాలు దొరకవా మనకు?" అంది

"ఎలా దొరుకుతాయి ఇందిరా? గడచిన విషయాలన్నీ ఒక్కసారిగా మరిచిపోయి తుడిచిపెట్టేసుకొని – ఏమీ జరగనట్లుగా ప్రవర్తించాలంటే ఎలాగ? నీ మీద నాకేమీ శత్రుత్వంలేదు; యీ ప్రపంచంలో ఎవరితోటీ నాకు పగలేదు. అలాంటివి అసలు నా ఒంటికి పడవు. కాని – దాచుకోవడం దేనికీ? – నువ్వంటే ఒకప్పుడుండే అభిమానం, స్నేహభావం యిప్పుడు లేవు. కల్యాణికి నువ్వు చాలా అన్యాయం చేశావు ఇందిరా! ప్రకాశానికీ అన్యాయం చేశావు. నా సంగతి సరే – ఒదిలేద్దాం. మరొకడయితే నిన్నూ, మీ నాన్నను జన్మలో క్షమించి ఉండేవాడు కాదు – మీరాడిన నాటకానికి. మనుషుల్ని వాడుకోవడం మీకు బాగా తెలుసు."

"ఏదీ తెలీకపోతే బతకడం ఎలాగ కృష్ణమూర్తి! నీకున్నట్టు మాకు కనుచూపుమేర పొలాలు లేవు. ఇనుప పెట్టెలో నోట్లకట్టలు లేవు వడ్డీ వ్యాపారం అంతకంటే లేదు"

"అవన్నీ యీ ప్రపంచంలో చాలామందికి లేవు అందరూ నీలాగే బతుకుతున్నారా?"

నెమ్మదిగా, చాలా ఆత్మవిశ్వాసం ఉన్న గొంతుకతో, ఒక్కొక్క మాటే తూచి చెపుతూ, "నా బతుకులో ఆక్షేపించదగింది ఏదీ లేదు కృష్ణమూర్తీ! అనవసరంగా లేనిపోని గొప్ప గొప్ప పోజులు నాదగ్గర నటించకు అందరూ నాలాగే ఉన్నారా – అంటే, అలాంటి మూర్ఖులందరిలాగా బతకడం నాకు అసహ్యం! ఇదొక పోటీ ప్రపంచం పెద్ద చేప చిన్న చేపను మింగుతుంది నిన్ను నేను మింగడానికి ప్రయత్నించకపోతే నన్ను నువ్వు మింగుతావు. అందరూ అంతే. ఈ సంధి యుగంలో అందరం గొంగళ్ళలోనే అన్నాలు తింటున్నాం ఆదర్శాలకోసం హరించిపోవాలనే తహతహ నా కెప్పుడూ లేదు. ఆ మాట కొస్తే నీకూ లేదు మనందరి తాపత్రయం ఒక్కటే – హాయిగా జీవించడం నువ్వు చేస్తున్నదీ ఆ పనే, నేను చేస్తున్నదీ ఆ పనే." అంది ఇందిర.

"అంతవరకూ బాగానే వుంది. దానికోసం యింకొకళ్ళ బతుకును పాడుచెయ్యడం దేనికి?"

"పని గట్టుకుని నే నెవరి బతుకూ పాడుచేయలేదు. అలా చేస్తే నా కేమీ ఒరగదు. నా యిల్లు నేను కట్టుకుంటుంటే పక్కనించి నడచివెళ్ళేవారి నెత్తిమీద యిటికలు పడ్డాయంటే నేనేం చెయ్యగలనూ? ఎవరి మటుకు వాళ్ళు చూసుకు నడవాలి, అంతే" అంది ఇందిర

'ఈవిడతో వాదించి లాభంలేదు' అనుకున్నాడు కృష్ణమూర్తి.

"పోనీలే – ఆ తర్జన భర్జనలన్నీ ఎందుకుగాని – అసలు సంగతి చెప్పవేం? మీ నాన్నగారెక్కడ?"

"మొట్టమొదటనే చెప్పానుగా – పెళ్ళిసంబంధం వెతకడానికి వెళ్ళారని!"

"సరే, దాచుకో చెప్పకపోతే."

"అంతేగాని నమ్మవన్నమాట! ఏం? పెళ్ళిచేసుకునే అర్హత నాకు లేదనా నీ ఉద్దేశం?"

"ఎంతమాట! అలా ఎందుకంటాను నేను? ఈ ప్రపంచంలో ప్రతి ఆడదానికీ – ఆ మాటకొస్తే ప్రతి మొగాడికీ పెళ్ళి చేసుకునే హక్కుంది అలాంటిది నీకేం తక్కువ? తెలివైనదానివి, చదువుల రాణివి, ఉద్యోగం చేసుకుంటూ స్వతంత్రంగా జీవిస్తున్నావు. అనాకారివి కాకపోగా – ఉన్న ఆకర్షణలకి మెరుగుబెట్టి మొగాళ్ళను కవ్వించే చాకచక్యం ఉన్నదానివి – ఎవడైనా నిన్ను సంతోషంగా పెళ్ళాడతాడు అదికాదు నే ననేది మీ నాన్న నీకు వరుణ్ణి వెతుకుతున్నాడంటే నవ్వొస్తోంది" అన్నాడు కృష్ణమూర్తి.

"ఐతే, మరి ఏమైపోయాడంటావు మా నాన్న?"

"అదే అడుగుతున్నాను."

వెల్లకిలా పడుకున్నది పక్కగా ఒరిగిందీ ఇందిర "మైడియర్ కృష్ణమూర్తీ! ఒకప్పుడు – అంటే మొన్న మొన్నదాకా – ఇందిర సాన్నిధ్యము అంటే పడిచచ్చినవాడా! మా నాన్న ఏమైపోయాడో చెప్తాను, వింటావా?" అంది.

"విందామనేగా అడిగింది!" అన్నాడు కృష్ణమూర్తి.

"అయితే విను. మధ్య మధ్య అడ్డురాకు" అని ప్రారంభించింది ఇందిర.

"అనగా అనగా కాలంలో అనుకుందాం. అంటే మొదటి ప్రపంచ యుద్ధం ముగిసిన కొత్తరోజుల్లో నన్నమాట మన అనుంగు ఆంధ్రదేశంలోనే - అన్ని విధాల వెనుకబడిన ఒక మెట్ట ప్రాంతంలో - ఓ కుర్రాడు అప్పుడే మెట్రిక్యు ప్యాసయాడనుకుందాం. తర తరాలనుండీ వాళ్ళది చాలా గౌరవనీయమైన బీదవంశం. ఈ దేశంలో బీదరికానికి అంటగట్టిన గౌరవం యింకెక్కడా ఉండదనుకో. ఆ కుర్రాడి నాన్న రాణేదారు అంటే, నెలకి జీతం అప్పట్లో ఎనిమిది రూపాయలు మెట్రిక్ ప్యాసయిన సంవత్సరంలోనే ఆ కుర్రాడికి నాన్న పోవడం - యిద్దరు మేనత్తలూ, అమ్మా మొత్తం ముగ్గురు వితంతువులతో సంసార బాధ్యత నెత్తిమీద పడడం - యిన్ని జరిగాయి. కుర్రాడు వాళ్ళ కాళ్ళూ వీళ్ళ కాళ్ళూ పట్టుకుని తాలూకాఫీసులో గుమాస్తాగా చేరాడనుకుందాం.

"అంతవరకూ అది ఓ ఘట్టం. రెండో ఘట్టంలో కుర్రాడికి పెళ్ళవుతుంది. పెళ్ళాం ఓ అనాకారి, అర్భకురాలు కోరికలకి అనాకారితనం, అర్భకత్వం అడ్డురావు. కనక - ఆ దంపతులకి వరసగా పిల్లలు పుట్టడం ప్రారంభిస్తారు వాళ్ళు వెంట వెంటనే చచ్చిపోతుంటారు. అందుకోసం యిద్దరు మేనత్తలూ అనునిత్యం ఏవో పూజలు పునస్కారాలూ చేస్తూ కొబ్బరికాయలికీ, హారతి కర్పూరానికీ, పురోహితుడికీ డబ్బిమ్మని ఆ సంసారిని వేధించుకు తింటూంటారనుకో. భార్యకు ఆసుపత్రి వైద్యం, ఆయుర్వేద వైద్యం - అన్నీ జరిపించుతూంటాడనుకో. ఆ బంగారు కాలంలోనే ఆయనగారు తెచ్చే వెండిరూపాయలు చాలవు అది ఇంట్లో పరిస్థితి

"బైటకు వెళితే - తనతో చదువుకున్న సాటివాళ్ళంతా లాయర్లూ డాక్టర్లూ కనీసం టీచర్లూ అయి, కొత్తహోదా తెచ్చుకొని కొత్తగాలి పీలుస్తున్నారు మొదటినుండీ తనకు కాలేజీ చదువులమీద శ్రద్ధ ఉండేది. కాని సాధ్యపడలేదు అదొక అశాంతి అప్పుడప్పుడే బ్రహ్మసమాజ మతం అంటూ ఓ కొత్తఫ్యాషన్ బయలుదేరింది. సంఘ సంస్కరణా, ఏకేశ్వరోపాసనా, ఏకపంక్తి భోజనాలూ, హరిజనోద్ధరణా - హేతువాద గ్రంథాలూ - ప్రార్థన సమాజం, స్త్రీ పురుషులు కలిసి ప్రార్థనలకూ విందులకూ హాజరవడం - ఇదీ ఆ సంసారిని ఆకర్షించిన బైట ప్రపంచం. వాళ్ళతో కలిసి తిరిగేవాడు. వాళ్ళలాగే బట్టలు వేసుకునేవాడు క్రమంగా క్రమక్రమంగా తాలూకాఫీసునించి కలక్టరాఫీసుకి ఫిరాయించబడ్డాడు అక్కడ తెల్లదొరలూ, నాటుదొరలూ, వాళ్ళ దర్జా, భోగం - ఇవన్నీ ప్రత్యక్ష్యంగా చూశాడు వాళ్ళకు కావలసిన పనులు చేయడానికి పనిముట్టుగా ఉపయోగపడ్డాడు. అంతఎత్తు సంఘంలో బతికే మనుషుల పోకడలను స్వయంగా చూసి కొన్ని ఘట్టాలలో వాటికీ గురి అయాడు. వ్యక్తిత్వాన్ని చంపుకొని ఆ పరాభవాలన్నీ మింగేస్తూ, కొంచెం మనశ్శాంతి యింట్లో దొరుకుతుందేమోనని ఆశించేసరికి ఇల్లాలు తన మూర్ఖత్వంతో మరింత బాధ కలిగించేది. వీటన్నింటినీ ఎదుర్కోలేక భగవద్గీత పారాయణం చేయడం ఒక పద్ధతే అనుకో. కాని - అతనికి దృష్టి అటు పోలేదు భగవద్గీతకంటే రసవత్తరమైన ఓ భోగం చిన్నది - దొరగారి పోషణలో వుండె, దొరగారికి బదిలీ

అయిన తర్వాత – అతనికి తారసిల్లింది అంతే, అతనికొక పలాయన మార్గం కనబడింది. ఆ పిల్లతోడిదే ప్రపంచం అనుకున్నాడు

"వెధవది యీ ప్రపంచంలో కోరికలు పెరిగిన కొద్దీ డబ్బు కావాలి అతనికీ అదే చిక్కొచ్చింది. ఆ చిక్కును పరిష్కరించే మార్గాలు అతని డిపార్టుమెంటులో చాలా వున్నాయి. వాటిలో కొన్ని అవలంబించేసరికి కొంతకాలం వరకూ బాగానే వుందిగాని, ఒకానొక ఘట్టంలో పెద్దచిక్కే వచ్చి, ఉద్యోగం కాస్తా ఊడిపోయింది ఒక ఏడాదిపాటు నానా అవస్థ పడి ఉత్తరాది రైల్వేలో గుమాస్తా ఉద్యోగం సంపాదించాడు. ఆ రోజుల్లో ఆ రైల్వేలో వుద్యోగాలు చాలా గమ్మత్తుగా దొరికేవిలే అందులో కొంతకాలం కాలక్షేపం చేశాడు అలా కొన్నేళ్ళపాటు అతని ఖర్మాన అతను రఘుమహారాజులాగ రాజ్యం చేసుకుంటూండగా, బ్రిటిష్ సామ్రాజ్యం అస్తమించినట్లు వరసగా మేనత్తలు వగైరాలు తనువు చాలించారు కాలక్రమాన ఒక కూతుర్ని బహూకరించి భార్యకూడా మంచాన పడింది క్రమంగా ఆ సంసారి యీ సంఘాన్నీ, యిందులోని మనుషుల్నీ, వాళ్ళ విలువల్నీ సరిగ్గా అర్థం చేసుకున్నవాడై, జీవితంతో జూదం ఆడ్డం ప్రారంభించాడు. అతనిది ఎప్పుడూ జూదం బతుకే అనుకో; యిప్పుడు మరీ ఎక్కువయింది. కూతురికి కొంచెం జీవశక్తి ఎక్కువగా ఉండటాన్న దానంతట అదే అలాంటి యింట్లో పెరిగి పెద్దదైంది; నిరంతరం రోగంతో మూలిగే తల్లి అంటే ప్రేమాభిమానాలు పెంచుకోలేకపోయింది రాత్రి నిద్రపోయేటప్పుడు కూతుర్ని గుండెలమీద పడుకోపెట్టుకొనేవాడు నాన్న, ఆయన పెదవుల్లోంచి ఘాటైన ద్రావకాల వాసనలు వెదజిమ్మేవి అటువంటి అనుభవాలవల్ల గట్టిపడింది. ఆ పిల్ల ప్రకృతి యిచ్చిన గట్టి శరీరమూ, చురుకైన మెదడూ, యీ రెండింటివల్లా ఎన్ని అడ్డంకులున్నా, నెమ్మదిగా చదువులో కాలేజీదాకా ఎగబాకింది, అంతట్లో నాన్న అపస్మారంగా చిన్న పొరపాటు చేశాడు దాని వలన సంవత్సరం పాటు స్టేట్ గెస్ట్గా వుండి వచ్చాడు. ఈలోపుగా అమ్మ పోవడంలాంటివి కొన్ని జరిగాయి ఎలాగైతేనేం నడమంత్రంగా అమ్మాయి చదువు మానివేసి టైపూ షార్టుహాండూ నేర్చుకుని, కేవలం తన పలుకుబడి వల్లనే వుద్యోగం సంపాదించుకుంది

"నువ్వు యిప్పుడు చెప్పు కృష్ణమూర్తీ! ఈ బేతాళ కథలో – ఆ అమ్మాయి కర్తవ్యం ఏమిటి? ఏ విధంగా బతకాలి? ఆ పిల్ల ఎందుకలాగ నిర్లక్ష్యంగా, లోకంమీది కసితో బతికేస్తూ, మగవాళ్ళను కవ్విస్తూంటుంది? ఆ ప్రశ్నలకు నువ్వు జవాబు చెప్పలేవు. నేను విక్రమార్కుడి చెల్లెల్ని కాబట్టి చెపుతాను విను. అలా కాకపోతే ఆ అమ్మాయి బతకడం కష్టం నువ్వు పురుగులాగ బతికేస్తే అందరూ నీ మీద కాలువేసి తొక్కేస్తుంటారు. రూల్సు ప్రకారం బ్రతికేవాళ్ళంతా అణగారిపోవడమే ఆ అమ్మాయి ప్రత్యక్షంగా చూసింది. అలా బతకాలంటే బోలెడంత హంగు వుండాలి. అన్ని హంగులూ వున్నవాళ్ళకు రూల్సు పాటించడం సులువు రూల్సు అతిక్రమించడం కూడా సులువే వాళ్ళకు ఇప్పుడు దొరలు మారారేమోగాని, దొరతనం అలాగే వుంది. బహుశా యీ వెధవ ప్రపంచం ఎప్పుడూ ఇలాగే ఉందేమో అంచేత వేటికోసమూ బెంగపెట్టుకోకుండా హాయిగా యెక్కడికక్కడ సదుపాయంగా బతకడమే ఆ అమ్మాయి ఆశయం ఆ ప్రయత్నాన్నే మీ బోటి రూల్సువాళ్ళంతా వింతగా చూస్తారు"

ఆగిపోయింది ఇందిర. వెల్లకిలా పడుకుని యింటికప్పుకేసి చూస్తూ మోచెయ్యి తలక్రింద పెట్టుకుంది. కథంతా విన్న తరవాత అతను నిశ్చేష్టుడయిపోయాడు తదేకంగా ఆ అమ్మాయి విగ్రహంకేసి చూశాడు వ్యక్తిత్వం తొణికిసలాడే మొహం; మెరిసే కళ్ళు. బలంగా నిండుగా వున్న శరీరం. ఆ తరుణ శరీరంలో ఉద్రిక్తజీవన వాంఛలు మిలమిలా మెరుస్తున్నాయి.

"ఈ కథంతా నాకెందుకు చెప్పావు ఇందిరా?" అన్నాడు కృష్ణమూర్తి బొంగురు గొంతుకతో.

"అడిగావు గనుక చెప్పాను" అంది ఇందిర.

"ఇదంతా అడగలేదే? మీ నాన్నగారు ఏరీ అన్నాను అంతే."

"తీగ లాగితే డొంకంతా కదిలిందంటారు చూడూ – అలాగయిందన్నమాట. ఘరానా మనిషివి కదూ – గొప్పింటి అబ్బాయివి, పచ్చనోట్లు ఖర్చుపెట్టగలవాడివి అందులో ఈమధ్య గొప్పింటి అమ్మాయిలతో స్నేహం చేస్తున్నావు అంచేత ఇందిర ఎంత చెడ్డదో నీకు పూర్తిగా తెలిస్తే మంచిదని, కథంతా చెప్పాను మా నాన్న ఏమయాడో తెలుసుకోవాలని కదూ – ఆయన గురించి అడిగావు – మొదటినుంచీ ఆయన ఏమయాడో చెప్పాను అంతే."

"అదంతా నాకు తెలుసు ఇందిరా – తెలుసంటే వివరాలు తెలుసనికాదు. అవన్నీ అడిగి ఏవేవో కెలికి నీ మనస్సు బాధ పెట్టాలనీ కాదు. ఇంట్లో నాన్న కనబడకపోతే మాటవరసకు అడిగాను. ఊరెళ్ళాడన్నావు రైట్ అక్కడికి సంగతి వదిలేద్దాం. ఇంకేమైనా చెప్పు అఫీసు యెలా ఉంది? మీ బాస్ ఏమంటున్నాడు?"

ఇందిర జవాబు చెప్పలేదు.

"మాటాడవేం ఇందిరా?"

ఇందిర ఓరగా తిరిగి చెయ్యి చాపి అతని చేతిని లాక్కుంటూ "ఇలా రా కృష్ణమూర్తీ! కాస్సేపు దగ్గిరగా కూర్చో" అంది అప్రయత్నంగా అతను కుర్చీలోంచి లేచి మంచంమీద ఇందిరను అనుకుని కూర్చున్నాడు వెంటనే కిలకిలా నవ్వింది ఇందిర.

"నవ్వుతావెందుకూ?"

"పిచ్చినాయనా! నవ్వొచ్చింది నవ్వాను తప్పా? ఇందిర గురించి ఆలోచించనని సాయంత్రమే గదూ ఎవరికో మాటిచ్చావు ఇంతలో వుంటుంది ఏదైనా మనమందరం శుద్ధ నూనెమిరాయి సరుకు మనుషులం కృష్ణమూర్తీ! ఏమిటేమిటో అనుకుంటాం. రెక్కలున్నాయనుకుని ఎగరడానికి ప్రయత్నించుతాం. రెక్కలు లేవు మనకు. ఉన్నా, అవి తడిసిపోయాయి. నా రెక్కల్ని బీదరికం తడిపేసింది; నీ రెక్కల్ని మితిమీరిన డబ్బు తడిపేసింది అంచేత మనిద్దరి పరుగులాటలూ ఒకటే! నా పిచ్చి కృష్ణమూర్తీ! నువ్వు చాలా ఖరీదైన గడియారంలాంటి వాడివి మంచి కంపెనీ తయారీ కేటలాగులో ఖరీదు వెయ్యిరూపాయలు నేనొక సాదా గడియారాన్ని కాని – భగవాన్! – యీ గడియారాలకు ముళ్ళు లేవయ్యా! సెకెండ్లముల్లు అటుంచి గంటల ముల్లు కూడా లేదు. లోపల యంత్రాలన్నీ ఎంత పసందుగా తిరిగితే మాత్రం ఏం లాభం? అంచేత బుద్ధిగా బతుకు; హాయిగా బతుకు" అంది గోముగా, గంభీరంగా, యీ విశ్వ రహస్యాలను పూర్తిగా అర్థం చేసుకున్న వైజ్ఞానికురాలివలె.

అతని నరనరాల్లోనూ ఏదో మైకం ప్రవేశించింది అతనిప్పుడు ఏదీ సరిగా ఆలోచించే స్థితిలో లేడు. తనెందుకిలా దిగజారిపోతున్నాడు? ఈ ఇందిరలో వున్న చిత్రమైన ఆకర్షణ ఏమిటి? ఒక్కసారిగా అతనికి లేచి పారిపోవాలనిపించింది ఈ ఒంటి స్తంభం మేడలోంచి, యీ ఇందిర లావణ్యపు ప్రలోభంలోంచి, ఈ చీకటి సందులోంచి – ఒక్క వురుకులో పారిపోయి లాడ్జిలో స్నేహితుల మధ్య పడిపోవాలనిపించింది. ఏమిటి జరుగుతోంది తనకు? ఎందుకిలా దిగజారిపోతున్నాడు? తనమీద తనకే అసహ్యం వేసింది. ఒక్కసారి ఆమె ముఖంలోకి చూశాడు ఏవేవో పాత సంగతులు బుర్రలో మెదిలాయి. ఆమెమీద ఒక్కసారి అభిమానం వెల్లివిరిసింది ఆ అమ్మాయి ఏమైతేనేం గాక, ధైర్యవంతురాలు, వ్యక్తిత్వం వున్న మనిషి. ఈవిడలో అసహ్యించుకోదగినది ఏముంది? జీవితం యీవిడను అడుగడుగునా భూతంవలె పీడిస్తూంటే.. ఎదురుతిరిగి పెనుగులాడుతోంది. ఆ భూతాన్ని తన్నేసి రక్కేసి కరిచేస్తోంది "సెభాస్ ఇందిరా!" అనుకున్నాడు ఆమెను మరింత దగ్గిరగా తీసుకున్నాడు.

ఇందిర అతన్ని విడిపించుకుంటూ, "నీ బుద్ధి ఎక్కడికి పోయింది కృష్ణమూర్తీ!" అంది. కసురుతున్నట్లుగా.

అతను వినిపించుకోకుండా, "లేదు ఇందిరా! నాకు బుద్ధుందో లేదో నాకే తెలీదుగాని.. నిన్ను చూస్తే సంతోషం వేస్తోంది నువ్వు గొప్పదానివి – సందేహంలేదు" అన్నాడు.

"నిజంగానే!" కిలకిలా నవ్వింది ఇందిర

"నిజంగానే."

"అలాగంటే నేను పొంగిపోతాననుకోకు సుమా! ఏ పనిచేసినా నేను కళ్ళుతెరిచి చేస్తాను. నాకూ మిగతావాళ్ళకీ అదే తేడా ఏడుస్తూ ఏదీ చెయ్యను ఏం జరిగినా ఏడవను నా పిచ్చి కృష్ణమూర్తీ! నీకు నిజంగా మతిపోయింది" అంది

అతనికి నిజంగానే మతి స్వాధీనం తప్పింది

☆ ☆ ☆

వేకువ ఘడియల్లో కృష్ణమూర్తికి మెలకువ వచ్చింది పెనవేసుకున్న అతని చేతుల్ని తప్పించుకుంటూ మంచంమీంచి లేవడానికి ప్రయత్నిస్తోంది ఇందిర అందుకే అతనికి మెలకువ వచ్చింది

"లేద్దామా?" అన్నాడు

"నేను లేవాలి. పాలవాడు తలుపు కొడుతున్నాడు తీసికొని కుంపటి రాజేసి కాఫీ పెట్టాలిగా! నాన్నవుంటే ఈ బాధలన్నీ ప్రొద్దునే తను పడేవాడు లేడుగా? అంచేత!" అంది.

"ఇంతకూ మీ నాన్న ఏ వూరెళ్ళాడో చెప్పావు కావు"

"లేచి కూర్చో, చెపుతాను."

లేచి కూర్చున్నాడు తను, చెప్పు వింటాను అన్నట్లు

"అయితే విను కృష్ణమూర్తీ! మొన్న భోగిపండుగనాడు మా నాన్న జైల్లో పడ్డాడు"

"ఆఁ!" అప్రయత్నంగా లేచి నించున్నాడు

"అవును, నిజమే చెపుతున్నాను. ప్రొహిబిషన్ కేసులో అరెస్టయాడు అతని పాత స్నేహితులంతా కలిసి ఆ క్రితం రాత్రి చిన్నపార్టీ చేసుకున్నారు! సీసాల పార్టీ అదెలాగో ముందే పోలీసులకు తెలిసిపోయింది రెయిడ్ చేసి సీసాలతో సహా పట్టుకున్నారు. జామీనుమీద విడిపించాలనుకున్నాను గాని అసహ్యం వేసి మానుకున్నాను, ప్రస్తుతం రిమాండులో వున్నాడు. 3 నెలలు వేస్తారనుకొంటున్నా " నిర్లిప్తంగా, ఏదో పేపరులో వార్త చదువుతున్నట్లు చెప్పేసింది ఇందిర

అతని కాళ్ళకింద భూమి కదలిపోయింది నిలువునా అలా నించున్నపాటున పాతాళంలోకి కుంగిపోయాడు

"నిజమే?" ఎక్కడో నూతిలోంచి అరిచినట్లుగా అన్నాడు.

"నువ్వు శుద్ధ ఇడియట్‌వి కృష్ణమూర్తీ! నిజమేనంటూంటే" అంది ఇందిర అనేసి మెట్లు దిగి కిందకు వెళ్ళిపోయింది భారంగా ఆమె వేపే చూస్తూ అతను అచేతనంగా నిల్చుండిపోయాడు

## 19

ఒక అరగంట పోయాక ఇందిర మేడమీదకి వచ్చి చూసేసరికి కృష్ణమూర్తి వాలుకుర్చీలో పడుకున్నాడు. అతన్ని జబ్బ పట్టుకుని ఊపుతూ, "మళ్ళీ పడుకున్నావా? లేచి మొహం కడుక్కో కాఫీ టిఫిన్ పూర్తి చేస్తే ఆ తరువాత నువ్వు ఉడాయిద్దువుగాని. నాకు చాలా పనుంది ఇవ్వాళ కొంచెం ముందుగా వెళ్ళాలి ఆఫీసుకి" అంది మారుమాటాడకండా అతను కిందకి దిగాడు

పనిమనిషి తెచ్చిన హోటల్ టిఫిన్ తిని కాఫీ తాగారిద్దరు

"ఇవాళ నువ్వు ఆఫీసుకి వెళ్ళి తీరాలా?" అన్నాడు

"అహా, వెళ్ళి తీరాలి, ఏం?" అంది

"ఇవాళకి సెలవు పెట్టేసి ఉండిపోకూడదూ? నీతో చాలా సంగతులు మాటాడాలి" వేడుకుంటున్నట్టుగా అడిగాడు.

ఇందిర కళ్ళు రెండూ పెద్దవి చేసి భయపడుతున్నట్లుగా, "అమ్మబాబోయ్! ఐతే అసలే వీల్లేదు. రాత్రంతా మాటాడుకున్నాం చాలదూ? ఎన్నాళ్ళు మాటాడినా అవే సంగతులు" అంది.

"కాదు. కొత్త సంగతి ఉండబట్టే అడుగుతున్నాను"

అద్దం ముందు కూర్చుని జడ అల్లుకుంటూ ఇందిర "మై డియర్ కృష్ణమూర్తీ! మనకి మాటాడుకుందికి కొత్త సంగతులేం లేవు ఒకవేళ నీకున్నప్పటికీ అవేమిటో తెలుసుకోవాలనే కుతూహలం నాకు లేదు ఒక అరగంటలో నువ్వు నన్ను వదిలి పెట్టేయాలి" అంది.

అతను అమాంతం కుర్చీలోంచి లేచి, జబ్బ పట్టుకుని ఇందిరను లాక్కొచ్చి పక్క కుర్చీలో కూలవేశాడు. సగం అల్లిన జడ వదల్లేక ఆమె అలాగే కూలబడి, "నువ్వు ఉత్త బ్రూట్‌వి. ఇక్కణ్ణించి పోతావా పోవా?" అంది

"పోను, సంగతేమిటో తేల్చుకునిగాని పోను."

"ఏ సంగతి?"

"అదే మాటాడతా నంటున్నాను."

"వీల్లేదు. ఇలా నస పెడతావని తెలిస్తే అసలు ఇంటిలోకే రానివ్వకపోదును" అని కొంచెం తీవ్రంగా, మళ్ళీ కంఠం మార్చి గోముగా "మామూలుగా ఉండు కృష్ణమూర్తీ! హాయిగా లాడ్జికెళ్ళి భోంచేసి పడుకో. వీలయితే సాయంత్రం కలుసుకుందాం. ఎక్కడికక్కడికి తృప్తిపడడం నేర్చుకో" అంది.

అతనికి కొంచెం కోపం వచ్చింది. "నువ్వు ప్రతిదీ ఎంత తేలిగ్గా తీసుకోగలవ్!" అన్నాడు.

ఇందిర నవ్వేసి "నువ్వూ అంతే కదుటోయ్! ఇప్పుడంటే కొత్త స్నేహాలుచేసి కొత్త పద్ధతులు నేర్చుకుంటున్నావు గాని"అంది.

"అదికాదు ఇందిరా! యింత జరిగాక జాగ్రత్తగా ఆలోచించుకొని కొన్ని నిర్ణయాలకు రావడం మంచిది గదా!"

"ఏమో నాకు తెలీదు నాకు అవసరం కనబడడం లేదు."

"మరీ ఇంత బండగా తయారయావేం ఇందిరా?"

"నీ యిష్టమొచ్చినట్లు అనుకో. అది నీ ఖర్మ"

"కనీసం మీ నాన్న సంగతైనా మాటాడదామా? నీలాంటి చిత్రమైన మనిషిని నేనెక్కడా చూడలేదు అతని గతి ఏం కాను? చీమ కుట్టినట్లయినా లేదేం నీకు?"

ఆమె మొహం వివర్ణమైంది. "పోనీలే, నాకు లేదు, సరేనా? అంత జాలి ముంచుకొస్తూంటే నువ్వెళ్ళి ఏదైనా చెయ్యి, నేనేం అడ్డురాను" అంది

"అది కాదు ఇందిరా!"

"అది కాకపోతే మరేమిటోయ్ నీ తలకాయ?" ఆమె కంఠం హెచ్చించింది "నాకు చీమ కుట్టినట్లుందో తేలు కుట్టినట్లుందో అవన్నీ నీ కెందుకూ? జాలిగుండె వాడివి మహబయల్దేరావ్! నా మీద నాకే జాలిలేనప్పుడు యింకొకళ్ళగురించి ఎక్కడ ఆలోచించగలను? ఈ ప్రపంచంలో ఎవళ్ళ బాధ వాళ్ళు పడాలి తల్లీ తోడూ, భర్తా భార్యా—ఎవరైనా అంతే. దేనికైనా ఒక లిమిట్ ఉంటుంది. అది దాటాక విరక్తి అనే పెద్ద మైదానంలో అన్ని అభిమానాలూ యింకిపోతాయి నాన్నకోసం నువ్వేం బెంగ పెట్టుకోనక్కరలేదులే. స్టేటు గెస్టుగా వెళ్ళడం అతని కలవాటే ఇది మూడోసారి వెనకటికంటే అక్కడిప్పుడు సదుపాయంగా ఉందట కూడా. మూణ్ణెల్లుపోయాక హాయిగా తిరిగొస్తాడు. ఈ మూణ్ణెల్లూ నేను సినిమాలో నాయికలాగ ఏడుస్తూ కూర్చుంటే మీలాంటివాళ్ళకి తృప్తిగా ఉంటుందేమో గాని, ఆ పని నేను ఛస్తే చెయ్యలేను" —ఉద్వేగంగా అనేసి గబగబా జడ అల్లుకోవడం ప్రారంభించింది

అతనికి నోట మాట రాలేదు ఏమిటీ అమ్మాయి? ఇందిరను చూస్తే అతనికి నిజంగానే భయం వేసింది. ఉత్తది, ఉత్తది అనుకున్నాడు 'ఈ అమ్మాయి లోపల చాలా బాధపడుతోంది ధైర్యంగా నడుస్తున్నకొద్దీ అడుగడుగునా గోతులే వస్తూంటే, ఉడుకుబోతుతనం, పగ, కసి ఎక్కువయిపోతున్నాయి ఇలాంటి పరిస్థితిలో నూటికి ఏ ఒక్కరో మినహా అందరూ కాళ్ళు చాపేసి కూర్చుని ఏడుస్తారు ఇందిరలాంటి

వాళ్ళు రాజసం అడ్డువచ్చి మరింత హాయిగా ఉన్నట్లు పళ్ళు గిట్టకరచి నటిస్తారు ఇలాంటివాళ్ళు లోలోపల మరింత కుమిలిపోతుంటారు' అనుకున్నాడు

"సమస్యల్ని ఎదుర్కోలేక పారిపోతున్నావు అంతేగదూ?" అన్నాడు.

"నేనేం పారిపోవడంలేదు" అంది. "ఎక్కడికీ పారిపోలేదు, ఉన్నచోటే నించున్నాను ..హాయిగా."

"హాయిగా బతుకుతున్నదానివి– ఉండుండి యింతింత సాహసాలు ఎందుకు చేస్తున్నావు?"

"ఏం సాహసాలు?"

"రాత్రి నీ ధోరణి సాహసంకాక మరేమిటి?"

వూరుకుంది ఇందిర. "నీ పుణ్యముంటుంది నన్ను వదిలేద్దు బాబూ! ఆఫీసుకు పోవాలి" అంది కాస్సేపాగి

ఇంక లాభం లేదనుకొని, "పోనీ, సాయంత్రం మీ ఆఫీసుకి రానా, ఇద్దరం కలిసి ఇంటికొద్దాం?" అన్నాడు.

"అలా అన్నావు బాగుంది ఇంక దయచెయ్యి" అనేసి దిగ్గున లేచింది ఇందిర అతను వెళ్ళిపోయాక వీధి తలుపు గడియవేసి స్నానానికి వెళ్ళింది.

☆ ☆ ☆

అప్పటికప్పుడే పదిన్నర దాటింది డా. చక్రవర్తి కన్సల్టింగ్ రూములో అలికిడిగా ఉంది పేషెంట్ల హడావిడి ఐపోయాక బాతాఖానీకి వచ్చిన స్నేహితుల అలికిడది. విజిట్స్‌కి బయటకు వెళ్ళాలి కాని బాతాఖానీరాయుళ్ళు వదిలేటట్లు లేరు రాజకీయాలనుండి రంపపుపొట్టుదాకా అన్ని సంగతులూ దొర్లుతున్నాయి సంభాషణలో చక్రవర్తి ఏమీ కలుగచేసుకోవడం లేదు అతని మనస్సు ఎక్కడో దూరతీరాల్లో విహరిస్తోంది ఉండుండి ఏదో జ్ఞాపకం వచ్చినవాడిలా ఉలిక్కిపడుతున్నాడు. కొంతసేపటికి డాక్టర్ వాలకం గ్రహించిన ఆ బృందంలో ఒకడు "డాక్టరు గారు పరధ్యానంగా వున్నట్టున్నారు మా మాటలేం వినిపించుకోవడం లేదు!" అన్నాడు

ఆ మాటలకి చక్రవర్తి తేరుకుని, "అవునండీ! ఏమిటో పరాగ్గా వున్నాను ఇంక దేనిగురించో ఆలోచిస్తున్నాను. మనస్సు కొంచెం చికాగ్గా వుంది" అన్నాడు

"డాక్టర్లకే మనస్సు చికాగ్గా వుంటే ఏం దారండీ? దానిక్కూడా ఏవైనా మందులూ ఇంజక్షన్లూ లేవూ?" అన్నాడు మరొకడు ఇంతలోకే వసుంధర లోపలికి ప్రవేశిస్తూ..అంతమంది జనాన్ని చూసి జంకుగా గుమ్మం దగ్గరే నిలబడిపోయింది. తరవాత నెమ్మదిగా పక్కకు తప్పుకుని – నర్సూ కాంపౌండరూ వుండే భాగంలోకి వెళ్ళిపోయింది.

చక్రవర్తి ఆమె రాక గమనించాడు వెంటనే లేచి కోటు తొడుక్కుని. "క్షమించండి..విజిట్సున్నాయి, కొంచెం బయటకు వెళ్ళాలి" అన్నాడు స్నేహబృందం లేచి "సెలవండీ అయితే, మళ్ళీ కలుసుకుందాం" అనేసి వెళ్ళిపోయారు "హమ్మయ్య!" అనుకుని చక్రవర్తి పక్క డిస్పెన్సరీ భాగంలోకి వెళ్ళి "వసుంధరగారూ! రండి!" అని కన్సల్టింగ్ రూమ్‌లోకి దారి తీశాడు వసుంధర జంకుతూ అతన్ననుసరించి,

ఎదురుగా సోఫాలో కూర్చుంది. ఆమె ఎందుకు వచ్చిందో డాక్టరుకు తెలుసు పొద్దున్నే వసుంధర ఇంటికి వెళ్ళి తను క్షేమంగా వున్నట్లు చెప్పిరమ్మని తనతో కల్యాణి మరీ మరీ చెప్పి వెళ్ళింది. ఇప్పటిదాకా తనకు తీరికే లేకపోయింది.

"అదేం వసుంధరగారూ! అలా వున్నారేం?" అన్నాడు.

వసుంధర అతనివైపు చుర చురా చూసి, నిజంగా మీకు తెలియకే అలా మాటాడుతున్నారా, లేక తెలిసే తమాషా చేస్తున్నారా?" అంది.

"క్షమించండి వసుంధర గారూ! చూడగానే అలా అనేశానేమిటో మరేం కంగారు పడకండి. కల్యాణి క్షేమంగానే వుంది. రాత్రి సరాసరి మీ యింటినుంచి యిక్కడికే వచ్చింది, జరిగినదంతా చెప్పిందిలెండి. చాలా బాధపడింది తరువాత. తొందరపడి వుండకూడదని తనే ఒప్పుకుంది-"

"నాక్కావలసింది క్షమాపణలు కాదు. ఏమైపోయిందోనని రాత్రంతా బెంగపడి చచ్చాను. పోనీ కబురు పెడదామన్నా యింట్లో ఎవరూ లేరు ఇదంతా మా పిన్ని వల్ల జరిగింది కల్యాణి మీకంతా చెప్పే వుంటుంది."

"అవును, చెప్పానుగదూ, రాత్రంతా ఆ సంగతి తలుచుకునే బాధపడిందని?"

"రాత్రంతా అంటున్నారు-ఇక్కడే వుండిపోయిందా?"

చక్రవర్తి నాలిక కరుచుకున్నాడు. కాని మళ్ళీ "మరేం పరవాలేదు మన వసుంధరే గదా!" అనుకుని "నేను వుండిపొమ్మన్నాను, అంత రాత్రివేళ తీసికెళ్ళి అక్కడ దిగబెట్టటమూ బాగుండదు. ఏం చెయ్యడానికి తోచక యిక్కడే గడిపేస్తే తెల్లారేక చూసుకోవచ్చుననుకున్నాను. అంతకంటే చెయ్యదగిందేమిటో ఆవిడకీ తెలియదు మీ కర్థమవుతుందనుకుంటాను" అన్నాడు

"రాత్రి దిగబెట్టేశారేమోననుకుని అడిగానండీ! అంతకంటే మరేంలేదు. హమ్మయ్య, కల్యాణి సమస్య తీరిందిగాని నా సమస్య తీరలేదు" అంది వసుంధర

"అంటే-"

"అంటే ఏముందీ! ఈ మధ్య మా పిన్నికీ నాకూ రగడ ఎక్కువవుతూంది మీ అందరితో చనువుగా వుంటున్నానని ఆవిడకు కోపం. ముఖ్యంగా కృష్ణమూర్తి అంటే ఆవిడ మండిపడుతోంది నిన్నరాత్రి మా యిద్దరి మధ్యా వ్యవహారం చాలా దూరం వెళ్ళింది. ఇంతవరకూ యిలాంటి గృహకలహాలు కలలో కూడా ఎరగం ఈనాటికి మా పిన్నీ నేనూ కలిసి ప్రారంభించాం" అంది వసుంధర

గృహచ్ఛిద్రాలనేసరికి డాక్టరుకి ఏవేవో పాత సంగతులు జ్ఞాపకం వచ్చాయి. తనూ తన సంసార జీవితం, పెంపుడుతల్లి .. గడచిపోయిన జీవితంలో మధురమైనవీ-స్మృతి పథంలో పదిలపరచుకోవలసిందీ యింతవరకూ ఒక్కటిలేదు తనకు; విద్యార్థి దశలో స్నేహితులతో గడిపిన కొన్ని ఘట్టాలు, అనంతరం వృత్తి జీవితంలో అప్పుడప్పుడు పేషెంట్లు చూపే కృతజ్ఞతవల్ల కలిగే సంతృప్తి మినహాయిస్తే గృహచ్ఛిద్రాల గురించి తనకి వసుంధర చెపుతోంది!

"వాటికేం లెండి-అవి ప్రతీ యింట్లోనూ వుండేవే" అన్నాడు సానునయంగా వసుంధర జవాబు చెప్పలేదు కొంచెం సేపుండి చక్రవర్తి "మీ కివాళ కాలేజీ లేదా?" అన్నాడు.

"ఉందండీ! కాని ఎగ్గొట్టేశాను. కాలేజీ జ్ఞాపకం చెయ్యకండి. గుండె గుభేలు మంటుంది. ఈ గొడవలన్నిటి మధ్యా చదువొకటి మూలపడింది. పోనీలెండి గాని కృష్ణమూర్తి ఎక్కడుంటాడో మీకు తెలుసా?"

"తెలుసు. ఏం?"

"అతనితో ఓసారి అర్జంటుగా మాటాడాలి."

"తీసికెళ్ళమంటారా?"

"ఒద్దు. ఈ స్టూడెంట్సు లాడ్జీలకి వెళ్ళడమా? అలాంటి చోట్లకి జన్మలో వెళ్ళను కబురుపెట్టి ఓసారి అతన్నీ సాయంత్రం మా యింటికి పంపిస్తే సంతోషిస్తాను"

"వాడో బదుద్దాయి. తెల్లారి లేచింది మొదలు అర్ధరాత్రిదాకా త్రిపాది నక్షత్రంలాగ ఊరంతా తిరగడం తప్ప మరో పని లేదు. గాలివాటుగా వాడే వచ్చి పడాలిగాని వాణ్ణి పట్టుకోవాలంటే చాలా కష్టం. మధ్యాహ్నం యిక్కడికి వస్తాడేమో లెండి ఐనా ఓ సారి వాడి లాడ్జికే వెళ్ళి చూస్తాను. దొరక్కపోతే చీటీరాసి అక్కడ పడేస్తాను"

"కొంపతీసి నా పేరు రాయకండేం, అందులో!"

"ఛాఛా! అంత ఇంగితజ్ఞానం లేదనుకున్నారటండీ!"

"థ్యాంక్స్. నేను వెళ్లిరానా మరి?"

"ఉండండీ, కాస్త కాఫీ తీసుకు వెళుదురుగాని,"

"ఒద్దండీ, ఇందా కిందాకనే తాగాను ఎక్కువతాగితే ఒంటికి పడదు."

వెళ్ళిపోయింది వసుంధర. భారంగా అడుగులు వేసుకుంటూ మెట్లు దిగుతున్న వసుంధరను చూసిన డాక్టరుకి హఠాత్తుగా బుర్రలో మెరుపు మెరిసింది "ఈ అమ్మాయి చదువును నిర్లక్ష్యం చేస్తోంది. పిన్నితో పోట్లాట వేసుకుంది కష్టంలో వుండే స్నేహితురాలిని ఆదుకుందామని క్షమించరాని తప్పు చేస్తోంది ఇప్పుడు కృష్ణమూర్తితో అర్జంటుగా ఏదో మాటాడాలనుకుంటోంది దీనికంతటికీ ఒకటే అర్థం!" అనుకున్నాడు.

కారు స్టార్టుచేసి వీధిలో పడ్డాడు. చూడవలసిన నలుగురైదుగురు పేషంట్లని చూసేశాడు. అక్కణ్ణుంచి—అంతకు రెండురోజులక్రితం ఎడ్మిట్ చేసిన పేషంటును ఓ సారి చూడ్డానికి కె.జి. ఆసుపత్రికి వెళ్ళి – ఆ తరువాత కృష్ణమూర్తి లాడ్జికి వెళ్ళాడు గదిలోకి వెళ్ళి చూసేసరికి కృష్ణమూర్తి సామాన్లు సర్దుకుంటున్నాడు

"ఇదేమిటోయ్! బట్టలు సర్దుకుంటున్నా వెందుకూ?" అన్నాడు

సర్దుకుంటున్న ట్రంకు పెట్టెమీద కూర్చుని కృష్ణమూర్తి "కూర్చో డాక్టరూ! ఏమిటి విశేషాలు?" అనేసి సిగరెట్ ముట్టించాడు

"ఏడిసినట్టుంది. నే నడిగినదానికి సమాధానం చెప్పక నన్ను విశేషాలడుగుతా వేమిటి?"

"అమ్మబాబోయ్! అంత కోపంవస్తే యీ దీనుడు భరించగలడా?" ఊరెళ్ళుతున్నానోయ్ డాక్టరూ – ఊరెళుతున్నాను."

"ఏ వూరు?"

"ఇంకేవూరారో ఎందుకూ? మా వూరే!"

"అదేమిటి? అంత అర్జంటుపని ఏం తగిలింది? నిన్నరాత్రి పదిన్నరదాకా బాగానే వున్నవాడివి యిప్పుడేమొచ్చింది?"

"ఏం రాలేదు. బుర్రలోకి ఓ ఆలోచన వచ్చింది ఇంటిమీద కుతిపారింది, పండక్కికూడా వెళ్ళలేదా–అమ్మనీ నాన్ననీ చూడాలనిపిస్తోంది"

డాక్టరుకి నవ్వొచ్చినంత పనైంది. 'కాయ్' అన్నాడు "ఈ టక్కరి వేషాలు నాదగ్గిర వెయ్యకు. ఇల్లంటే భయపడి పట్నంలో మకాం పెట్టినవాడివి ఇంటివాళ్ళను వీలయినంత తప్పించుకుంటూ తిరుగుతున్నవాడివి, ప్లేటు ఫిరాయించి యిలా మాటాడితే నమ్మాలా వద్దా? ఏం జరిగిందో చెప్పు" అన్నాడు.

కృష్ణమూర్తి మొహం అదోలా పెట్టి "లాభంలేదు డాక్టరూ! నీ దగ్గిర అబద్ధం అడి నెగ్గలేను. నిజమే, ఇంటిమీద ధ్యాసా కాదూ పాడూకాదు వేరే అవసరం వచ్చింది. వెళుతున్నాను. నాకు బుర్ర చెడిపోయింది, డాక్టరూ! నా కేదో జరిగింది హాయిగా, సాదాగా బతుక్కొస్తున్నవాడిని యీ మధ్య కొంచెం పరాగ్గా ఉండేసరికి అమాంతంగా కొన్ని సమస్యలు వచ్చి మీద పడ్డాయి నీకు తెలుసుగదా – నాకు సమస్యలు అంటే భయం. అంటీ ముట్టనట్లుగా అలా అలా బతికెయ్యాలి గాని – సీరియస్ విషయాలు ఆలోచించకూడదు. అది నా మతం. ఈ మధ్య దానికి కొంచెం వ్యతిరేకంగా జరిగి, బుర్రకి ఆలోచించవలసిన దుర్గతి పట్టింది. అంచేత ఓ వారం రోజులపాటు మకాం ఎత్తేసి – మా వూళ్ళో, మా భవంతిలో – పందిరి మంచంమీద హాయిగా పండుకొని నేతి లడ్డూలు తింటూ భట్టి విక్రమార్క కథలు చదువుకుంటాను. వారం రోజులు అలా బతికితే బుర్రకి పట్టిన తిక్కలన్నీ వదలిపోయి హాయిగా ఉంటుంది ఆ తరువాత మళ్ళీ తిరిగొస్తాను."

అదంతా వింటూంటే క్షణమాత్రం డాక్టరుకి అనిపించింది – ఇతనికి మతిగాని పోలేదుగదా అని. మరుక్షణంలోనే మళ్ళీ అర్థమైంది కాదు, కృష్ణమూర్తికి మతి పోలేదు. ఆ మాటకొస్తే – ఎంతో ఆలోచించాకనే కృష్ణమూర్తి యీ నిశ్చయానికి వచ్చి వుండాలి. లీలగా డాక్టరు కేదో అంతా అర్థమయిపోయినట్లనిపించింది అతనికి కృష్ణమూర్తిమీద ఒక్కసారిగా అభిమానం పెల్లుబికింది

"ఎప్పుడు ప్రయాణం?" అన్నాడు

"మధ్యాహ్నం రెండుగంటల బస్సుకి"

"ఓ ఐతే చాలా టైముంది ఓ సారి మా యింటికి రా, పోదాం"

"వీల్లేదు డాక్టరూ! ఇప్పటికి వదిలెయ్ నన్ను. తిరిగివచ్చాక కలుసుకుందాం."

"పిచ్చి వేషాలెయ్యక షర్టు వేసుకో. టైం వేస్టు చెయ్యకు. త్వరగా లే"

డాక్టరువేపుదీనంగా చూశాడు కృష్ణమూర్తి లాభంలేదు, డాక్టరు వదిలేటట్టులేదు, "ఐతే పద!" అన్నాడు

☆ ☆ ☆

ఉన్న మూడు ప్రయివేట్లూ ముగించి, మధ్యాహ్నం ఒంటిగంటవుతోందనగా గదిలో కూర్చుని హోటల్ క్యారేజీ తెరిచింది కల్యాణి హోటల్ భోజనం ఆమెకెప్పుడూ అలవాటే; కానీ యివాళెందుకో ఆ భోజనం చూస్తేనే వెగటుగా తోచింది. తలదిమ్ము నిలుచుంటే కాళ్ళు ఒణుకు టీచరమ్మ పారం ఆ రోజు

పిల్లలెవరికీ నచ్చలేదు పారం చెప్పుతూంటే ఆ సంగతి కల్యాణికే అర్థమైంది అందుకే ప్రతిచోటా గబగబా ముగించేసింది భారంగా కంచంముందు కూర్చుంది కల్యాణి గుండెల్లో పెద్ద నాపరాయి, ఉండుండి దాని మీద సుత్తెలతో బాదుతున్నారు కడుపులో అంతకంటే పెద్ద రాయి ఒక్క మెతుకు కూడా నోటికి వెళ్ళడం లేదు.

"కల్యాణమ్మా!" గుమ్మందగ్గర పిలుపు

ఎవరది?–ఇంటాయన! "ఏం బాబయ్యగారూ?" అంది.

"అన్నానికి కూర్చున్నావా? తినమ్మా తరవాత వస్తానులే."

"ఫరవాలేదు బాబయ్యగారూ, మనలో మనకేమిటి? చెప్పండి"

"ఆ ఏంలేదు. రాత్రి మీ స్నేహితురాలింటికి వెళ్ళావటగా?"

త్రుళ్ళిపడింది కల్యాణి. "మరేనండీ!" అది హీనస్వరంతో

"పొద్దున్న మీ పిన్ని చెప్పిందిలే. నేను గమనించనే లేదూ రాకపోకలుంటేనే స్నేహాలు గదమ్మా! పాపం, ఆ అమ్మాయి ఎంత మంచిది కాకపోతే నిన్ను అలా ఆదరిస్తుంది! ఉంటారు ధర్మాత్ములు చిన్నేమిటి పెద్దేమిటి ధర్మబుద్ధి వుండాలి కాని రానురాను అలాంటివాళ్ళు లోకంలో కరువైపోతున్నారమ్మా! పాడుకాలం. చిన్నలకీ పెద్దలకీ నీతి నశించింది"

"అవునండీ!" అంది కల్యాణి ముక్తసరిగా, వంచిన తల ఎత్తకుండానే.

"నువ్వు సరేనన్నావా–మా పాపారాయుణ్ణి అడిగాను. అడగడమేమిటి, చేస్తేకాని వీల్లేదన్నాను."

పాపారాయుడెవరు? కల్యాణికేమీ అర్థంకాలేదు అతనివేపు వెర్రిగా చూసింది

"ముందు సణిగాడనుకో, తరవాత సరేనన్నాడు ఎల్లుండి నిన్నోసారి తీసుకు రమ్మన్నాడు సర్టిఫికెట్లూ అవీ తీసుకుని. అలాగే దానికేం కష్టం. అవసరమైతే ఒకసారి కాదు పదిసార్లు వస్తాం గాని పని జరగాలి అన్నాను ఎల్లుండి మధ్యాహ్నం నీకు వీలుంటుందా?"

ఏమిటి యీ ముసలాయన అంటున్నది? నెమ్మదిగా బహు నెమ్మదిగా బుర్రలో యంత్రం తిరిగి, జవాబు వెలిగించింది. టెలిఫోన్ ఆపరేటరు సంగతి! హమ్మయ్య! తనకు అర్థం అవడానికి ఎంతసేపు పట్టింది!

"తప్పకండా వెళదాం బాబయ్యగారూ! దయచేసి ఆ కాస్త ఉపకారం చేసిపెట్టండి, మీ మేలు మరచిపోను."

"ఇందులో ఉపకారం ఏముందమ్మా! పరాయివాళ్లకు చేస్తున్నామా ఏమిటి?" ముసలాయనకు బంధుప్రేమ చాలా ఎక్కువ అందరూ అలాగే వుండాలి అని ఆయన సిద్ధాంతం. ఇంతలో పిన్నిగారొచ్చి గుమ్మందగ్గర నిలబడి "ఏమిటీ అమ్మాయికి చెపుతున్నారూ?" అంది.

"ఆఁ, పాపారాయుడు లేడటే, కనకయ్య కొడుకూ! ఇప్పుడంటే చాలా పెద్దవాడయిపోయాడు గాని, ఆ కనకయ్యని మూడుసార్లు నేను ఆపదలో ఆదుకున్నాను."

"మీదంతా సోదె. అసలు సంగతేమిటో చెప్పండి"

"ఆఁ అదేనే! అమ్మాయికి టెలిఫోన్ ఆపరేటరు ఉద్యోగం."

"ఇస్తానంటాడా యివ్వనంటాడా? ఆ సంగతి చెప్పండి"

"బాగుంది నీ ప్రశ్న. వాడి బాధలేవో వాడు చెప్పాడు ఏమిటో ట్రెయినింగంటాడు, టెంపొరరీ అంటాడు, సెలక్షన్ అంటాడు అదేమిటో సరిగ్గా నాకు బోధపడలేదు అదంతా నాకు తెలియదు, అమ్మాయికి నువ్వు ఆ ఉద్యోగం వేయించక తప్పదన్నాను వేయిస్తాడులే, నా మాట కాదనలేడు."

ఆ ధోరణిలోనే దంపతులిద్దరూ కలిసి కాస్సేపు లోకాభిరామాయణం మొదలెట్టారు తీవ్రమైన నిర్వేదంలో పడి కొట్టుకుంటూన్న కల్యాణికి ఉద్యోగం అనేసరికి దృష్టి అటు మళ్ళింది తనకు నిజంగా ఆ వుద్యోగం దొరుకుతుందా? దొరికితే తను ఏ నిర్ణయానికి రావాలి? ఉదయం నుండీ నిద్రలో అన్నీ సమస్యలే వాటి వేడికి మెదడులో పొగలు రేగుతున్నాయి కాని, జవాబులు మాత్రం దొరకడం లేదు. ఏం జరిగింది తనకు?

"అలసిపోయావమ్మాయ్! అన్నం తిని కాస్సేపు నడుం వాల్చు" అనేసి యింటావిడ లోపలకు పోయింది ఇంటాయనకూడా ఆవిడ ననుసరించాడు

అవును, నిజంగానే అలిసిపోయింది తను. ఉదయం తెలతెలవారుతూండగానే రిక్షా ఎక్కి ఇంటికి వచ్చింది. చాలా రోజుల తరవాత మళ్ళా రిక్షా. గుమ్మం దగ్గర దిగీ దిగగానే నవనాడుల్లోనూ ఏదో నీరసం ప్రవేశించింది. పరిచితమైన వీధి, పరిచితమైన యిల్లు, అంతా కొత్తగా కనబడ్డాయి, తనకుతనే కొత్తగా కనిపించింది త్వరత్వరగా రిక్షావాడికి డబ్బులిచ్చేసి, గదిలోకి పోయి పరుపుమీద చేరబడిపోయింది. "ఊరు తెల్లారకుండా వచ్చేశావేమమ్మాయ్! కాస్త పొద్దెక్కాక రాలేకపోయావా?" అంది పిన్నిగారు పలకరిస్తూ "త్వరగా తెములాలిగదా పిన్నిగారూ! అదీకాక నిద్రమొహంతో వచ్చినప్పుడు వేకువతో వచ్చేయడమే మంచిది" అంది. అన్న తర్వాత తన సమయస్ఫూర్తికి తనకే ఆశ్చర్యం వేసి, భయం వేసినంత పనైంది గడచిన రాత్రి ఒక్కసారిగా మనోనేత్రం ముందు గిరగిరా తిరిగింది నిన్న తన పుట్టినరోజు దినం. అందుకే ఆ విధంగా గడిచిందా? వసుంధర పిన్నిగారు ఆ మాటలనకపోతే ఎంత బాగుండిపోను? అదేంమాట, ఆవిడకు తోచినదేదో ఆవిడ అంది నిన్న తనసలు గుమ్మం కదలక పోవలసింది ఇంట్లోనే వుండిపోతే యిన్ని పరిణామాలు వచ్చి వుండేవి కావు ఇప్పుడేమనుకుని ఏం లాభం?

పరుపుచుట్టమీద చేరబడిన కల్యాణి కళ్ళలోంచి నీటిచుక్కలు జరజరా రాలాయి ఇంతే తన జీవితం. జన్మాంతం ఇలా ఒంటరితనంతో బాధపడవలసిందే. తను ఎవరికీ అర్థంకాదు– నిజమేనా? తనేమిటో డాక్టరుకి అర్థం కాలేదా? కాదు, అలా అనుకుందుకు తనకు హక్కులేదు? నిన్నటి దాకా వుందేమో కాని నేటితో ఆ హక్కు పోయింది. డాక్టరుకి తను అర్థం అవాలి అందుకు ప్రయత్నించాలి తను తప్పదు అలాగే వసుంధరకు కూడా క్షమాపణలు చెప్పకోవాలి. పాపం, వసుంధరే లేకపోతే తన జీవితం ఏమై ఉండేది? ఆవిడ పిన్నిగారు తనకి మహోపకారమే చేసింది. తనలోని జీవనోద్రిక్త వాంఛలను, పరాభవాలను ప్రజ్వలింపచేసింది ఏదైనా ఒత్తిడిలోనేకాని మన అంతర్గత వ్యక్తిత్వస్ఫూర్తి ఆకారం దాల్చి ఆచరణలోకి దిగదు రాత్రి అదే జరిగింది. వసుంధర పిన్నిగారే తన ప్రియబాంధవి, తన మనోనేత్రం

తెరిపించి, కర్తవ్యంలోకి ఉరకలెత్తించింది ఆ సంగతి తనకొక్కర్తికే తెలుసు చక్రవర్తికి కూడా తెలియదు. ఈ జన్మలో తను చెప్పలేదు కూడా.

హఠాత్తుగా ఆమె మనసు నాక్రమించిన విషాదమేఘాలు అదృశ్యమైనాయి ఏమిటది? తనెందుకిలా కుంగిపోతోంది? ఇన్నాళ్ళకు తన జీవితం ఫలించింది తన ఒంటరితనం తొలగిపోయింది తనిప్పుడు హాయిగా లేచి నిలబడాలి; ధైర్యంగా ప్రపంచాన్ని చూసి చిరునవ్వు నవ్వాలి తనకు పునర్జన్మ వచ్చింది తనొక కొత్త కల్యాణి. ఈ కొత్త కల్యాణి లోకానికి భయపడదు తనమీద ఇంకెవరికీ హక్కు వుండనివ్వదు. ఆఖరికి చక్రవర్తికయినా సరే! ఏం చేశానని తనకు భయం? జరిగినదాన్ని గురించి భయం దేనికి? వెళ్ళి నిర్భయంగా లోకాన్ని ఎదుర్కోవాలి తను. మళ్ళీ తనకే నవ్వొచ్చింది ఏ లోకం? తనకు తెలిసిన లోకం అంతా కలిసి పదిమందిలేరు. తక్కిన లోకానికి తనసలు బతికున్నట్లే తెలియదు. ఏవో గంభీరమైన మాటలు వాడుతుంటారుగాని, మనకు సంబంధించిన ప్రపంచం ఎప్పుడూ చిన్నదే ఆ చిన్న ప్రపంచంలోనే అనేక సంఘర్షణలు

సాయంత్రం నాలుగు గంటలదాకా అలా అచేతనంగా పడుకొని ఉంది కల్యాణి ఆమె పదిలంగా హృదయంలో మోసుకుంటున్న రహస్యాలు ఆమెకే బరువనిపించాయి ఆ బరువులోనే ఏదో నిషా చేతివాచీ అప్రయత్నంగా చూసుకుని "అమ్మయ్యో చాలా టైమైంది" అనుకొని గబగబా లేచి మొహం కడుక్కొందుకు వెళ్ళబోయేసరికి కాఫీగ్లాసుతో పిన్నిగారు ఎదురైంది "ప్రతిరోజూ మీకే శ్రమదేనికి పిన్నిగారూ!" అంటే పిన్నిగారు దానికి సమాధానం చెప్పక "ఎక్కడికైనా బయలుదేరుతున్నావా అమ్మాయ్?" అంది.

"అవునండీ! చెప్పడానికి మీ దగ్గరకు వద్దామనుకుంటూంటే మీరే వచ్చారు సాయంత్రం కొంచెం పనుందండీ! మా వసుంధర దగ్గరకు వెళ్ళాలి చీకటి పడకముందే వచ్చేస్తాలెండి" అంది.

"వెళ్ళిరా అమ్మా! దానికేం?" అనేసి పిన్నిగారు చక్కాబోయింది

అరగంటలో తయారై కల్యాణి బయలుదేరింది వీధిలోపడి నడక ప్రారంభించింది కల్యాణి నడుస్తున్నప్పుడు అడుగు భద్రంగా వేస్తుంది రిక్షా ఎక్కాలా, నడవాలా? చిన్న పర్సులో డబ్బులు చూసుకుంది. ఫరవాలేదు. చిల్లరడబ్బులున్నాయి ఆమెకెందుకో ఇవాళ మనుష్యులమధ్య నడవాలనిలేదు. జనానికి దూరంగా, ఏకాంతంగా ఉండాలనిపించింది. తన హృదయంలో ఏవో దివ్యపరిమళాలు వెల్లివిరుస్తున్నాయి ఆ సంగతి ఎవరికీ తెలియకూడదు. మరుక్షణంలోనే బెంగతో గుండె బరువెక్కిపోతోంది. ఆ సంగతి ఎవరికీ తెలియనివ్వకూడదు. ఐదింటికల్లా ఎలాగోలాగ డాక్టరింటికి చేరుకుంటే అదే చాలు. సందుచివర రిక్షాఎక్కి మెయిన్ రోడ్డులో పడింది రిక్షావాడు పదిబారలు తొక్కాడో లేదో ఆమె గుండె ఆగిపోయినంత పనైంది ఎదురుగా, సరాసరి తనకు ఎదురుగా, ప్రకాశం నడిచి వస్తున్నాడు ఏం చెయ్యాలిప్పుడు? ధైర్యం చిక్కబట్టుకొని "రిక్షా త్వరగా పోనీ అబ్బాయ్! పనుంది" అంది రిక్షావాడు జోరు హెచ్చించాడు. కాని లాభం లేకపోయింది రిక్షాకి అడ్డంగా వచ్చిన ప్రకాశం

ఆపమని సైగ చేశాడు. రిక్షా ఆగింది రోడ్డువారగా. కల్యాణికి ఎక్కడలేని భయమూ ముంచుకొచ్చింది. అటూ యిటూ చూసింది. తెలిసిన వాళ్ళెవరైనా ఉన్నారా?

ప్రకాశమే ముందు పలకరించాడు, "ఏం కల్యాణీ! బాగున్నావా?" అంటూ.

కల్యాణి మాటాడలేదు. ఆమె గుండెల్లో భయం పోయింది. భయం బదులు అసహ్యం ప్రవేశించింది. అతని కెందుకు భయపడాలి అనుకుంది.

"ఇలా ఎక్కడికి వెళుతున్నావ్ కల్యాణీ?"

"పనిమీద" ముక్తసరిగా జవాబిచ్చింది. రిక్షావాడు కొంచెందూరంలో రోడ్డువార నిల్చొని చెమట తుడుచుకుంటున్నాడు.

"చాలా కాలానికి కనపడ్డావు మళ్ళీ. నువ్వెక్కడున్నావో తెలసుకుందామని యీ మధ్య చాలా ప్రయత్నించాను."

"దేనికీ?"

"దేనికంటావేమిటి కల్యాణీ? జరిగినదానికి క్షమించి స్నేహితుడిగానైనా చూడలేవా?"

"ఎవళ్ళ స్నేహితులు వాళ్ళకున్నారులెండి."

"అండీ ఎప్పుడు నేర్చుకున్నావు కల్యాణీ?"

"మీరు కూడా నేర్చుకోవడం మంచిది."

"పోనీలే. క్రమంగా అదీ నేర్చుకుంటాను ఇన్నాళ్ళకి నిన్ను తిరిగి చూడగల్గాను అంతే చాలులే. పోనీ జరిగినదేమిటో చెప్పుకుని క్షమించమని నిన్ను అడగడానికైనా అవకాశమివ్వవా?"

"నడిరోడ్డుమీద యీ సంభాషణ బాగులేదు; దయచేసి నన్ను పోనివ్వండి. ఇప్పుడప్పుడే మీతో ఏం మాటాడలేను. కొంతకాలంపోయాక చూద్దాం, ఇంక మీరు వెళ్ళండి."

"ఇక్కడికి దగ్గరే మా యిల్లు. మా అమ్మని కూడా తీసుకొచ్చేశాను"

"మంచిదే..."

"ఒక్కసారి మా యింటికి రాలేవా?"

"అనవసరం" అనేసి రిక్షావాడిని రమ్మని గట్టిగా కేకేసి, రిక్షాపోనివ్వమంది. ఆ కేకకు రిక్షావాడు బిత్తరపోయి క్షణమాత్రం యిద్దరి మొహాలవేపు చూసి బండి పోనిచ్చాడు. సాగిపోయిన రిక్షావేపే చూస్తూ అలా స్తంభించిపోయాడు ప్రకాశం. ఎవరైనా చూశారేమోనని చుట్టూరా కలయచూసి, వచ్చినదారినే మళ్ళీ వెనక్కి మళ్ళాడు. లాభంలేదు, కల్యాణి తనతో ఇంక మాటాడదు. ఒకసారి కృష్ణమూర్తిని కలుసుకుంటే బాగుండును. రూమ్‌లో ఉంటాడో ఉండడో; అతనికి చూడాలనే వెర్రి ఆవేశం కలిగింది. బయలుదేరాడు.

"ఛీ! మనస్సంతా పాడైపోయింది. ఇతను కనబడకుండా ఉన్నా బాగుండిపోను" అనుకుంది కల్యాణి. మాసిపోయిన పాత గాయాలను మనుషులు అనవసరంగా రేపుతుంటారు. ఏనాడో చచ్చిన అనురాగాలను చేటపెయ్యలుగా మార్చి హృదయాన్ని కదలించాలని చూస్తారు" అనుకుంది.

రిక్షా చక్రవర్తి క్లినిక్ ముందు ఆగింది. ఇంట్లోకి వెళ్ళబోతూంటే నర్సువచ్చి, "డాక్టరుగారు లేరండీ! ఎక్కడికో వెళ్ళారు. మీరొస్తే కూర్చోబెట్టమన్నారు" అంది.

"సరే!" అనేసి హాల్లో కూర్చుంది కల్యాణి ఎక్కడికి వెళ్ళిపోయినట్టు యీ డాక్టరు? సరిగ్గా ఐదింటికి ఉంటానన్నారే? ఆదిలోనే హంసపాదా? ఎంత ఉద్విగ్నహృదయంతో వచ్చింది తను! ఆయనకి కూడా అలా అనిపించలేదా? లేదనుకుంటేనే గుండె గజగజాలాడిపోయింది.

నిరీక్షణ, ఎడతెగని నిరీక్షణ జీవితంలో సగం కాలం నిరీక్షణతో గడపాలి తక్కిన సగం కన్నీళ్ళతో గడపాలి. ఛీ, వెధవ బతుకు అనుకుంది కల్యాణి. అలాగే డాక్టరుకోసం నిరీక్షిస్తూ కూర్చుంది.

☆ ☆ ☆

సరిగ్గా ఆ సమయంలో డాక్టరూ కృష్ణమూర్తీ బస్‌స్టాండ్ దగ్గర ఉన్నారు ఇద్దరూ డాక్టరు కారులోనే కూర్చున్నారు.

"ఎంత చెప్పినా నీ మొండి పట్టుదలే నీదన్నమాట ఇవాళ ఒక్కరోజుకి ఆగి రేపు వెళితే నీ పుట్టి ఏం మునిగిందీ?" అన్నాడు డాక్టరు.

కృష్ణమూర్తికి చికాకేసింది "రెడ్డొచ్చె మొదలాడు అన్నాట్ట మధ్యాహ్నమల్లా వాగానుగదా, అదంతా గాలికి పోయినట్లేనా? నీతో వాగి వాగి గుండెల్లో నొప్పి పుట్టుకొచ్చింది, నేనేం చెప్పలేనింక, వెళ్ళితీరాలి."

"నేను అడ్డుపడలేదు. ఫో! నీ యిష్టం వచ్చినచోటుకి కాని ఒకసారి వసుంధరతో మాటాడి మరీ వెళ్ళు అంటున్నాను; అంతే"

"లాభంలేదు. ఈ జన్మలో యింక ఆవిడ మొహం నేను చూడలేను. నాలో చాలా చాపల్యాలు ఉన్నాయి కాని నేను దుర్మార్గుణ్ణి కాను డాక్టరూ! ప్రవాహంలోపడి చాలాదూరం కొట్టుకుపోయాను ఇప్పటికైనా నించుని అన్నీ ఆలోచించుకోవడం మంచిది. ఇలా బతకడం చాలా అసహ్యంగా ఉంది నాకు తెలియకుండానే నాలో ఏదో వక్రత్వం ఉండివుండాలి. దాని ఫలితమే ఇప్పుడనుభవిస్తున్నాను. వసుంధర ఇంటి పొలిమేరలకి వెళ్ళడానికి కూడా నాకు అర్హతలేదు. అదంతా పోయింది జీవితంలో నాకు కావలసింది వేరు, దొరుకుతున్నది వేరు అంచేత ఇందిరను దక్కించుకోవడమే ఇప్పుడు నేను చెయ్యవలసింది. నాక్కావలసిన పరిణామం కాదది. దానివల్ల నా వాళ్ళకి కూడా దూరమైపోతాను. కాని ఏం చెయ్యడము? అదలా జరిగి తీరవలసిందే. లేకపోతే మనశ్శాంతి అసలుండదు. లేదా, ఇక్కడికి యీ ఘట్టానికి స్వస్తిచెప్పి చదువుకోసం దూరంగా ఎక్కడికైనా పోవాలి అలా పారిపోవడం అంతకంటే అసహ్యం. చిత్రమేమిటంటే డాక్టరూ! ఏ బాధ్యతలూ అక్కరలేకుండా గట్టుమీదకూర్చుని నిశ్చింతగా తమాషా చూద్దామనుకున్నా నన్ను పరాగ్గా ఉండడం చూసి ఎవరో నీట్లోకి లాగేశారు లేదా నేనే పడిపోయాననుకో, నీ యిష్టం పడిపోయాక ఈదాలి, తప్పదు లేకపోతే రూల్సుకి భంగం ఇవన్నీ ఆలోచించుకోవాలి కాబట్టి నాయనా, నన్ను వెళ్ళనియ్!"

"ఆల్ రైట్ నీ ఖర్మ మళ్ళీ ఎప్పుడొస్తావ్?"

"ఇక్కడనుకుంటాను గాని తీరా అక్కడికెళ్ళాక తిరుగుబస్సులో వచ్చేయాలని పిస్తుంది. అచ్చట మా ఊరు, మా కుటుంబం అలాంటివి ఇక్కడివి తప్పించుకోవాలని

వెళుతున్నానుగాని అచ్చటవి కావాలని కాదు మహా అయితే నాలుగైదు రోజుల్లో వచ్చేస్తాను."

డాక్టరు చిరునవ్వు నవ్వాడు "అలాగే వచ్చేయ్, లేకపోతే అందరి సంగతీ అటుంచి ముందు నాకు తోచదు" అన్నాడు

అతనిని బస్సెక్కించేసి, ఇంటికి వెళ్ళిపోయాడు డాక్టరు. అప్పటికి సాయంత్రం అయిదున్నర దాటుతోంది.

# 20

అంతవరకూ మేలుకుని ఉన్న కల్యాణికి క్షణంలో కునుకు పట్టేసింది. కూర్చుని ఉన్న కల్యాణి వెనక్కి చేరబడి నిద్రపోయింది. శరీరమూ, మనస్సూ బాగా అలసిపోయాయి. నిద్ర, తిండి రెండురోజులనుండి సరిగా లేవు పసిలేని భోజనం, ఎడతెగని ప్రయాణం, ఎచ్చటెచ్చటో బస. యివన్నీ కలిసి ఆమెను నీరసింపచేశాయి ఆ రోజు ప్రొద్దున్న సరిగా తిండి సయించలేదు. రాత్రి ఆ ప్రయత్నమే మానుకుని కప్పు పాలుతాగి వూరుకుంది శరీరం అలా ఉంటే మనస్సు సరేసరి, సుఖదుఃఖాదిక ద్వంద్వాతీతంగా ఉంది కల్యాణి చైతన్యం శరీరంనుండి విడివడి దూరంనుండి నిర్వికారంగా పరిశీలిస్తూంది. "కల్యాణీ! ఎవరు నువ్వు?" అని ప్రశ్నిస్తూంది తన శరీరంమీద తనకే అసహ్యం వేస్తూంది. మరుక్షణంలోనే ఏదో మమత; పులకరింతలు. ఎక్కడో-ఎన్నడో చదివిన పద్యభాగం, అవగాహన పొరల అడుగున మెల మెల్లగా లోకాంతర వాణివలె వినబడింది; "చెలువము సౌరభము వెదజిమ్మెడు లేత గులాబి మొగ్గకున్ తులయగు నాదు యౌవనము"-ఎక్కడిది చెప్మా ఆ భావం? యౌవనం...లేత గులాబి మొగ్గలు . చెలువము, అగరువత్తుల పరిమళం, మెత్తని నీలికాంతుల దీపం, దీపకాంతిలో సూర్యోదయం, కాశ్మీరం కుంకుమతోటలు, హిమాలయాలమీద ఉషఃకాలం... ఏవేవో అనుభూతులు, ఆ అనుభూతులకు మాటుగా వేసిన మాంజిష్మకాంతులీనే తెరలు తను మేలుకుంటున్నదా కలలు కంటున్నదా?

మగత నిద్రలో కలలు కంటున్నది కల్యాణి. తెల్లని పాలసముద్రం వంటి అనంతకాల గర్భంలో మంచు తుపానుల మధ్య చిక్కుకున్న ఓ పల్లెటూరు. అచ్చంగా తన వూరే. కుగ్రామం. ఆ గ్రామంలో, రామమందిరాన్ని ఆనుకుని సాగే సందులో చిట్టచివరి ఓ పెంకుటింట్లో వసారాలో నిల్చున్నది తను బయటకుండపోతగా వాన, వడగళ్ళవాన. తను పరికిణీ కట్టుకొని, నోట్లో వేలు పెట్టుకొని మూలగా నిల్చున్నది అర్ధరాత్రి సమయం. వంటింట్లో పిన్ని గరుడ పురాణం చదువుకుంటోంది తను వెక్కి వెక్కి ఏడవడం చూసి తనకే నవ్వొస్తూంది. వరండా చూరుకింద పడుకుని ఉన్నాడు నాన్న మంచి నాన్న, ముసిలి నాన్న. నాన్న చచ్చిపోయాడంటే నిల్చుని చూస్తోంది తను. అందరికీ కోపంగా ఉంది తనమీద నాన్నని చంపింది తనే నంటున్నారు అంతా. అందుకే ఏడుస్తూంది

"నాన్నా! నా మీద కోపం వచ్చిందా నీకు?"

"ఉందమ్మా మరీ! ఏంచేశావో ఒకసారి ఆలోచించుకో. భూకంపానికి మధ్య పుట్టావు. నా గుండెలమీద పెరిగావు ఐదేళ్ళప్పుడు నాతో బడికి వచ్చావు అప్పుడు ఏమనుకున్నానో తెలుసా? నిన్ను ఝాన్సీ లక్ష్మీబాయి అంతటిదాన్ని చేసెయ్యాలి అనుకునేవాణ్ణి; సరోజినీనాయుడు అంతటిదాన్ని చేసెయ్యాలి అనుకునేవాడిని"

"పోనీ నాన్నా! యింకా టైముంది అంతటిదాన్ని అవనంటావా?"

"ఇంకెలాగా అవుతావు కల్యాణీ! చివరికి ఏం చేశావో ఆలోచించుకో. మన యింటావంటా ఎవరైనా చేశారా ఇలాంటి పని?"

"మరి నువ్వు చచ్చిపోయావుకదా నాన్నా? నీకేమైనా బాగుందా అలా చేయడం?"

"ఏం చెయ్యను కల్యాణీ! పాము కరిచేసింది, చచ్చిపోయాను. అది నా తప్పేనంటావా? బతుకు అనే పెద్దపాము కరిచేసింది, చనిపోయాను అయితే మట్టుకు? నీకేమైనా లోపం చేశానా? ఎనిమిదేళ్ళపిల్లవు నువ్వు పిన్నితోపాటు గుడికి పంపాను. పదేళ్ళప్పుడు రుక్మిణీకల్యాణం, గజేంద్రమోక్షం కంఠస్థం చేయించాను పదకొండేళ్ళప్పుడు నీకు పెళ్ళి చేసెయ్యమని పిన్ని గోలపెడితే. అందర్నీ తిట్టేసి బళ్ళోపడేశాను"

"పడేస్తే ఏం చేశాను నాన్నా?"

"ఏం చేశావా? ఆ సంగతి ప్రకాశాన్ని అడుగు; నీ చక్రవర్తిని అడుగు"

"అలాగంటావేమిటి నాన్నా? నువ్వా చచ్చిపోయావు నాకా జ్వరం వచ్చింది డాక్టరు దగ్గరికి వెళ్ళకపోతే ఎలాగ మరీ?"

"మందుల్నీ డాక్టర్లనీ మార్చడం ప్రమాదం కాదా కల్యాణీ?"

"ఏం చెయ్యను నాన్నా? ప్రకాశం డాక్టరే అనుకున్నాను చేతిలో స్టెతస్కోపు చూసేసరికి అతను డాక్టరే అని భ్రమపడ్డాను. కాదని తెలిసికూడా, పోనీలే డాక్టరూ పరీక్ష పూర్తి అయేదాకా ఆగుదామనుకున్నాను. అతనే భయపడి పారిపోయాడు నాన్నా!"

"అవన్నీ సాకులు. అసలు నీకు జ్వరం ఎందుకు రావాలి?"

"ఏం చెయ్యను నాన్నా? నువ్వా చచ్చిపోయావు. బయటచూడు ఎలా వాన పడుతోందో! అది ఉత్తవానకాదు నాన్నా! మంచుతుపాను, చలితుపాను పైగా అర్ధరాత్రి ఇంట్లో ఎవరూ లేరు ఇంటికప్పు వూడిపోయింది ఇల్లంతా కురుస్తోంది ఇంటిముందు జువ్విచెట్టు గాలికి ఎలా చప్పుడుచేస్తోందో విను! నాకు భయం వేస్తోంది నాన్నా!"

"అందుకనేనా గులాబీ మొగ్గలు అలా దానం చేసేశావు?"

"లేదు నాన్నా? అలా అనకు. నువ్వు పొరపాటుపడుతున్నావు కాలం మారింది. అంచేత నువ్వు అర్థం చేసుకోలేకపోతున్నావు."

"ఒప్పుకుంటాను. పోనీ, ఇప్పటికైనా నీ బెంగలు తీరాయా? నేను చచ్చిపోయాను గదా, నన్ను సంతృప్తిగా కళ్ళు మూసుకోనిస్తావా?"

"నిశ్చింతగా మూసుకో నాన్నా! నా కోసం బెంగపెట్టుకోకు. కల్యాణి నీ కలల్ని వృథా కానివ్వదు. ఒకసారి భ్రాంతిలో పడినాను. నాన్నా క్షమించు ఇది భ్రాంతి

కాదు. ఇక ఫరవాలేదు నాన్నా ఇంకా కొండ చేరుకోలేదు చాలా దూరం ఉందిగాని, దారి మాత్రం ఇదే నాన్నా అలా వెళ్ళగా వెళ్ళగా కొండ వస్తుంది. అక్కడికే వెళుతున్నాం. తరువాత అక్కడికి చేరుకున్నాక నువ్వుచెప్పిన పనులన్నీ ఒక్కటొక్కటే చేస్తాను నాన్నా!"

"చెయ్యమ్మా! ఒకటీ మరచిపోకు. మాట నిలబెట్టుకో గులాబీలు ఇస్తే ఇచ్చేశావు పోనీలే...మీ తరంవాళ్ళ పద్ధతులు వేరు, కాని నాన్నమీద పెట్టుకున్న ఆశల్ని మరచిపోకు. తుపాను ఎక్కువవుతోంది; చీకటి కాటుకలు కురుస్తోంది. ఏరు పొంగి ప్రవహిస్తోంది. కుక్క అరుస్తోంది. భద్రం అమ్మాయ్, నేను వెళ్ళొస్తాను"

"నాన్నా! నాన్నా!"

కెవ్వుమని కల్యాణి అరిచేసరికి ఛట్టున కారు బ్రేకువేసి ఆపేశాడు చక్రవర్తి. రోడ్డు పక్కగా కారు ఆగింది. ప్రక్కసీటులో కూర్చుని తన మీద ఒరిగిపోయిన కల్యాణి బుజం పట్టుకు వూపుతూ "కల్యాణీ ! కల్యాణీ !" అని గట్టిగా లేపాడు. అప్పటికి ఆమెకి మెలుకువ వచ్చింది. కళ్ళు నులుముకునేసరికి తాను ఏడుస్తున్నట్లు తెలుసుకుంది.

"ఏం? ఏం జరిగిందీ! కారు ఆపేశారేం?"

"భలేదానివి! హడలిపోయాను. నాన్నా అని ఎంత గట్టిగా అరిచావో తెలుసా?"

"అరిచానా నేను?"

"నెమ్మదిగా అంటావ్! పొలికేక పెట్టావు. అందుకే హడలిపోయి కారు ఆపేశాను."

"మంచివాళ్ళే! నాకేదో కలొచ్చింది కలలో భయపడి అరిచుంటాను—కునుకు ఎప్పుడు పట్టేసిందో! ఇప్పటిదాకా మెలుకువగానే ఉన్నాను"

చక్రవర్తికి నవ్వొచ్చింది. ఒక్క చెయ్యి స్టీరింగు చక్రంమీదుంచి యింకో చేతితో కల్యాణిని దగ్గరకు తీసుకుంటూ, "పిచ్చిదానా! అరగంట అయింది నువ్వు పడుకుని, అలాగే కునుకుతూ నామీద జోగిపోయావు. నువ్వు పడుకున్న తరువాత కనీసం ఓ వంద రెండెడ్ల బళ్ళనీ, ఓ డజన్ లారీలనీ ఓవర్ టేక్ చేశాను తెలుసా?" అన్నాడు.

"టైమెంతయింది?"

"నాలుగున్నర!" అన్నాడు, వాచీ చూసి.

"అబ్బ! ఎప్పటికి తెల్లారుతుంది బాబూ! ఇంకా ఎంతదూరం ఉంది?"

"తెల్లవారే లోపున చేరుకుంటాంలే అంటే, మహా అయితే ఒక గంట రోడ్డు బాగాలేదు, లేకపోతే యీసరికే చేరుకుని ఉండేవాళ్ళము."

"ఐనా యీ అర్ధరాత్రి ప్రయాణమేమిటి బాబూ! పదండి పోదాం, ఆపేశారేం?"

మళ్ళీ కారు స్టార్టు చేశాడు చక్రవర్తి నెమ్మదిగా పోనిస్తూ "కలొస్తే భయపడి అలా అరుస్తారా ఎవరైనా? పీడకలా?" అన్నాడు.

"పూర్తిగా కాదు. సాయంత్రం నుంచీ నాన్నగురించి అప్పుడప్పుడు ఆలోచిం చుతున్నానేమో, ఆయనే కలలోకొచ్చారు ఏమిటో గమ్మత్తయిన కల ఆయన కోప్పడినట్లనిపించింది" అంది కల్యాణి.

అతను మాటాడలేదు. బ్రేకువేసి కారాపి. జేబులోంచి సిగరెట్టు వెలిగించుకుని, మళ్ళీ పోనిచ్చాడు. సీటులో ఒరిగి కూర్చుని మొహం రెండుచేతులతోనూ కప్పుకుంది కల్యాణి.

"చలివేస్తోందా?" అడిగాడు చక్రవర్తి.

"కొంచెం."

"రగ్గు తీసుకోకూడదూ? వెనకసీటులో వుంది."

"ఫరవాలేదు. కావాలంటే తీసుకుంటాలెండి"

ఇద్దరూ మౌనం దాల్చారు. కారు ముందుకు సాగిపోయింది.

ముందు ప్రసరిస్తున్న కారు లైట్లు తప్ప యిరుపక్కలా చిమ్మచీకటి ఈదరగాలి రంయ్‌మని వీస్తూంది. ఎక్కడికీ ప్రయాణం అనుకుంటోంది కల్యాణి దీని ఫలితాలు ఎలాగుంటాయి. ఎందుకలాంటి కలొచ్చింది తనకి? అన్నీ ప్రశ్నలుగానే మిగిలిపోతున్నాయి వేటికీ జవాబులు లేవు ఇదొక సాహసిక యాత్ర; అంతే. ఇంకాసేపటిలో నెల్లూరు అక్కడ కొంతసేపు విశ్రాంతి. ఆ తరువాత తిన్నగా, సరాసరి – "అమ్మబాబోయ్" ఆలోచించడం మానేసింది కల్యాణి

పదినిముషాలు పోయాక కల్యాణే మౌనాన్ని భంగం చేసింది.

"కృష్ణమూర్తినీ ఇందిరనీ ఎక్కడ కలుసుకుంటాం మనం?"

"అంటే?"

"అంటే నెల్లూరులోనా, లేక సరాసరి అక్కడేనా అని"

"చెప్పానుగా!"

"మీరు చెప్పింది సరిగా అర్థంకాలేదు నాకు. ఒకసారి నెల్లూరంటారు ఒకసారి సరాసరి అక్కడే అన్నారు చివరకు ఏది నిశ్చయించారో నాకేం తెలుసు?"

"అతనుకూడా సందిగ్ధంగా చెప్పాడు మరి. నేనేం చెయ్యను? ఇందిరకేమో నెల్లూరులో ఆగడానికి యిష్టంలేదట సరాసరి అక్కడికే పోదాం అందట మనవాడి ఉద్దేశమేమో అందరం నెల్లూరులో కలుసుకుని అక్కడ నుండి కలిసి వెళదామని. చివరకు వాడే నెగ్గుతాడులే."

"ఏమిటి మీకా ధైర్యం?" అంది కల్యాణి

"అదంతేలే. ఇందిర యిదువరకెలాగుండేదో నాకు తెలీదుగాని, యిప్పుడు మాత్రం వాడెంత చెపితే అంత. సణుగుతుంది, పోట్లాడుతుంది గాని, చివరకు చెప్పినట్లే చేస్తుంది."

"ఎంతలో ఎన్నిమార్పులొచ్చేసాయి! ఇందిర యింత మారిపోతుందని కలలో కూడా అనుకోలేదు నేను!" అంది కల్యాణి.

"అక్కడే నువ్వు పొరపాటు పడుతున్నావు" అన్నాడు చక్రవర్తి. సిగరెట్ గట్టిగా పీలుస్తూ, "మార్పువచ్చింది ఇందిరలో కాదు, ఇందిర జీవితంలో వచ్చిందంటాను ఆవిడగురించి మీరంతా పొరపాటుగా అర్థంచేసుకున్నారేమో! అంటే, ఆవిడలో లోపాలు లేవని నేననడంలేదు. కాని, అందరికీ ఉన్న ఆశల్లాంటివే ఆవిడకీ ఉంటాయని ఎందుకనుకో కూడదూ?"

"ఉండకూడదని అనలేదు నేను. నే నంటున్నది అదికాదు కృష్ణమూర్తి విషయంలో ఆవిడ యింతగా మారిపోయిందంటే ఆశ్చర్యంగా ఉందన్నాను; అంతే ఇలా జరుగుతుందని కలలోకూడా ఊహించుకోలేదు ఇంకోలా జరుగుతుందనుకున్నాను."

"అదే జీవితంలో విచిత్రం. నీలో యిన్ని మార్పులొస్తాయని మాత్రం అనుకున్నానా?"

"మీరూ అలాగంటే యిప్పుడే కారు దిగిపోతాను ఆపెయ్యండి"

నవ్వేశాడు డాక్టరు, "నేనేమన్నాననీ?" అన్నాడు.

"మీలో అలాంటి చులకన అభిప్రాయాలుంటే యిప్పుడే చెప్పేయండి"

"ఛా! చులకనేమిటి కల్యాణీ!" లాలనగా అన్నాడు చక్రవర్తి "నిన్ను చులకనచేసి యీ జన్మలో మాటాడగలనా? ప్రతి మనిషి జీవితంలోనూ అనుకోని మార్పులొస్తూంటాయన్నాను; అంతే నే నుద్దేశించింది"

"నన్ను మార్చేసింది మీరే!" అంది కల్యాణి నేరం మోపుతున్నట్లుగా.

"వెరీగుడ్ అంతకంటే నాకు కావలసిందేముంది? ఇద్దరం ఒకళ్ళ నొకళ్ళం మార్చేసుకున్నాం, సరేనా?"

ఆ మాట వినిపించుకోకుండా కల్యాణి, "నాకు బాధ ఏమిటంటే, ఇందిర ఎప్పుడూ యిలాగే చేస్తుందేమిటా అని. ఎవళ్ళనో ఒకళ్ళని బాధ పెడితేగాని, యింకొకళ్ళ జీవితాన్ని గాయపరిస్తేగాని, ఆవిడకి సంతృప్తి లేనట్లుగా ఉంది ఇంత జరిగాక అందరికీ సంతోషంగానే ఉన్నట్టుంది. మీలో ఎవరికీ వసుంధర సంగతి పట్టినట్లే లేదు. ఇది వసుంధరకే మంచిదనుకోండి కాని యిలా ఎవళ్ళ స్వార్థం వాళ్ళు చూసుకోవడం మాత్రం నాకెందుకో బాధగా వుంది" అంది

"అన్యాయం కల్యాణీ! అలా అనకు నువ్వు ఇంతవరకు ఒక్క విషయం దాచాను నీ దగ్గిర. ఇక దాచక్కరలేదు కాబట్టి చెప్పేస్తాను. కృష్ణమూర్తి, వాళ్ళ ఊరునుండి తిరిగొచ్చాక, తనొక్కడే యీ నిర్ణయానికి రాలేదు ఆ సంగతంతా నీకు చెప్పాను తిరిగొచ్చాక మనిషి కుమిలిపోయి బాధపడ్డాడు ఒక్క సంఘటనతో అతనిలో చాలా మార్పు వచ్చింది జీవితానుభవాలేవీ ఎరుగనివాడు చదువుకోసం ఈ వూరొచ్చాడు పట్నం జీవితంలోని వ్యామోహానికి లొంగిపోయాడు అంచేత చదువు అబ్బలేదు రకరకాల స్నేహితులు చుట్టూచేరి అతని డబ్బునీ, మంచితనాన్ని వాడుకున్నారు చదివి పరీక్షలు ప్యాసవకపోతే గడవదనే బెంగలేదు స్వతహాగా అలాంటి గొప్పతనాలేవో సాధిద్దామనే ఆసక్తీలేదు అంచేత అలా అలా కాలక్షేపం చేస్తూ బతికేశాడు అలాంటివాడికి మొదటిసారిగా కనువిప్పు కలిగించింది నువ్వు ఆ తరవాత వసుంధర అతనిలో కొంత చలనం కలిగించింది. అంటే, అతనిలో నిద్రాణంగా ఉన్న కొన్ని బాధ్యతలనీ విలువలనీ మీరు పైకి తీశారన్న మాట సరిగ్గా ఆ సమయంలో ఇందిర అతన్ని పశ్చాత్తాప పడేటట్లు చేసింది అందువల్లే అతడో నిశ్చయానికి వచ్చాడు. వారంరోజులు పల్లెటూళ్ళో కూర్చుని ఆలోచించాడు మనుష్యులతో అంత తేలికగా ఆడుకోవటం అసహ్యమనిపించిందతనికి ఈ విషయాలన్నీ నాతో చెప్పుకున్నాడు అతనిలో అంత మార్పు వచ్చినందుకు నిజానికి నాకూ సంతోషమనిపించింది—"

మాట మధ్యలో కల్యాణి అడ్డొచ్చి, "అదంతా నిజమే కావచ్చు కాని, నే నడుగుతున్నది వసుంధర సంగతి ఇతనివల్ల ఆ అమ్మాయి చాలా పోగొట్టుకుంది.

నా వల్ల కూడా చాలా యిబ్బందులు తెచ్చిపెట్టుకుందనుకోండి కాని అతని వల్ల కుటుంబంలో మనశ్శాంతి పోయి అందరికీ దూరమయ్యే దాకా వచ్చింది అనుకోకుండా అలాంటి స్థితి కల్పించి, ఇప్పుడిలా చేస్తే ఆ అమ్మాయి మనస్సెలా ఉంటుంది?" అంది.

"నువ్వన్నది రైటే కల్యాణీ! అందువల్లే అతడు పల్లెటూరు పారిపోయాడు తన కర్తవ్యం ఏమిటని ఆలోచించుకున్నాడు వసుంధర మీద అతనికి చాలా గౌరవముంది కాని లోతుగా ఆలోచిస్తే తను యే విధంగానూ ఆ అమ్మాయి జీవితానికి పనికిరాడు అతని మంచితనాన్ని ఆదరించబోయేసరికి ఇంట్లో వాళ్ళు అదొక పెద్ద నేరంగా ఆవిడ వంక కొరకొరా చూశారు. దీంతో ఆవిడ అభిమానం మరింత దెబ్బతిని వాళ్లని యెదిరించడానికి ప్రయత్నించింది అందుచేత కృష్ణమూర్తి ఆవిడకి మరింత ఆత్మీయుడుగా కనబడ్డాడు అదొక విచిత్రమైన పరిస్థితి ఆవిడ ప్రేరణలే వేరు ఆవిడా ఇంకొంచెం జాగ్రత్తగా ఆలోచించుకొనివుంటే తన జీవితానికి కావలసింది కృష్ణమూర్తి అందివ్వలేడని తెలుసుకొని ఉండేది ఆ తెగింపు వల్ల మరికొన్ని కొత్త సమస్యలు పుట్టి జీవితాంతం ఆవిడ బాధపడి ఉండేది. అంటే, ఒక్క ముక్కలో చెప్పాలంటే ఆవిడ తాహతు వేరు ఆవిడ నిలుచున్న చోటు వేరు కృష్ణమూర్తి నిలుచున్న చోటు వేరు. ఆ రెండింటికీ యెప్పుడూ సమన్వయం కుదరదు ఆ సంగతే కృష్ణమూర్తి నాతో చెప్పుకున్నాడు. స్వార్థం కోసం ఆ అమ్మాయిని రెచ్చగొట్టడం సులభమే అయినా అది చాలా నీచం అనుకున్నాడు ఇంక ఇందిర సంగతా, ఇందిర తన స్థాయిలో మనిషి – ఒకళ్ళ దౌర్బల్యాలింకొకళ్ళకి తెలుసు కాబట్టి అనుకోకుండా వాళ్ళిద్దరి మధ్యా ఆ సంఘటన జరిగింది జరిగాక యింక వెనక్కి వెళ్ళడం లేదనుకున్నాడు తను ఇప్పుడర్థమౌతోందా కల్యాణీ, కృష్ణమూర్తి వసుంధరకి మంచి చేశాడో చెడు చేశాడో? అతనిలో స్వార్థమే కనుక ఉంటే వసుంధరను ఇంకొంచెం దూరం తీసుకువెళ్ళేవాడు. లోకంలో చాలామంది ఆ పనే చేస్తారు ఆ తరువాత వసుంధరలాంటివాళ్ళు ఏడుస్తారు అలాంటిది జరగకుండా వాడు జాగ్రత్త పడ్డాడు కాబట్టి అతడెంత మంచివాడో ఆలోచించు" అన్నాడు చక్రవర్తి

కల్యాణి మథనంలో పడింది. నిజమేనా? అయితే తన కెంకోలా అనిపించిం దెందుచేత? ఈ మధ్య జరిగిన సంఘటనలన్నీ ఆమె కళ్ళముందొక్కసారి గిరగిరా తిరిగాయి. కృష్ణమూర్తి ఊళ్ళో లేడనేసరికి వసుంధర మొహం వివర్ణమయింది "నిన్న సాయంత్రం కనబడతానన్నాడు. ఇవ్వాళ ఊరెళ్ళిపోయాడంటున్నావు. అంత అర్జంటు ఏ మొచ్చిందో" అని విసుక్కుంది వసుంధర వసుంధరను చూస్తే ఆమెపట్ల అపరాధం చేసినట్లనిపించింది తనకి. తన మూలానే కృష్ణమూర్తి ఆవిడకి పరిచయమయ్యాడు తన మూలానే పిన్నితో పోట్లాట వేసుకుంది తను పోనీ నిస్సహాయురాలు, కృష్ణమూర్తి కూడా ఆవిడ మనస్సు నొప్పించడం దేనికి? ఆగంతుకంగా యీ పారిపోవడం దేనికి? వాళ్ళిద్దరి మధ్యా ఏం జరిగిందో తనకి సరిగా తెలీదు ఆ తరువాత నాలుగైదు రోజులు తన బాధలు తనవి తనే ఒక పెద్ద విషాదయోగంలో పడింది ఎటూ నిశ్చయానికి రాలేక, ముందడుగు వేసే ధైర్యం లేక, మానడానికి యిష్టంలేక నరకం అనుభవించింది. మంచికో చెడ్డకో ఒక నిశ్చయానికి వచ్చేసింది ఫలితాలెలా ఉంటాయో ముందు ముందు తెలియాలి. ఆ కారుచీకట్లోనే చక్రవర్తి వైపు చూసింది గంభీరంగా

కారు నడుపుకు పోతున్నాడు. తనని యెక్కడికో తీసుకు వెళుతున్నాడు. నరకానికా స్వర్గానికా! ఆ క్షణంలో కల్యాణికి వళ్ళు జలదరించింది. అణు వణువునా భయం ఆవేశించింది. తన కింత వరకూ చక్రవర్తి ఒక స్నేహితుడిగా మాత్రమే తెలుసు ఆత్మీయుడిగా మాత్రమే తెలుసు చాలా ఆదుకున్నాడతను ఏడుపొచ్చినప్పుడల్లా తన పక్క నిలబడి ధైర్యం చెప్పాడు చాలా సహాయం చేశాడు ఇప్పుడతనికి తానొక కొత్త హోదా కాబోతూంది ఆ హోదాలో అతనెలా ఉంటాడో, తనను యెలా స్వీకరిస్తాడో అంతా అయోమయం

"మళ్ళీ నిద్రపోతున్నావా?" అడిగాడు చక్రవర్తి

"లేదు. ఏదో మత్తుగా ఉంది చాలా నీరసంగా ఉంది"

"ఎందుకుండదూ! పగలల్లా భోజనం లేదు. రాత్రి తినమంటే తిన్నావు కావు. తెల్లారేక మళ్ళీ బోలెడెంత ప్రయాణం – ఆ తరువాత యెంతో తంతు, సాయంత్రానికి కాని అక్కడికి చేరుకోలేం" అన్నాడు చక్రవర్తి.

"అవును" అనేసి ఊరుకుంది కల్యాణి.

"ఏమిటవును?" – కల్యాణి పలకలేదు

తను యెందుకు అన్నం తినలేకపోయిందో అదికూడా పోల్చుకోలేకపోతున్నాడా ఈ డాక్టరు? విపరీతమైన సంతోషంవస్తే మనిషికి ఆకలి చస్తుంది దుఃఖం వచ్చినా అంతే రెండూ తనని పీడిస్తున్నాయి మెదడులో ఏదో నీరసం. తిండిధ్యాస లేదు కాని బలీయమైన అదృశ్య శక్తి ఏదో తనని ముందుకు నడిపిస్తూంది వారం రోజుల క్రితం తన ఆశలు వేరు. ఆశయాలు వేరు నాలుగు ప్రైవేట్లు దొరికితే చాలు ననుకుంది ఇంటాయన ఇప్పిస్తానన్న టెలిఫోను ఆపరేటరు ఉద్యోగం దొరికితే జీవిత సమస్యే తీరిపోతుం దనుకుంది. ఇంక తనకి ప్రైవేట్లు అక్కరలేదు ఉద్యోగం యింక వారం పదిరోజుల్లో రాబోతుంది. అయినా మనసులో ఏదో ఆందోళన ఎక్కువవుతూంది కాని, తగ్గడంలేదేం? వారం రోజుల తర్జనభర్జన ఫలితం యిది చాలా వాదించింది డాక్టరుతో. చాలా షరతులు కోరింది. తనమీద జాలికొద్దీ ఏ పనీ చెయ్యొద్దంది తనను ఉద్ధరిద్దామని ప్లానుకోవద్దంది. జీవితంలో యేం జరిగినా ఒకటే ఖాయం – తను యెవరి పోషణ కిందో ఉండగల్గడం అసంభవం దేనికోసమయినా సరే. అవతల కొండంత అనురాగం తనకు దొరికినా సరే ఆర్థికంగా జన్మలో యింకొకరి మీద ఆధారపడడం తనకిష్టంలేదు. ఆ సంగతే చక్రవర్తికి స్పష్టం చేసింది అతనూ అదే అన్నాడు. మళ్ళీ కాలేజీలో ప్రవేశపెట్టి చదివించుతానన్నాడు అలాంటివింక కుదరవని చెప్పేసింది ఒకరి దయాధర్మభిక్షాలు వాళ్ళు ఎంత ఆత్మీయులైనాసరే, తనకనవసరం. తనకు కావలసింది ఆర్థిక భర్తకాదు ఆ మాటకొస్తే భర్త అనే మాటలోని సాంఘిక అర్థాన్ని అమలులో పెట్టే వ్యక్తి కూడా కాదు. ఇవన్నీ మినహాయించేక యింకేవైనా విలువలు మిగిలి వుంటే, ఆ విలువలు కావలసివస్తే, ఆలోచించుకోమంది డాక్టరును అలా మాటాడ్డానికి ధైర్యం ఎక్కడనుంచి వచ్చిందో తనకే తెలీదు అది ధైర్యం కాదు. జీవితం మీద నమ్మకం లేకపోవడం ఇటువంటి పరిస్థితే యిదివరకొకసారి వచ్చింది – అప్పుడు తన మనసులో షరతులేమీ లేవు బెంగలూ సంకోచాలూ అంతకంటే లేవు – ఆ అనుభవం తనకు ఆశనూ సంతోషాన్నీ యిచ్చింది అక్కడ

దెబ్బ తగిలేసరికి మనస్సు విరిగిపోయింది ఇప్పుడంతా సంశయమే. ఏమైనాసరే తనమీద తనకు స్వాధీనం తప్పకూడదు ఇది అలాంటి అనుభవం కాకూడదు కళ్ళు రెండూ గట్టిగా మూసేసుకున్నది ఆ వేకువ ఘడియల్లో కల్యాణి హృదయం ఒకానొక అనిర్వచనీయమైన ప్రార్థనతో నిండిపోయింది "పరమేశ్వరా! దీనివల్లకూడా గాయపడనివ్వకు. బతుకులో నేను కోరేది బహుస్వల్పం ఆ స్వల్పాన్ని నిరాకరించకు." అని మనసారా వేడుకుంది.

ఆ వేకువ చీకట్లో కారు నిరాటంకంగా ముందుకు సాగిపోతూంది ఉండుండి కల్యాణి వైపు చూస్తూ డ్రైవు చేసుకుపోతున్నాడు చక్రవర్తి. గాలికి ఆమె జుత్తంతా చెదిరింది సీటులో ముడుచుకు కూర్చున్న కల్యాణిని చూస్తే అతనికి వాత్సల్యమూ కృతజ్ఞతా వెల్లి విరిసిపోతున్నాయి. ఇదంతా స్వర్గాన వున్న రామినాయుడి చలవ అనుకున్నాడు. రామినాయుడికి ఆ రోజు జబ్బే రాకపోతే, కృష్ణమూర్తి తననక్కడకు లాక్కెళ్ళకపోతే కల్యాణిని ఈ జన్మలో పోల్చుకోలేకపోయేవాడు ఆసుపత్రిలో మృత్యు సాన్నిధ్యంలో – నిజమైన కల్యాణిని – అలా కనబడిన కల్యాణి చిరకాల బంధువుగా మొదటినుంచీ తనకు తెలిసిన ఆత్మీయురాలివలె గోచరించింది. ఆ మొదటి అనుభవాన్ని తను నమ్మలేదు. రోజులు గడచినకొద్దీ నమ్మకూడదని ఎంత ప్రయత్నించినా తనకది సాధ్యంకాలేదు. మనస్సుకీ హృదయానికీ అనేక పరీక్షలు పెట్టి చూశాడు అన్నింటికీ ఒకే జవాబు వచ్చింది. ఇద్దరికీ చాలా పోలికలున్నాయి. తను కూడా ఆవిడలాగే ఒకసారి దెబ్బతిన్నాడు చాలా చేదు జీవితం భరించాడు ఆ ఘట్టం తనంతటదే ముగిసింది. అమ్మయ్యా! అనుకుని గతించిన జీవితంతో బంధనాలు తెంచేసుకున్నాడు దూరంగా వచ్చేశాడు కొత్త జీవితానికి పునాది వేసుకున్నాడు ఆసుపత్రి, రోగులు, అర్జనా, డబ్బు – సుఖంగా తృప్తిగా ఒడిదుడుకులు లేకుండా గడిచిపోతే చాలుననుకున్నాడు తనకు పట్టుపరుపు అక్కరలేదు, ముళ్ళపరుపు కాకుండా వుంటే చాలు సుఖమైన ఇల్లూ, కారూ, డబ్బులిచ్చే నలుగురు పేషెంట్లూ, స్నేహితులు, కొంత కాలక్షేపం కావాలి.

మరచిపోయిన ఆశలని చిగురింప చేసింది కల్యాణి. ప్రకాశవంతమైన రాత్రి చల్లని చందమామ తన జీవితంలోకి ప్రవేశించింది నిస్సహాయమైన స్థితిలో ఆమెను చూశాడు. జాలిపడ్డాడు జాలిపడటం ఆవిడకసహ్యం అని తెలుసుకున్నాక ఆమెమీద గౌరవం మరింత ఎక్కువయింది తనకు తెలియకుండానే అనురాగం పెంచుకున్నాడు ఆవిడతో ఒక జీవితకాలం హాయిగా బతకగలను, నన్నీవిడ అర్థం చేసుకోగలదు అనుకున్నాడు. ఈ పరిణామం అంతా తనలో కలిగిందని చాలాకాలం వరకూ తనకే తెలీదు. బహుశా నేపథ్యంలో ఎక్కడో కృష్ణమూర్తి ఉన్నాడనే భావం కారణం కావచ్చు. ఒకరోజు అదీ తేలిపోయింది. ఇద్దరూ ఘర్షణ పడ్డారు తనప్పుడు అబద్ధం చెప్పాడు. ఆ చెప్పింది అబద్ధమని తర్వాత ఎప్పుడో తనకు తెలిసింది కల్యాణి ఒక్కర్తే తన బతుకులో శూన్యత్వాన్ని పోగొట్టగలదు తనిన్నాళ్ళూ వెతుకుతున్నది ఈమె కోసమే! కాని ఆ విషయం ఆ పిల్లతో చెప్పడానికే భయం వేసింది. చాలా ఆత్మాభిమానురాలు. అతను చెప్పిన కథ విన్నాక తనకు చాలా బాధ కలిగింది. కోపం వచ్చింది కల్యాణి కేవలం తనదిగా తన సర్వస్వంగా నరనరాల్లోనూ

ఏదో ఘోషించింది. 'నువ్వు పొరబడ్డావు కల్యాణీ! సరిగ్గా పోల్చుకోలేకపోయావు. అందుకే గాయపడ్డావు ఒక్కసారి కళ్ళు తెరిచి చూడు నీకు కావాలసింది ఎక్కడ దొరుకుతుందో? నీకోసం ఎవరు వెతుక్కుంటున్నారో? పోల్చుకో!' అనాలనిపించింది. ఆ అవకాశం అనాటి రాత్రి వచ్చింది. దెబ్బతిన్న లేడివలె పిన్నిగారు వేసిన బాణాన్ని మోసుకుంటూ వచ్చి తన దగ్గిర వాలిపోయింది కల్యాణి ఆ రాత్రే తనెవరో పోల్చుకుంది అదొక దివ్యానుభవం – ఒకరికొకరు కావాలి ఒకరు లేనిదే ఇంకొకరికి జీవితమే లేదు అనేది ఇద్దరికీ అర్థమైంది కాని అదరణలో పెట్టడమెలాగ? ఆ అమ్మాయి స్వాభిమానాల పుట్ట వాటన్నిటికీ ధైర్యం చెప్పేసరికి వారం రోజులు పట్టింది. ఒక స్నేహితుడిగా ఆత్మీయుడిగా తననంగీకరించింది తనకి ఒక కొత్త హోదా యివ్వడం దగ్గరే భయపడింది ఆ భయం ఉత్త హామీలవల్ల పోదు కొన్నాళ్ళకు పోతుందనే ధైర్యం తనకుంది. అందుకే తనూ ధైర్యం చేశాడు

దాని ఫలితమే ఈ ప్రయాణం మొదట కల్యాణి ఒప్పుకోలేదు రైలులో పోదామంది. తనే పట్టుపట్టాడు. అది తన మొదటి విజయం. ఇద్దరికీ పునర్జన్మ కావాలి అందుకే కారులో బయలుదేరి సరాసరి వెళ్ళడానికి నిశ్చయించాడు. ప్రయాణం కష్టం దారిలో ఎన్నో అడ్డంకులు, ఇబ్బందులు కాని వాటిలోనే ఏదో మాధుర్యం ఉంది యివన్నీ గడిచి కొండకి చేరుకోవడంలో ఏదో సంతృప్తి ఉంది. రెండురోజులపాటు కల్యాణి ఒక్కక్షణం విడువకుండా తన దగ్గిరే వుంటుంది తన పక్కనే ఉంటుంది అంతకంటె యింకేం కావాలి? సైంటిస్టు చక్రవర్తికీ భౌతికమైన చక్రవర్తికీ ఆ క్షణంలో పరమేశ్వరుడిమీద కృతజ్ఞత వెల్లివిరిసింది. "భగవాన్! జన్మలో యెప్పుడూ కల్యాణిని నా దగ్గరనుండి వేరు చేయకు, అంతే నేను కోరేది" అని మనసారా ప్రార్థించాడు

☆ ☆ ☆

తెల్లారగట్ల అదురుపాటుతో మెలకువ వచ్చింది ఇందిరకి రాత్రంతా నిద్రలేదు. ఒకటే దోమలు, ఇంక విసుగువేసి పక్కమీద లేచి కూర్చుంది హాలంతా కలయచూసింది. ఒకమూల పిల్లలు నిద్రపోతున్నారు వాళ్ళ పక్కగా వాళ్ళ నాన్న పడుకున్నాడు. హాలు మధ్యలో కృష్ణమూర్తి పడుకున్నాడు. ఈ చివర తనూ, యింటి ఇల్లాలూ పక్కలు వేసుకున్నారు ఇందిరకంతా కొత్తగా అయోమయంగా అనిపించింది ఏమిటి తను చేసిన పని? ఎక్కడుంది తను? గుర్రుపెట్టి నిద్రపోతున్న కృష్ణమూర్తిని చూసి కోపం వచ్చింది తరువాత నవ్వొచ్చింది ఆశ్చర్యం! ఈ రాత్రికూడా ఇతనికి హాయిగా నిద్రపట్టేసింది ఎంత అదృష్టవంతుడు! అనుకుంది. వెంటనే నాన్న జ్ఞాపకం వచ్చాడు. పాపం, ఎక్కడున్నాడో – యెక్కడేమిటి? కటకటాల వెనుక గొంగలి కప్పుకుని పడుకునుంటాడు ఎంతపని చేశావు నాన్నా! నువ్వెప్పుడూ ఇంతే! అందుకే నేనిలా తయారయాను అనుకుంది పోనీలే నాన్నా! చాలాసార్లు క్షమించాను నిన్ను – చాలాసార్లేమిటి మొత్తం నీ జీవితాన్నే క్షమించాను ఈ ఒక్కదానికే కోపం తెచ్చుకోకు ఇది నాకు చాలా అవసరం నాన్నా! – అనుకుంది మెల్లగా లేచి పిల్లిలా అడుగులు వేసుకుంటూ వీధి తలుపు తీసి అరుగుమీద కుర్చీలో చేరగిలబడింది బయటంతా చిమ్మచీకటి దూరాన వీధి లాంతర్లు వెలుగుతున్నాయి. ఇంకాసేపట్లో తెల్లవారుతుంది. వాళ్ళిద్దరూ వస్తారు. కాఫీలు, స్నానాలు అయాక అందరూ

కలిసి డాక్టరుగారి కారులో మళ్ళా బయలుదేరుతారు సాయంత్రానికి కొండకు చేరుకోవాలిట అప్పటికికాని ముహూర్తం కుదరలేదట ఏమిటో నా తలకాయ ముహూర్తం నా అన్నవాళ్ళు లేకుండా నలుగురు చేరి కొండెక్కి నాలుగు ముళ్ళు వేసుకున్నంత మాత్రాన ఏం జరుగుతుంది? ఇదంతా ఆ కల్యాణి ఆలోచన దానికి కృష్ణమూర్తి తాళం వేశాడు ఈ హైరానా అంతా లేకుండా ఉన్న చోటనే ఉండి రిజిస్ట్రారుకి ఓ పదిరూపాయలు పారేస్తే హాయిగా వుండును అనుకుంది

చీకటివేపు చూస్తూ అలా ఆలోచనలో పడి, వారం రోజుల్లో ఎన్ని మార్పులొచ్చాయి – అనుకుంది ఇందిర. ఆ రోజు రాత్రి సినిమా తరువాత రోడ్డుమీద తారసిల్లిన కృష్ణమూర్తిని ఇంటికి లాక్కెళ్ళకపోతే ఇవన్నీ జరిగుండకపోను ఆ రాత్రి తననేదో ఉన్మాదం ఆవహించింది తనమీద తనకే కసి. లోకంమీద కసి నాన్నమీద కసి ఆ సాయంత్రం పీడకలవలె ప్రకాశం గుర్తుకొచ్చాడు. ఎన్ని ఆశలు పెట్టుకుంది అతనిమీద! ఎన్ని పేకమేడలు కట్టుకుంది! అవన్నీ కూల్చేసి పారిపోయాడు అటువంటి వాడికోసం కల్యాణితో పోట్లాట పెట్టుకుంది కల్యాణికి చాలా అన్యాయం చేసింది. ఆమె జీవితాన్ని ఇంచుమించు నాశనం చేసింది. చివరికేం మిగిలింది? విధి తనను వెక్కిరించింది. ఇంత జరిగాక ప్రకాశం చల్లగా జారిపోయాడు తనమీద తనకే అసహ్యం వేసింది ఛీ! యింక నాకేవీ దొరకవు అనుకుంది చిత్రమేమిటంటే, యేవి తన అంతరాత్మకు వ్యతిరేకమైన పనులో అవే చేసింది తను ఎందుకు చేసింది? తెలీదు.. ఆ రాత్రి రోడ్డుమీద కృష్ణమూర్తి కనబడేసరికి క్షణమాత్రం తన అంతరాత్మ బాధపెట్టింది. ఈ మనిషిని అన్ని విధాలా వాడుకున్నాడు నాన్న నిర్హేతుకంగా యీ కుర్రాడు మా యిద్దరినీ అభిమానించాడు. శక్తి ఉన్నప్పుడల్లా ఆదుకున్నాడు ప్రతిఫలంగా యిద్దరం కలిసి దెబ్బకొట్టాము. పాపం! యితడిని కొంచెం వెన్ను నిమరాలి. మంచివాడు అమాయకుడు అనిపించింది మంచివాడే కాని అనుకున్నంత అమాయకుడు కాడని ఈ వారం రోజులలోనూ తెలిసింది ప్రకాశానికీ యితనికీ యెంత తేడా! తనవెంట అంత వెర్రిగా తిరిగిన ప్రకాశం, ఇందిరా నువ్వే నా సర్వస్వం అన్న ప్రకాశం తీరా సమయం వచ్చేసరికి యేమీ చెయ్యలేకపోయాడు. జరిగినదంతా మరచిపోగల్గాడు. ఏ అనుభవమూ అతన్ని నిలబెట్టలేకపోయింది జారిపోయాడు పారిపోయాడు. అంత పిరికివాడినెక్కడా చూడలేదు ఈ కృష్ణమూర్తికి మొదటినుంచీ తనంటే పెద్ద గౌరవం లేదు మామూలు సరదాలకోసం వినోదాలకోసం చుట్టూ తిరిగాడంతే – తన గురించి అతనికేమీ భ్రాంతులు లేవు తనేమిటో తెలుసు కాని అనుకోకుండా ఒకానొక పరిణామం జరిగేసరికి పూర్తిగా మారిపోయాడు జరిగిన దానికి విచారించకుండా ఉండడానికి తక్కినవన్నీ వదులుకుందుకు సిద్ధమౌతున్నాడు సంఘం, బంధువులు, అవన్నీ యిచ్చే వెచ్చదనం, వేటినీ లక్ష్యం చేయకుండా ఉండడం దీనివల్ల అతను చాలా నష్టపోతాడు. తనకీ తెలుసు అందుకే వూరికెళ్ళి వచ్చిన తరువాత కృష్ణమూర్తి ఆ ప్రస్తావన తెచ్చేసరికి తనకి ఆశ్చర్యం వేసింది "నీకు మతిగాని పోయిందా కృష్ణమూర్తీ! మాట వరసకి అలాగే అనుకుందాం ఆ తరువాత నీ గతేమిటి?" అంది... "నా గతి ఏమీలేదు. ఏం జరిగినా భయపడను– ఇదేం చిన్నపిల్లల ఆటగాదు ఇందిరా! ఇది జరిగి తీరాల్సిందే–" అని పట్టు పట్టాడు ఎంత నిబ్బరం! ఎంత సాహసం! తను కలలో కూడా వూహించుకోనిది జరగబోతూంది

తనలో ఎన్ని ప్రలోభాలు ఉన్నా ఆత్మవంచన మాత్రం లేదు ఏ విధంగా చూసినా తను కృష్ణమూర్తికి తగదేమో! అదీ నిజం కాదేమో! ఇలా జరగడమే మంచిదేమో! ఇతరత్రా ఏం నష్టపోయినా తనవల్ల ఇకముందు కృష్ణమూర్తి ఏమీ నష్టపోకూడదు ధైర్యంగా తన పక్క నిల్చున్నాడు ప్రతిఫలంగా అతను ఏం కోరినా తను ఇవ్వాల్సిందే! సంతోషంగా యివ్వాలి, తప్పదు. తను యిన్నాళ్ళూ నిరీక్షించినదీ వెతుకుతున్నదీ ఇలాంటి వాడికోసమే! చిత్రం! ఇన్నాళ్ళూ తన పక్కనే ఉన్నాడు అనునిత్యం చూస్తూనే ఉంది. కాని గుర్తించలేకపోయింది "నేనున్నానులే నీకేం ఫర్వాలేదు నీ బాధ్యతలన్నీ నా మీద వేసి, నువ్వు నిశ్చింతగా ఉండు" అనగలిగేవాడు తనకు కావాలి ఆ అన్వేషణలో తనకందరూ మరుగుజ్జులే కనిపించారు తనెంత సాహసించినా వాళ్ళు తన అంతస్థుకు పెరగలేకపోయారు జరిగినవాటికి తనకేమీ విచారం లేదు ఇప్పటికయినా తనకు కావలసింది దొరికింది, అదే చాలు అనుకుంది నాన్న ఏమనుకుంటాడో? తిరిగివచ్చాక కారాలూ మిరియాలూ నూరుతాడు తనకేదో పోయినట్లు బాధ పడతాడు. ఈ మాటు గట్టిగా చెప్పేయాలి, తప్పదు. త్యాగానికైనా ఒక హద్దుంటుంది ఎవరికీ పనికిరాని త్యాగాలు చెయ్యడం బుద్ధిహీనం నాన్నను తనేమీ ఒదిలెయ్యబోవడం లేదు. తన ఉద్యోగం, తన స్వతంత్రం అన్నీ అలాగే ఉంటాయి ఉంచుకోదల్చుకుంది కూడా! భావదాస్యం, ఆర్థికదాస్యం – ఈ రెండూ మనిషిని కుంగదీస్తాయి. ఇష్టముందా నాన్న తనతో ఉంటాడు లేదా ఆయనకేం తోస్తే అది చెయ్యవచ్చు. మూడు రాత్రిళ్ళు ఎడతెగని చర్చల తర్వాత, ఎంతో ఆత్మపరీక్ష తర్వాత తమ నిశ్చయానికి వచ్చింది. నాన్నకి కాదు, దేవుడికి కోపం ఎచ్చినా సరే, ఈ పని జరిగి తీరవలసిందే. దేవుడంటే తనకే నవ్వు వచ్చింది. దేవుడనే వాడసలు ఉన్నాడో లేడో! "దేవుడా! నువ్వనేవాడివి అసలుంటే నీమీద నా కెప్పుడూ నమ్మకం లేకుండా చెయ్యి! దేవుడిమీద నమ్మకం నాలోంచి శాశ్వతంగా తీసెయ్యి. అంతే నే కోరేది" అనుకుంది

తెల తెల్లవారుతూంది. గబగబా లోపలికి వెళ్ళి కృష్ణమూర్తి భుజం తట్టి లేపింది. "ఓ మొద్దావతారంగారూ! ఇంక లేవండి. తెల్లారుతూంది" అంది

కళ్ళు నులుముకుంటూ అతను బయటికి వచ్చాడు "ఏమిటలా నిల్చుండిపోతావు? వెళ్ళి ముఖం కడుక్కో" అంది ఆవిడ రెండు భుజాలమీద చెయ్యివేసి కృష్ణమూర్తి, "ఇలా చూడు, కొంచెం మర్యాద నేర్చుకో ఈ క్షణంనుండీ నువ్వు నన్ను మీరు అనాలి తెలుసా?" అన్నాడు. ఇందిర ఛర్రున, "ఛస్తే అనను అలాంటి వెధవవేషాలు నా దగ్గర కుదరవు. అలాంటి ఆశలెప్పుడూ పెట్టుకోబోకు, తెలుసా? ఎప్పుడూ నువ్వనే పిలుస్తాను" అంది.

"పాపం చుట్టుకుంటుందిలే!" బెదిరించాడు అతను.

"పోనీలే. నేను చేసిన పాపాల్లో ఇదొకటి. పాపాలంటే నాకు భయం లేదు కాని ఇది చెప్పు. చక్రవర్తీ కల్యాణీ ఎన్ని గంటలకొస్తారు? ఈ యింట్లో నే నుండలేను బాబూ! నాకు మొహమాటంగా ఉంది. వాళ్ళు రాగానే పోదాం."

"మొహమాటం దేనికి? ఈయన చక్రవర్తికి మంచి ఫ్రెండు, ప్రాణ స్నేహితుడు అందుచేతే ఇక్కడ దిగమని మరీ మరీ చెప్పాడు. వాళ్ళు రాగానే అందరం కలిసి

ఆ కారులోనే పోదాం మనం వెళ్ళేసరికి చక్రవర్తి కాంపౌండరు అన్ని ఏర్పాట్లూ చేసే ఉంటాడు" అన్నాడు కృష్ణమూర్తి

"ఎన్ని గంటలకిట ఆ తంతంతా?"

"రాత్రి ఎనిమిదిన్నరకి, నీ కదంతా తంతులాగ వినబడుతోందా?"

"తంతుకాక మరేమిటి? హాయిగా ఉన్నచోటనే ఉండి, పదిరూపాయలు పారేస్తే రిజిస్ట్రారు మన కాళ్ళదగ్గర కొచ్చేవాడు."

"అది నీ పద్ధతి. వాళ్ళ పద్ధతి యింకోలా ఉంది, ఏం చేస్తాం?"

"పోనీ, నీ పద్ధతి ఏమిటో చెప్పకూడదా కృష్ణమూర్తీ?"

"అమ్మాయ్! ఇలా విను. నాకో పద్ధతంటూ లేదు. మన మేలు కోరేవాళ్ళనీ, కష్టసుఖాల్లో మనల్ని ఆదుకునేవాళ్ళనీ సంతోషపెట్టడమే నా పద్ధతి."

"కోట్లకి విలువైన మాట అన్నావులే, పో దాంతోనే అందర్నీ జయించుకు వస్తున్నావు. అది సరేగాని, నా యింట్లోంచి వెళ్ళిపోయిన తర్వాత కల్యాణిని కలుసుకోలేదు. అప్పటి పరిస్థితి వేరు ఇప్పుడు అందరం ఇంకో అవస్థలో ఉన్నాం. ఇంకో నిమిషంలో వాళ్ళిద్దరూ వూడిపడుతున్నారంటావు ఆవిడని ఎలా పలకరించడం?"

"హాయిగా పలకరించు, మామూలుగా పలకరించు ఇంకపోదాం పద. యిద్దరం యిలా మాటాడుకుంటూంటే యింట్లోవాళ్ళు ఏమనుకుంటారు?"

"నీమొహం. అలా నువ్విప్పటినుండే అధికారం చెలాయిస్తే ఇక్కణ్ణించే పారిపోతాను తెలుసా? నే నడిగిన దానికి జవాబు చెప్పు!"

"కల్యాణి నిన్ను క్షమించేసిందన్నానుగా!"

ఇందిరకు ఆ మాటలతో కోపం వచ్చింది "నన్నెవరూ క్షమించనక్కరలేదు" అంది. అతను కొంచెం విసుగ్గా "యిదుగో ఇందిరా! పొద్దున్నే మళ్ళీ రగడ లేవదియ్యకు. నేను చెప్పినట్లు వినాల్సిందే నువ్వు, తెలిసిందా?" అన్నాడు.

"అలాగేనయ్యా, అలాగేనయ్యా బాబూ! సరేనా?" అనేసి వెనక్కి తిరిగిపోతుంటే గేటు దగ్గిర కారు ఆగిన చప్పుడైంది గిర్రున తిరిగి చూసింది ఇందిర గేటు దగ్గిర నల్లని కారు ఆగింది.

## 21

"వాళ్ళు వచ్చేశారిందిరా!" అంటూ కృష్ణమూర్తి నాలుగడుగుల్లో గేటు దగ్గరకు వచ్చి "హల్లో చక్రవర్తీ !" అని పలకరించాడు. ఇందిర కొంచెం బెరుకుగా వచ్చి అతని పక్కనే నిలబడింది. నల్లని కారుతలుపులు తెరుచుకున్నాయి. కాని అందులోంచి దిగింది చక్రవర్తీ కల్యాణీ కాదు. తెల్లని సూటులో ఉన్న ఒక యువకుడు, మధ్యవయస్సు దాటిన మరొక పెద్దమనిషి! ఆ యువకుడు జేబుల్లో చేతులు పెట్టుకుని నిల్చున్నాడు పెద్దమనిషి కొంచెం ముందుకు వచ్చి "డాక్టరు గోపాలరావుగారున్నారండీ?" అని ప్రశ్నించాడు కృష్ణమూర్తిని.

ముఖం ప్రశాంతంగా ప్రఫుల్లంగా కన్పించింది. మంచినిద్రలో ఉంది అందమైన కలలు కంటూంది కాబోలు అనుకున్నా డతను.

ఉన్నట్లుండి కల్యాణి కెవ్వున కేకవేసి ముందుకు తూలిపడింది ఆమె కళ్ళు తెరచి చూసేసరికి చక్రవర్తి తనమీద కొరిగిపోయి గట్టిగా పట్టుకొని ఉన్నాడు కారు ఎడం చేతివైపు ఒరిగిపోయింది. చక్రవర్తి కల్యాణి భుజంమీద తల ఉండి కళ్ళు గట్టిగా మూసేసి "ఎంతపని జరిగింది కల్యాణీ" అని పెద్దగా మూల్గాడు. అతని నుదుటిమీద గాయం తగిలి రక్తం కారుతూంది కల్యాణికి ఒక్క క్షణం అంతా అయోమయంగా ఉంది. కల కాదుగద అని అటూ యిటూ కలయచూసింది కలకాదు. తాను మేల్కొనే ఉంది. కారు అద్దాలు పగిలిపోయాయి ఒక ప్రక్క తలుపు తెరుచుకుంది. తాను సీటుకీ కారు తలుపుకీ మధ్యన ఒరిగిపోయింది. చక్రవర్తి తనమీద కొరిగిపోయాడు. ఒకపక్క ఎత్తుగా రోడ్డు కనిపిస్తూంది, ఒక పక్క నాలుగడుగుల గొయ్యి...కారు సగం గోతిలో కొరిగిపోయి పెద్ద బండరాయి నానుకుంది క్షణకాలం అచేతనంగా ఉండిపోయి "ఏం జరిగింది-ఏమైంది మనకి?" అన్నది కల్యాణి, మెల్లిగా అతనిని లేవదీయడానికి ప్రయత్నిస్తూ

"ఏక్సిడెంటయింది. చావు తప్పింది-ఉండు నేను నెమ్మదిగా లేస్తాను తరువాత నువ్వు లేద్దువుగాని" అంటూ చక్రవర్తి స్టీరింగు చక్రాన్ని తప్పించుకొని కారులోంచి ఎలాగో బయటకొచ్చి కల్యాణికి చెయ్యి అందించాడు. సగం ఒరిగిపోయిన కారులోంచి కల్యాణి బయటకు దిగి డాక్టరు ముఖం చూసి "అబ్బా! ఎంత పెద్ద దెబ్బ తగిలింది?" అన్నది కంగారుగా.

డాక్టరు భారంగా నవ్వేసి "ఇదేమంత పెద్దదెబ్బ కాదులే! జరిగినదాన్నిబట్టి చూస్తే ఇదొక పెద్ద దెబ్బా-అటు చూడు కారెలా పిప్పయిపోయిందో" అన్నాడు

కల్యాణి కారు ముందుభాగం చూసి కొయ్యబారిపోయింది. ఇంత జరిగి ఇంకా ఎలా బతికాం అనుకుంది కారు బాగా దెబ్బతింది ఇంజన్ దగ్గరే ఎక్కువ చెడిపోయింది. కల్యాణి డాక్టరు రెండుచేతులూ గట్టిగా పట్టుకుని "నావల్లే ఇదంతా! దరిద్రాన్ని వరించారు. మీరెంత పొరపాటు చేశారు!" అని గొణిగింది డాక్టరు ఆ నడిరోడ్డుమీద ఆ చలిలో ఆమెను మరింత దగ్గరగా తీసుకుని "పిచ్చిదానా, ఏమిటలా అంటావు? దురదృష్టం నన్నెప్పుడో వరించింది నువ్వు పక్కనుండబట్టే నేను బతికున్నాను. ఇంత అదృష్టపు రోజు మరొకటి లేదనుకో! ఇంత జరిగినా మనం సజీవంగా బయట పడ్డామంటే అంతా నీవల్లే నేను చెప్పినది నువ్వు నమ్ము కల్యాణీ!" అన్నాడు.

కల్యాణి అతనినుండి విడిపించుకుని "ముందు ఆ రక్తం తుడిచేసుకోండి. కారులో మీ మెడిసన్ ఛెస్ట్ ఉందికదూ ఏదయినా మందు వేసుకోండి" అంది.

"అవును, వెనకసీటులో వాటర్ బాటిలూ బాక్సూ వున్నాయి మెల్లిగా తియ్యగలవా?" అన్నాడు, గట్టుమీద చతికిలబడుతూ.

వాటర్ బాటిలు తీసి రుమాలు తడిపి రక్తమంతా తుడిచింది మెడిసిన్ ఛెస్ట్ తెరచి డాక్టరు చెప్పిన పద్ధతిలో అతనికి కట్టు కట్టింది పగిలిపోయిన కారు అద్దాలు గుచ్చుకుని నుదుటిమీద అంగుళంమేర చర్మం చీరుకుపోయింది బాగా రక్తం కారింది

కాని ప్రమాదకరమైన గాయం మాత్రం కాదు. చక్రవర్తికి ఎదురు రొమ్ము మీద స్టీరింగువీలు గట్టిగా తగిలింది. అతనికెక్కడలేని నీరసం వచ్చేసింది. "ఇంకిప్పుడేం చెయ్యాలి కల్యాణీ?" అన్నాడు దిగులుగా ఆమెవైపు చూసి.

"అసలింత ప్రమాదం ఎలా జరిగింది చెప్పండి"

"ఏం చెప్పమంటావు–దగ్గరికి వచ్చేసింది తెల్లవారిపోయింది, రోడ్డు బాగానే వుంది అనే ఉత్సాహం కొద్దీ స్పీడుగా పోతున్నాను ఇంతలో రెండు దూడలు బెదరిపోయి కారుకడ్డంగా వచ్చిపడ్డాయి ఒక్కడుగు ముందుకువెళితే అవి కారు కిందపడి చచ్చిపోయేవే. సడన్‌గా బ్రేకువేసినా వాటికి దెబ్బతగలక మానదు ఆ గాభరాలో స్టీరింగు ఎడమపక్కకు తిప్పాను ఆ కంగారులో రోడ్డుపక్కనింత గొయ్యి వుందని చూసుకోలేదు–ముందు చక్రాలు రెండూ గోతిలోకెళ్ళిపోయాయి ఎంత ఆపబోయినా నా స్వాధీనం తప్పిపోయి బండి దొర్లిపోయింది ఇప్పుడైనా ఆ రాయి ఉండబట్టి కారు తిరగబడలేదు–అందుచేతే మనం బతికున్నాం!" అని ముగించాడు

కల్యాణి ఆశ్చర్యంగా అతనివైపు చూస్తూ, "ఇంత జరిగినదాకా నే నెలా నిద్రపోయానో, పాడునిద్ర!" అన్నది

"ఇదంతా లిప్తపాటులో జరిగిపోయింది కల్యాణీ! ఇన్నివందలమైళ్ళు ప్రయాణం చేశాం కొన్నివందల బళ్ళనీ లారీలనీ తప్పించుకుని వచ్చాం ఎంతో అసహ్యమైన రోడ్లన్నీ దాటిపోయాం ప్రయాణం చివరికి వచ్చాక ఇలా జరిగింది ఏం చేయగలం!"

చక్రవర్తి చివరిమాటలు విని కల్యాణి ఎందుకో వణికిపోయింది "ప్రయాణం చివరికి వచ్చాక ఇలా జరిగింది, ఏం చేస్తాం"–ఆ మాటలు తల్చుకుంటే ఆమెకేమిటేమిటో వింత భయాలు స్ఫురించాయి తను పుట్టడమే ఒక మహాపాపం అన్నట్లు భూమి దద్దరిల్లి భూకంపం వచ్చింది ఎవరిదారికీ అడ్డురాకుండా ఎవ్వరికీ హాని కలుగకుండా ఎంత ఒదిగి ఒదిగి బతికినా జీవితమే అడుగడుగునా దద్దరిల్లిపోయింది అన్నిటికీ నిలబడి అన్నిటినీ దాటుకుని ఒక గమ్యం చేరబోతూంది తను అందుకే "ప్రయాణం చివరికి వచ్చాక ఇలా జరిగింది" అని చక్రవర్తి అంటే కల్యాణి వణికిపోయింది ఇలా జరగవలసే ఉందా? ఇందుకేనా తానింత దూరం ప్రయాణం చేసింది? ఇంక ఫరవాలేదు, గమ్యం చేరుకుంటాను అనుకోవటమే పెద్దపొరపాటు కాబోలు. రాత్రి కల జ్ఞాపకం వచ్చింది నాన్న కోప్పడినట్లుంది. అందుకే యిలా జరిగిందా? నిజంగా నాన్నే ఈనాడు బ్రతికి ఉంటే తాను ఈ పాటి ధైర్యంతో ముందుకు వచ్చి నిలబడి తన జీవితాన్ని నిలబెట్టుకున్నందుకు సంతోషించడా! ఆశీర్వదించడా! తండ్రి జ్ఞాపకం వచ్చేసరికి కల్యాణి కళ్ళు చెమర్చాయి

☆ ☆ ☆

మద్రాస్ మెయిల్ నెల్లూరు చేరేసరికి తెల్లవారిపోయింది రాత్రి చాలా సేపటివరకూ ఏవేవో ఆలోచనలతో మేల్కొని కలతగా నిద్రపోయిన వసుంధరకు నెల్లూరు స్టేషనులో మెలకువ వచ్చింది. ఇక్కడే తెల్లవారింది, బండి చాలా లేటన్నమాట అనుకుంది. గూడూరు వెళ్ళేసరికి కనెక్టింగ్ ట్రెయిన్ ఉంటుందో ఉండదో? అది తప్పిపోతే మళ్ళీ ట్రెయినెప్పుడో! తానింతా సిద్ధపడితే సమయానికి

చేరుకోలేదా ఏమిటి? అలా జరిగితే తన ప్రయాసంతా వృథా! ఎంత లేటయితే మాత్రం ఆ వేళకి చేరుకోలేకపోతానా అని ధైర్యపడింది మరచెంబులో నీళ్ళుతీసి ముఖం కడుక్కొని కాఫీ తెప్పించుకుని తాగింది.

అన్నట్లు వాళ్ళు నెల్లూరు నుండే కలిసి కారులో వెళతామన్నారు ఈ పాటికి బయల్దేరి ఉంటారు కల్యాణి ఏమనుకుందో తన గురించి ఒక రోజంతా బతిమాలింది. డాక్టరు మరీ పంతం పట్టాడు ససేమిరా రానంది తను. కల్యాణి చిన్నబుచ్చుకుని వెళ్ళిపోయింది అయినా ఆ అమ్మాయికి కోపం రాదు తానెందుకు రానన్నదో ఆ మాత్రం పోల్చుకోగలదు. అకస్మాత్తుగా తను వెళితే వాళ్ళంతా ఏమనుకుంటారు? కల్యాణి మహదానందపడుతుంది తనకు తెలుసు కల్యాణికి తనకంటె ఆత్మీయులెవరూలేరు డాక్టరు కూడా తన రాకకు తప్పకుండా ఆనందిస్తాడు మరి కృష్ణమూర్తి! కృష్ణమూర్తి ఏమనుకొంటాడు? అసలు తనతో మాట్లాడతాడా? ఆ మాత్రం గుండెనిబ్బరం ఉంటే తనకు కనబడకుండానే ఈ తంతంతా ఎందుకు ఏర్పాటు చేసుకుంటాడు? నాకు నచ్చిన అమ్మాయిని నేను పెళ్ళిచేసుకుంటాను అంటే తానడ్డుపడిందా? పిచ్చి కృష్ణమూర్తి. అంత పిరికివాడనుకోలేదు తను

రీడర్స్ డైజెస్ట్ చేతిలో ఉంది కాని ఒక్క పేజీకూడా తిరగలేదు వసుంధర మెదడులో కల్యాణి, కృష్ణమూర్తి, డాక్టరుగురించిన ఆలోచనలే జడలల్లుకుంటున్నాయి చిక్కుపడుతున్నాయి మళ్ళీ విడుతున్నాయి ఆ ముప్పేట జడలో తానెక్కడా లేదు ఇందిరకూడా లేదు ఇందిరను అంతగా ఎరుగదు ఒక ప్రేక్షకురాలిలా ఆ ముగ్గురి జీవితాలూ, పరిణామాలూ, వాళ్లుచేరే గమ్యం అవలోకిస్తోంది తను ఆ అవలోకనలో అవగాహనలో కృష్ణమూర్తి మెదలినప్పుడల్లా గుండెల్లో పదిలపరచిన కత్తుల్లాంటి భావాలేవో కలుక్కుమంటున్నాయి

నాల్గురోజుల క్రిందట డాక్టరువచ్చి భయపడుతూ భయపడుతూ "కృష్ణమూర్తి ఇలాంటి నిశ్చయానికి వచ్చాడు ఈ విషయం మీతో చెప్పమన్నాడు" అన్నపుడు తనకు దుఃఖంకంటే కోపం అతిశయించింది. ఆ కోపంలో డాక్టరుతో ఎక్కువ మాట్లాడలేకపోయింది "ఎందువల్ల?" అని కూడా తానడగలేదు. అయినా డాక్టరే చెప్పాడు, కృష్ణమూర్తి ఎందు కిలాంటి నిశ్చయానికి వచ్చాడో. అతడు చెప్పిందంతా అర్థంచేసుకునే స్థితిలో లేదు తనప్పుడు తనకిప్పుడు కృష్ణమూర్తిమీద కోపం ఏమీలేదు తనకర్థం కానిదల్లా ఒక్కటే! అతడు తనకు కనబడకుండా ఎందుకు తప్పుకుతిరగాలి? అని

నిజానికి కృష్ణమూర్తి నిశ్చయంకంటే, అంతరాంతరాల్లోని తన ఆశలు తుంపివేశాడనే బాధకంటే వసుంధర నెక్కువ బాధపెట్టింది అతడు తప్పుచేసినవాడిలా తననుంచి పారిపోవడం; పిరికివాడిలా తప్పుకుపోవడం ఒక స్నేహితుడిగా అతను వచ్చి "ఇదీ నా నిశ్చయం" అని ఉంటే తానింత మథనపడేదికాదు. అలా అనుకున్నప్పుడు వసుంధర కొక చిత్రమైన ఆలోచన వచ్చింది అతడలా చేయకపోవడమే మంచిదైందేమో? కృష్ణమూర్తిలో ఆ పిరికితనం కనబడబట్టే "అతడిలో నేననుకున్నంత ఏమీలేదు. అతనూ సామాన్యుడు, నేనంత కుంగిపోవలసినదేమీ లేదు ఇదొక అనుభవం. మరికొంచెం కళ్ళు పెద్దవిచేసి లోకాన్ని చూడాలి. ముందుకు సాగాలి" అనుకోగలిగింది

వసుంధర. ఆ భావం ఆమెకొక ప్రశాంతత నిచ్చింది. తనకిప్పుడెవ్వరిమీదా ద్వేషం లేదు.

☆ ☆ ☆

"ఏమిటి కృష్ణమూర్తీ! విసుగెత్తి చచ్చిపోతున్నాను. ఎప్పటికీ వూడిపడడేం మీ డాక్టరు? వాళ్ళిద్దరూ కలిసి మననేదో మోసం చేశారు!" అంది ఇందిర, చేతిలో ఉన్న పుస్తకాన్ని విసురుగా టేబిలుమీదకి విసిరేసి.

"నీకు కోపం తెచ్చుకోడం, విసుక్కోడం, ఎవరినో తిట్టేయడం అంతే తెలుసు ఏం జరిగింది? వీళ్ళింకా ఎందుకు రాలేదు? అని అదుర్దాపడి ఛస్తున్నాను నేను" అన్నాడు కృష్ణమూర్తి చీదరగా.

"అటూ కాకుండా యిటూ కాకుండా ఇక్కడ చిక్కడిపోయాం. పోనీ ఈ డాక్టరు వస్తాడేమో అంటే, అర్జంటు కేసంటూ పొద్దున్ననగా వెళ్ళాడు ఇంతవరకూ రాలేదు. మీ చక్రవర్తి మరిచిపోయి నెల్లూరుదాటి వెళ్ళిపోలేదు గదా?" అంది ఇందిర మళ్ళీ.

"అదేమిటిందిరా అలా అంటావు? మరిచిపోవడానికిదేమీ సినిమా, సర్కసూ కాదు. మనల్నిక్కడ ఉండమన్నవాడు తను. తీసుకువెళతానన్నవాడు తను డాక్టరు గోపాలరావూ కుటుంబమూ కూడా వస్తారని చెప్పినవాడు తను. ఇంత జరిగి ఎందుకురాడూ? తోవలో కారేమైనా గడబిడ చేసిందా అని నా అనుమానం" అన్నాడు.

టైము ఎనిమిదిన్నర గంటలు దాటింది. అంతకంతకూ ఇందిర చికాకుపడుతూంది. కృష్ణమూర్తి గాభరా పడుతున్నాడు. ఎప్పటికీ చక్రవర్తి జాడలేదు ఏమయిందో తెలియదు. ఇంటాయన ఇంతవరకూ తిరిగి రాలేదు. గడియ గడియకీ గేటువైపు అప్రయత్నంగా చూస్తూ హాలులో పచార్లు చేస్తున్నాడు కృష్ణమూర్తి. ఇంతలో వీధిలో కారాగింది. అతను అదుర్దాగా తొంగి చూశాడు ఇందిరకూడా తొంగిచూసి "అది టాక్సీలే–మనవాళ్ళేం కాదు – డాక్టరుగారికి మరొక కేసు కాబోలు!" అంది.

"కాదిందిరా, అదిగో చక్రవర్తి!" అంటూ వీధిలోకి ఒక్క ఉరుకున పరిగెత్తాడు కల్యాణి కూడా నెమ్మదిగా కారులోంచి దిగింది.

కృష్ణమూర్తి "ఏమిటోయి డాక్టరూ–కారునెక్కడయినా గుద్దించేశావేమిటి? టాక్సీలో వచ్చేవేమిటి?" అన్నాడు.

"నువ్వన్నంత పనే జరిగింది. ఆ సంగతి వింటే నువ్వు హడిలిపోతావు" అన్నాడు చక్రవర్తి. మొదట అతను నమ్మలేదు కాని వాళ్ళిద్దరినీ చూస్తే ఏదో పెద్ద ప్రమాదం జరిగినట్లే అనిపించింది.

"సరే లోపలికి రా! మాట్లాడుకోవచ్చు" అంటూ "ఇందిరా! నేను భయపడినట్లే జరిగింది చూశావా! మనవాళ్ళు పెద్ద ఏక్సిడెంటునుండి బయటపడి వచ్చేరట" అన్నాడు హాల్లో ఉన్న ఇందిరతో.

టాక్సీ డ్రైవరు సామానులు హాల్లో పెట్టాడు. చక్రవర్తి హాల్లోకి వెళ్ళగానే అక్కడ

ఈజీ ఛెయిర్లో కూలబడ్డాడు కల్యాణికేం చేయడానికి తోచక అటూ యిటూ చూస్తూంది.

"అన్నట్లు ఇందిరను నీ కింట్రడ్యూస్ చెయ్యాలి కదూ లోపలికి పోయినట్లుంది, లాక్కొస్తానుండు" అంటూ లోపలికి వెళ్ళాడు అతను ఎప్పుడూ ఎవరితో మాట్లాడడానికీ భయపడని ఇందిర కల్యాణి నెలా పలకరించాలి అనే జంకుతో లోపలికి పారిపోయింది. అతను ఇందిరని లాక్కొచ్చి డాక్టరుకి పరిచయం చేశాడు, "నిల్చునే ఉండిపోయారేం, కూర్చోండి కల్యాణిగారూ" అన్నాడు ఆమెవంక తిరిగి

ఇందిర కల్యాణి వైపొకసారి పరిశీలనగా చూసింది చిరకాలానికి వేరొక అవస్థలో యిప్పుడిద్దరూ తారసపడ్డారు కల్యాణి కళ్ళెత్తి ఇందిర వేపు చూసి పరిచితమైన నవ్వు నవ్వింది. క్షణకాలం ఇద్దరిమధ్యా నిశ్శబ్దం ఆవరించింది

"ఇలా కూర్చో కల్యాణీ!" అన్నది ఇందిర ఆఖరికి, తనుకూర్చున్నమంచంమీద చోటు చూపిస్తూ. ఆమె కూర్చుంది. ఏం మాట్లాడటానికీ ఇద్దరికీ తోచలేదు ఇంతలో డాక్టరుగారి భార్య వచ్చి చక్రవర్తిని పలకరించింది. కల్యాణిని పరిచయం చేశాడామెకు డాక్టరు. "గోపాలమేడీ?" అన్నాడు.

"ఏదో అర్జంటు కేసుందని ఉదయమే వెళ్ళారు. ఇంతవరకూ రానేలేదు" అన్నదావిడ.

"అదిగో, మాటలోనే వచ్చారు. హమ్మయ్య, ఇప్పటికి సగం సమస్యలు తీరినట్లే" అని నిట్టూర్చాడు కృష్ణమూర్తి

డాక్టరు గోపాలరావు సీరియస్‌గా లోపలికి వచ్చి చక్రవర్తిని చూసి "ఎంతసేపయింది వచ్చి?" అన్నాడు. అతని పలకరింపులోనే చక్రవర్తి కేదో అర్థం అయింది "అదంతా చెప్తాలే, నువ్వేం అలా వున్నావు?" అన్నాడు

గోపాలరావు మ్లానంగా నవ్వి "ఏం లేదు, ప్రొద్దుటినుండీ ఒక టెటానస్ కేస్ ఎటండయాను–ఫెయిలయింది–నాకు చాలా స్నేహితుల్లే వాళ్ళు" అనేసి, "స్నానం చేసి వస్తాను" అని వెళ్ళాడు డాక్టరు చెప్పిన చావుకబురుతో కల్యాణి ముఖం మరింత వెలవెలపోయింది "ఇది నా జీవితంలో అదృష్టపు రోజనుకున్నాను. అన్నీ ఇలాంటి సంఘటనలు జరుగుతున్నాయేం? ఉదయ మాప్రమాదం ఎందుకు జరగాలి? ఇప్పుడీ చావు కబురేమిటి?" ఏదో పిరికితనం, ఏదో నిర్వీర్యత ఆమె నావహించాయి ప్రతి విషయానికి బెదరిపోతూంది

కృష్ణమూర్తి అతని నడిగాడు– "ఏం జరిగిందీ? కారేమైంది?" అని. అతను నెమ్మదిగా ఉదయంనుండీ జరిగిన కథంతా చెప్పాడు కారునక్కడే వదిలేశారట అక్కడికి సమయానికి ఏదో లారీ వచ్చిందట. వాళ్ళు ఈ ఏక్సిడెంటు సంగతి విని వాళ్ళిద్దరినీ అందులో ఎక్కించుకుని, కారుదగ్గర వాళ్ళతాలూకు ఒక మనిషిని కాపలాపెట్టి వీళ్ళిద్దరినీ వూళ్ళోకి తీసుకువచ్చి స్టేషనుదగ్గర విడిచిపెట్టారట అక్కడినుండి టాక్సీలో వచ్చారట.

ప్రమాదం జరిగిన పద్ధతి, వాళ్ళు పడ్డ అవస్థలూ అన్నీ విన్నా ఇందిర కూడా చలించిపోయింది. "దెబ్బలేమైనా తగిలాయా కల్యాణీ?" అని ఆప్యాయంగా

పలకరించింది. "నాకేమంత పెద్దదెబ్బలు తగలలేదు ఇందిరా! డాక్టరుగారికి నుదుటిమీద గాయం తగిలి బాగా రక్తం కారింది. అయితేనేంలే ఒరిగిపోయినకారులో అంతమాత్రం గాయాలతో తప్పించుకు రావడం మేలేకదూ!" అన్నది కల్యాణి

"కారిక్కడి కెంతదూరంలో ఉండిపోయింది?" ఇందిర డాక్టరు నుద్దేశించి అడిగింది.

"సుమారు ఆరుమైళ్ళుంటుందంతే" అన్నాడు

గోపాలరావు స్నానం చేసివచ్చాడు కాఫీ టిఫిను వగయిరాలు కానిస్తూ మళ్ళీ జరిగిన విషయమంతా అందరూ కలిసి చర్విత చర్వణం చేశారు డాక్టర్లిద్దరూ కారుగురించి ఏం చేయాలి అని చర్చించుకున్నారు.

"ఇక్కడనుండి ఎవరినో పంపించి దాని నెలాగైనా వూళ్ళోకి తెచ్చే ఏర్పాటు చేయిస్తాననుకో. కాని ఇదంతా జరిగేసరికి కొంతటైము పడుతుంది అంతవరకూ అక్కడ మనిషి ఉంటాడా అని" అన్నాడు గోపాలరావు

"ఉంటాడనే చెప్పారు ఆ లారీవాళ్ళు. అతని కయిదో పదో ఇస్తానని చెప్పాను. ఏదో ఏర్పాటు చేసెయ్యి. ఏం జరిగితే అది జరుగుతుంది సగం చితికిపోయిన కారు ఏమవుతుందని నేనంతగా బెంగపడలేదు. ఇంతకీ యిక్కడనుండి మనం బయలుదేరడమెలా? ఎలా అక్కడికి చేరుకోవడం?" అన్నాడు చక్రవర్తి బాధగా, దిగులుగా.

"మీ రిద్దరూ కాసేపు పడుకోండి రాత్రంతా కారు ప్రయాణం తెల్లవారేక ఈ గడబిడ...కొంచెంసేపైనా విశ్రాంతి తీసుకోండి. నేనూ కృష్ణమూర్తిగారూ ఆ ఏర్పాట్లన్నీ చూస్తాం. నువ్వూరికే బెంగపడకు చక్రవర్తీ, నే నెలాగో ఏర్పాటు చేస్తానుగా" అన్నాడు.

చక్రవర్తి అలాగే కుర్చీలో పడుకుని మగతగా కన్నుమూశాడు

కల్యాణి పరుపుచుట్టకు చేరబడి దిగులుగా కూర్చుంది ఎందుకో ఇందిర మనసులో తెరలన్నీ తొలగిపోయాయి. ఒకనాడు హాస్టలునుండి తన యింటికి వచ్చిన కల్యాణిని ఎంత స్వచ్ఛంగా, ఎంత ఆప్యాయంగా చేరదీసిందో, ఆనాటి ఆప్యాయత మళ్ళీ వెల్లివిరిసింది. మధ్యలో జరిగినదంతా మరచిపోగల్గింది కల్యాణికి ఇందిర గురించి పెద్దద్వేషం ఎప్పుడూ లేదు. కొందరంతే అనుకుని వూరుకుంది. ఇందిరే తన జీవితాన్ని నాశనం చేసింది అనే అభిప్రాయం కల్యాణికి లేదు ప్రకాశంలో అలాంటి బలహీనత ఉండబట్టి, ఆమెకీ తనలాగే కొన్ని కోరికలుండబట్టి ఆమె అలా ప్రవర్తించింది అని అర్థం చేసుకోగలిగింది తననెంత సమాధాన పెట్టుకున్నా తను క్షమించలేకపోయింది ఒక్క ప్రకాశాన్నే–ఇప్పటికీ కల్యాణి దృష్టిలో ప్రకాశం క్షమార్హుడు కాడు

"చాలా చికాకుగా కన్పిస్తున్నావు–స్నానం చేసి డ్రెసు మార్చుకో కల్యాణీ! కొంచెం హాయిగా వుంటుంది" అంది ఇందిర

"ఎలాగో అలాగ ప్రయాణం పూర్తవడం జరిగితే అప్పుడవన్నీ చూసుకోవచ్చు ఇందిరా! అంతవరకూ ఏం చేయలేను" అంది కల్యాణి

"కృష్ణమూర్తీ డాక్టరూ కలిసి ఊళ్ళోకి వెళ్ళారుకదా–వాళ్ళేదో సాధించుకు రాకపోరు. నువ్వులేచి స్నానం చెయ్యి నా మాట విను, అలా ఉండకు" అని లేపింది ఇందిర కల్యాణిని

'ఆ ఇందిరేనా ఈ ఇందిర!' అని ఆశ్చర్యపడక తప్పలేదు కల్యాణికి.

చక్రవర్తి కుర్చీలో చాలాసేపు నిద్రపోయాడు కల్యాణి స్నానం చేసి డ్రెస్సు మార్చుకుంది ఆమెకేదీ ఆలోచించడానికి తీరిక చిక్కకుండా ఇందిర ఏవేవో కబుర్లు చెప్పింది నాన్న జైలుకెళ్ళడం గురించి చెప్పింది కృష్ణమూర్తీ తనూ కలిసి రైలు ప్రయాణం, ముందు రాత్రంతా వీళ్ళింట్లో మకాం, దోమలు, పిల్లల ఏడుపులు– అన్నీ సహజమైన ధోరణిలో చెప్పింది ఆ సమయంలో ఆమెకు ఇందిర మాటలు కొంత హాయినిచ్చాయి

పదిగంటలకు కృష్ణమూర్తీ గోపాలరావూ తిరిగి వచ్చారు చక్రవర్తిని లేపి, కారును ఊళ్ళోకి తీసుకొచ్చే ఏర్పాటంతా చేసేశామని చెప్పారు "మరి మన ప్రయాణం సంగతి?" అన్నాడు చక్రవర్తి

"ఊరంతా తిరిగి వెతికాం ఎక్కడా టాక్సీ దొరకలేదు అంటే ఒకటి రెండు వున్నాయి కాని వాళ్ళు మరీ ఆశకంతు లేకుండా అడుగుతున్నారు చివరకు డాక్టరుగారొక ఉపాయం చేశారు తనకు తెలిసిన సబ్ ఇన్‌స్పెక్టరు నొకడిని పట్టుకుని ఒక బస్సు ఏర్పాటు చేశారు మామూలుగా ఒంటిగంటదాకా బస్సులేదట. మనకోసం ప్రత్యేకం ఈ ఏర్పాటన్నమాట" అన్నాడు కృష్ణమూర్తి

"ఒక అరగంటలో వచ్చేస్తుంది మనం సిద్ధంగా ఉంటే కనీసం నాల్గింటికి దిగువ తిరుపతి చేరుకోవచ్చును" అన్నాడు గోపాలరావు.

"మాదేముంది, మేమంతా సిద్ధమే మీ ఆవిడని త్వరగా సిద్ధపడమను" అన్నాడు చక్రవర్తి.

అలా స్పెషల్‌గా ఏర్పాటు చేసిన బస్సు స్పెషల్‌గా అరగంట ఆలస్యం చేసిగాని రాలేదు డాక్టరుగారి భార్య తెమలడానికి మరో అరగంట పట్టింది. అంతా సర్దుకుని ఎక్కి కూర్చున్నాక బస్సుబయలుదేరి నెల్లూరు పొలిమేర దాటేసరికి చక్రవర్తి రిస్టువాచీలో పదకొండున్నరయింది శీతాకాలపు మధ్యాహ్నమైనా చురుక్కుమనిపించే ఎండ రెండురోజులు కారు ప్రయాణంలో ముడుచుకొని కూర్చొవడంతో, పొద్దుటి ప్రమాదపు అదుటతో, కల్యాణి శరీరంలోని ప్రతి అణువూ మూల్గింది దానికి తోడు ఆ గతుకుల రోడ్డుమీద నలభై మైళ్ళ వేగంతో పోతూ అందర్నీ ఎత్తి కుదేస్తున్న బస్సు "నాలుగు గంటలకైనా కింద తిరుపతి చేరుకోగలమంటావా?" అని డాక్టరు గోపాలరావు అప్పుడప్పుడు డ్రైవర్ని పరామర్శిస్తూంటే, "రోడ్డు చూస్తున్నారుగా! ఉత్త ముదనష్టం రోడ్డు. ఇంజను వేడెక్కిపోయింది. ఇంతకన్నా స్పీడు ఎక్కువ చేస్తిమా, తిరుపతి కర్మేం– నేరుగా స్వర్గానికే పోతాం. అయినా ప్రయత్నిద్దాం సార్!" అన్నాడు డ్రైవరు

"ఏమిటి ప్రయత్నిద్దాం? స్వర్గం చేరుకుందుకా?" అన్నాడు కృష్ణమూర్తి డ్రైవరు అపర పార్థసారథివలె స్టీరింగు చక్రం తిప్పుతూ "మీదయ సార్! పోదామంటే అక్కడికే డ్రైవ్ చేస్తాను. తప్పుతుందా మరి" అన్నాడు, అంతకంటె నిబ్బరంగా.

"ఏం ఇందిరా? స్వర్గానికట, పోదాం వస్తావా?" అన్నాడు కృష్ణమూర్తి, ఆమెను క్రీగంట చూస్తూ

"నేను రానుబాబూ! నాకిక్కడే బావుంది. అంత సరదాగా ఉంటే నువ్వు వెళ్ళు, నాకేం అభ్యంతరం లేదు"

అదంతా ఆశ్చర్యంగా వింటున్న డాక్టరుగారి భార్య "శుభమా అని వెళుతుంటే అవేం మాటలండీ!" అంది కొంచెం మందలింపుగా

ఇందిర ఆవిడ మాటతో జోడించి "మరే! అలా కొంచెం బుద్ధి చెప్పండి అక్కయ్యగారూ! పెళ్ళయాక కావాలంటే నరకం రుచి చూపించుతాను, స్వర్గానికి తీసికెళ్ళమంటే మటుక్కు నా తరంగాదు" అంది.

కల్యాణి అంతా వింటున్నదిగాని, ఆమె మనసు ఎక్కడో వుంది కొయ్యబారి పోయినట్లు కూర్చుంది. చక్రవర్తి ముఖంలో ఎటువంటి కవళికలూ లేవు స్థిరప్రజ్ఞుడివలె మొహం పెట్టి యిటూ అటూ దృశ్యాలను చూస్తూ కూర్చున్నాడు కృష్ణమూర్తి మనసులో పెద్ద ఉద్వేగాలంటూ ఎప్పుడూ లేవు గుంపులోని వెచ్చదనం, గుంపులోని సంతృప్తి అనుభవిస్తూ కూర్చున్నాడు ఉన్నట్లుండి అతనికి వసుంధర స్ఫురణకొచ్చింది దానితో అతని అస్థిపంజరం భయంతో వణికిపోయింది అతని అంచనాలో తన తాహతుకు మించిన ఆణిముత్యం వసుంధర తనను గురించి వసుంధర ఏవీ భ్రాంతులు పెట్టుకోకూడదు తన వలన ఆమెకు మాయని గాయాలేవీ ఉండకూడదు. దానికొకటే మార్గం– తనలో వున్న అసలు విలువలేమిటో ఆమెకు విపులంగా తెలిస్తే ఆమె తనను మరిచిపోయి, జరిగినదానికి బాధపడడం బదులు సంతోషించగలదు

బస్సు నాలుగ్గంటలకు ఒగురుస్తూ పొగలు చిమ్ముతూ ఎలాగైతేనేం దిగువ తిరుపతి చేరుకుంది. కొండపైకి బయలుదేరే బస్సు మరో పదినిముషాల్లో దొరికింది అందరూ సంతృప్తిగా నిట్టూర్చారు. కల్యాణి చైతన్యరహితంగా రెండో బస్సులోకి శరీరాన్నెలాగో చేరవేసింది కల్యాణి ఎలా ఉంది అనే స్పృహ చక్రవర్తికి అప్పుడే కలిగింది. ఆమె తన పక్కనే కూర్చుంది కళ్ళు విప్పి చూస్తూనే వుంది కాని ఆ చూపులో కాంతిలేదు. ఏదో విభ్రాంతి; యోజనాల వెనుకకు మరలిపోయిన చూపు

"ఇంకా యిలాగే ఉండకు కల్యాణీ! అన్నీ దాటిపోయాం మన చుట్టూ ఎంతెంత అగాధాలో చూడు. వాటన్నిటినీ దాటి ఎక్కడికో పైపైకి వెళుతున్నాం సంతోషంగా లేదూ?" అన్నాడు, ఆమె మొహంలోకి చూస్తూ.

ఆమె మాటాడలేదు. కిటికీలోంచి తొంగి చూసింది అవును, చుట్టూ అగాధాలు. కళ్ళు తిరిగిపోయే కొండలోయలు వాటన్నిటినీ దాటి ఎక్కడికో పైపైకి వెళుతున్నారు. అక్కడేముంది? అదెలా ఉంటుంది? ఎందుకు వెళ్ళాలక్కడికి?

"అమ్మయ్య! వచ్చేశాం బాబూ! దిగండి దిగండి!" అని ఇందిర వేసిన కేకకు కల్యాణి తుళ్ళిపడింది. అప్పటికప్పుడే కొండమీద చీకట్లు ముసురుకుంటున్నాయి తూలుతూ తూలుతూ బస్సు దిగింది కల్యాణి ఇందిర సామాను దింపిస్తోంది చక్రవర్తికి ఎదురుగా కాంపౌండరూ, వసుంధరా ప్రత్యక్షమయ్యారు. "అద్భుతం కల్యాణీ! వసుంధరగారు వచ్చారు. ఏం వసుంధరగారూ! చాలా సంతోషం! మంచిపని చేశారు!" అని చక్రవర్తి హంగామా చేశాడు, పట్టరాని ఆనందంతో

వసుంధర ఆ మాటలు వినిపించుకోకుండా, "ఇంత ఆలస్యమైందేం కల్యాణీ!" అని ఆమె చెయ్యి పట్టుకుంది.

కృష్ణమూర్తికి క్షణమాత్రం మూర్ఛ వచ్చినంత పనైంది మళ్ళీ మరుక్షణంలో తేరుకుని "హల్లో వసుంధరగారూ! చాలా థాంక్స్!" అన్నాడు.

వసుంధర కొంచెం బాధగా, "నిజంగానేనా? అనాలిగనుక అంటున్నారా?" అంది.

కృష్ణమూర్తికి ఆమెవేపు దీనంగా చూడ్డమే తప్ప ఏం చెప్పాలో తెలియలేదు "భయపడకండి కృష్ణమూర్తిగారూ!" అంది.

అందరూ బస చేరుకున్నారు. అందులో ఏర్పాట్లన్నీ చూశాక ఇందిర కంపౌండరు వేపు తిరిగి "కంపౌండరుగారూ! కంగ్రాచ్యులేషన్స్" అంది.

కంపౌండరు ఆశ్చర్యపోయి, "మధ్య నాకా తల్లీ! దేనికి?" అన్నాడు. ఇందిర కళ్ళు రెండూ పెద్దవి చేసి, "దేనికని నెమ్మదిగా అంటా రేమిటండీ? ఇంత తక్కువ టైంలో యింత చక్కని ఏర్పాట్లు చేశారంటే గాంధీగారు చెప్పినట్లు నిర్మాణ కార్యక్రమంలో మీరు గొప్పవాళ్ళన్నమాట. చచ్చి ఏ స్వర్గాన ఉన్నాడోగాని, గాంధీగారే యిప్పుడు బతికుండి యిదంతా చూసుంటేనా? అమాంతం మీకు పద్మవిభూషణ్ సహిలేవర్గ్ యిమ్మని నెహ్రూగారిని నిలవేసి వుండేవాడు లేకపోతే ఆ భోజనం వండుకుంటానని గొడవ చేసేవాడు"

కంపౌండరు "అంతా ఆ ఏడుకొండలవాడి దయమ్మా!" అనేశాడు.

☆ ☆ ☆

రాత్రి పదకొండు గంటలు దాటింది బంగళా ఆవరణలో పచార్లు చేసి చేసి, చెట్టు మొదట రాయిమీద చతికిలపడ్డాడు కృష్ణమూర్తి. సిగరెట్టు మీద సిగరెట్టు కాల్చేస్తున్నాడు. నెమ్మదిగా చక్రవర్తి అక్కడికి చేరి, "ఇక్కడ కూర్చున్నావేం కృష్ణమూర్తీ?" అన్నాడు.

"ఎడ్వెంచర్ ఐపోయిందిగా! తరవాత కార్యక్రమం ఏమిటా అని."

"అంటే?"

"అంటే ఏమిటి డాక్టరూ? ప్రవాహంలోపడి అందరం ఇక్కడదాకా ఏదో ఆవేశంతో కొట్టుకొచ్చాం. దీని తరువాత ఏమిటి? అసలు సమస్యలన్నీ ఇక్కడనుంచే మొదలు దేనికోసం ఇదంతా జరిగింది? దీనివలన మేం ఇద్దరం సుఖపడతామా అంటే నాకు ఎందుకో అనుమానంగా ఉంది ఇంతటితో ఇంటికి నాకూ సరిగదా? కొన్నాళ్ళకి అంతా సర్దుకుంటుందనుకో. అది వేరే విషయం."

"ఇవన్నీ ఆలోచించుకునే రంగంలోకి దిగావు గదుటోయ్! మళ్ళీ మొదటి కొచ్చావేమిటి?"

"మొదటికి రాలేదు డాక్టరూ! ఆలోచిస్తున్నానంతే కావలసిన కార్యం గంధర్వులు తీర్చేశారు గదా."

"అంటే?"

"అంటే ఏముంది? అనుకున్నది జరిగిపోయింది జీవితానికి యిదొకటే ముఖ్యమా? ఏమో, నాకు తెలియడంలేదు. ఒక ఆనందాన్ని అందుకోవడం కంటే

బాధను తప్పించుకునేందుకు ఈ పని చేశాను నేను. మారుమూల కుగ్రామంలో పుట్టాను నేను. ఇంట్లో కాస్త ఉంది గనుక చదువుకు పంపించారు నన్ను అందులో నాకేమీ ప్రతిభ లేదని తేలిపోయింది పోనీలే, దానిగురించి నాకేం బెంగలేదు మావాళ్ళు కొంచెం పాతకాలంవాళ్ళు అయితే కావచ్చుగాని, నిర్దయులు కారు. నన్ను కష్టపడనివ్వరు. ఇందిరను మాత్రం వాళ్ళలో ఎప్పటికీ చేర్చుకోలేరు. అది శత్రుత్వం కాదు, చేతకాని తనం– అంతే ఇందిరకు వాళ్ళ ప్రమేయమూ అక్కర్లేదు. దేనికీ నా మీదకూడా ఆధారపడనని ఖచ్చితంగా చెప్పేసింది "

ఇంతలో ఇందిర అక్కడికి వచ్చి "ఏమిటి నా చిట్టితండ్రీ! ఏమిటి బాతాఖానీ వేశావు?" అంది.

"కల్యాణీ వసుంధరా ఏం చేస్తున్నారు?" అన్నాడు చక్రవర్తి

"మీ కల్యాణి ఏమీ అయిపోలేదండీ! వరండాలో కూర్చుని ఏదో ఆలోచిస్తోంది "
"నువ్వెందుకిలా వచ్చేశావ్ వాళ్ళని వదిలేసి?". అన్నాడు

"ఇది మరీ బాగుంది. ఆ చంటిపిల్లల కిద్దరికీ నేనేం 'ఆయా' ననుకున్నావా?" అంది ఇందిర కొంచెం చిరాగ్గా.

"ఇంత జరిగాక కూడా యింకా చిలిపితనం పోలేదా ఇందిరా?"

"ఏడిసినట్లుంది, ఇలా విను కృష్ణమూర్తీ! ఏదో జరిగిందని నన్ను మాటిమాటికీ భయపెట్టకు జరిగినదానికి నువ్విచ్చినంత గంభీరమైన అర్థం నే నివ్వడంలేదు అలాగని దాన్నంత చులకనగానూ చూడ్డంలేదు. దేని విలువ దానికివ్వాలి అంతే ఇది జీవితంలో నాకు ఒక భాగం మాత్రమే. నీతో ఎంతదూరం రమ్మన్నా వస్తానుగాని, ఏ ఘట్టంలోనూ నా వ్యక్తిత్వాన్ని చంపుకోలేను ఆ మాత్రం అర్థం చేసుకుని, నా అవసరాలను గౌరవించటం నేర్చుకుని, నన్ను నా యిష్టం వచ్చినట్లు వూపిరి పీల్చుకోనిస్తావా – నువ్వూ సుఖపడగలవు – నన్నూ సుఖపెట్టగలవు లేదా ఇద్దరికీ నరకం తప్పదు. ఇద్దరం కలిసి ఒకళ్ళ కళ్ళలోకి ఒకళ్ళం చూస్తూ కూర్చుందుకు కాదు ఇలా దగ్గరికి వచ్చింది ఇద్దరం కలిసి ఒకే లక్ష్యంవేపు చూడగలిగితేనే సార్థకత్వం అంతేగాని, నాన్న ఒకరకం జైలులోకి వెళితే, నేను ఇంకోరకం జైలులోకి వచ్చాననుకోకు" అంది ఇందిర

ఇంతలో కల్యాణీ వసుంధరా అక్కడికి వచ్చారు "అందరూ ఈ చెట్టుక్రింద చేరారేమిటి?" అంది వసుంధర

"రేపటి సంగతి ఆలోచిస్తున్నాం. మీ ప్రోగ్రాం ఏమిటి?" అన్నాడు చక్రవర్తి

వసుంధర "ఏముందీ? మొదటి బస్సుకి బయలుదేరి వెళ్ళిపోవడం వచ్చిన పని అయిపోయిందిగా! ఆ తరవాత, ఆ తరవాత ఏముంది? దీక్షగా కూర్చుని పరీక్షకు చదవడం డిగ్రీ తీసుకునేంతవరకూ యింక ఏం చెయ్యాలనే ప్రసక్తేలేదు నాకు మీ సంగతి?" అంది.

చక్రవర్తి "ఏముంది? అందరం కలిసే పోదాం నెల్లూరులోకారు గతి చూసుకుని ఆ తరవాత రైలెక్కి వైజాగ్ ఉడాయించడం, సీరియస్‌గా కల్యాణి ఉద్యోగం కోసం ప్రయత్నించడం" అని. "ఏం కల్యాణీ? అంతేనా" అన్నాడు. "అంతే" అంది కల్యాణి.

"అంటే, తెల్లారేక మన సమస్యలు ప్రారంభం అవుతాయన్నమాట" అన్నాడు కృష్ణమూర్తి. దానికి జవాబుగా ఇందిర –

"ఏం భయంలేదు. బతికున్న ప్రతి మనిషికీ సమస్యలుంటాయి సమస్యలు లేనిది చచ్చిపోయినవాళ్ళకి మాత్రమే ఇంకా ఆలోచిస్తూకూర్చుంటే – బుర్ర వేడెక్కిపోవడం తప్ప యింకో ప్రయోజనంలేదు ఇలా విను మై డియర్ కృష్ణమూర్తీ! ఈ విషయంలో నీ తత్వమూ నా తత్వమూ ఒకటేగాని, ఐనా ఇది నువ్వు నా మెడలో తాడుగట్టిన రాత్రిగనుక – యింకొక్కసారి చెపుతున్నాను విను. నీకు ఆయుర్దాయం ఎన్నాళ్ళు – అంటే నీ జీవితకాలంలో – నిండుగా బతుకు నిర్భయంగా బతుకు. రోజుకి పదిసార్లు చావకు. ఇంకొకళ్ళని చంపకు. నీకు తారసిల్లిన మనుష్యుల్లో అణిగి మణిగి ఎక్కడైనా లోలోపల కొంచెం మానవత్వం ఉంటే – దాన్ని బైటకి తీయడానికి ప్రయత్నించు దాన్ని బైటికి రానియ్ మానవత్వం ఉండడం సిగ్గుపడవలసిన నేరం ఏమీకాదు నువ్వు నమ్మవేమోగాని, యీ శరీరాన్ని ఎన్నడూ నేను అతిగా ప్రేమించలేదు. అలాగని ద్వేషించనూలేదు – దాని అవసరాలను అసహ్యించుకోనూలేను అది తప్ప యింకో పరమార్థం లేదని అనుకోనూలేను మన చుట్టూరా ఉన్న స్వార్థం, రోషం, క్రౌర్యం, భయం – యివి మనలోనూ ఉన్నాయి కాబట్టి వీటికి భయపడకు. సర్వత్రా వ్యాపించి ఉన్నదాన్ని చూసి భయపడ్డం దేనికి? ఈ ప్రపంచంలోని వికృతాన్నీ వికారాన్నీ అసహ్యించుకో, ఫరవాలేదు. అసహ్యించుకోవాలికూడా. ఆశలూ, స్వప్నాలూ, అనురాగాలూ, అభిమానాలూ అన్నీ పెంచుకో. కాని, వాటికి శస్త్రచికిత్స అవసరం అయినప్పుడు సంకోచం లేకుండా కోసి అవతల పారెయ్ ఏనాడో పగిలిపోయిన కలలు, విరిగిపోయిన అనురాగాలు, అటకలోంచి తీసి అవతల పారెయ్– మనస్సు తేలిగ్గా ఉంటుంది ఆయుర్దాయం ఉన్నన్నాళ్ళు బతుకుదాం కృష్ణమూర్తీ! కాబట్టి రేపటి సమస్యలు తలచుకొని బరువెక్కిపోకు తెల్లవారితే యింకొక్క రోజు" అని కొంచెం ఉద్వేగంగా, ఉద్రేకంతో అంది

అందరూ కాస్సేపు నిశ్శబ్దంగా వుండిపోయారు ఆ ప్రవాహంలోంచి మొదట కృష్ణమూర్తి గుక్క తిప్పుకొని, "ఇందిరా! నిన్ను అన్నింటికీ క్షమించేశాను పో!" అన్నాడు

"థాంక్స్!" అంది ఇందిర.

"ఇంక పోదాం పదండి! కొంచెంసేపు కునుకుతీద్దాం తెల్లవారితే బోలెడన్ని సమస్యలు!" అన్నాడు చక్రవర్తి

"మళ్ళీ సమస్యలంటారు!" అంది ఇందిర, కొంచెం గద్దిస్తున్నట్లు.

"లేదు, లేదు పొరపాటు!" అన్నాడు డాక్టరు.

"ఇందిరా, మా డాక్టర్ని ఏమైనా అంటే ఏం చేస్తానో తెలుసా?" అన్నాడు

"ఏం చేసావేం?"

"ఏం చేస్తానా? అమాంతం నిన్ను ముద్దుపెట్టేసుకుంటాను."

"అలాచేస్తే నిన్ను ఏడుకొండలవాడు రపేమని శపించేస్తాడు – కొండ అపవిత్రం అయిపోయిందని" అంది ఇందిర

"మరేం భయంలేదు నువ్వు నా పక్కనుండగా డెబ్బైకొండలవాడు శపించినా నాకేం భయంలేదు?" అన్నాడు కృష్ణమూర్తి

కల్యాణి మాటందుకుని, "కోట్లకి విలువైనమాట అన్నారు కృష్ణమూర్తిగారూ! ఇంక పదండి లోపలికి!" అని, చక్రవర్తివేపు తిరిగి "పోదాం పదండి!" అంది కల్యాణి చెయ్యి గట్టిగా పట్టుకున్నాడు చక్రవర్తి. అందరూ బంగళాలోకి దారితీశారు

(సంపూర్ణం)



# డా॥ శ్రీదేవి గారి కాలాతీత వ్యక్తులు

- డా. వి. చంద్రశేఖరరావు

ఒక కల్యాణి. ఒక ఇందిర –

సంక్లిష్టమవుతున్నకాలం, విలువల పతనం, దారిద్ర్యం, జీవితం అంతట్నీ ఒక్కలా చుట్టు ముట్టుతున్న నైరాశ్యం పోగొట్టుకోవటం, దుఃఖం భీతి, మరణం – పొద్దుతెలియని ప్రవాహం – ఏ హెచ్చరికలూ లేకుండా ఒక్కసారిగా ప్రవాహంలోకి తోసివెయ్యబడటం –

ఎట్లా రియాక్టు అవుతారు?

ఒక కల్యాణి లాగానా? ఒక ఇందిర లాగానా?

కల్యాణిని మీరు బాగా ఎరుగుదురు! లలిత లలితంగా, ముగ్ధలా, బేలగా, మీ విశాలమైన బాహువుల్లో ఒదిగిపోయి, రొమాంటిక్ స్వైరకల్పనల్లో రంగుల చిత్రంలా తళుక్కుమనగల పాత్ర – పాపం అన్నీకష్టాలే, బోలెడంత ఆత్మాభిమానం – గుర్తొస్తుందా మీకు! వందలాది వేలాది కల్యాణుల్ని గత నలభై యేళ్ళుగా దేశం పట్టనంతగా విస్తరిల్లి – సెక్రటరీ, శంకుతీర్థం లాంటి నవలలతో మొదలై అభిలాష, వెన్నెల్లో ఆడపిల్ల వగైరా నవలలదాకా, నాయికలందరూ ఈ కల్యాణికి రోల్ మోడల్సే!

మరి ఇందిరా?

'ఇందిరా' నా అని నొసలు చిట్లించే ఇందిర, ఐడెంటిఫై అవడానికి ఇష్టపడని ఇందిర – పురుషాధిక్య సమాజం ఏర్పరచిన చట్రాలలో, ప్రేములలో ఇమడడానికి ఇష్టపడని ఇందిర – పాతివ్రత్యం, ప్రేమ, అర్పించుకోవడాలు, అంకితమవటాలు – ఈ ట్రాష్‌నీ, ఈ నాన్సెన్స్‌నీ, ఫెడేల్‌మని కాలితో తన్నే – ఈ ఇందిరను మీరు ఎరుగరు; గుర్తుపట్టడానికి, గుర్తుపెట్టుకోడానికి ఇష్టపడరు! ఇందిరను ఇష్టపడే రోజులు ఇంకా మనకు సమీపం కాలేదు! ఇందిర ఒక ఆశ, పోరాటం, ఒక సమగ్రమైన స్త్రీని – "నీతో ఎంతదూరం రమ్మన్నా వస్తానుగానీ... ఏ ఘట్టంలోనూ నా వ్యక్తిత్వాన్ని చంపుకోలేను! అర్థం చేసుకొని – నన్ను నా యిష్టం వచ్చినట్లు వూపిరి పీల్చుకోనిస్తావా.. " అని అడగగలిగే ఇందిర – ఇవాల్టి 'ఆకాశంలో సగం' అంటూ ఉద్యమిస్తున్న ఆధునిక స్త్రీకి ప్రోటోటైప్!

ఒక కల్యాణి, ఒక ఇందిర –

త్రోసుకొచ్చే జీవితపు ప్రకంపనల కల ఎట్లా రియాక్టు అయ్యారు! ఒక విపత్తు మనిషిరూపంలోనో, ప్రేమరూపంలోనో, అనుభూతిరూపంలోనో, ఎదురైతే ఎట్లా స్పందించారు? ఏ Conclusions, ఏ ముగింపుని, వాటి ద్వారా ఏ Message ని అందించారు?

ఇప్పుడొక చిన్న ప్రయోగం! టెస్ట్! అనగనగా పందొమ్మిది వందల యాభై లేదా కొద్దిగా ముందు, ప్రయోగశాల ఆంధ్రదేశం – ఇంకా కరెక్టుగా చెప్పాలంటే విశాఖపట్టణం – ఈ ప్రయోగంలో Variables కల్యాణి, ఇందిరలు – non-variables గా ప్రకాశాన్ని తీసుకుందాం!

ప్రయోగం నెంబర్ ఒకటి! కల్యాణి – ప్రకాశంల ప్రేమకథ!

మెడికో ప్రకాశానికి, ఒక ఉదయం పూట, తనుండే అద్దె యింటిలో, మెరుపు మెరిసినట్లుగా కల్యాణి కనబడి – గంభీరంగా, అట్టే మాట్లాడకుండా టచ్ మీనాట్ లా, అచ్చం మన తెలుగు నవలానాయికలా – ఈ కల్యాణికి ఒక దుఃఖభరితమైన గతం, పల్లెటూరు, జబ్బుపడ్డతండ్రి, కన్నీటి చారికలాంటి బాల్యం, డాక్టరు కోర్సు చదవాలనే ఫలించని కల – ఉన్నాయి ప్రకాశానికి ఈ అమ్మాయి సహజంగానే నచ్చింది నచ్చదామరి! అంత అందం, అంత ఆత్మాభిమానం, ముఖం చూట్టూ 'ఆరా' లా దిగులు వలయం సహాయం చేయడానికి వీలుగా కష్టాలు, జబ్బులు – కల్యాణికి టైఫాయిడ్ – ప్రకాశం అచ్చం కథానాయకుడిలాగే రాత్రింబవళ్ళు సేవచేసి – కళ్యాణి కళ్ళలో కృతజ్ఞతలు, అతనంటే ఇష్టం – పొందగలిగాడు. ఇద్దరూకలిసి బీచ్ కెళతారు. ఇద్దరికీ తమ తమ కళ్లలో దుఃఖపు తడి, జీవితంలో కష్టాలబరువు ఉన్నట్లు అర్థమవుతుంది. ప్రకాశాన్ని ఒక మహావృక్షంలా భ్రమపడి – లతలా లలిత లలితంగా అతన్ని అల్లుకుపోయింది కల్యాణి

నిజానికి ప్రకాశం భీరువు! చాలామంది యువకుల్లాగే అవకాశవాది! సుఖవాది! ఏ మాత్రం కష్టం లేకుండా జీవితం తన చేతుల్లోకి వరంలా జారి పడాలనే కోరిక ఉన్నవాడు! పోరాటం, ప్రతిఘటన అంటే భయపడే వెన్నెముకలేని జీవుల జాతిలోనివాడు!

కల్యాణికి షరామామూలుగానే కష్టాలు త్రోసుకువచ్చాయి. తండ్రి పోయాడు! ఊరంతా అప్పులు! ఒంటరితనం! ఓదార్పు కోరే కష్టాలు!

సాయం రమ్మంటే ప్రకాశం అనే భీరువు బిగుసుకుపోయ్యాడు! వెళ్లి కల్యాణిని ఆదుకుంటే – తనను పెంచి పోషించే మామకు కోపం వస్తుందేమో! అదేమో! ఇదేమో! అంటూ కల్యాణికి దూరంగా జరిగాడు! కల్యాణికి విస్ఫోటనమంత బలమైన – దెబ్బ "కన్నీరెందుకు కల్యాణీ! నేనుండగా నీకు దుఃఖమా!" అన్నప్రకాశమేనా? అని దుఃఖపడి, "ఛీ ఇతనూ మనిషేనా?" అని అసహ్యించుకొని – అన్నివిధాలా నష్టపోయాను! "దిగాలుపడుతుంది!" జీవితం అంతా ముగిసిపోయినట్లుగా – కుంచుకుపోయింది!

ప్రయోగం నెంబరు టూ – ప్రకాశం ఇందిరల కథ–

సహజంగానే ప్రకాశానికి ఇందిర నచ్చదు!

ఏమిటీ మనుష్యులు – ఇట్టే మమతలు పెంచేసుకుంటారు! ఇట్టే కన్నీళ్ళుకార్చేస్తారు! దౌర్బల్యాన్ని చూసి బాధపడటం ఒక దౌర్బల్యం!" అనగలిగే అమ్మాయి ఈ ఇందిర – హఠాత్తుగా అట్లా బీచ్ వైపు వెళ్దాం పద అని ఆజ్ఞాపించగల అమ్మాయి – రిక్షాలో పక్కనే కూర్చోవడానికి భయపడే ప్రకాశాన్ని – "ఫరవాలేదులే ఇంతలోకే నా పాతివ్రత్యానికేం భయం రాదు! ఇద్దరం కూర్చుని పోదాం!" అనగలిగే ఇందిర – పారసైట్ లాంటి తండ్రి – ఎవర్నీ లెక్కచేయనితనం – సగంలో ఆపేసిన చదువు! చిన్న ఉద్యోగం – Inhibitions అరమరికలు లేకుండా స్నేహ హస్తాన్ని చాటగల ఉదారత – ప్రకాశంతో బీచ్ కి షికారుకు వెళ్ళగలదు! అట్లాగే ప్రకాశం స్నేహితుడు కృష్ణమూర్తితో సెకండ్ షోకే వెళ్లగలదీ ఇందిర! జీవితం ఎప్పుడూ మధురంగా పలవరించేపాటలా ఉండాలనుకునే ఇందిర –

"గడియగడియకి కాళ్ళుచాపి కూర్చుని ఏడవడం నాకుచేతకాదు!" అనే ఇందిర – అంత బరువులోనూ, ఇంకొకరిమీద "ఒరిగిపోయి కాలక్షేపం చేద్దామన్న దురాశ అంతకన్నాలేదు! నేను బలపడి ఇంకొక్కరిని బలమివ్వాలనే తత్వం నాది!" ఇందిర ప్రకాశానికి ఎప్పుడూ చెబుతూనే ఉంటుంది – ఇది కాదు బ్రతికే విధానం అంటూ; పిరికితనం, అణిచివేసిన ఆశలతో నిండిన ప్రకాశంలో – కొత్తచిగురులేవో వేయాలనే "అన్నివిధాలాఏకాకిగా నన్ను విడిచిపెట్టేరు" అని రోదించే ప్రకాశానికి "నేనెక్కడికిపోతాను! నువ్వు నావాడివి! అంటూ స్నేహ హస్తాన్ని ఇస్తుంది!"

ప్రకాశానికి మామయ్యనే యములాడు, అతణ్ణి, అతడి తల్లి జీవితాన్ని శాసించే కర్త, కర్మ, క్రియ – ఆ మామయ్యను ఎదిరించలేడు! ప్రకాశం ప్రేమపురాణాల్ని ఆకాశ రామన్న ఉత్తరాల ద్వారా తెలుసుకొన్న మామయ్య – ముక్కుపట్టుకొని పల్లెటూరుకు లాక్కువెళతాడు. ఎనిమిది వేల కట్నంతో రాజమండ్రి అమ్మాయితో లగ్నం కుదురిస్తాడు! ఎదిరించలేడు, ఎదిరిస్తే చదువు ఆగిపోతుందనే భయం – ఈ భయంలో ప్రేమ వగైరా అనుభూతులు బ్యాక్‌గ్రౌండ్‌లోకి వెళ్ళిపోతాయి! నిశ్చితార్థం అయినాక, పారిపోయి దొంగలా ఇందిర దగ్గరకు వస్తాడు. ఆమె ముందు దీనంగా మోకరిల్లి – "అలా ప్రాధేయపడి నా జాలిని రెచ్చగొట్టి నువ్వేమీ సంపాదించలేవు ప్రకాశం! అన్ని హక్కులూ ఉండే మేనమామను ఎదిరించలేని పిరికివాడివి! అచ్చంగా చింతామణిలో భవానీశంకరంలా మాట్లాడుతున్నావు! నువ్వసలు పుట్టుకతోనే సగం మనిషివి! మొదటినుంచీ బీటలువారిన వ్యక్తిత్వమే నీది – మొదటి పరీక్షలోనే తలవంచేసి లొంగిపోయిన వాడివి! కొన్ని అనుభవాల తరువాతనైనా ఒక మనిషిలా ప్రవర్తిస్తావనుకున్నాను! నీకూ నాకూ గుడ్‌బై!" అనేసి దిగ్గున లేచి వెళ్ళిపోయింది ఇందిర –

ఈ ప్రయోగాల ఫలితం – ఇన్‌ఫెరెన్స్ ఏమిటని అడగవద్దు! పందొమ్మిది వందల యాభై నాటి ప్రయోగపరిస్థితులు – ఇవాళా ఉన్నాయి! ప్రకాశం అనే వానపాములూ ఉన్నాయి!

ఇలాట్టి స్త్రీ ఎలా రియాక్టు అవుతుంది?

కల్యాణిలానా? ఇందిరలానా?

సమాధానం మన అభిరుచులు, సంస్కారం, మానవ సంబంధాలపై స్త్రీ పురుష సంబంధాలపై మనకున్న అవగాహనలపై ఆధారపడి ఉంటుంది! ఇంతకూ కాలతీత వ్యక్తి ఎవరు?

కల్యాణినా? ఇందిరానా?

సాహిత్యాన్ని 'aesthatic exploration of World' అనుకుంటే, Exploration of Forces అనికూడ అనుకుంటే – 'Transforming a mild society into an active and emotional one' అనీ, అట్లాగే 'Giving courage to the weak' అని కూడా చెప్పుకుంటే – ఆ లక్షణాలన్నీ ఉన్నగొప్ప నవల 'కాలాతీత వ్యక్తులు'.

చాలా కాలంగా, మనం గొప్ప నవలకు ప్రధాన లక్షణాలుగా చెప్పుకునే– సంక్లిష్ట జీవితము, సజీవమైన పాత్రలూ, పాత్రల మధ్య సంఘర్షణా–వగైరాల–కాలాన్ని దాటి మనం చాలా ముందుకు వచ్చాము! ఇవాళ రచనను బలమైన ఆయుధంగా చెప్పుకుంటున్నాము – గొప్పరచన పాఠకుడికి ఒక తాత్విక దర్శనాన్ని అందించాలని కూడా చెప్పుకుంటున్నాము!

ఈ గొప్ప సుగుణాలన్నీ కలిగిన నవల కాలాతీత వ్యక్తులు

నవలలో Ingradients గా ఉన్న పై సుగుణాల్ని ఒక్కమాటలో చర్చించుకుందాం.

ముందుగా కథ – అతిసాధారణమైనది! వైజాగులోనో, మరోపట్టణంలోనో, లేదా, మీ, మా ఊళ్ళో ఎక్కడైనా జరిగే కథ! పెద్దగా మలుపులు లేవు! ఒక మరణం, ఒక దుఃఖం మినహాయిస్తే యిందులో గుండెల్ని పిండివేసే సంఘటనలు లేవు! గొప్ప త్యాగాలు వగైరా గిమ్మిక్కులు లేవు! స్థూలంగా చెప్పాలంటే ఒక కల్యాణి, ఒక ఇందిర – ఒకానొక జీవితపు చౌరస్తాలో, కొన్ని అనుభవాలు, కొందరు మనుషుల పరిచయాలమీదుగా – కాలం స్కేలుపై ఎట్లా నడిచివెళ్ళేరు – అనేదే! ఆ ఇద్దరి ప్రయాణపు విశేషాలే ఈ నవల! అయితే ఆ ప్రయాణం ఏ దిశకు – అనే తాత్విక శోధనే ఈ నవల ప్రత్యేకత!

రెండో Ingradient కాలం – పందొమ్మిది వందల నలభై, యాభైల మధ్యన జరిగిన కథే గానీ – ఈ కథ నిరంతరము జరుగుతూంటుంది! కల్యాణీ ఇందిరల 'ప్రోజనీ' నిత్యం మనకు కనిపిస్తుంటారు! అయితే పోరాటాల ఇందిర సంఖ్య – కొద్దికొద్దిగా పెరుగుతున్న పందొమ్మిది వందల తొంభైలనాడు ఈ నవలను మరోసారి గుర్తు చేసుకోవటం సమయోచితమైనపని.

మరో Ingradient సమాజం రెండు ప్రపంచ యుద్ధాల తర్వాతి సమాజం – ఆర్థికమాంద్యం, చదువుల మీద శ్రద్ధ చూపుతున్న యువతరం – సినిమాలు, సంగీతాలు, బీచ్ షికార్లు అంటూ జీవితపు మొనాటనీ బ్రేక్ చెయ్యాలనే కొత్త సరదాలు, యువతీయువకుల స్నేహాల్ని ఇంతింతలు కళ్ళుచేసుకొని చూడడాలు, ఇంటా, బయటా, ఆఫీసుల్లో స్త్రీలు ఉక్కిరిబిక్కిరి అవుతున్నవైనం – గుర్తుపట్టారా! మన సమాజమే! పరిణామాల్ని, వేగాల్ని ఇంకా వంటబట్టించుకోని తొలినాటి మన సమాజం –

మరో Ingradient పాత్రలు

ఒకప్రకాశం, ఒక కృష్ణమూర్తి, ఒక డాక్టరు చక్రవర్తి – కథానాయకులో మహానాయకులో అనడానికి వీలులేని మామూలు మనుషులు. ప్రకాశం పిరికితనానికి, అవకాశవాదానికి ఒక మెటాఫర్! కృష్ణమూర్తి కొద్దిగా లోవెలుగు వున్న పాత్ర! సుఖవాదిగా జీవితాన్ని మొదలుపెట్టే వసుంధర, ఇందిర లాంటి గొప్పవ్యక్తుల సాన్నిహిత్యంలో క్రమంగా Transform అవటం మొదలు పెట్టిన వ్యక్తి! డాక్టరు చక్రవర్తి సులోచనా రాణి నవలల్లోని నాయకుడికి ప్రోటోటైపు!

ఇక కాన్వాసంతా – నిండిన ఇద్దరు స్త్రీ మూర్తులు కల్యాణి, ఇందిరల గురించి ముందే చెప్పుకున్నాము. చివరిగా చెప్పుకోవాల్సిన ముఖ్యమైన వ్యక్తి ఇందిర తండ్రి ఆనందరావు. ఆదర్శవాదంలోంచి వ్యక్తివాదంలోకి ప్రయాణిస్తున్న 1950 ల నాటి తెలుగు సమాజానికి ప్రతీక ఈ పాత్ర. ఇవాళ మార్కెట్ ఎకానమీ రోజుల్లో – దేశమంతా ఈ ఆనందరావు క్లోనింగ్ సంతతి కుప్పలు కుప్పలుగా పెరుగుతోంది. ఆదర్శాలూ, విలువలూలేని 'తిను, తాగు, సుఖించు!' మార్కు సుఖవాదులు – ఈ కాసిన్ని పాత్రలతో అద్భుతమైన Human drama నడుస్తుంది నవలలో

మరో Ingradient - Charactirisation లేదా Evolution of Characters ఇందిర అనే అమ్మాయి – నవల రెండో పేజీలో పరిచయమైనప్పుడు ఎట్లా

మాట్లాడుతుందో – చిట్టచివరి పేజీలోనూ అదే ధోరణి, అదే నిర్భయత్వం, అదే స్వేచ్ఛాప్రియత్వం – ప్రదర్శిస్తుంది. "ఇంత విశృంఖలత" అని మనలో కొద్దిమంది విసుక్కునే పరిస్థితి కొద్ది పేజీల తరువాత కనిపిస్తుంది ఆ మేరకు పురుషవాద అహంకార మనస్తత్వాన్ని Expose చెయ్యటంలో రచయిత సఫలీకృతం అయినట్లే! అయితే అట్లా విసుక్కునే పాఠకుడు ఇందిర వెంట నవల చివరదాకా ప్రయాణిస్తే – ఇందిర పాత్రలో ఒక విధమైన రొమాన్సులో పడిపోతాడు! ఆమె స్వేచ్ఛా ప్రయాణత్వానికీ Opennes కీ ధీరత్వానికీ విస్మయుడవుతాడు! ఒక గొప్ప స్త్రీ మూర్తిని చూసిన అనుభూతి కలుగుతుంది!

మరింక కల్యాణి "ఈ కన్నీళ్ళు, ఈ కష్టాలు, ఈ దారిద్ర్యం నాకెందుకు దేవుడా!" అంటూ ఈ అందమైన సుకుమారమైన యువతి మనసు బాగా చిరపరచితమైన స్త్రీ – ఈమె కొంచెం ధైర్యం, కొంచెం గాంభీర్యం చూపితే బాగుణ్ణు – అని నవల చివర్లో అనుకోకుండా ఉండలేం!

కృష్ణమూర్తి, మనలోనివాడే – యవ్వన సంధ్యల్లో తప్పటడుగులు వేసినవాడు – కాని స్థిరంగా నిలబడి. వెలుగు వైపు ప్రయాణించి – ఇందిర వ్యక్తిత్వపు ధగధగల్నిచూసి, ఆమె చెయ్యి అందుకోను సాహసించిన యువకుడు –

పాత్రలు ఎట్లా Envolve అవుతాయో గమనించాలంటే ఈ కృష్ణమూర్తిని Follow అయితే చాలు

చివరాకర్న చెప్పుకోవాల్సింది ఆనందరావును The symbol of decaying middle Class - ఏ విలువలూ, వాదాలూ, ఆశయాలూ లేని – కేవలం తన సుఖం, తన వస్తువేల్యం మాత్రమే పరమావధి అనుకునే నేటి మధ్యతరగతి? ఆదిపురుషుడు అతని సంతతే వందలు, వేలుగా, మిలియన్లుగా దేశం అంతటా వర్ధిల్లుతోంది. ఈ ఆనందరావు గతాన్ని అతని మనస్తత్వాన్ని పరిశీలిస్తే – ఒక జలదరింపు కలుగుతుంది! ఈ ఆనందరావు మనకో వార్నింగ్!

చివరి Ingradient నవలలోని ఫిలాసఫీ లేదా సందేశం లేదా నవలా ప్రయోజనం వగైరా, వగైరా –

ఏ సందేశాన్నీ చెప్పకపోవటమే ఈ నవల విశిష్టత! జీవితాన్ని జీవించాలి! ధైర్యంగా పోరాటంగా "రెక్కలున్నాయని ఎగరడానికి ప్రయత్నిస్తాం! రెక్కలు లేవు మనకు! ఉన్నా అడిచిపోయాయి!" అన్న వివేచన. "ఏపనిచేసినా నేను కళ్ళు తెరచి చేస్తాను! ఏడుస్తూ ఏదీ చెయ్యను! ఏది జరిగినా ఏడవను" అనే స్థిర చిత్తాన్ని "ఏ ఘట్టంలోనూ నా వ్యక్తిత్వాన్ని చంపుకోను!" అనగలిగే తాత్విక ధీరతా – ఇవాల్టి స్త్రీ నేర్చుకోవాలనే స్ఫూర్తిని అందించే ప్రయత్నం చేస్తుంది నవల!

"వ్యక్తి – ఉన్నతి" – 'మానసిక పరిణితి' అనే మాటల్ని కూడా మనం చెప్పుకోవాలి! అట్లాగే Gender Sensitivity gender equality అనే మాటల్ని కూడా మనం గుర్తుచేసుకోవాలి! యాభైయేళ్ళ నాటి నవలలో ఇన్ని సుగుణాలా అని మనం ముచ్చట పడుతాం ఈ నవల చదివిన వెంటనే! ఆ ముచ్చట పడటమే ఈ నవలను గొప్ప నవలల జాబితాలోకి చేర్చింది

*(శత వసంత సాహితీ మంజీరాలు – గ్రంథాలయ సర్వస్వము, 2000)*

# ఏం చెప్పను నేస్తం!

- ఆచార్య నాయని కృష్ణకుమారి

ఆద్యంతాల కందకుండా
ఆవేశకావేషాల రంగులు పట్టని
అచ్ఛాత్మ స్వరూపమైన నేస్తం
ఏం చెప్పను నిన్ను గురించి!

మమతలూ మమకారాలూ దులుపుకుని
మాటల మరకలు అంటుకోలేని
ఊహా పథాలకెగసి పోయిన నేస్తం
ఏం చెప్పను నిన్ను గురించి .

నలుగురికి మల్లే
నువ్వూ కష్టాలకు కుంగి
సుఖాలకు పొంగావనీ
అలముకొన్న అపవాదులకు
అనంత నైరాశ్యం వరించావనీ
అందరూ నీ రచనల్ని చదివి
అబ్బో బాగా రాశావంటే
ఆకాశమంత ఎత్తుకు పెరిగావనీ
చెప్పనా!

నీలో మానవత్వం
నిండుగా తొణికిసలాడేదని చెప్పనా!
నడుము చుట్టూ చీరచెఱగు
తిప్పి దోపే పద్ధతిలో
కార్యదీక్షా మనోబలమూ
కనిపించేవని చెప్పనా?

నీ పెదాల మీద వెలిగే
కనీకనపడని చిన్న నవ్వు
రోగాల చీకట్ల మధ్య వెలిగించిన
రాగాల వెన్నెల వత్తి
అని చెప్పనా నేస్తం!

ఆపదల పడవలో ఎక్కి
ఆ లోకపు టంచుల్ని మెట్టబోయిన అమ్మను
ఆపి మళ్ళీ మామధ్య వదిలిన
మృత్యుంజయవని చెప్పనా నిన్ను నేస్తం?

* * * * * * * * * * * * * * * * * * * * * *

నీవు సామర్థ్య లేనందువల్ల
మాకు వెలితి!
నీ కలం కథలుగా మారనందువల్ల
తెలుగు కథలకే వెలితి!

నీ అమృత హస్తం
రోగుల వెన్ను నిమరనందువల్ల
ఆరోగ్యానికే వెలితి!
అంతా వెలితిగా కనిపించే
ఈ నిరాశలను మించి
ఏం చెప్పను నేస్తం!

గొంతెత్తి గట్టిగా
ఏం చెప్పను నేస్తం!

నువ్వు అద్భుత కథా ప్రపంచంలో
ఆకాశమంత ఎత్తున పెరుగుతావని
నీ కలంలోని సిరా
లక్ష ఇందిరల్నీ కోటి కల్యాణుల్నీ
కల్పించగలదని ఆశించిన నా గుండెకు
జవాబు ఏమని చెప్పను నేస్తం!

ఎప్పుడో ఒకనాడు
రెండు లోకాలు కలిసే సరిహద్దు గీత మీద
నువ్వు నవ్వుతూ నా కెదురుగా వచ్చినప్పుడు
అంతరంగంలో నువ్వంటే
నాకెంత యిష్టమో
అంతా నిజంగానే చెప్తాను నేస్తం!

(డా॥ శ్రీదేవి మరణ వార్త విని......1962)